

# SRI VENKATESWARA NITHYA ANNADANAM TRUST
# TIRUPATI

**TTD ADMINISTRATIVE BUILDING, K.T.ROAD, TIRUPATI (A.P.)**

**REGD. NO. 18/94**

**Dear Donor**

There is no gift worthier and nobler than Annadana. In our country, giving good to the needy and poor is not merely a service, but a hearty tradition practised since vedic times. It is said that one who offers food is placed among the devas.

Sri Venkateswara Annadana Trust, aimed at providing free and wholesome food to the persons visiting Tirumala launched by the T.T. Devesthanams in 1985, has an over whelming response from philanthropists all over India.

## HOW THE SCHEME OPERATES:

(i). Pay a sum of Rs . 5 lakhs of multiples thereof to this scheme by (a) an Individual (b) a Family not exceeding 5 persons or (c) a group of two companies or firms and avail the following privileges :

1. The Donor's name will be prominently displayed in the Dining Hall.
2. The name and gothram of the donor will be read in Srivari Koluvu by rotation.
3. The donor will be given free furnished accommodation at Tirumala for three days in a year.
4. Free Darshan with Harathi for 5 members during break on the three days will be arranged in a year.
5. The donor will be given a gold plated silver memento embossed with the images of the Lord and Sri Padmavathi Ammavaru (once only).
6. Income Tax Exemption under section 80 (G) of Income Tax Act.

The T.T.Devasthanams will in turn contribute an equal amount towards matching investment and deposit the entire amount in fixed deposit in a Nationalised Bank. Only the interest earned on it will be used to feed 15,000 pilgrims everyday.

**OR**

(ii) Pay a sum of Rs. 1,000/- or multiple there off to the S.V.Nithya Annadana Scheme and get Income Tax Exemption Certificate under Section 80 (G) if required.

## HOW TO SEND DONATIONS

The donations can be sent by way of Demand draft drawn on any nationalised bank in favour of "Sri Venkateswara Nithya Annadana Trust" and send it to the Executive Office, T.T.Devasthanams, Tirupathi (Andhra Pradesh).

*Further details can be had from:*

The Executive Officer

**TIRUMALA TIRUPATI DEVASTHANAMS**

T.T.D., ADMINISTRATIVE BUILDING, TIRUPATI - 517 501.

**JOIN THE NITHYA ANNADANA SCHEME AND HAVE THE PRIDE OF PARTNERSHIP IN THIS SACRED SERVICE**

మహాకవులు, మానవతావాదులు
మాన్యులు డా. జె. బాపురెడ్డి గారికి
షష్టిపూర్తి సాహితీ పురస్కారంగా
ఆప్యాయంగా
[illegible]
3-8-1997

# బాపురెడ్డి సాహితీ భారతి

## బాపురెడ్డి షష్ట్యబ్దపూర్తి అభినందన సంచిక


సంపాదకుడు

**డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం**



**1996**

ప్రచురణ

**జయం పబ్లికేషన్స్**

జూబిలీహిల్స్, హైదరాబాదు - 33

**BAPU REDDY SAHITHI BHARATHI**

*First Edition:*
**1996 - YUVANAMA SAMVATSARAM**



*Copies : 1000*

*Price : Rs. 300/-*
*US $ 20*

Published by :
**JAYAM PUBLICATIONS**
Plot No. 10, Road No. 5
Jubilee Hills,
Hyderabad-500 033.
A.P. India.

Composed at :
**SREE DATTA SAI GRAPHICS**
1-8-702/105, Nallakunta,
Hyderabad - 500 044.
Ph : 7633275. 3020719

Printed at :
**VIPLA COMPUTER SERVICES**
Nallakunta, Hyderabad - 500 044.
Ph : 7636242
Cover Design by K. Rajaiah

# అక్షర రక్ష

ఒక జీవితంలో షష్ఠబ్దపూర్తి ఒక పర్వ సమయం. ఆరుపదుల జీవిత ప్రమాణం భారతీయుల దృష్టిలో ఒక ఆదర్శ కాలం. మానవుడు సాధింప గలిగిన చతుర్విధ పురుషార్థాలను ఆ కాలంలో సాధించి సమీక్షించుకోవలసిన సమయం. అందువల్లనే షష్ఠబ్ద పూర్తిని ఒక ఉత్సవంగా చేసుకుంటారు; ఒక పరిపూర్ణ జీవిత అమృత కలశం షష్ఠబ్ద పూర్తి మహోత్సవం.

డాక్టర్ జె. బాపురెడ్డి గారు ఒక మహాకవిగా తాము సాగించిన జీవిత యాత్రలో ఆరుపదుల పండుగను ఒక సాహిత్య శిఖరదర్శనంగా భావించడం సాహితీలోకం సంతోషింప దగిన అంశం. పరిపాలనా ప్రస్థానంలో కాకలు తీరిన నేర్పరిగా కీర్తికెక్కుతూనే సాహితీ రచనా ప్రస్థానంలో త్రివిక్రమాకృతి తాల్చిన డాక్టర్ బాపురెడ్డిగారి షష్ఠబ్దపూర్తి సందర్భాన్ని అక్షరానంద చిహ్నంగా మిత్రులు మలచుకోవాలనే మధుర సంకల్పానికి ఈ సంచిక ఒక మరపురాని గుర్తు!

బాపురెడ్డిగారి పేరు వినగానే ప్రకాశించే ప్రతిభ స్ఫురిస్తుంది. వారి ఆలోచన ప్రగతిశీల మానవతా స్పందనను మన్నిస్తుంది. రచన పదచిత్రాలను పరిమళింపజేస్తుంది. కవిత జీవితానికీ తాత్త్వికతకూ కళావారధిని నిర్మిస్తుంది. ఒక్కమాటలో చెప్పాలంటే - బాపురెడ్డిగారు నడుస్తున్న భావుకత.

పద్యాన్నీ, గేయాన్నీ, వచనాన్నీ కవితా ప్రయోగాలలో కళాగౌరవంతో రచించగలిగిన సమకాలీన కవుల్లో బాపురెడ్డి గారు మొదటి వరుసలో నిలుస్తారు.

పద్యంలో ఆశు విస్తర కవితలు ఆత్మీయంగా, ఆత్మాశ్రయంగా కూడా పలక గలిగిన ప్రౌఢకవి; ఛందోహృదయం, పద్యగతి తెలిసిన చతురుడు.

గేయంలో రూపకాలనూ, భావగీతాలనూ, పాటలనూ, నృత్య సంగీత స్వరవల్లికలనూ స్వీయముద్రతో చిత్రించిన మధురకవీ, మార్మికకవీ, తత్త్వకవీ బాపురెడ్డిగారు.

వచనకవిత వారి అభ్యుదయ మానవతా దృక్పథాన్ని మహనీయంగా ఆవిష్కరించిన అక్షరమార్గం. జీవిత సత్యాలను భావభౌతిక స్థాయిలలో దర్శించి ఆ రెంటికీ అద్భుతమైన అన్వయాన్ని అందించిన సాహితీస్రష్ట డా॥ బాపురెడ్డి. నిబద్ధ దృక్పథం రాజకీయపరంగా కాక జీవన విధానం మీద ఉండాలని చాటిచెప్పే ఆధునిక ప్రవక్త డా॥ బాపురెడ్డి.

ఆంగ్ల కవితా సంపుటులు వెలయించటంలోనూ, ప్రణవాన్నీ, ప్రణయాన్నీ, ప్రగతినీ జీవితంలో ముప్పేటగా భావించే సమగ్ర దృక్పథంలోనూ, ప్రపంచ కవుల మహాసభల్లో తెలుగు వెలుగు బావుటాను ఎగురవేయుటంలోనూ, ప్రపంచ భాషలలోకి తమ కవితా వల్లికలను అల్లుకొనేటట్లు చేసిన ఆంధ్ర పౌరుషంలోనూ బాపురెడ్డిగారు నేటి సాహిత్యరంగంలో అగ్రగణ్యులు.

1971లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి పురస్కారాన్ని అందుకున్నారు డా॥ బాపురెడ్డిగారు. 1984లో మొరాకోలో జరిగిన ప్రపంచ మహాకవుల సభలవా రందించిన గౌరవ డాక్టరేట్ పురస్కారం మొదలైనవి డా॥ జె. బాపురెడ్డి గారి ప్రతిభకు అందిన కొన్ని గుర్తింపులు మాత్రమే.

1936లో కరీంనగర్ జిల్లాలోని సిరికొండ గ్రామంలో రెడ్డిగారు జన్మించారు. గ్రామీణ ప్రకృతి సౌందర్యం, సహజ ప్రజాసాహితి, తెలుగు సజీవ సంస్కృతి అందించిన సుసంపన్న సంస్కారం వారిలోని కవితాకళా సౌందర్య శక్తిని జాగృతం చేసింది. వారి తల్లిదండ్రులు శ్రీమతి జంకె రామలక్ష్మిగారు, శ్రీ జంకె

కృష్ణారెడ్డిగారు. కృష్ణారెడ్డిగారు సంప్రదాయ మౌఖిక సాహిత్యానికి చెందిన ఎన్నో గీతాలను, గేయాలనూ, పద్యాలనూ, శ్లోకాలనూ కంఠస్థం చేసి పాడటమే కాకుండా, స్వయంగా తత్త్వాలను ఆలపిస్తుండేవారు. రామలక్ష్మిగారు వారి గానలహరికి స్వరచైతన్యం. ఇలా, తల్లిదండ్రుల వారసత్వంగా డా॥ జె. బాపురెడ్డిగారు పద్యాన్నీ, గేయాన్నీ, తాత్త్వికతనూ, రసికతనూ, మానవతనూ, నవతనూ తమ గళంలో, కలంలో సహజంగా పోషించుకోగలిగారు.

ఈనాటికీ వారి సాహితిలో వారి సహజ సంస్కార బీజాలు మూడు పూవులే ఆరుకాయలైనట్లు ముచ్చట గొల్పుతూ ఉన్నాయి.

బాపురెడ్డిగారు పుట్టిన సంవత్సరం యువ. నిరంతరయౌవనోత్సాహానికి ఆ సంవత్సరం ప్రతీక. మరలా అరవై వసంతాలకు యువనామ సంవత్సరాన్ని డా॥ బాపురెడ్డిగారు దర్శించి పులకిస్తున్నారు. 'యువ' మీద ఒక ఉత్తమ కవితనే ఆలపించారు. వారు ఐ.ఎ.యస్., ఆఫీసరుగా ఎన్ని పదవులను ఎన్నిచోట్ల నిర్వహించినా, ఎన్నిసార్లు ఎన్నిదేశాలు పర్యటించినా - యువత, నవత వారి వ్యక్తిత్వ లక్షణం. ముదిమి జాడలు కనరాని రూపస్ఫూర్తి, ప్రతిభా విస్ఫూర్తి ఆయనకు సహజాలంకారాలు! 'యువ' వారి ఆరుపదుల వసంతాల అక్షరోత్సవానికి ఒక శుభ సంకేతం.

బాపురెడ్డిగారు ఉన్నత పదవులు నిర్వహించినా, సామాన్యులలో కలిసి తిరిగే సహృదయులు. స్నేహితులను మరువక పోవటం వారి కొక వరం. ఎదుటివారిని స్నేహితులుగా మలచుకోవటం వారి కొక సహజ నైపుణ్యం. అనుభవాన్ని కవితగా శిల్పించటం వారి అపూర్వగుణం. భౌతికం వెనుక ఉన్న తాత్త్వికాన్ని దర్శించటం వారి ఆసక్తి. పరిచితులైన వారికి పరమాప్తు డనిపించే పుణ్యాత్ముడు డా॥ బాపురెడ్డి.

డా॥ జె. బాపురెడ్డిగారి షష్ఠ్యబ్దపూర్తి సందర్భంగా ఆరుపదుల వసంతాల అభినందన సంచిక వెలువరించాలని సాహితీ మిత్రులు సంకల్పించారు. వారి సాహిత్యాన్ని సమీక్షించే వ్యాసాలతో, వారి వ్యక్తిత్వాన్ని చిత్రించే కవితలతో, పత్రికలు, సాహితీ సంఘాలు, అభిమానులు, మిత్రులు, సహృదయులు వారిని అభినందిస్తూ ఆయా సందర్భాలలో అందించిన అక్షరోపాయనాలతో, ప్రచురించిన 'ముఖాముఖి' చర్చలతో, మిత్రుల లేఖలతో ప్రశంసాత్మక కవితలతో కలిపి, దేశ విదేశాలలో ఉన్న తెలుగువారు డా॥ బాపురెడ్డి గారిని గురించీ, వారి సాహిత్యాన్ని గురించీ ఎలా స్పందిస్తున్నారో తెలిపే రచనలను ఎన్నికచేసి ఈ సంపుటిగా రూపొందించటం జరిగింది. ఇది ఒక విశిష్ట ప్రయోగంగా మేం భావిస్తున్నాం! అందులోనూ మరొక విశేషం. తెలుగు రచనలన్నీ ఒక భాగంగా, ఇంగ్లీషు రచనలన్నీ మరొక భాగంగా ఇందులో పొందుపరుస్తున్నాం. ప్రధానంగా చదువరుల సౌకర్యం కోసం ఈ విభాగాలు చేయడమైంది. ఇంగ్లీషు విభాగాన్ని రూపొందించడంలో ఎంతో సహకరించిన ఆచార్య యస్.యస్. ప్రభాకరరావు గారికి, ఈ సంచికను రూపొందించడంలో ఎంతో తోడ్పడ్డ యువకళావాహిని అధ్యక్షులు శ్రీ వై.కె. నాగేశ్వరరావు గారికి నా కృతజ్ఞతలు.

ఈ అభినందన సంచికలో తమ అక్షరాశీస్సుల వంటి రచనల నందించిన సాహితీమూర్తుల కందరకీ పేరు పేరునా మా కృతజ్ఞతాభివందనాలు. ఎందరో సాహితీ మిత్రులు ఎన్నో విధాల ఈ కృషిలో సహాయపడ్డారు ఆర్థికంగా, హార్దికంగా. అందరికీ వందనాలు.

అక్షరాల కూర్పు శ్రీ దత్తసాయి గ్రాఫిక్స్ వారిది; ముద్రణ విప్లౌ ప్రింటర్స్ వారిది. వారికి మా కృతజ్ఞతలు

ఈ సంచికకు నాయకులైన మహాకవి డా॥ జె. బాపురెడ్డి గారికి షష్టిపూర్తి శుభాకాంక్షలు! ఈ సంచిక వారి సాహితీమూర్తికి అక్షర రక్ష!

**సంపాదకుడు**

# అభినందన ప్రసూనాలు

## కవితలు; వ్యాసాలు

## సమీక్షలు

## ఆశీస్సులు ; అభినందనలు ; ప్రశంసలు



# యువవర్షదర్శనం



**- డా॥ జె. బాపురెడ్డి, ఐ.ఎ.ఎస్**

మామిడి పూచినట్లు, మధుమాసము హాసము చేసినట్లుగా
నా మదియే నవ ప్రణవనాద పికమ్మయి మ్రోగినట్లు, తే
జోమయ కాలచక్రపరిచుంబిత దిక్తటమట్లు, కోరి నే
నే మరుజన్మ మెత్తినటు లీ యువ వర్షము దర్శనమ్మిడెన్.

రామలక్ష్మీ కృష్ణ రసయోగ సిద్ధిలో
కన్ను విప్పిన జీవకణము నేను
సిరికొండ శిఖరాల శివతాండవమ్ములో
పల్లవించిన పల్లె ప్రకృతి నేను
కొండవాగుల గుడిగుడి గుంజెమాటలో
పులక లెత్తిన రామ చిలుక నేను
ఇల ఉగాదులనెల్ల అలరించు చైత్రుని
జైత్రయాత్రా ప్రగతి చరిత నేను

కాలతటమున కూర్చుండి కలల అలల
తేలిపోయెడి పసిగాలి బాలకుడను
ఆది తుదిలేని సృష్టికావ్యార్థములను
చెప్పుచుందును ఎరుగను తప్పొ ఒప్పొ !

తెల్లని వేపపూ వొగరు తీరిన మామిడి కాయ, బెల్లమున్
చల్లని నీట కల్పిన రసమ్మును దొన్నెలనిండ త్రాగి మ
త్తిల్లిన నా మనంబు అరుదెంచిన క్రొత్త ఉగాదులందు రా
గిల్లెను, వాడిపోని వనగీతికయై స్వరసప్త శైలమై !

కోహము కోహమంచు, యువకోకిల వేసినచిక్కు ప్రశ్న నా
దేహము గేహమందు నివదించును సోహము
సోహమంచు, మో
హాహమువీడి ఆత్మకలహంసము తీర్చెడి సృష్టిమూల సం
దేహము వోలె, ద్యో వనధి తీరము తట్టిన శబ్ద వీచినాన్.

వాసంతోదయమే ప్రబుద్ధ ఋతుశోభావార్ధి సంగీతమో!
ఆశావాదజనాంతరంగములు సౌఖ్య ప్రాప్తికానందమై
దేశం బంతట లాస్యమాడినవి, దేదీప్యమ్ముగా నిండి పో
యెన్ సౌజన్య సమత్వముల్ చెదిరిపోయెన్ శైశిరస్వార్థముల్.

యువనామవత్సరము నను
భువిపై పడవేసి వెడలి పోయె నెటకొ! మా
నవజీవిత విపణిని నా
వ్యవహారము చూచిపోవ వచ్చెను మగుడన్.

నీ నాకమ్ముకు తీసిపోవనటులుంగా ఈ లోకమున్
తీర్పు కా
వ్యానేకమ్ములు కూర్చుచుండెడి చిదద్వైతాత్ముడౌ
నన్ను, చై
త్రానందమ్మున కాంచి మెచ్చి యువనామాబ్దమ్ము
దీవించె; వ
త్సా! నీ సత్కృతులెల్ల లోకముల సత్సంయోగమున్
కూర్చెడిన్!

నన్ను యువనామ శక్తియే కన్నకతన
చిరయువత్వము నా భావచేతనమున
వెలుగుచున్నది అమృతత్వ మలరి; ముదిమి
త్రాసమే లేదు, నా కవితా సవితకు

యువవర్షాగమన మహో
త్సవమిది, నరులెల్ల కల్పతరులై విరులై
యువతాక్షర శివగరులై
నవతాక్షయ ఝరులు సిరులు నా వర్ధిలుతన్ !



(ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక 5-4-1995 సౌజన్యంతో)



**జ్ఞానపీఠ అవార్డు గ్రహీత**
**పద్మభూషణ్ డా ॥ సి. నారాయణరెడ్డి**
*రాష్ట్ర ప్రభుత్వ సాంస్కృతిక భాషా సలహాదారు*

# నిరంతర కవితా కృషీవలుడు

జీవితానికున్నట్టే కవిత్వానికీ లక్ష్యం ఉండాలి. కవికి ముందు ఏమి రాయాలనే స్పష్టమైన అవగాహన అవసరం. అప్పుడు చూడొచ్చు ఎలా రాయాలో. వస్తువు, అభివ్యక్తి అంటే ఇవే. డా॥ బాపురెడ్డికి తాను ఎన్నుకున్న వస్తువుపట్ల నిర్దిష్టమైన అవగాహన వుంది. ఆవేశాన్నీ ఆలోచననూ రంగరించుకుని అందంగా వ్యక్తీకరించే నేర్పుంది. ప్రథమ రచన **"చైతన్యరేఖలు"** నుంచి పరిణతికృతి **"శ్రీకారం శిఖరం"** వరకు జరిగిన క్రమారోహణలో బాపురెడ్డి ప్రతిభా పరిణామం స్పష్టంగా కనిపిస్తుంది. ద్వంద్వ ప్రవృత్తుల మధ్య నలిగిపోతున్న సత్యాన్ని సందర్శించే సూచీ ముఖం లాంటి సూక్ష్మమతి ఆయనది.

ఛందోరూపకంగా పరిశీలిస్తే బాపురెడ్డి రచనా ప్రస్థానం అగ్రకవులు కొందరిలాగే త్రిముఖంగా సాగింది. పద్యం, గేయం, వచనగేయం, ఆ తరం నవ్యకవులు పద్యరచనలో పగడాలు రాల్చిన సంగతి సాహిత్య లోకానికి తెలుసు. కాని మా తర్వాతి తరం కవుల్లో పద్యాన్ని పట్టుకున్న వాళ్లు అరుదు. పట్టి అంచులు ముట్టినవాళ్లు వేళ్ల దాటిపోరు. బాపురెడ్డి పద్యవిద్యామర్మజ్ఞుడు. ప్రౌఢ పద్యకవుల పంక్తిలో కూర్చునే పద్యాలు ఎన్నెన్నో రాశాడు. గేయ కవితలతో పాటు గేయ నాటికలను కూడా రాశి పోశాడు. ఆలోచన ప్రేరకంగా వుండే వచన కవితలూ కూర్చాడు.

మూడు దశాబ్దాలకు పైగా ప్రభుత్వపరంగా వివిధ పదవుల్లో రాణకెక్కుతూ, నిరంతర కవితా కృషీవలుడిగా ఆధునిక సాహితీ క్షేత్రంలో రాజనాలు పండిస్తున్న డా ॥ బాపురెడ్డి సేవలకు గుర్తింపుగా ఆయన పేర ఒక అభినందన సంచిక ప్రచురింపబడడం ప్రశంసనీయం. ఈ సందర్భంగా ఆత్మీయసోదరుడు డా ॥ బాపురెడ్డికి నా శుభాకాంక్షలు.

**సి. నారాయణ రెడ్డి**



*Parents Smt. Ramalakshmi and Sri Jankay Krishna Reddy*



*Rajeswari and Bapu Reddy as young couple*



*In-laws - Smt. Chilakamma & Sri Pinninti Linga Reddy*



*J.Bapu Reddy with his parents and his youngest son Balaji.*



*Mr Reddy's father-in-law Sri P.Linga Reddy who has influenced him tremendously in his childhood.*



*J.Bapu Reddy lost in poetic thoughts somewhere in the mountains in California (USA) in 1989.*

# కావ్యాశ్రమ దీక్షితుడు : బాపురెడ్డి

- శేషేంద్ర

శ్రీ బాపురెడ్డి నేటి కవుల్లో అగ్రశ్రేణి కవి. ఆయన కావ్యాశ్రమంలో దీక్షితుడై చిరకాలమయింది. కొన్ని బహుమతులు కూడా లభించాయి గానీ ఆయన చేశిన ఉత్కృష్ట కృషికి సమాన ప్రమాణంలో ఉన్న బహుమతి ఇంతవరకూ ఆయనకు లభించక పోవడం శోచనీయమే కాక ఈ దేశపు బహుమతుల సంస్థల్లో ఉన్న అనైతికతనూ స్పష్టం చేస్తుంది.

శ్రీ బాపురెడ్డి కావ్యకృతులు పాఠకలోకాన్ని ఆకర్షించి చదివిస్తాయి. ఏ కావ్యంలో నైనా ఆకర్షణ అలంకారం చేతనే ఉత్పన్నమవుతుంది. ప్రతీకలనీ బింబాలనీ అలంకారాలనీ ఈనాడు ఆధునిక విమర్శలో వాడే శబ్దాలన్నీ అలంకారాన్నే వ్యంజితం చేస్తాయి. అట్టి అలంకారాన్ని వ్యక్తం చెయ్యడానికి కవి శబ్దాన్ని ఎన్నుకుని కుశలతతో కూర్చువాడు. కుశలత ఎందుకంటే తన మనోవీధిలో మెరిసిన అలంకారాన్ని పఠితకు అందజెయ్యాలి. ఆ కార్యానికి శబ్దాలే ఉపకరణాలు. అలంకారాభివ్యక్తి కోసం జరిగే అలాంటి నకుశల శబ్దసంయోజన చేత పుట్టే భాషే కవిత్వం.

అలంకార రహితమైన రచన మెయిన్ స్ప్రింగు లేని గడియారంలా ఉంటుంది. మనిషి మీద మహిమ చూపించలేదు. వ్యర్థమవుతుంది. "కింకవేస్తస్య కావ్యేన కింకాండేన ధనుష్మతః । పరస్యహృదయే లగ్నం నఘూర్ణయతి యచ్ఛిరః"।( ఎదటి వాడి హృదయానికి గుచ్చుకొని ఆ కవి కావ్యమూ శిరస్సు నేలబడి దొర్లేలా చెయ్యలేని ఆ ధనుర్ధారి యొక్క బాణము ఎందుకు? ఏడవనా!) అందుచేతనే మన పూర్వకావ్యాలంకారా చార్యుడైన వామనుడు, "కావ్యం గ్రాహ్యమలంకారాత్" అన్నాడు. పాశ్చాత్య సాహిత్యలోకం కూడా అదే మాట చెప్పి. ప్లెఖనోవ్ అనే ప్రఖ్యాత రష్యన్ సాహిత్య వేత్త అంటాడు. "Literature is the art of images and every invasion of naked ideas or propaganda is always detrimental to a given work." అలాంటి ఆకర్షణ శక్తి ఉన్న అలంకారాలు శ్రీ బాపురెడ్డికి ఎలా లభ్యమవుతాయి? నిజమైన కవులందరికీ ఎలా లభ్యమవుతాయో అలాగే లభ్య మవుతాయి. అవి ఎలా లభ్యమవుతాయనే వివేచన కావ్యశాస్త్రంలో క్షుణ్ణంగా జరిగింది. "నానృషిః కవి రిత్యుక్తః ఋషిశ్చకిల దర్శనాత్ । సమస్త వస్తు ధర్మాంశ్చ తత్త్వ ప్రఖ్యాచ దర్శనం" అన్నాడు తౌతభట్టు తన కావ్య కౌతుకంలో - (ఋషి కానివాడు కవి అనబడడు, అంటే ఋషి అనబడడానికి ప్రధానం, దర్శనమనే కీలక లక్షణం, మరి ఈ దర్శనమేమిటి? సృష్టిలో ఉన్న వస్తువుల అదృశ్య అంతర్గత ధర్మాలు, వాటి తత్త్వము కవికి కనబడడమే దర్శనము. ఆ దర్శన ప్రక్రియలో నుంచే అలంకారాలు పుడతాయినః వ్యాఖ్య) ఈ విషయాన్నే రుద్రటుడు "మనసి సుసమాధిని విస్ఫురణ మనేక ధాభిధేయస్య । అక్లిష్టాని పదాని నచ విభాంతి ...." అని స్పష్టీకరించాడు. కనక శ్రీ బాపురెడ్డికి ఈ విధమైన దర్శనం చేతనే అలంకారాలు లభించాయి. ఈ ప్రక్రియనే ఫ్రెంచి కవి బోదిలేర్ " Perfected Sensibiity" అన్నాడు, స్పానిష్ కవి లోర్కా " Sensibility eultivated by reading and experience" అన్నాడు. రష్యన్ కవి మాయాకోవ్స్కీ "the celebrated absent mindedness of the poet" అన్నాడు. విఖ్యాత ఫ్రెంచి నవలా కారుడు బాల్జాక్, "the second vision" అన్నాడు.

కనకనే బాపురెడ్డి దేశ విదేశాల్లో కవి పండిత విమర్శకుల చేత భూరి భూరి ప్రశంసలు పొందిన జగద్విఖ్యాతకవిగా ప్రతిష్ఠితుడయ్యాడు. బాపురెడ్డి సాధారణ కవికాడు, విశేష కవి. ఆయనకు జరుగుతున్న ఈ సాహిత్య మహోత్సవ సమయంలో ఆయనకు నా అనేకానేక హార్దిక అభినందనలు -

# విజయకామన

– డా॥ ఉండేల మాలకొండారెడ్డి

● పద్యమ్ము గద్యమ్ము పదునుగా కదనుగా
గుప్పించగల కళాకోవిదుండు
గేయమ్ము ధ్యేయమ్ము ఖేలాసమమ్ముగా
సంధించు, సుకవితా సవ్యసాచి
ప్రణయమ్ము ప్రణవమ్ము పాలుతేనియలుగా
కలిపి వడ్డించు ప్రజ్ఞానశాలి
అనుభూతి జనగీతి అసమానరీతి ఆ
లాపించు గాన కళావిదుండు,
పలుకు పలుకున చైతన్యమొలుకుచుండ
సభను పాలించు చతుర వాక్పానుండు
"బాపురెడ్డి" కి పట్టరే! బ్రహ్మరథము
సర్వజనులార : కవితారసజ్ఞులార !

● నిండుగళమ్ముతో మధుర నిక్వణముల్ పలికించి, సాహితీ
మండలిమేలినట్లు, జనమండలి నేలిన పాలనా కళా
ఖండలుడైన "బాపు" బహు కావ్యమహత్వము వెల్వరించు, ఈ
పండుగ వేళ, కన్నులకు పండుగ, ఆంధ్రకలాజగుత్తుకున్

● అమెరికా తెలుగుల ఆతిథ్యదీప్తిలో
"తానా" సభల నిండుదనముగూర్చి,
"నెదర్‌లాండ్" విరిసిన మృదుపుష్పచయములు
ఆంధ్ర శారద సిగయందు తురిమి,
"బ్యాంకాకు" పురిని ప్రపంచ సాహిత్య వీ
ణాతంత్రులకు తెల్గు గీతి నేర్పి
కళ, కళ కోసమే కాదని, విశ్వక
ళ్యాణ మార్గమున కలమ్ము నడపి,
భావుకత కెట్టి యెల్లలు లేవటంచు
సకల మానవ సౌభ్రాత్ర సౌరభమ్ము
వివిధ భాషల వెలయించు విశ్వ కవికి
"బాపురెడ్డి"కి నేడిదే ప్రణతిశతము.

# Bapu Reddy, The Poet

**J.M. Girglani, IAS (Rtd)**

*J. Bapu Reddy, the poet, is a skylark who floats high above the clouds. He is a swan who gracefully swims in the waters of celestial lakes. He is Narada who jaunts about from Planet to Planet. He is a telescope that sees beyond the horizon. He is the cuckoo that sings sweet melodies of love to the spring. He is a philosopher trying to unravel the mysteries of life, death, time and space. He is a gardner who weares beautiful flower garlands of thoughts and words. He is a weaver who weaves colourful patterns of emotions and ecstasies. For, Bapu Reddy is a versatile poet, steeped in poetry, in thought, word and deed. His most mundane actions are also couched in poetic grace. He writes with equal force and felicity on death or beautiful women and their enticing charms darting eyes and having breasts, on war and peace, on Ugadi or family planning, economics or the concept of time, man or morals, pleasure or pain. He writes in traditional metre and blank verse, ancient style and most modern style. Whatever he writes, in whatever form, one thing is certain: he is peerless. Rythem, meaning, melody subime thought, all combine to make his poetry a class by itself.*

*Until he had written his* ***'Longing For Life'*** *we thought Bapu Reddy could at best translate his own beautiful Telugu poems into English as he had done in In 'Quest of Harmony.' But in 'Longing For Life, he astounded even his best friends and admirers by his English Poetry written directly in that language on powerful themes. He betrayed no problems with English language. He proved that language is no barrier to poetry and that once you are a poet, language becomes your slave. Thereafter, his three more books in glish established him as an 'English Poet' or whatever s the right phrase for an Indian Poet writing English Poetry better than Englishmen.*

*To his powerful and highly meaningful poems, he adds the lustre of his effective recitation that results in sheer delight for the listners. His poetry has the depth of a seer, the passion of lover, and the beauty of an Apsara. If much higher awards than he has received have eluded him, it is because his image as an administrator seems to be a disadvantage in an ascriptive society that judges quality of everything, including poetry, by labels. Another disadvantage that a non-professional poet suffers is that the 'literary arbitors' - if I may use that phrase, do not allow them to sell their poetry or sell themselves as poets. I use the word sells in the American sense of 'projecting getting accepted.) Not that Bapu Reddy suffers from undue modesty. But inspite of his social charm and expansiveness, the charmed circle of English intelectuals will not easily accept poetry in English from a non-academic or form those who are already in the literary limelight. That is the measure of their conditioning. But by shere grit, I am sure, Bapu Reddy will penetrate this charmed circle and charm them out of their shells and their obdurity.*

# శ్రీ బాపురెడ్డి కవి హృదయం

– డా॥ నాయని కృష్ణకుమారి

భౌతిక ఆకార యష్టిలో ఒక అంశం హృదయం. దేహశాస్త్ర వేత్తల వివరణల ననుసరించి దీనికి కొన్ని అరలూ, సిరలూ, ధమనులూ వంటి భాగాలుంటాయి. ఇది వివిధ దేహాంగాలకు రక్తాన్ని సరఫరా చేస్తుంది. మలిన రక్తాన్ని శుభ్రం చేస్తుంది. ఇది కేవలం భౌతిక పరమైన హృదయ ధర్మం.

ఇందుకు భిన్నంగా ఆధిభౌతికమైన ధర్మం దీనికి అంటగట్టబడ్డది. ఆలోచనా ప్రక్రియ శాస్త్రీయంగా చూస్తే మెదడు చేసే పని..... హృదయం చేసే పని కాదు. కేవలం ఆలోచించడం అనేదాన్ని మెదడుకే అట్టిపెట్టి, భావ నిర్భరంగా, రసబంధురంగా, ఆలోచించడం కలల్లో తేలిపోతున్నట్లు ఊహించడం లోపలంతా ఏదో కరిగిపోతున్న అనుభూతిని సృష్టించేఆలోచనల్ని సారించడం–తతాం గాన్నంతా భావుకులు హృదయానికి కట్టబెట్టేశారు. ఆరకంగా మెదడుతో ఆలోచించేవాడు సామాన్యుడైతే, హృదయంతో ఆలోచించే వాడు అసామాన్యుడు.

కవి అనే ప్రతి వ్యక్తికీ ఈ అసామాన్య లక్షణాలు తప్పకుండా ఉంటాయి. అవి లేని వాడెవడూ కవి కాలేడు. అయితే ఆ లక్షణాల వైరళ్య గాఢత్వాల మీద ఆధారపడి మనిషిలోని కవిని కొలమానం వేసుకోవాలి. శ్రీ బాపురెడ్డి కవి. తన హృదయధర్మాన్ని ఖచ్చితంగా కొలుచుకో నేర్చిన కవి. ఏ కవికైనా తాను సృష్టిస్తున్న కవిత్వం పట్ల ఒక నిశ్చితావగాహన ఉండి తీరాలి. తన హృదయపరమైన ఆలోచనల్ని సంయమనంతో ఒక నిర్దిష్టమార్గంలో నడిపించ గలగాలి. పగలంతా ఆటల్లో మునిగి చీకటి పడేవేళకు అమ్మదగ్గరకు చేరుకునే పిల్లల్లాగా, కవి భావాలన్నీ ఈ నిర్దిష్ట పథకం వేపుకు మళ్ళవలసిందే. బాపురెడ్డి ఇలువంటి పథాన్ని సిద్ధం చేసుకునేఉన్నాడు. జీవితంలో మూడు దశలు, యౌవన, ప్రౌఢ, వృద్ధాప్యాలు, ఏ వ్యక్తీ ఒప్పరికింప వలసిన దశలు కావు. ఈ మూడింటి లక్ష్యాలు వేరుగా ఉంటాయి.

యౌవనంలో ప్రపంచమంతా ఒక ప్రేమారామం. ఇక్కడ స్త్రీ పురుష ద్వంద్వం తప్ప మరొకటి ఉండదు. ఈ దశలో ఒక తీగె స్త్రీ గానూ, చెట్టు పురుషుడుగానూ కనపిస్తుంద మేఘం, మెరుపు తీగ, అర విరిసిన కుసుమం, భ్రమరం ఆకాశం, అతని ఉన్ముఖజ్వలిత జ్వాల, శలభం– ఇట్లా ప్రకృతిలోని సర్వ విషయసంచయమూ స్త్రీ పురుష రూపంలో జంట వస్తువులై భాసిస్తుంటాయి. ఇక్కడ ఆదర్శాలు వెవక పట్టవచ్చు. సందేశాలు చప్పబడి పోవచ్చు కవికి, ఒక విధంగా ఏదీ కనిపించదు. అనలతని మనోదర్పణంలో మరొకటేదీ ప్రతిఫలించదు. ఉండేదంతా ఒక్కటే ప్రేమ! బాపురెడ్డి కవి జీవితంలోని ఈ దశా ప్రాముఖ్యాన్ని చక్కగా గుర్తించాడు. తరుణ భావ సాగరాన తరంగమై పోయి, "పరవశించు గాలిలో పరిమళించే ఆత్మీయతను" గ్రహించి "రావే చెలి నా జీవన ప్రణయారామమువై" అంటూ ఒక స్త్రీ మూర్తిని గుర్తిస్తున్నాడు. అంతటితో ఆగక "నీవు అనిర్వచనీయవు కాని చిరస్మరణీయవు" అని ఆమెను విశ్లేషించి "నేను ఇంతవరకు జడుడ కాని యిప్పుడు కవీశ్వరుడ" అని కవిత్వాంశను విశదీకరిస్తున్నాడు ఈదశలో ఇటువంటి కవిత్వం వెలువడడమే కవి జీవనపరాకాష్ఠ.

**రెండవదశ ప్రౌఢ దశ** – ఇది ప్రగతి భావ రంజితమైన దశ. మనిషి యౌవనోద్భవ ప్రథమ దినాలనుండి ముందుకు జరిగి, వివాహితుడై, సుస్థిర కుటుంబానీత సంతృప్తి పరవశాత్ముడై, తన దృష్టిని దేశం వైపుకు సారించడానికి సిద్ధమౌతాడు. అప్పుడు దేశం, తన బాధలు తాను పడుతూ చిత్తం వచ్చిన రీతిలో పలుముఖాలుగా బాధావిముక్తి కోసం పరుగులు తీస్తూనే ఉంటుంది. మనిషిలోని కవి హృదయం ఆ బాధల్ని గుర్తిస్తుంది. ఆ ఆర్తిని చూచి కళవళ పడిపోతుంది. నే నేం చెయ్యను? ఎట్లా ఈ ఎగుడు దిగుడుల్ని సరి చేయను? నా వంతు కర్తవ్యాన్ని నే? నెలా నిర్వహించను అంటూ ఆక్రోశిస్తుంది. ఆవేశ ప్రకటన చేస్తుంది. ఉద్య మిస్తుంది. ఈ దశలో కవి కళ్ళకు లోకమంతా సమస్యల వలయమై, నన్నాదుకో అని అరచి చెప్పే చిన్న పిల్లలాగా పిలుస్తూ ఏడుస్తూ కనిపిస్తుంది. అందుకే కవిహృదయం, ఇంతకు ముందు ప్రశంసించిన ప్రకృతి రామణీయకాన్ని కాదని, "తలిరుగాడుపుల నామది పులకరించదు సకల జనుల సుఖతరంగ శ్రుతుల వినాలి" అంటుంది. "కోకిల పాటలు వినే కోరిక లేదు ప్రగతి నోట మనిషి గెలుపు పాట వినాలి" అని రొక్కిస్తుంది. లోకాన్ని తేరిపార చూస్తే, స్త్రీలపై అత్యాచారాలు, లోకంపై ప్రకృతి బీభత్సాలు, దేశం మీద పొరుగు దేశపు దురాక్రమణలు, సమ్మెలు, గృహదహనాలు, ధరనాలు, అంటరానితనాలు, మతకలహాలు ఒకటేమిటి అన్నీ ఈ దశలో కవి కలాన్ని కుదిపేస్తాయి. అన్నిటినీ పరామర్శిస్తూనే కోప్పడుతూనే, దేశం మీద కొండంత అభిమానాన్ని కూడగట్టుకుని, "నాదే నాదే భారతదేశం మోదంలోనూ ఖేదంలోనూ నాదే ఈ దేశం" అంటాడు. నా రక్తంలో నానాడుల్లో నాదం నాదేశం నా కన్నుల్లో నా డెందంలో వెలుతురు ఈ దేశం అంటూ మనిషిని దేవుని ఒకటిగా మలిచే భూతలస్వర్గం నా దేశం అంటూ ఎలుగెత్తి చాటుతాడు. ఈ దశయొక్క ఆర్తి, ఆప్తి, సారమూ, ధ్యేయమూ, అంతా ఇంతకు మించి మరొకటుండదు.

**మూడవదశ : కించిత్ ప్రాయం కై వ్రాలిన దశ :** ఈ దశలో సమాజం సమస్యలు లోకం, వెనకబడిపోతాయి. పూర్వపు దశలోని సమష్టి చేత నుండి, తిరిగీ వ్యష్టి చేతనను చేపట్టడానికి హృదయం ఉద్యుక్త మౌతుంది. ఇక్కడ కవిదృష్టి ఆంతర చేతన వైపు అది గ్రహించే అలౌకిక భావ బంధురత వేపు' మనుష్యులూ, లోకమూ, వాళ్ళసమస్యలై, సుఖదుఃఖాలూ అన్నీ అప్రధానాలయి పోయి, ఈ కళ్ళు చూడలేని, ఈ భౌతిక జగత్తుకు అర్థం కాని, ఒకానొక తత్త్వం వేపుకు ఆకృష్టమై పోతుందది. "అంతరిక్ష శిఖరంపై కాంతి గోళములు కావల చిద్విలాస మాడు నిన్ను పృధ్వీని నిలుపు కుంటూ ఈ ఎత్తులు ఒక యెత్తా ఎరుగవేమో నా సత్తా" అని ఆ తత్త్వాన్ని రొక్కింటి "ఏ రూపంలో ఉన్నా నీరూపం కనగలిగే నా కన్నుల కాంతులు" అని ఆత్మప్రత్యయాన్ని ప్రకటించుకుంటుంది.

ఇట్లా ప్రణయగీతులు, ప్రగతి కవితలు వ్రాసి ప్రణవ గీతాలలో పరవశిస్తున్న కవి బాపురెడ్డి ! ఇక ముందు ఈయన కవితాత్మ చేసే ప్రయాణమెట్లో! ఇతని హృదయ ధర్మి ఆదర్శం ఆసక్తి ఎటువంటిదో?

**నాయని కృష్ణకుమారి**
898/2, నాయని సుబ్బారావు వీధి
నాగార్జున నగర్
హైదరాబాదు – 500 873.

# ప్రజ్ఞాచక్షు వైన పద్యకవి

**'సాహిత్య బ్రహ్మ' డాక్టర్ వి.వి.యల్. నరసింహారావు**

కవిత్వానికి భావం అంతరంగమైతే భాషా చ్ఛందస్సులు బహిరంగాలు. కాలానుగుణంగా అంత రంగంలో వచ్చిన మార్పుల్ని బట్టి బహిరంగ సాధనాల్లో కూడా అనివార్యమైన మార్పులు వచ్చాయి.

ప్రాచీన పద్యకవితకు భిన్నమైన ఆధునిక వచన కవిత అట్లా అవతరించిందే. ఆధునిక నాగరకత, శాస్త్ర సాంకేతిక రంగ విస్తృతి మొదలైన వాటిని కవితలో ఆవిష్కరించటానికి నిజానికి ప్రాచీన పద్యచ్ఛందం కంటే ఆధునిక వచన కవిత అనువుగా ఉంటుంది. అంత మాత్రాన పద్యానికి కాలం చెల్లిందనీ, ఈ యుగమంతా వచన కవితా యుగమేననీ తీర్పు చెప్పటం సముచితం కాదు.

ఈ సత్యాన్ని పూర్తిగా గ్రహించిన సత్కవి బాపురెడ్డిగారు, గ్రహించటమే కాదు, వస్తువుకు అనుగుణంగా ఇటు వచనకవితనీ, అటు గేయకవితనీ, మరో వంక పద్యకవితనీ ప్రతిభావంతంగా రూపొందిస్తూ త్రివేణీసంగమస్థలంగా తన కవితను ఆవిష్కరిస్తున్న ఆంధ్రకవి డాక్టర్ జె. బాపురెడ్డి గారు.

'బాపురెడ్డి పద్యకావ్యాలు' పేరుతో 1969లో 23 పద్యఖండికలూ, అదనంగా మరో 8 ఖండికలు చేర్చి ఆ గ్రంథాన్నే 1973లో ద్వితీయ ముద్రణగానూ, ఆ తరువాత మరో 16 ఖండికలు చేర్చి 1986లో, దాన్నే తృతీయముద్రణగాను ప్రచురించారు.

ఈ గ్రంథానికి బాపురెడ్డిగారు ముందుమాట వ్రాసుకుంటూ "పద్యానికి ప్రమాదం లేదు" అని హామీ యిచ్చారు.

హామీ యివ్వటమే కాదు, ప్రచురించిన పద్యాలను పరిశీలిస్తే కవిగారు పద్యాన్ని భావ మోహనంగా సుప్రతిష్ఠితం చేశారన్న తృప్తి ఆనందమూ కలుగుతుంది సహృదయలోకానికి.

కంద మల్లినవాడే కవి అనీ, పందిని పొడిచిన వాడే బంటు అనీ పాత సామెతను వల్లె వేయక, పద్యరచనలో ప్రవేశమున్న ఆధునిక కవులే గేయాన్నీ వచనకవితను శక్తిమంతంగా వ్యక్తీకరించగలరనే నిశ్చితాభిప్రాయాన్నికూడా వెలువరించారు బాపురెడ్డి గారు.

ఇందుకు బాపురెడ్డి గారు కూడా ప్రత్యక్ష సాక్ష్యమే. ఈ కారణం వల్ల శ్రీశ్రీ, భీమన్న, దాశరథి, శేషేంద్రశర్మ, కరుణశ్రీ, నారాయణరెడ్డి గార్ల సరసన బాపురెడ్డి గార్ని కూడా నిలిపి పరిశీలించవలసిన అవసరం ఏర్పడుతున్నది.

బాపురెడ్డి గారికి పద్యవిద్య ఈనాడు హఠాత్తుగా సిద్ధించింది కాదు. ఆ మాటకొస్తే పద్య విద్య ఏకవికీ హఠాత్తుగా సిద్ధించేది కాదు. జన్మసిద్ధంగా ఉన్న ప్రతిభకు పదునుపెట్టుకుంటూ చిరకాల అభ్యాసం వల్ల మాత్రమే ఆ విద్య అలవడుతుంది.

బాపురెడ్డి గారికి చిన్ననాడే పద్యాలు రాసుకునే అలవాటు ఏర్పడింది. పదహారేళ్లు నిండీ నిండని పసరు ప్రాయంలో 'తెనుగు సాహితి'ని గూర్చి అభ్యుదయ నవ కవులను గూర్చి భక్తి శ్రద్ధలతో రాసిన ఈ పద్యం వింటే భావి కాలంలో బాపురెడ్డి

ఎంతటి మహోన్నత కవి కాగలడో స్పష్టమౌతుంది.

"నవ కవితాద్భుతాభ్యుదయ నాదము మ్రోసి, తెనుంగుజాతిలో
వివిధ కళాప్రభాకరుల వెల్గగ జేజి, తెనుంగు సాహితీ
భువన మహాంగణమ్మున నపూర్వ వసంతము గూర్చి నట్టి మా
నవ కవి చైత్రమహార్తుల మనఃపరిపూర్తి నమస్కరించెదన్."

మరో ఏడు గడిపి, వర్తమానాన్ని గతాన్నీ చూచుకుంటూ, అలనాటి కృష్ణరాయ విభుని సాహితీ వాల్లభ్యానికి పులకించి 'అశ్రుమాలలు' రచించు కుంటూ, ఆంధ్ర రాష్ట్ర అవతరణకు 'జయవిజయ నవాంధ్ర రాష్ట్ర జయపతాక లక్ష్మికిన్ అంటూ గొంతెత్తి జయగానం చేస్తే నిండు ఇరవైయేళ్లు వచ్చే సరికే విచిత్రమైన ఒక "మనశ్శాంతి"ని వాంఛించిన బాపురెడ్డి తత్త్వకోశం ఈనాడే (1956) పండిపోయిందేమోనని పిస్తుంది. ప్రేమద్వేషాలుకూ హాసక్రోధాలకూ, అవామన విసర్జనలకూ, గుణా గుణాలకు అతీతమై ద్వంద్వభాబాన్ని జయించన తామరాకు మీది నీటి బొట్టు లాంటి మనఃస్థితి యౌవనోదయంలోనే పొడసూపిందంటే ముందు ముందు ఈ సత్కవి ఏ మహాకవితా ప్రస్థానాలు చేయనున్నాడో స్పష్ట మౌతుంది. తాను 'ఋషీశ్వరుడు' కాకున్నను "నీరజదళమ్ముపై నుండు నీరమట్లు" సహచరులతో నుండగల్గు 'మనశ్శాంతి' ఆనాడే సిద్ధించినదంటే భావిఫలోదర్కమైన మహాకవితా లక్షణాన్ని అది సూచిస్తుంది.

పద్యకవితా ప్రస్థానం పదహారేళ్ళ పిన్ననాడే ప్రారంభించి దాదాపు పావు శతాబ్దికాలంలో భిన్న ప్రక్రియల్లో గేయకవితలు, వచన కవితలు, నాటికలు, సమీక్షా వ్యాసాలు, అనేకానేకం రచించి ప్రచురించారు బాపురెడ్డి.

"నీకును నాకు ఛాందసుల నేమమునన్ యతి చెల్లదేని, గే
యాకృతిలోన ప్రాసయతినై జతనౌదును నీకు, మెచ్చునీ
లోకము భావుకాధునిక లోక మహాభ్యుదయోన్ముఖ ప్రజా
నీకము ప్రేమ వాహినివి నీకు రసాబ్ధిని నాకు అడ్డులా?"

ఛాందసుల కఘోరనియమాలు పద్య భావానికి ఏ మాత్రం ప్రతిబంధకం అనిపించినా గేయంలో హాయిగా గానం చేసుకుంటాననే స్వచ్ఛందశీలం బాపురెడ్డిగారిది. ఈ కవితాశీలు నుంచి పొడుచుకొచ్చినవే "శ్రీకారశిఖరం" మొదలైన ప్రణవాత్మక అద్వైత భక్తి భావ గీతికా సంపుటులు; "ప్రేమారామం" మొదలైన మానవహృదయగీత అంతశ్చేతనానుభూతి ఆలపించిన రాగమాలికలు. "నాదేశం నవ్వుతూంది" అనే భావం తెలివెన్నెలు వెదజల్లే బాపురెడ్డి కన్నుల్ని చూస్తే స్పష్టమౌతుంది. 'కృతఘ్నత' అనుతాపము, 'మృత్యువు' మొదలైన వేదనా విశిఖలు గాయం చేస్తున్నా, 'వసంతోదయ', 'రసరాగ' స్వప్నజగత్తులు దర్శించి 'అద్వైత' 'ఆనందయోగి' గా, 'అనింద్యస్నేహసౌరభ' 'సరససాగరు'డై 'సుప్రభాత' 'మహోదయ' 'విజయేందిర' నావిష్కరించుకుంటూ 'ఆశల ఉగాది' పండించుకోగల ప్రజ్ఞ బాపురెడ్డి కవి చంద్రుడిది.

నవ్యత, సౌందర్యదర్శనం, తత్త్వాన్వేషణ, అనంతసత్యావిష్కరణ, భావభౌతికవాద ప్రపంచనం, చమత్కార చారుత, భావానుగుణశైలీరామణీయకం బాపురెడ్డి కవితకు ప్రాణకళలు.ఏ ప్రక్రియనైనా పట్టింది బంగారంగా భాస్వంతం చెయ్యగల ప్రజ్ఞ

ఆయనది. పద్యచ్ఛందాన్ని కట్టడిదాటని నట్టువరాతిగా నాట్యమాడించగల నేర్పు ఆయనకుంది.

గేయరచన కవితా కృతుల వలెనే ఒక సంపూర్ణ పద్య కావ్యం సమగ్రకథాకావ్యంగా రెడ్డిగారి కలంనుంచి వెలువడాలని ఆశిస్తున్నాను.

"యోగమార్గమున ప్రయోగ మార్గమ్మున
కాంచుచుందు దేశకాలములను
కనులతోడ లోని కన్నులతోడను
కాంచుచుందు సత్యకాంతిలవము"

అంటూ రెండు దశాబ్దాల క్రితమే తన కవితాలక్ష్యాన్ని నిర్దేశించుకొని, మహాకవితా ప్రస్థానం సాగిస్తున్న బాపురెడ్డిగారి గళంనుండి సందేశాత్మక కథా కావ్యగానం అచిరకాలంలో వెలువడగలదని ఆకాంక్షిస్తున్నాను.

**Dr. V.V.L.Narasimha Rao**
Retd.Director, Education Dept.
C-4, HUDA Colony, Saroornagar,
HYDERABAD 500 660
PHONE: RESI:878534

# సాహితీప్రయోక్తగా బాపురెడ్డి

డా॥ ముకురాల రామారెడ్డి

సాహిత్య సభలల్లో సరేసరి-రోజువారీ సంభాషణల్లో, కులాసా కబుర్లు చెప్పుకుని, తాజా తాంబూలాలు నములుకునే సందర్భంలో కూడా ఒకటి రెండు కొత్త మాటలు వినపించి తోటివారిని కాస్త కవ్వించనిదే, నవ్వించనిదే బాపురెడ్డి గారికి సంతృప్తినివ్వదు. కొత్తదనంవైపు, సరికొత్త భావాల వైపు ఆయన మనస్సు నిత్యమూ పరవళ్ళు తొక్కుతుంటుందని ఆయన రచనలన్నీ సాక్ష్యమిస్తాయి. 'నా ప్రత్యేకత నిత్యనూతనత' అని బాహాటంగా చాటుకున్న మనస్విత ఆయనది.

బాపూజీని గురుంచి "ఆరిపోవని వెలుగునిచ్చి ఆరిపోయిన దీపమా" అని ఆయన రాసిన పాట మాతరం వారి చెవుల్లో రింగుమని తిరుగుతూనే ఉంటుంది. ఆరచన కలిగించే సంవేదన పాఠకులనూ, శ్రోతలనూ మైమరపిస్తుంది, మౌన వ్రతం పట్టిస్తుంది. ఇలాంట మంచిపాట లెన్నో రచించారు; రచించిన ప్రతి ప్రక్రియ లోనూ ఆకర్షకమైన, ప్రయోజకమైన కొత్తరీతులను ప్రసారించిచూపారు.

గేయనాటికలకు ఎన్నుకున్న వస్తువు లన్నింటి లోనూ సమకాలీక ప్రయోజనాన్ని ఎంతో కొంత సాధించటానికే అన్నట్లు ఆయామలుపులు కనిపిస్తాయి. గేయనాటికలను సినీనటులు శ్రీ గుమ్మడి వేంకటేశ్వరరావుగారికి అంకితం చేసిన పద్ధతినుంచే రచయిత ప్రవేశపెట్టదలచిన నూత్నరీతి కనిపిస్తుంది. అంకితం విషయమై కావ్య కన్య, భావసఖి ఇద్దరూ ముచ్చటించుకుంటారు. ఏం చూసి ప్రేమించావమ్మా ఈ వరుణ్ణి ? గుణమా ? రూపమా? ధనమా? అని భావసఖి కావ్య కన్యకను అడుగుతుంది.

*'రాగద్వేషాలకు కారణములు చెప్పుట వశమా?*
*మా ప్రణయ రహోబంధమ్ములముడి విప్పుట వశమా?*
*నారాయణుడే, మాలో నాటెను ఈరాగలతలు (సి.నా.రె.)*
*కనిపించని ప్రేమసరాగాలె, కలిపె మా ఎదలను*

ఇలా చమత్కారాలతో సాగుతుంది సంభాషణ. చివరకు కావ్యకర్త సంతోషించి కావ్య కన్య మెచ్చిన వరునికి కావ్యాన్ని అంకితం చేస్తాడు. సాహిత్యరంగంలో ప్రసిద్ధులైన "భీమన్నలు, రామన్నలు తదితర విద్యావర సంపన్ను"లంతా అక్షతలు చల్లుతారు. బహుకొత్తగా ఉందిగదా ఈ అంకితపద్ధతి.

**ఋతురాగం:** ఈ గేయరూపకంలో ఆరుగురు ఋతుకాంతలు ప్రవేశించి అనుకూలమైన వాతావరణ శుద్ధికి, సిద్ధికి నేనే ఘనంగా చేశానంటే, నేనే ఘనంగా తోడ్పడ్డానని వాదించుకుంటారు. చివరకు కాలపురుషుడు ప్రవేశించి

*' మీలో మీరట్లు హద్దుమీరి పోరుపడకండి*
*ఈ కాలపురుషుని బ్రతుకులో తుఫాను రేపకండ*
*లోకమునకు మీరందరు ఏకరీతి ప్రియతములు*

*..............................................................*

*ఒకరు లేక ఒకరు లేరు సకలము ఎవ్వరూ కారు*
*యుగయుగాలు నావెంబడి ప్రగతిని సాధించండి"*

అంటాడు. భిన్నస్వరాలతో వినదించిన ఋతుకాంతలు కాలపురుషుడు చెప్పినట్లు తమ

సమైక్యతలోని ప్రయోజకతను గుర్తిస్తారు. తమ విధులు యధాతథంగా నిర్వర్తిస్తారు. భిన్నంగా కనిపించే సామర్థ్యాలన్నీ వ్యక్తిగత సామర్థ్యాలనీ, వ్యక్తిగత సామర్థ్యాల కలయికతోనే జాతీయ సమైక్యత అలవడుతుందని సందేశమిచ్చిన ఉత్తమ రచన ఇది.

**సాగరసౌధం:** అంటే తరతరాలు పారి పారి, పరుగెత్తి, పరుగెత్తి, పరవళ్ళు తొక్కి తొక్కి అలసి సొలసిన కృష్ణవేణీ నదికి నాగార్జునసాగరమనే ఆనకట్ట కాస్త విశ్రాంతినిచ్చే సౌధం వంటిదని తాత్పర్యం. కవి ప్రయోగంలోని నిగూఢతను ఈ మాత్రం నిర్వచనం చెప్పవలసి వచ్చింది.

నా ప్రజలకు దూరమై, నా బ్రతుకంతా ఇలా ఆడవిపాలై, నేనలా నడుస్తూ తడబడి తారాడి పోవలసిందేనా? చివరకు నా జీవనం సముద్రం పాలు కావలసిందేనా? అనుకుంటూ కృష్ణవేణి జాలువారుతూ పోతూంది. అప్పుడు

*ఆడవిపాలైన నీ అందాల బ్రతుకింక*
*ఆరాధనీయమౌనమ్మా!*
*కడలిపాలైన నీ సంసారసంపదలు*
*కనకంపు కోటలౌనమ్మా!*

అంటుంది ఓ నేపథ్యకంఠం. ప్రజలు తమ ప్రగతిని గుర్తించి ముందుకు వచ్చి నాగార్జున సాగరం నిర్మించుకుంటారు. నాగార్జునాచార్యుని ఆశీర్వచనంతో ప్రజల శ్రమతో తెలుగు మాగాణాల నిండా పసిడిపంటలు పండుతాయి.

నా చూపు లెటు పాకినా—పచ్చలే
ఏ మోడు తాకినా—పూమేడమే

అని కృష్ణవేణి, తన జన్మ ప్రజా ప్రయోజనాలకు అంకితమై, తరించినట్లు భావిస్తుంది.

'తెలుగు ఋతువులు' గురించి విశ్వనాథ 'ఋతుచక్రం' పేరుతో సి.నా.రె 'ఋతురాగం' పేరుతో బాపురెడ్డి రచించారు. రచనలో, ఇచ్చిన సందేశంలో ఎవరి ప్రత్యేకత వారదే అయినట్లు మనం గమనించగలం. 'నాగార్జునసాగరం' పేరుతో సి.నా.రె మహాకావ్యం రచించారు. రెంటికీ పోలికలు లేవు. ఎవరి ప్రత్యేకత వారిదే. ఇలా సమకాలికులు ఎన్నుకున్న వస్తువునే తానూ ఎన్నుకున్నా రచనాశైలిని నిర్వహించటంలో, నూతన సందేశమివ్వటంలో బాపురెడ్డి తన ప్రత్యేకతను నిలబెట్టుకున్నారు.

**భావిజీవులు:** జనాభా పెరుగుదలను అరికట్టే కుటుంబ సంక్షేమ పథక కార్యక్రమాలకు అనుకూలంగా రచించిన గేయనాటిక. పుట్టిగిట్టే ధర్మం ప్రకృతిలోనే ఉందిగదా? అనే ప్రశ్న రచయితను కాస్త లాగదీసింది. అందుకే ఇందులోని భావాలు తాత్త్వికచర్చలతో ప్రారంభమై "చెప్పిన హితమంతా పెడచెవినిబెట్టి పుట్టనట్టి నరజీవులకేమొ చరాచరములు నరకమైతోచు" అని కొంచెం తర్కస్పర్శతో ముగుస్తాయి. పదార్థచైతన్యాల పరిణామ చక్రంలో జీవులపుట్టుకను కవి శాసించలేడు కదా! అందుకని ఈ మాత్రం చమత్కారం—సొగసుగానే ఉంది.

**విజయహేల:** విజయదశమి సంబరాలకు స్వాగతం పలికిన గేయనాటిక. 'విజయీభవ' దేనికి? స్వార్థ త్యాగానికి, నిర్మల దేశభక్తికి విజయీభవ! అన్న కవివాక్కులతో దేశభక్తి, జాతీయప్రగతి గురించిన ఆశయం సూటిగానే తెలుస్తున్నది.

రచయితకు గల సృజనశక్తిని ప్రతిబింబించే గేయనాటిక ఇది. ఆకర్షణీయమైన శక్తులు కొన్ని: ప్రకృతి, ప్రేయసి, తల్లి, కష్టఫలం, భాగ్యదేవత, దేశమాత ఇలాంటివి. వీటిలో వేటిని వదులుకోవాలో,

వేటిని ఆరాధించాలో! మీమాంసలో పడుతుంది. ఆదర్శంగా నిలదొక్కుకోదలచిన మానవబుద్ధి. సమన్వయ వివేచనతో అన్నిటినీ ఆయా సందర్భాలలో గౌరవించి జీవయాత్ర సాగించటమే ఉత్తమమనే సందేశం ఇస్తుంది ఈ రచన.

**రాకెట్టు రాయబారం :** ఆధునిక మానవుని శాస్త్రీయ ప్రగతిని, సంక్షేమ ప్రగతిని వర్ణించిన రచన ఇది. మొత్తంపై చంద్రగోళ మెక్కిన మానవుడు వైజ్ఞానిక గర్వం ముదిరి గంద్రగోళంలో పడనక్కర లేదు. 'మానవాభ్యుదయమునకు ప్రమాదము లేదెన్నటికి' అన్నది కవి ఆశయం. అది ఫలిస్తే మానవలోకానికి సౌభాగ్యమ్ - ఈ నాటికలో చంద్రుణ్ణి 'చంద్రకాంత' 'చంద్రమాత', అన్నారు. పాశ్చాత్య సాహిత్యంలో చంద్రశబ్దం స్త్రీలింగం. అందుకని ఈ కొత్త ప్రయోగం. చంద్రగోళంపై మొదట కాలు మోపిన వ్యక్తి పేరు Armstrong., తెలుగు సేతలో అతను 'బాహుబలుడు' అయ్యాడు. ఇలాంటి మార్పులలోనూ కవిచెప్పనేర్చిన కొత్తదనం కనిపిస్తూనే ఉంది.

మిగతా గేయనాటికలు కూడా ఇలాంటి నవీన సృజనాత్మక కళలే ప్రతిబింబిస్తాయి. వీటినన్నింటినీ మరిన్ని విశ్లేషణ-వివరణలతో పరిశీలించే యత్నాలు పరిశోధకులవి, అవి ముందు ముందు రావచ్చు. ఈ సందర్భంలో నేను రాస్తున్నది కేవలం పరిచయవాక్యాల స్థాయిలోనే.

'పంచబాణ సంచా', 'ప్రేమారామం' వంటి గేయ గంధి వచన కవితలలో ప్రణయ భావ పరిమళాలు స్వేచ్ఛగా గుప్పించారు రచయిత.

*స్వేచ్ఛగా జరిగేది చెడైనా*
*స్వచ్ఛంగా ఉంటుంది.*
*దొంగచాటుగా జరిగేది*
*మంచైనా ఛండాలంగా మారుతుంది.*

(పంచబాణ సంచా పు. 18)

ఈ అభిప్రాయాన్ని కాదనటం కష్టం. పైగా స్కాండినేవియా వంటి దేశాల్లో పారిశ్రామిక సంస్కృతితో, స్త్రీలకు లభించిన సమాన హక్కులతో ఏర్పడ్డ సంఘ వాతావరణం చూసి చెప్పిన మాటలు అవి. పరిస్థితులను బట్టి ప్రణయ జీవన ధర్మాలు మారుతుంటాయి. వాటితో ఎవరికీ అభ్యంతరం ఉండదు.

'వద్దంటేనే ముద్దు' (లోమురిపెం). వంటి శీర్షికలు చదివతే సగటు మనుషులు కూడా సై అంటారు. మరీ ఇలా రాస్తే ఏంబాగు? అనే ప్రబుద్ధులు కూడా అవి చదువుకున్నప్పుడు లోలోన మెచ్చుకోవడమే సహృదయతకు మొదటి లక్షణ మేమో! మొత్తంపై ప్రేమ ఘాటు నసాళ మంటించే దాకా తన నూత్నతను ప్రయోగించి వడ్డించిన బాపురెడ్డి బాహాటశైలి మెచ్చుకోదగిందే.

అంతేకాదు, ప్రణయవ్రతకథల కమామీషుల వర్ణనా విన్యాసాలలో ధ్వనించిన ప్రకృతి పురుషుల హావ-భావ-విలాసాలు చూడ సొగసులు - ఒక చోట కేవలం ప్రకృతి విలాసమ్, మరోచోట పురుషలీలా కలాపమ్. ఒకచోట విశిష్టాద్వైతం, మరోచోట అద్వైతం పాఠకులను మోహపెడుతుంటాయి. ఈ వస్తు భావాల విచిత్రతలో 'పూర్ణాద్వైతం' ధ్వనించినట్లు లేదు. పంచతన్మాత్రల కందనిదిగదా అది. అది వస్తువూ కాదు, భావమూ కాదు. అందులో ప్రకృతి-పురుషుల విలాసం ఎలా ఉంటుంది? అందుకని కవి జాగ్రత్త పడ్డట్లు తెలుస్తుంది.

పద్యకవిత రచించగలిగిన వారినే మా చిరుప్రాయంలో కవులుగా పరిగణించేవారు: పెద్దల

గుర్తింపు కోసమే అనండి మాతో పాటు బాపురెడ్డి పద్య రచనలు చేసి పత్రికల్లో ప్రకటించటం గుర్తు. పద్య శిల్పాన్ని మెచ్చే సహృదయులు ఈతరంలోనూ అనేకులు ఉన్నారు. సాఫీగా చెప్పే మాటలతో రచించటం ఒక ఎత్తు. గణయతిప్రాసల అడ్డంకులకు గడబిడలో పడకుండ, గమక విన్యాసాలతో సాఫీగా చెప్పనేర్వడం మరో ఎత్తు. పద్యశిల్పం అనేది బహుశా ఈ రకం రచనతోనే ప్రారంభమవుతుందనాలి. పద్యం రచించే వరకు మాత్రమే చూస్తే అది ఒక పాటి పరిశ్రమ అనవచ్చు. చదివించే గుణం ఉంటే సరి ఏదో పాటి శిల్పం ఆ పద్యంలో ఉన్నట్లే. ఇలా చెప్పటం కొంత సులభమనిపించినా పద్యం రచించి మెప్పించటం బహుకష్టం. "నిజానికి పద్య ఛందస్సులో కొంత ప్రవేశం ఉన్నవారే గేయాన్నీ, వచన కవితనూ శక్తిమంతంగా వ్యక్తీకరించగలరని" బాపురెడ్డి చెప్పింది గమనించదగిన మాటే.

బాపురెడ్డి పద్యాలలో కొన్నిచోట్ల దుష్కరప్రాస (అలా శాస్త్ర దృష్టికి) కనిపించినా అది శ్రుతి సౌకర్యంగానే వినిపిస్తుంది. అల్లికలో కొత్త కొత్త సమాసాల మూసలు తొడగటం కవి మమత. రగడల రీతులు కూడా కొన్ని కలిశాయి. సంభాషణ శైలితో కొన్ని ఆకర్షిస్తాయి. వర్ణానుప్రాసల వైచిత్రి, తెలుగు-సంస్కృత పదాల మైత్రి నాజూకుగా పెనవేసుకుంటాయి. ప్రౌఢ పద్య రచయిత బాపురెడ్డి. 20వ శతాబ్ది పద్య కవుల గంభీర శైలికి ఎక్కడా తీసిపోని రచన ఈయనది. పద్యరచనల్లో మొదట భావకవుల శైలి వెంట సాగినట్లు తర్వాత అభ్యుదయ కవుల మార్గం అనుసరించినట్లు తెలుస్తుంది. చాటువులు కూడా కొన్ని రచించారు. 'భాష-భావం' అనే చాటువులో చౌకబారు రచనలపై ఒక నిరసన విసిరారు.

వచనం రాసినా ఈయన వాక్యాల్లో అక్కడక్కడ పదాది వర్ణమైత్రి కనిపిస్తుంది. "అన్నిటిలో ఆవిష్కృతమయ్యేది అనంత జీవ చైతన్యమే, అఖండ భావచైతన్యమే - అంతరిక్ష విజయకేతనము అడుగడుగున ఆవిష్కృతమైన ఈ కృతులు"....... ఇలాంటి వాక్యాలు చదువుతుంటే ఇంగ్లీష్‌లో 8వ శతాబ్దిలో వెలసిన పద్యపాదాలుfl "Grendel going God's anger bore" వంటివి జ్ఞాపకంలో మెదలుతాయి. రచనాపద్ధతిలో ఈరెంటికి సంబంధం లేకపోవచ్చు కానీ, పద్యాలు విస్తారంగా రచించిన మతి కవిది. ఆ 'యతి' ప్రభావం వచనంలోనూ వచ్చిపడిందనుకోవచ్చు.

సరిక్రొత్త పదాలు, పదబంధాలు, భాషీయాలు, కాకువులు సృష్టించగల శక్తి కవికి బాగా అలవడింది. ఏ ఖండికను ఎలా సృష్టించినా దాని లక్ష్యాన్ని జాతీయోన్నతి వైపు, మానవాభ్యుదయం వైపు మలచిన కవి ప్రయత్నం విశేషంగా మెచ్చదగ్గది.

తన రచనలో వలెనే నిత్యజీవితంలో కూడా ఎంతో స్వతంత్రతంగా, మంచిమనసు నిండుకున్న మనిషిగా, సహృదయతతో మెలగుతారు మిత్రులు బాపురెడ్డిగారు. ఈ సందర్భంలో వారికి అభినందనలు తెలుపుతూ సంతోషిస్తున్నాను.

**డాక్టర్ ఎం. రామారెడ్డి**
బి-20, ఫ్లాట్ 1
విజయనగర్ కాలని
హైదరాబాద్ - 500 454.

## ఓ సదాలోచనను అక్షరాలలోకి ఆప్యాయంగా ఆహ్వానించడం కవిత్వం......

**– డా॥ రావూరి భరద్వాజ**

నేను – అన్ని రకాల ఆలోచనలను గురించీ చెప్పబోవడం లేదు. అపరంజిలా మెరిసిపోయే ఆలోచనలను గురించి మాత్రమే చెప్పబోతున్నాను. ఎందుకా ఆలోచన అలా మెరిసిపోతాయో ఇప్పటికీ నాకు స్పష్టంగా తెలీదు.

నాకు చాలా సాధారణంగా కనిపించే ఓ దృశ్యం, బాపురెడ్డిగారికి, సాధారణాతీతంగా ఎందుకు కనిపిస్తుంది?

పోనీ – ఇలా అందాం –

నాకు, చాలా సాదాసీదాగా ఉన్న దానిలోనే బాపురెడ్డి గారు, ఓ మెత్తని అందాన్నెలా చూడగలుగు తున్నారు? ఎందుకు చూడగలుగుతున్నారు??

"ఏదో విద్వేషకాలుష్యం
ఈ గాలి నిండా ప్రవహిస్తున్నది,
ఏదో విధ్వంసక దావాగ్ని
ఈ నేల నిండా ప్రవహిస్తున్నది"

(రంగుల చీకట్లు, పుట : 7)

ఒప్పుకొన్నట్లే ఒప్పుకొని,
తప్పుకొనే తంత్రం మనది,
'మార్పు' రాకుండా మార్పులు చేసే
మాయామయ మనస్తత్వం మనది"

(పుట : 11)

"ఇరువై శతాబ్దాలుగా, ఏ
రువై దివివాసివై నీవు పాలిస్తున్న ఈ లోకం
ఇంకా పాపపంకిలంగానే ఉంది.
కళ్ళుండి చూడలేని వాళ్ళు
చెవులుండి వినలేని వాళ్ళు
సకలాంగాలు ఉన్న
వికాలాంగులై పోయి వాళ్ళు
సత్యాన్ని సిలువవేస్తున్న నిత్య విద్వేష కిరాతకులు
నరలోకాన్ని నరకలోకాన్ని చేస్తూనే ఉన్నారు"

(పుట : 16)

అన్న పంక్తుల వెనుక, కనిపించని కన్నీటి ప్రవాహాలు వినిపిస్తున్నాయి.

ముంచుకు రావలసింది మరణం కాదనీ, మోసులెత్త వలసింది మార్పులేననీ బాపురెడ్డి గారంటారు.

చేయవలసింది సంహరణం కాదనీ, చేపట్ట వలసింది సంస్కరణమనీ, బాపురెడ్డి గారు విశ్వసిస్తారు.

రంగులు పూచే చెట్ల మీద రక్తం పూయడం చూస్తారు బాపురెడ్డి గారు!

కాలమే కంపించి కంపించి, కెవ్వు మనడం వింటారు బాపురెడ్డి గారు.

ఏడాది కోసారి మాత్రమే వచ్చేఆమని గారిని, అరణ్యంలోంచి, జనారణ్యంలోనికి రమ్మంటున్నారు బాపురెడ్డిగారు. అదృశ్య రూపం నుంచి, దృశ్య రూపంలో కొచ్చినప్పటి ఆవేశాన్ని, ఆలోచనాక్షేత్రం లోకి మళ్లించమంటున్నారు బాపురెడ్డిగారు.

"మార్తాండునికి మసి పూస్తే
మహోదయం ఆగుతుందా?" అని ప్రశ్నిస్తున్నారు.

చుక్కలకు రెక్కలు తొడిగి, శూన్యం లోకి ఎగురవేస్తున్నారు. కాలానికి కాంతి కళ్ళెం వేసి

దేశమంతా తిప్పుతున్నారు. కవిత్వాన్ని రాజకీయం చేసే కాకి తత్వం పోవాలీ, రాజకీయాన్ని కూడా కవితామయం చేసే కోకిలత్వం రావాలనీ, బాపురెడ్డి గారు ఆశిస్తున్నారు.

మనకు తెలీకుండానే మనమంతా రాసుకొంటు పోయే కాలాన్ని గురించి బాపురెడ్డి గారిలా అంటున్నారు –

"యౌవనం వృద్ధాప్యాన్ని ఎదిరిస్తున్నది
అయినా ముదిమి బెదరకుండా

వయసు వాకిట్లోకి చొచ్చుకవస్తూనే ఉన్నది.

విర్రవీగే నాదేహ దుర్గాన్ని

వింత వింతగా ఆక్రమిస్తూనే ఉన్నది"

– అని ఊరుకోరు. ఆ వింత యేమిటో కూడా చెబుతారు. గండుతుమ్మెదల్లాంటి తల నీలాలలను వెండి తీగలుగా మారుస్తున్నదట కాలం. చెక్కు చెదరని వజ్రాల్లాంటి పళ్లను వొక్కటొక్కటిగా పీకేస్తూ పసితనం మళ్ళీ వొస్తున్నదని పరిమాసం చేస్తున్నదట కాలం. బయట కాదు చూపవలసింది లోనికి, నీలోనికి అంటూ హెచ్చరిస్తున్నదట కాలం!

అదేదో, మంచి పనే చేసింది కాలం!

ఉపకారాల పూవులే తప్ప, అపకారాల ముళ్ళు లేని ఆత్మీయతా వల్లరులు, బాపురెడ్డి గారి ఎదనిండా అల్లుకొనేలా చేసింది కాలం!

కోకిలలు చిందిస్తున్న పాటలను, కాకులు పరీక్షిస్తున్న రోజు లివి. పూవులు కురిపిస్తున్న నవ్వులకు బండరాళ్ళు విలువ కడుతున్న రోజు లివి. గగనంలోని నక్షత్రాలకంటే గాజు పెంకులే పెద్దవయి పోతున్న రోజు లివి.

అయినా –

అంతరాంతరాల నిండా అనురాగ వాహినులను నింపుకొన్న ఆర్ద్రహృదయుడు మా బాపురెడ్డి.

అంచేతనే –

చీకట్లలో కూడా రంగు రంగులను చూపగలుగుతున్నారు.

ఓ సదాలోచనను అక్షరాల్లోకి ఆప్యాయంగా ఆహ్వానించడమే కవిత్వమైతే,

ఓ మంచి రాగాన్ని రేఖల్లోకి, రంగుల్లోకి అందంగా అనువదించడమే కవిత్వమైతే,

నీకు తెలిసిన నిన్నే, నీకు తేలీని కోణం లోంచి నీకే చూపించుతూ, నిన్నే ఆనంద చకితం చేయడమే మంచికవిత్వమైతే –

ఎందుక్కాదు? తప్పకుండా అవుతుంది!!

"రంగు రంగుల చీకట్లు" కూడా అక్షరాల –

అదే అవుతుంది !!

**రావూరి భరద్వాజ**
"కాంతాలయం"
విజయనగర్ కాలనీ,
హైదరాబాదు-500 457.

# మనిషిని ఆరాధించే మనిషి శ్రీ బాపురెడ్డి

– రామమోహనరాయ్

"తెల్లని వేసపూవాగరు తీరిన మామిడికాయ బెల్లముల్
చల్లని నీట కల్పిన రసమ్మును దొన్నెల నిండ
త్రాగి మ
త్తిల్లి సురత్వమెందిన దివ్య వసంతకళా విలాస సం
పుల్ల జగత్ప్రమోద పరిపూరిత గీతిక లాలపింతమా?"

ఈ మంచి పద్యం మల్లంపల్లి సోమశేఖరశర్మగారు మెచ్చుకున్నది; ఇది శ్రీ బాపురెడ్డి రచనల్లోని రసగుళిక ఈ వర్ణన ఉగాది పండుగ నాటి మధురానుభూతిని తెలిపే జీవన దృశ్యం. కనుమరుగై పోతున్న తెనుగు పద్య సౌందర్యాన్ని యీ పద్యం జ్ఞాపకానికి తెస్తుంది.

శ్రీ బాపురెడ్డి సౌందర్యోపాసకుడు, సమాజ శ్రేయస్సును కోరుతున్న కవి, సంప్రదాయం పై గౌరవం ఉన్న కవి. పద్యం, గేయం, వచన కవిత, గేయ నాటిక, ఏది రచించినా వాటిలో సౌందర్యాన్ని నింపటానికే ప్రయత్నిస్తారు. మనషిని ఆరాధించే మనిషిగా సాహితీ ప్రియులకు జ్ఞాపకముంటారు.

కవిత్వాన్ని ఒక తపస్సుగా కవిని ఋషి తుల్యునిగా భావించడం గాక ఏదైనా మంచి ఊహ మనస్సులో మెదిలితే దానికి వెంటనే కావ్య రూప మిచ్చే కవి శ్రీ బాపురెడ్డి. పుంఖానుపుంఖంగా రాసిన ఆయన కవితల్లో ప్రసన్నత ప్రధానగుణంగా కన్పిస్తుంది. పదముల పొందికలో కూర్పు కొన్ని చోట్ల ఆహ్లాదకరంగా గోచరిస్తుంది.

సమాజంలో వర్గ వైరుధ్యాలు శ్రీ బాపురెడ్డిని కలవరపెట్టినట్టే లేదు. కష్టపడి పనిచేసే వారందరికీ ప్రతిఫలం లభిస్తుందని, ప్రతి మనిషీ తన జీవితాన్ని ఉన్నంతలో హాయిగా అనుభవించే విధంగా తీర్చి దిద్దుకోవాలని ఆయన అభిలాష. అటువంటి మనిషిని ఆరాధించే మనిషి వీరు.

శ్రమ నిష్ఫలమై బ్రతుకు దుర్భరమై తెగించి సమ్మెలు కట్టే కార్మికులూ, వాళ్ల భార్యాబిడ్డల ఆకలి బాపు రెడ్డిగారి కావ్య వస్తువులు కావు.

"వ్రాయగనె విలాసినులపై గేయములను
కూలి పిల్లను మరచు మూర్ఖుడను గాను
ప్రకృతి సౌందర్యముల గూర్చి పాడగనె
మానవుని కష్టసుఖములే మరువలేదు" అని

బాపురెడ్డి తెలిపారు.

కాని "అలజడి మా జీవితం
ఆందోళన మా ఊపిరి
తిరుగుబాటు మా వేదాంతం" అనే

పద్ధతిలో సమాజ స్వరూపం పూర్తిగా మారాలనే కొర్కెను కనబరచరు.

ప్రభుత్వం అమలుజరుపుతున్న ప్రజోప యోగ ప్రణాళికలను పొగిడితే ప్రభుత్వపు బాకా అనుకుంటారేమోనన్న జంకు వీరికి లేదు. కుటుంబ నియంత్రణ, వయోజన విద్య, ప్రాజెక్టులు కట్టటం ద్వారా నీటి పారుదల సౌకర్యాలు మొదలైన వాటిని వీరు కావ్యవస్తువులుగా స్వీకరించారు.

**సౌందర్యోపాసన :** ప్రకృతి సౌందర్యానికి స్త్రీ సౌందర్యానికి పరవశుడై శ్రీబాపురెడ్డి

"విచ్ఛిన్న సుమాలు మధువుల వెల్లివిరిసె
భ్రమర యువకాళి ప్రణయ గీతముల కరిగి
హెచ్చిన వియోగబాధ నా ఎద రగుల్ప
భావకవి చేసే సన్నొక దేవి మోవి!"

అని భావకవుల రీతిలో పలికారు - భావ కవులు స్త్రీ సౌందర్యాన్ని "ఆమె నవనీత హృదయ, నా అంతరంగ శాంతి దేవత" అనే రీతిలో అంగాంగ వర్ణనలకు దూరంగా, తేజోమయంగా వర్ణించారు. బాపురెడ్డి ప్రబంధ కవుల రీతిలో అంగాంగ వర్ణనలకు దూరంగా, తేజోమయంగా వర్ణించారు. బాపురెడ్డి ప్రబంధ కవుల రీతిలో స్త్రీ అంగాంగ వర్ణనలు చెయ్యటమే గాక 'పంచబాణ సంచా'లో వాటికి ఘాటైన ఆధునిక రీతిని జోడించారు.

"తులాభారం అంటే / ఏదో పౌరాణిక నాటకం అనుకున్నాను / రసకుంభినీ! నితంబినీ/ నీ నడుముపై కెత్తి / నింగి దాక పొంగినపుడు / నిజం తెలిసింది'' వంటి చమత్కృతులు, స్కాండినేవియన్ కంట్రీస్‌లో కన్పించే విశృంఖల సెక్స్ దృశ్యాలలా బాపురెడ్డి కవితలలో కానవస్తాయి.

''ఆకలి లేకుంటే / అభ్యుదయత్వం లేదు.
సెక్స్ లేకుంటే / శృంగార తత్వం లేదు"
(ప్రేమికులకు జై)

అని వీరు తమ మార్గాన్ని స్పష్టం చేశారు.

"కొరడాలు విసిరితే కోకిలలు కూయవు.
కత్తులు ఝళిపిస్తే కొమ్మలు విరబూయవు
క్రొత్త ఆలోచనల కోకిల నా హృదయం...
ఆకులు రాలితేనే చెట్టు ఎదుగుతుంది
నీరు పారితేనే ఏరు జీవిస్తుంది" లాంటి రచనల్లో కవిభావన సరళసుందరంగా భాసిస్తుంది.

**అభ్యుదయ భావన :** "ఈ దేశం మనదేశం/ ఎంత మారిపోయెరా ప్రజలు కన్నకలలెన్నో / నిజాలు అయిపోయెరా చేతి కందకుండ పరుగు / తీసె నదులెన్నో ప్రేమతోడ నిలిచి బీడు /భూములు పండించెరా.... చమురు దీపములు సైతం / సరిగా వెల్గని పల్లెలు కంటికింపుగా వెల్గె / కరెంటు దీపమాలలు"

అంటూ దేశంలో జరిగే అభివృద్ధిని గూర్చి శ్రీ బాపురెడ్డి ఆనందించారు. కాని, స్వాతంత్ర్యానంతరం పేదల బ్రతుకులు మరింత దుర్భరమై దేశంలో జరుగుతున్న అభివృద్ధి కొద్దిమందికే అందుబాటులోకి వచ్చి ఆకలి, దారిద్ర్యం, నిరుద్యోగం విలయతాండవం చేస్తున్నాయనేది నేటి యువకవుల ఆక్రందన.

"దండి నదుల కన్న ప్రియము కొండవాగులే మీకు
తమ్మి పూలకన్న ప్రియము రెల్లుపూవులే
పేద గుండెలం మంచి
ప్రేమ జీవులం మేము" అంటూ అల్పజీవుల సంక్షేమమే సమాజ సంక్షేమమని తలుస్తారు శ్రీ బాపురెడ్డి.

సంప్రదాయాన్ని గౌరవించినా వర్తమానాన్ని విస్మరించకూడదనే కవి శ్రీ బాపురెడ్డి, "కాళ్ళు చేతులు ముడుచుకున్న/ కాలాన్ని /కదిలించిన విప్లవజ్వాల / ఇరవయ్యోశతాబ్దం / నేల మీద ప్రాకులాడే కాలానికి / గాలిలో ఎగరటం నేర్పిన / గంధర్వ పక్షి / అంతరిక్షాక్షి / ఈ శతాబ్దం " అంటూ ఈ శతాబ్ది మానవ విజయాలను వీరు కొనియాడారు.

సుప్రసిద్ధ కవి ఇస్మాయిల్ కవితా విలాసాన్ని శ్రీ బాపురెడ్డి చుక్కల వానగా భావించటమే గాక మృత్యువృక్షం మీద వ్రాలి సత్యఫలాలు చవిచూచే / పలుకు చిలుకగా తలచటం చాలామంచి ఊహ.

"మన జాతి పక్షి నెమలి కదా/ మనజాతి సుమం పద్మం కదా/ మరి మనజాతి గుణం

ఏమిటంటే / 'మోసం' అని చెప్పుకుంటే ముచ్చటగా ఉంటుందేమో! మన జాతి రంగు ఏమిటంటే / 'చీకటి' అని ఒప్పుకుంటే / చైతన్యం కలుగుతుందేమో ! స్వాతంత్ర్యం వెలుగుతుందేమో! " అని ఆత్మ విమర్శకు లోనైనారు శ్రీ బాపురెడ్డి (రంగురంగుల చీకట్లు).

"భావాన్ని బట్టి భౌతికం/ఆలోచనను బట్టి అనుభూతి"ని వెల్లడించే తత్వాన్ని భావ భౌతిక వాదంగా పేర్కొని, దాన్ని తన కవితా తత్త్వంగా బాపురెడ్డి పేర్కొన్నారు. దీనికి అనుయాయులు ఉన్నట్లు కన్పించటం లేదు గాని వీరి భావ వ్యక్తీకరణను రేడియో, టీ.వి.లలో కవితలు విన్పిస్తున్న కవులు కొందరు అనుకరిస్తున్నట్లు తోస్తుంది.

ప్రపంచంలో పెక్కు దేశాలు పర్యటించినా బాపురెడ్డి తాను దర్శించి సుందర దృశ్యాలను అందమైన వాక్చిత్రాలుగా ప్రదర్శించారు.

శ్రీ బాపురెడ్డి భావన లోతైనది కాకపోయినా ప్రసన్నమైనది; ఆహ్లాదకరమైనది. పద చిత్రాలు వర్ణోజ్వల సౌందర్యాన్ని వెలార్చక పోయినా మళ్ళీ మళ్ళీ చూడాలనిపించేవి. మళ్ళీ తలచు కోదగినవి.

బాపురెడ్డి కవితలలో కన్పించనిది 'హిపోక్రసీ',. తాను తలచిన, నమ్మిన అభిప్రాయాలను కవితలుగా మలచటంలో రసరమ్య భావనకు పారదర్శకంగా అందిస్తారు. స్వాదువూ మధురమూ అయిన బాపురెడ్డి కవితాసవం రసజ్ఞులు ఆస్వాదించదగినది.

**రామమోహనరామ్**

4-5-41, కల్యాణి రోడ్,

చంద్రమౌళినగర్,

గుంటూరు - 522 007.

# బాపురెడ్డి గారి శైలి

– ఆచార్య ఎన్. గోపి

దశాబ్దాలుగా కవిత్వం వ్రాస్తున్న మధురమైన తెలుగు కవుల్లో బాపురెడ్డి గారు తొలిపంక్తిలో ఉంటారు. ఊపిరి సలపని ఉన్నతోన్నత ప్రభుత్వోద్యోగాలు చేస్తున్నా మలయమారుతంలా వీచే తమ ప్రసార గుణాన్ని వదులుకోలేదు. పదుల కొలది కావ్యాలు వెలువరించిన బాపురెడ్డి గారి శైలిని గురించి చేసిన విహంగ వీక్షణమే ఈ చిన్న వ్యాసం.

శైలి అనే పదం Style అనే ఇంగ్లీషు పదానికి సమానార్థకంగా వాడుకలో ఉంది. 'శైలి'కి "రచనా కౌశలము గల భాషా సౌష్ఠవము" అని శబ్దరత్నా కరకారుడు అర్థమిచ్చాడు. బ్రౌన్ Style అనే పదానికి తన 'ఇంగ్లీషు – తెలుగు నిఘంటువు'లో Manner of writing with regard to language' అనే అర్థం చెప్పాడు. బ్రౌణ్యార్థంలో శైలి అంటే 'ఒక ప్రత్యేక పద్ధతి ద్యోతకమవుతుంటే అని ధ్యోతకమవుతుంటే శబ్దారత్నాకరుడు 'అదొక నేర్పు అనే అర్థాన్ని ధ్వనింపజేస్తున్నాడు. నిజానికి శైలి భారతీయ అలంకారికులు ప్రయోగించే పదం కాదు. శయ్య అనే పదమే వాడుకలో ఉంది.

"యా పదానాం పరా అన్యోన్యమైత్రీ
శయ్యేతి కథ్యతే "

అనేది శయ్యకు నిర్వచనం. 'పదాల యొక్క ఉత్కృష్టమైన మైత్రి' అని భావం. 'పరా' అనేది అస్పష్టమైనది. పైన చెప్పిన "ప్రత్యేకత, నేర్పు"లు కూడా ఇటువంటివే. వీటిని నిర్వచించుకోవడంలో అనేక భేదాభిప్రాయాలు ఏర్పడుతుంటాయి. The problem of Style" అనే గ్రంథాన్ని రచించిన మిడిల్‌టన్ ముర్రే అనే సాహిత్య విమర్శకుడు Style ను ఈ కింది విధంగా నిర్వచించాడు.

"The Style means that personal idiosyncracy of expression by which we recognize a writer"

అభివ్యక్తి ద్వారా కవి స్వభావ విన్యాసాన్ని గుర్తించే ప్రయత్నమే శైలి అంటున్నాడు ముర్రే. "ప్రత్యేకత, నేర్పు" ల వలె గాక కొంత స్పష్టంగా కవి స్వభావానికి శైలికి గల సంబంధాన్ని నొక్కి చెపుతున్నాడు. కవి స్వభావమంటే అతని గాఢమైన భావావేశం, (decisive emotion) పదార్థాల నిర్దేశం, వాటి ద్వారా అతడు ఆశించిన ప్రయోజనం వీటిని లెక్కలోనికి తీసుకోవాలి.

కవి భావోద్రేకం నిరర్థకంగా పుట్టదు. అది అతని లక్ష్యానికి ఉన్ముఖంగానే అభిగమిస్తుంది. కవిలో కలిగిన భావ శబలత వ్యక్తమయ్యే పద్ధతిని భావ విధానమనవచ్చు.

"A style must be individual, because it is the expression of an individual mode of feeling"

ఈ విధంగా శైలి కవిస్వభావంలో ఒక భాగం. స్వభావం యొక్క వ్యక్త రూపం. ఫలాని విధంగా తప్ప మరో విధంగా రచించలేని అనివార్యత (Invitability) ఉన్నప్పుడే కవి శైలిలో కవి స్వభావాన్ని గుర్తించవచ్చు. ఒక కవి ఓజోగుణ ప్రధానమైన భాషలో తప్ప రచించలేడు. దాని కతని భావ విధానమే కారణం.

ఒక కవి తనదైన ఒక ప్రత్యేకత శైలీ

విన్యాసం వల్ల ప్రజలకు అభినివేశాన్ని కలిగిస్తాడు. అట్లాంటి శైలీ నైగనిగ్యంతో కవితాసృజన గావించిన విశిష్ట కవి డా॥ బాపురెడ్డి ఒక కవిత్వానికి శైలిని బట్టే దాని లోకి ప్రవేశించే ఆకర్షణ ఏర్పడుతుంది. ప్రవేశిస్తేనే కదా దానిలోని భావ గాంభీర్యాన్నీ రసమాధుర్యాన్నీ ఆస్వాదించగలిగేది. శైలిని మెచ్చుకున్నప్పుడల్లా గుడిపాటి వేంకట చలం కోపగించుకునేవాడు, ఆ దెబ్బతో తన భావాలకి రెండో స్థానం ఇస్తున్నారని; జాషువా సంగతి మనకు తెలసిందే, ఆవేదన కంటే శైలిని ఎక్కువగా మెచ్చుకోవడం, అయితే ఒకటి, అర్థభావాలు తొడుక్కున్న సార్థకమైన శైలిని సంభాషించక తప్పదు. ఈ సందర్భంగా బాపురెడ్డిగారి శైలిని గురించి బోయి భీమన్న గారి మాటలు తప్పకుండా ఉదాహరించదగ్గవి.

"శైలిని గురించి చెప్పడం, భాషను గురించి పరామర్శ చెయ్యడం, ఇతర కవులతో పోల్చడం వంటివి నాకు గిట్టని విషయాలు. అయినా ఈ కావ్యం చదువుతున్నప్పుడు నీ శైలి శైలుషి లాస్యకళా శైవాలినీ డోలికలలో తన్మయం కాకుండా ఉండలేకపోయాను......." అంటారు.

శైలిలో కవికి ఇష్టమైన పదబంధాలూ, ఛందస్సులోని విశిష్టమైన నడకా, ఆ కవికే ప్రత్యేకమైన విశిష్ట భావార్థ విన్యాసాలు మొదలైనవి ఉంటాయి. బాపురెడ్డి గారు తొలి రోజుల్లో వినగానే చెవులతో పాటు గుండెల్ని పట్టుకునే బోలెడన్ని పద్యాలు రాశారు. ఇవి ప్రసన్నంగా సాగిపోతూనే చక్కని నడకతో లయకు జీవం పోస్తాయి. లెక్కకు గణాలన్నీ సరిపోయిన పద్యం మాత్రమే కవిత్వం కాదు. నడక తెలిసిన పద్యమే నాలుగు కాలాలపాటు నోళ్లల్లో నానుతుంది. ఏ పదంపైన ఊనిక ఎక్కడుంటుందో తెలిసినవాడు మాత్రమే మంచి పద్యాలు రాయగలుగుతాడు. బాపురెడ్డి గారు సభలో పద్యం చదివే వొడుపు తెలిసిన వాడు కాబట్టి మాటల కూర్పు లోంచి తప్పకుండా సంగీతాన్ని పిండగలరు..

"నేను కవీశ్వరుండ నన
నేరను గాని రసార్ద్ర కావ్య ని
ర్మాణమె ప్రాణమైనసుకు
కుమారుడ, అక్షర భావ శిల్ప సం
ధానుడ నిత్య సత్య శుభ
దాయక జీవనగానగర్భ సం
తానము నేను, నేను పరి
తప్త జగజ్జననీ ప్రసన్నుడన్."

"భావము భాషపై తిరుగు
బాటొనరించును భాషయే మొత
ద్భావములోన జీవము ర
వంతయు లేదని ఈసడించు, స్వా
భావికమైన రూపగుణ
బంధములన్ విడనాడి భాషయున్
భావము మృగ్యమై తెలుగు
వాఙ్మయ వీధులు తెల్లబోయెడిన్."

ఈ పద్యాల్లో బాపురెడ్డి గారి సలలితమైన శైలితో పాటు ఆయన గాఢమైన కవిత్వాశయాలు కూడా వ్యక్తమవుతున్నాయి.

సభల్లో రాటుదేలిన గాన, పఠనానుభవం వల్లనో ఏమో బాపురెడ్డిగారు మంచి సంభాషణాత్మకమైన పద్యాలు కూడా రాశారు. తిక్కన, పింగళి సూరనల పద్యాల్లాగే అవి అలతి అలతిగా విరుగుతూ కాహళసంధిస్తూ సాగుతాయి. బాపురెడ్డి గారికి పద్యాల్లో గానీ, గేయాల్లో గాని చివరికి వచనకవితలో గానీ జనరంజకతకు భంజకం కాకుండా

రాయాలనే స్పృహ ఉండటం వల్లనే ఆయన రచనలకు ప్రసాదగుణం ధారాశుద్ధీ అలవడ్డాయనుకుంటాను. నారాయణరెడ్డి గారి లాగే బాపురెడ్డి గారు కూడా చివరకు వచన కవితలో కూడా లయ లేకుండా రాయలేని నిస్సహాయుడు. లయ సినారెకు లాగా ఈయనకూ ప్రాణమే. బాపురెడ్డి గారు మాత్రాచ్ఛందస్సులో ఎన్నో గేయాలు రాశారు. వాటిలో ఎన్నో మిశ్రగతులను సృష్టించి ప్రయోగాలు చేశారు.

"వెన్నతోనే నాకు పెట్టిన విద్దెలు
ఎన్నటికి విడిపోని ఉన్నత బుద్ధులు"

అయితే ఛందస్సును గురించీ, భాషను గురించి ఎంతటి అభినివేశమున్నా కవితాత్మపట్ల ప్రత్యేక శ్రద్ధ కలిగిన విలక్షణకవి బాపురెడ్డి గారు. అందుకే

"గణం పోతే పోయె కాని
గుణం పోయినట్టి కవిత
కాళ్లు పాతే పోయె కాని
కళ్లు పోయినట్టి కవిత
కాదని, రసధునీ కవిత వ్రాస్తున్నాను.

భాష పోతే పోయె కాని
భావం పోయిన కవిత
జవం పోతే పోయె కాని
జీవం పోయిన కవిత
కాదని, రసధునీ కవిత వ్రాస్తున్నాను"

కవితల పోటీ పెట్టి వచన కవిత్వంలో అయినా సరే లయ, తూగూ వంటివి లేకుండా కవిత్వం రాయమంటే బాపురెడ్డి గారు తప్పకుండా ఓడిపోతారు. చూడండి....

" ఆమె మనస్సేమో నింగి
నా మనస్సేమో నేల
అవి కనుమేరల్లో కలిసి ఉంటాయి
కలకాలం వెలుగుతుంటాయి.

ఆమె - ఒక హిమాచల శిఖరం
నేనేమో చంచలపవనాన్ని
నా కలతల మబ్బులన్నీ
ఆమె హృదయాన్ని స్పర్శించి
కరిగి పోతుంటాయి.........."

ఈ విధంగా బాపురెడ్డి గారు విశిష్ట శైలీ సంపన్నులు. వారి శైలిని ప్రదర్శించడానికి ఈ వ్యాసం చిన్న అద్దం ముక్క. నిలువుటద్దం లాంటి వ్యాసాంగం చెయ్యటానికి ఎంతో అవకాశమున్న కవిత్వమాయనది.

•••

**ఆచార్య ఎన్. గోపి**
తెలుగు శాఖ
ఉస్మానియా విశ్వవిద్యాలయం
హైదరాబాదు - 500 007.

# నవ కవితా వైతాళికుడు – డా॥ జె. బాపురెడ్డి

– శ్రీమతి ఉదయగిరి కళ్యాణీ రఘురామ్

బాపురెడ్డి గారి కవిత్వం తెలుగు సాహిత్యంలో చిరస్థాయిగా నిలిచి ఉంటుందని చెప్పడం అతిశయోక్తి కాదనుకుంటాను. కారణం ఆయన సహజకవి. ప్రతిభాసంపన్నుడైన ప్రజాకవి. ప్రతిభాసంపన్నుడైన ప్రజాకవి. ప్రజాకవి అంటే ఆడంబరాలకు అట్టహాసాలకు దూరంగా – ఎంతో దూరంగా నిలబడి యథార్థాన్ని స్వయంగా కన్నులతో వీక్షించి- అంతశ్చక్షువులతో గాంచి ప్రజా జీవితాన్ని, ప్రజాభిరుచులను తన కలంలో పలికించిన మహాకవి శ్రీ జె.బాపురెడ్డి. శిల్ప చాతుర్యం భావనైపుణ్యం శ్రీ బాపురెడ్డి గారి సొత్తు.

హిమగిరి శిఖరాలు ఎత్తు
హిందూ సాగరపు లోతు

అందరి ఆశయాలకు ఆదర్శం అవుతూంటే
నా దేశం నవ్వుతోంది నంద నవనంలా "

అంటూ తన దేశ సౌభాగ్యానికి ఉప్పొంగి పోయిన కవి బాపురెడ్డి గారు.

కవితా వస్తువులను ప్రజలనుండి గ్రహించిన నాడు కవిత్వాన్ని సామాన్య ప్రజల్లోకి తీసుకుని వెళ్లగలిగిన నాడు కవి ప్రజా కవి అవుతాడు. బాపురెడ్డి గారీ విషయంలో సఫలీకృతులైనారు.

"పని వాళ్ళం పని వాళ్లం పాలమూరు పని వాళ్ళం
ప్రాజెక్టులు నిర్మించే పాలమూరు పని వాళ్ళం"

అంటూ కవి ఒక సామాన్య కూలీ హృదయంలోకి చొచ్చుకుపోయారు. ఈ కవితను చదువుతున్నప్పుడు సుప్రసిద్ధ హిందీకవి నిరాలా రచించన " వేహ్ తోడత్ పర్దక్, దేఖా ఉసే మైనే ఇలాహాబాద్‌కే పథ్‌పర్" అనే కవితను జ్ఞప్తికి తెచ్చింది.

నిజమైన ప్రజాకవి తనదేశ సౌభాగ్యానికి ఒక పక్క సంతోషిస్తూనే, సాంఘిక వైషమ్యాలకు, వైమనస్యాలకు తల్లడిల్లి పోతాడు. బాపురెడ్డి గారి విషయంలో సరిగ్గా అదే జరిగింది.

పవిత్ర భారత ధరిత్రి ఒడిలో
భయంకర చరిత్ర ప్రభవిస్తున్నది
భుజబలాన్ని బుద్ధి బలాన్ని
స్వాధీనం చేసుకుంటున్నది
చదువుకున్న స్వార్థ పరత్వం

అంటే నేటి కుటిల రాజకీయ వాతావరణాన్ని చక్కగా చిత్రీకరించటమే కాక

చదువుకునే విద్యార్థుల సమ్మెల్లో దించి
విద్యాలయ రసనలతో విషాన్ని గ్రహించి
స్వార్థం ఆడే ఆట సాగునెంత కాలం?

అంటూ "సమాజాన్ని సూటిగా నిర్భయంగా ప్రశ్నించారు. మానవునిలో పేరుకుపోయిన స్వార్థ పరత్వాన్ని నిరసిస్తూ దోపిడీ, దగా కుట్ర మోసం వీటన్నింటినీ జయించవలసింది కూడా మానవుడే అంటు శంఖారావం చేశారు.

అధికారం అహంకారమై
దోపిడీ వ్యాపారమై
చట్టా అవినీతికి పట్టాలై
దేశాన్ని మోసం చేస్తున్నాయని
దీనంగా విలపిస్తున్నది
కలలు కన్నీరైన నాకళ్లకు
కవితా వస్తువుగా భాసిస్తున్నది"

ఈ కవితలో స్వాతంత్ర్యలక్ష్మి దీనావస్థను కవి కళ్ళకు కట్టినట్లు చిత్రీకరించారు. ఎంత చక్కని భావప్రేరణ!

కుక్కపిల్ల, అగ్గిపుల్ల సబ్బు బిళ్ల తలుపు గొళ్లెం హారతి పళ్లెం, గుజ్జుపు కళ్లెం, "కాదేది కవిత కనర్హం అన్నారు మహాకవి శ్రీ శ్రీ అందుకే నేమో -

బాపురెడ్డి గారి కవిత్వంలో కోకిల పాటలు, మలయమారుతాలతో పాటు కొరడాలు, యంత్రాలు, గద్వాల చీరలు, నాగేటి చాలులు, ఈలపాటలు పూలపాటలు, సిరుల బాటలు మంచుమల శిఖరాల మధురానుభూతులు ఆల్ఫ్స్ పర్వతాల ఆనంత తీరాలు ఒకటేమిటి ఎన్నో వీరి కలంలో కవితా వస్తువులే ధన్యత చెందినాయి.

బాపురెడ్డి గారి తెలుగు భాషా ప్రియత్వము అమోఘము అనర్ఘము.

*"అమెరికాకు తెలుగు వెలుగులందించాను*
*డెట్రాయిట్‌లో తెలుగు డేరా వేశాను.*

*నయాగరాకు కూచిపూడి నాట్యం నేర్పి*
*న్యూయార్కుకు త్యాగరాజ గానం నేర్పి*

*మిసిసిపీ విచ్చుకుంది తెలుగుపాకము*
*విస్కాన్సిన్ నేర్చుకుంది తెలుగు పాఠము*

*పిట్స్‌బర్గులో వెలసిన*
*వెంకటేశుడు*
*కాలిఫోర్నియా చేరిన*
*తిరుమలేశుడు*
*దిగ్దిగంతముల తెలుగుల*
*దీవించాడు"*

అన్నప్పుడు కవి ప్రగాఢమైన భాషాభిమానము వ్యక్తమౌతుంది.

"ఇటాలియన్ భాషను ప్రశంసించినా, దేశభాషలందు తెలుగు లెస్స" అని రాయలవారు ఎలుగెత్తి చాటినా, అన్నీ మరిచిపోయి తెలుగు భాషను, తెలుగు పాకాన్నీ, తెలుగు వస్త్రాన్నీ ఈసడిస్తున్న తెలుగు ప్రబుద్ధులకు బుద్ధివచ్చేట్లుగా కవిగారి కవితావేశం పై కవితలో వెల్లువయై ప్రవహించింది.

రాకెట్టు రాయబారం, ఋతు రాగం, సాగర సౌధం, జాతి జీవులు, చాచా నెహ్రూ, విజయహేల, ప్రజా విజయం మొదలైన వేదికలపై వివిధ సందర్భాలలో ప్రదర్శించబడి సహృదయుల హృదయాల నలరించినవి. ప్రముఖుల మన్ననలు పొందినవి. దేశ విదేశాల్లో ప్రదర్శించబడిన వీరి గేయనాటికలు అంతర్జాతీయ ఖ్యాతి గాంచినవి.

బాపురెడ్డి గారి గేయనాటికలు చదివిన వెంటనే దాశరధి గారి కలంనుండి జాలువారిన ఈ గేయం చదవండి.

*గేయనాటికలు - కావ్య నాటికలు*
*రమ్య చేటికలు - రత్న పేటికలు*

ఇంతకంటె చక్కని నిర్వచనం వేరే ఏముంటుంది చెప్పండి!

వీరి అనంత సత్యాలు ఎన్నడూ ఆరని అఖండ దీపాలు

బాపురెడ్డి గారు **పంచ బాణ సంచా, ప్రణవప్రణయం, ప్రేమా రామం** - ఈ మూడు కావ్యాలు శృంగార కావ్యాలు మాత్రం కావు. తత్వ ప్రదానమైనవే కాక భౌతికాధ్యాత్మిక సమ్మేళనాలు కూడా. కవిగారి మాటల్లో ప్రేమారామం ప్రణయ భావగేయ సంపుటి అయితే " పంచబాణ సంచా" విశ్వభావ రసోద్దీపికగా భాసిస్తుంది. ప్రణవ ప్రణయం

రాగరసయోగ తత్వకావ్యం. ప్రణవ ప్రణయం సత్యదర్శన కావ్యం.

బాపురెడ్డి గారు వివిధ పత్రికల ద్వారా సుమారు మూడు దశబ్దాలు పైగా సాహితీ ప్రియులందరకు చిరపరిచితులు. సాహితీ రంగంలో "బాఫురెడ్డి బాణీ" ని ఏర్పరుచుకున్న స్థిత ప్రజ్ఞులు. బాపురెడ్డి గారి కవిత వైతాళిక ప్రబోధ అయితే వివిధ ప్రక్రియలను చేపట్టిన బాపు రెడ్డి గారు నవకవితా వైతాళికులే కదా! వీరి కావ్యోద్యానవనంలో వీరబూచిన కవితా!

పుష్పాలెన్నో దర్శన మిస్తాయి. దేని ప్రత్యేకత దానిదే! దేని అందం దానిదే!

ఈ సందర్భంలో బాపురెడ్డి గారి కవితకు శాశ్వతతత్వాన్ని ఆపాదించి పెట్టిన, డాక్టర్ బోయి భీమన్న గారి గేయం స్మరణీయం.

బాపురెడ్డి కవిత
ప్రగతీ శ్వరత
బాపురెడ్డి తపస్సు
ప్రజా శ్రీకరోషస్సు

...

**శ్రీమతి ఉదయగిరి కళ్యాణి రఘురామ్**
సి-38, హెచ్.ఏ. కాలనీ
పిమ్ప్రి - 411018
పూనా

# బాపురెడ్డి కావ్యం – హిందీ అనువాదం

– డా. భీమసేన్ నిర్మల్

ఒక భాషలో అభివ్యక్తీకరించబడిన భావాలను, వీలయినంతమటుకు లక్ష్యభాష (target language) ప్రకృతికి అనురూపంగాను, సరిసమానంగాను, అభివ్యక్తీకరించే ప్రయత్నమే అనువాద ప్రక్రియకు గల ముఖ్య ఉద్దేశ్యం. అనగా మూలభాష (Source language) లోని భావాలను, లక్ష్యభాష ప్రకృతికి అనురూపంగాను, మూలానికి వీలయినంతమటుకు విధేయంగానూ ఉండాలి. మూలభాషలోని సాహిత్య సంప్రదాయాలు, అభివ్యక్తి, వైచిత్ర్యాలు, పదాలకు గల రూఢమయిన విశిష్ట-అర్థాలు మొదలయిన వాటితో పాటు లక్ష్యభాషలోని సాహిత్య సంప్రదాయాలు, అభివ్యక్తి-వైచిత్ర్యాలు, పదాలకు గల రూఢమయిన విశిష్ట-అర్థాలు మున్నగువాటిని గురించి అనువాదకుడికి క్షుణ్ణమయిన అవగాహన ఉండాలి. విషయ పరిజ్ఞానం కూడా చాలా అవసరం. అభ్యాసంతో పాటు అనువాదకుడికి తను చేస్తున్న పనిపట్ల నిష్ఠ (Sincerety) ఉండాలి. అప్పుడే అనువాదం మూలానికి దగ్గరగా ఉండి ఇతర భాషా పాఠకుణ్ణి ప్రభావితం చేయగలుగుతుంది.

చాలా మందికి అనువాద రచనలపట్ల, అనువాద కార్యం పట్ల సద్భావం లేదు. ఎందుకంటే అనువాదకుడు మూలానికి న్యాయం చేకూర్చలేడని వాళ్ళ నిశ్చితాభిప్రాయం. ఉమర్‌ఖైయ్యాం రుబాయిలను అనువాదం చేసి, వాటికి విశ్వ వ్యాప్తి కలిగించిన ఫిట్జరాల్డ్ కూడా 'Better alive sparrow than a stuffed eagle అని అన్నాడు.అలాగే జాన్సన్ కూడా 'Poetry cannot be translated in its own language అని అంటాడు. అంటే మూలంలో ఉండే శబ్ద సౌందర్యం, భావగాంభీర్యం నూటికి నూరుపాళ్ళు అను వాదంలో అభివ్యక్తీకరించబడలేవని వారి తాత్పార్యం. అయితే మూలభాషలు నేర్చుకొని, ఆయాభాషలలోని రచనలను చదివి, ఆనందించ గలగడమనేది సాధ్యపడే విషయం కాదు. శరవేగంతో రచనలు ప్రచురితమవుతున్న ఈ రోజుల్లో మరీ అసాధ్యం. కనుక ప్రస్తుత పరిస్థితుల్లో అనువాదాలు అని వార్యాలు అయిపోయాయి.

జాతీయ భాషగా ప్రచారంలో ఉండి (మహాత్మాగాంధీ గారు ప్రచార కార్యక్రమం ప్రారంభించడానికి ముందుకూడా), స్వాతంత్ర్యం వచ్చిన తరవాత కేంద్ర ప్రభుత్వ అధికార భాషగా గుర్తింపు పొందిన హిందీ భాషలలో నుంచి అనువాదాలు ఎక్కువగా వస్తున్నాయి. హిందీభాష సార్వదేశికమయిన భాష (lingna-Franca) గా రూపొందడంతో, హిందీ భాషలో అనువదించబడిన రచనలకు పాఠకులూ ఎక్కువ. హిందీ అనువాదం మూలంగా ఇతర భాషల్లోకి అనువదించబడిన రచనలూ ఎక్కువే. హిందీ నేర్చుకుని ఆ భాషలో నిష్ణాతులయి విద్వాంసులు తమ తమ భాష ల్లోని ఉత్కృష్టమయిన రచనలను హిందీలోకి అనువదించ బూనుకొనడం కూడా ఒక ముఖ్య కారణం.

డా॥ జె. బాపురెడ్డి గారు నేటి తెలుగు కవులలో అగ్రశ్రేణికి చెందినవారు. మొదటి నుంచి, కవిత పట్ల వారికా ఆసక్తి ఎక్కువ. ఉద్యోగ రీత్యా Administration లో తలమునకలవుతున్నా, వారు కవిత్వం, వ్రాస్తూనే ఉన్నారు. ఈ రోజుల్లో వకీళ్ళు, డాక్టర్లు మొదలయిన వారు సాహిత్య రచనలు చేయడం (సాహిత్య పఠనాభిలాషకూడా తగ్గి

పోయిందను కొండి) చాలా అరుదుగా కనిపిస్తున్నది. అలాంటి ఈ కాలంలో డా. బాపురెడ్డి గారు సాహిత్య కేదార కృషీవలులై, కావ్య కుసుమాలను పూయించడం చెప్పుకోదగ్గ విషయం.

బాపురెడ్డి గారి కావ్యఖండికలు హిందీలో అనువదించబడి, ప్రచురింపబడ్డాయి. డా. అన్నపురెడ్డి శ్రీరామరెడ్డి, డా. సి.హెచ్. రాములు, డా. రేగుల పాటి మాధవరావు, డా.నిర్మల్, డా. యం. రంగయ్య మొదలయిన వారు బాపురెడ్డి గారి రచనలను హిందీలో blank verse గా అనువదించి, వివిధ పత్రికల్లో ప్రచురించారు.

అద్వైత సిద్ధాంతాన్ని కావ్యాత్మకంగా ప్రస్తుతీ కరించారు బాపురెడ్డ గారు 'శ్రీకార శిఖరం'లో ప్రకృతి, మానవుడు, పరమాత్ముడు వీరిలో గల విభిన్న సంబంధాల మధ్య సామరస్యాన్ని వర్ణిస్తూ, కవి దార్శనిక చైతన్యాన్ని ఉద్దీపింపచేసారు. ఈ కావ్యాన్ని చదివినప్పుడు 'Every poet is but a philosopher' అన్న సూక్తిలో గల సార్థక్యం స్పష్టంగా గోచరిస్తుంది. ఈ 'శ్రీకార శిఖరాన్ని' డా. అన్నపురెడ్డి శ్రీరామరెడ్డి గారు (హిందీ ఉపన్యాసకులు, గవర్నమెంటు డిగ్రీకాలేజీ, కాకినాడ) 1987లో, హిందీలో అనువదించి ప్రచురించారు.

ఈ మధ్య డా. రేగులపాటి మాధవరావు (రీడరు, హిందీ శాఖ కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్లు) బాపురెడ్డిగారి గేయనాటికలను హిందీలో అనువదించారు. దాని సాఫు ప్రతి (fair copy) తయారుచేస్తున్నారు. అది త్వరలో ముద్రించబడి, హిందీ పాఠకులను అలరించగలదని ఆశిస్తున్నాను.

'శ్రీకార శిఖరాల'కు సుప్రసిద్ధ హిందీ కవి, విమర్శకుడు అయిన తేజ్ బహదూర్ సింహ గౌతమ్ 'మధుర్'గారు, 'అభిమత్' అన్న పేరుతో పీఠిక వ్రాశారు. వారు బాపురెడ్డ గారి కావ్యంలోని భావ సౌందర్యానికి ముగ్ధులయి, 'అనంతశూన్యంలో, స్వతంత్ర విహారం చేసే కవి-కావ్యాత్మాభివ్యక్తి ద్వారా కలిగించే రస్వాదన సామర్థ్యం' మన్‌హర్ (మనోహరం = మనస్సును ఆకట్టుకొనేది) గా ఉందని ప్రశంసించారు. ఇటువంటి కావ్యాల హిందీ అనువాదాలు జాతీయ సమైక్యతకు ఎంతగానో దోహదవడతాయని వారు అభిప్రాయపడ్డారు. నిజమే, అనవాదాలు, వేర్పాటు ధోరణులతో కొట్టుమిట్టాడిపోతున్న ప్రస్తుత వాతావరణంలో, జాతీయ సమైక్యకు ఎంతగానో తోడ్పడగలవు. అనువాద కార్యక్రమానికి తగినంతగా ప్రోత్సాహం కలిగించవలసిన బాధ్యత అందరిదీ.

•••

# బాపురెడ్డి కవిత్వంలో మార్మికత

- డా॥ నిర్మలాదేవి. ఎస్

ఆధునికాంధ్రాభ్యుదయ కవులలో బాపురెడ్డి గారు విశిష్ట స్థానాన్నలంకరించినట్టివారు. నవ నవోన్మే శాలినియైన ప్రతిభనీ, బహుదేశాటన, బహుభాషా గ్రంథ పఠనాసక్తి వల్ల సంతరించుకున్నట్టి వ్యుత్పత్తినీ, నిరంతర కావ్యరచనానురక్తినీ వెలారుస్తాయి వారి కావ్యాలు.

వృత్తిరీత్యా ఒక ఐ.యే.యస్. అధికారిగా బాధ్యతాయుత పదవులు నెన్నింటినో చేబట్టి ఎంతో శక్తిసామర్థ్యాలతో నిర్వహిస్తున్నప్పటికీ ప్రవృత్తి రీత్యా పరమభావుకులైన బాపురెడ్డి గారు తమ కావ్యరచనా వ్యాసంగాన్ని ఏ మాత్రము విస్మరించలేదు. సమకాలీన సామాజిక వ్యవస్థను ఆకళించుకుని సాహిత్య ప్రయోజనాలను సంధించి రచిస్తూనే వున్నారు. దేశ విదేశ విద్వత్కవి విమర్శకావతంసుల ప్రశంసా శీస్సులను పొందుతూ నిత్య ప్రత్యగ్ర శీలురై సాహిత్య ప్రస్థానాన్ని కొనసాగిస్తూనే వున్నారు. గేయ నాటిక, వచన, గేయ, పద్య కవితా సంపుటాల నెన్నింటినో వెలువరించి సహృదయాను రంజకులవుతున్నారు. వారి హస్త స్పర్శను పొందిన సాహిత్య ప్రక్రియ యేదైనా సరే పదారు వన్నెల పసిడిగా భాసింపక మానదు. బాపురెడ్డి గారిలోని తాత్త్విక చింతన సువర్ణానికి సుగంధాన్ని సంతరించినట్లుగా ఆ కావ్యాలకు సార్వకాలికతను, విశ్వజనీనతను చేకూరుస్తోంది.

ఈ నశ్వర జగుత్తులో అనశ్వరమైనది కావ్యం. చరాచార జగుత్తులో సత్యశివ సుందరాలను దర్శించి వర్ణించిన వాడే కవిగా రూఢి కెక్కుతున్నాడు. తత్కర్మే కావ్యమవుతోంది. ఆ కావ్యం విశ్వ శ్రేయస్కరమవుతోంది. కనుక కావ్యం సత్యశివ సుందరాలకే కైకాక వేదికగా అలరారుతోంది. ఈ కావ్యరచనా శక్తి మానవుని పురాకృత పుణ్య పరిపాకం వల్ల అబ్బుతుంది. ఆత్మానుభూతి ప్రగాఢతతో పాటు కావ్య సృష్టిని సమ్యగ్రీతిలో సాగేటట్లు చేయగలిగిన జ్ఞాన జ్యోతి బాపురెడ్డి గారి కావ్యాల్లో పుత్తడి వెలుగులను ప్రసరిస్తుంటుంది. కనుకనే వీరి కావ్యాల్లో వస్తువైవిధ్యంతోనూ భావ వైశిష్ట్యం తోనూ శైలీ వైదగ్ధ్యంతోను తాత్త్వికతానేపథ్యంలోను సమన్వయాన్ని పొంది సత్యశివసుందరాలకు వితర్దికలై విరాజిల్లుతుంటాయి. బుద్ధికీ శరీరానికీ మనస్సుకీ సముచితస్థానం చేకూరడమే గాక వాటికి అతీంద్రియమైన ఆత్మానుసంధానం గావించే యత్నమూ, సఫలత్వము కూడా వాటిలో గోచరిస్తుంది.

సాహిత్య స్పృహతో కూడిన రచన అభ్యుదయ రచనగా నేడు పరిగణితమై సర్వజనాదరణీయ మవుతోంది. రాజకీయ శృంఖలాబద్ధమై యున్న సామాజిక స్పృహను వాటిని నుండి విడిపించి దానికి సార్వజనీనమైన కళాత్మకతను చేకూర్చాలని పాటుపడుతున్న నేటి అభ్యుదయకవులు కొందరిలో బాపురెడ్డి గారు ఒకరు. తమ భావ భౌతిక వాదం ద్వారా తత్సాధనకు పూనుకున్నారు.

ఆత్మజ్ఞానము. పదార్థజ్ఞానము కలిస్తే సాహిత్య దర్శనమనీ, దైవత్వమూ అనంతత్వము కలిస్తే సాహిత్య తత్త్వమనేది బాపురెడ్డి గారి భావ భౌతిక వాదానికి మూల సూత్రం.

"భావవాద
భౌతికవాద
సరససమ్మేళనంలో
ఆనంద బ్రహ్మను దర్శిద్దాం" - అంటారు.

భౌతిక దృష్టిని భావదర్శనంగా మలచుకుని సాహిత్య ప్రస్థానంగా సమున్మీలనం గావించే సౌందర్యదృష్టిలో బాపురెడ్డి ప్రతిపాదిస్తున్న భావభౌతిక వాదం సార్వజనీన సౌందర్య దర్శనంగా (Universal vision) దీపిస్తోంది. ఇలా అభ్యుదయ శీలంతో పాటు మార్మికతను సంతరించుకుని తాత్త్విక చైతన్యస్ఫూర్తి మంతమైనవిగా విమర్శకాగ్రేసరుల చేత ప్రస్తుతి నందినవి వారి అనంతసత్యాలు, నాదావేదాలు, శ్రీకారశిఖరం, ప్రణవ ప్రణయం మొదలైన కావ్యాలు. వీటిల్లోనేగాక వారి పద్యకావ్యాలు పంచబాణసంచా, గేయ నాటికలు వంటి రచనల్లో కూడా ఎడాపెడా యీ లక్షణం ద్యోతకమవుతూనే వుంటుంద.

భగవద్రతిని భక్తిగాను భక్తితో కూడిన రచనలను భక్తిసాహిత్యం గానూ పేర్కొనడం కద్దు. ఆంగ్లంలో ఇట్టి భక్తి కావ్యాలను "మిస్టిక్ పోయెట్రీ'గా చెప్తుంటారు. 'మిస్టిసిజమ్' అనే పదానికి సమానార్థకంగా తెలుగులో 'మార్మికత'నూ, దానితో కూడుకున్న కవిత్వాన్ని 'మార్మిక కవిత' గానూ వ్యవహరిస్తున్నారు. భారతీయ సాహిత్యంలో ఈ మార్మిక కవిత్వం అనాది నుంచి వస్తున్న భక్తి కవితా శాఖయే! కొన్ని ప్రతికలతోనో, సంప్రదాయాలతోనో తాత్త్వికమైన విషయాన్ని భంగ్యతరంగా చెప్పడం మార్మిక కవితగా భావింపబడ్తోంది. రవీంద్రుని గీతాంజలి యీ కోవకి చెందినట్టిదే ! సూఫీ సాహిత్యం మార్మిక పద్ధతిలో వేదాంత భావనను ఆవిష్కరించేదే.

'లోచూపు' గల బాపురెడ్డి గారి ఆధ్యాత్మిక తాత్త్విక చింతాసమన్వితమైన సాహిత్య దర్శనం 'అనంతసత్యాలు' కావ్యంగా రూపొందింది. అందులో కవిగారు వాస్తవాలను చూసి, అనుభవించి, వాటిలోని జీవిత సత్యాలను అనంత సత్యాలుగా ఆవిష్కరించారు. జీవితతత్త్వాన్ని కవితా దృష్టితో అన్వేషించే అంతర్ముఖత్వం (లో చూపు) గలిగినట్టివారు బాపురెడ్డి గారు అనే మాటను నిరూపిస్తుం దాకావ్యం.

'ఏది సత్యం' అనే కవితలో విభిన్న సత్యాలకు ఆకరమైనదిగా కవి పేర్కొన్న గులాబీ 'ఎర్రదనం' అనురక్తికీ, కోపావేశానికీ, సౌందర్యానికీ, అంత్యదశకీ ప్రతీకాత్మకంగా నిలుస్తుంది.

వేదాంతంలో జ్ఞానాన్ని కాంతితోను, అజ్ఞానాన్ని నల్లని చీకటితోను పోల్చడం సంప్రదాయం. వెలుగు చీకటిని పోగొట్టినట్లే జ్ఞానము అజ్ఞానాన్ని పారద్రోలుతుంది. పారమార్థిక చింతనమే జ్ఞానమనీ లౌకికచింతన మజ్ఞానమనీ వేదాంతుల భావన. జ్ఞానకాంతిలో భగవద్దర్శన మవుతుందనీ పరంజ్యోతి స్వరూపునిగా దైవాన్నెంచడము, దైవం యొక్క అనంతత్వాన్ని ఉగ్గడించడం సంప్రదాయాం సుగుణమైనదే!

"భావభౌతికాలు' అనే కవితలో

"భావ వాద భౌతిక వాద సరస సమ్మేళనంలో ఆనందబ్రహ్మను దర్శిద్దాం రండి" అంటారు. 'ఆనందోబ్రహ్మ'మనే ఉపనిషదుక్తి దీనిలో సాక్షాత్కరిస్తుంది. ఆనందం బ్రహ్మస్వరూపం. బ్రహ్మానందం అనిర్వాచ్యమనే భగవత్తాత్త్వ నిరూపణం గావిస్తారు. 'ఆనంద బృందావనం'లో ఒకే దైవం అనంత రూపాలలో విరాజిల్లుతున్నట్టే ఒకే సత్యాని కున్న అనంతరూపాలను ప్రదర్శించి చూపడమే కవిపరమార్థంగా స్పష్టమవుతుంది. పరబ్రహ్మతత్త్వం త్రిమూర్త్యాత్మక మైనట్లే పరసత్యంకూడా

సత్యశివ సుందరాత్మకమనీ ఏకత్వంలో భిన్నత్వం, భిన్నత్వంలో ఏకత్వ మున్నదనే పరమ సత్యాన్ని నిష్కర్షగాను నిశితంగాను ప్రకటిస్తారు బాపురెడ్డి గారు.

ఆత్మజ్ఞానికి 'అవతలి గట్టు' దేవుడు

పదార్థ జ్ఞానానికి 'ఆఖరి మెట్టు' అనంతత్వం' అంటూ సంకేతాత్మకంగా ప్రకటిస్తారు. అంతర్ముఖంగా యోగమార్గం దైవత్వాన్ని అన్వేషిస్తున్నదనీ, బహిర్ముఖంగా ప్రయోగమార్గం అనంతత్వాన్ని శోధిస్తున్నదనీ.' అనడంలో అంతర్ముఖులైన యోగులు దైవాన్ని తమలో దర్శింపగలరనే జ్ఞాన మార్గానికి చెందిన సంప్రదాయకతనింపొందిస్తారు.

'ఆహ్వానమ'నే కవిత మార్మికతతో నిండినిబిడీకృతమైనట్టిది. "అగుపించని అనంతత్వంలోని ఆనందతత్వాన్నావిష్కరిస్తున్నా" నడంలో 'ఆనందోబ్రహ్మ' మనే ఉపనిషత్సూక్తి స్ఫురిస్తుంది. "ఎంత త్రాగినా తనివితీరని వింత రసామృతాస్వాదనకు, ఏ విజ్ఞాన శాఖ విరియలేని పరిమళోపాననము" అనడంలో 'రసోవైనః' రసస్వరూపుడైన భగవంతుని దర్శనామృతా స్వాదన తనివి తీరనిదిగా చెప్పడంలో భగవత్త్వావిష్కరణ సంప్రదాయానుగుణంగా జరిగింది.

శ్రీకృష్ణ ప్రణయానందరసానుభూతికి నెలవైనదిగా బృందావనం పౌరాణేతిహాసిక ప్రశస్తిని పొందింది. "ఆనంద బృందావనం లోకి అడుగిడదాం రండి" అనడంలో మధురభక్తి తత్త్వం వ్యంజిత మవుతుంది. జీవేశ్వరైక్యతను సంకేతంగా చెప్పే గోపికా కృష్ణుల రాసలీలలకు సంకేత స్థలం బృందావనం. గోపికాకృష్ణుల ప్రణయమే మధుర భక్తితత్త్వంగా చైతన్య ప్రభువులు ప్రతిపాదించి ప్రచారం గావించారు.

శ్రీకారశిఖరమనే గేయ సంపుటిలోని 'నా మనోభావనలు' అనే గేయంలో కవి తన మనోభావనలను గోపీజనం గాను క్రియారంగాన్ని బృందావనంగాను బ్రతుకును ఆనంద కృష్ణార్పణమనీ అది సుందర నాదరోదసిలో శివసత్యాన్ని వెదకి వెదకి వేసారి పరిదీన హృదయయైన పిమ్మట గోవిందుని అర్థించి ఆనంద హాసాలను పొంది తీరని సందేహాల నెన్నింటినో తీర్చుకుందంటారు.

'రంగనాథా' ! అనే మరోగేయంలో కూడా వేలవేద వేణువుల నెదలో పలికించే బృందావనస్వామి డెందంలోనే వుండగా వెర్రిదానిలా యమునా తటిపై వెదకడం, అజ్ఞాన తిమిరంలో వగవడం, ఉడుపథాల్లో కెగిరి చూడడం చివరకు తన అతరంగం లోనే దర్శించడం-ఇవన్నీ మధురభక్తి తత్త్వాన్నా విష్కరించేవే. కవి ఆత్మ గోపిక హృదయంగా మారి కృష్ణ ప్రేమలో బ్రతుకును పండించుకోవాలనుకునే తపన నావిష్కరిస్తుంది.

"మనిషి నుంచి ప్రారంభిద్దాం", 'మనిషిని చదువుతున్నాను" అనే కవితల్లో "అహంబ్రహ్మాఽస్మి", 'సోఽహం' అనే వేదోపనిషత్సూత్రం ధ్వనిస్తుంది.

'జీవిత మహాకావ్యం' అనే కవితలో -
మోహమదమాత్సర్యాది
అరిషడ్వర్గాల పందిరి మీద
క్షణాని కో పూవు పూచే
చిత్ర గంధి జీవితం" - అనడంలో

వేదాంతపరంగా చెప్పే సాంప్రదాయికత గోచరిస్తుంది. మనిషిలోనుండే కామక్రోధాదుల నంత శ్శత్రువులగాను, మానవుని పతనానికి హేతువులుగానూ పేర్కొని, వాటిని జయిస్తేనే గానీ మనిషి జితేంద్రియుడు కాలేడనీ దైవాన్ని

దర్శించలేడని వైదికమత సిద్ధాంతం. "చిత్రమైన వాసనలు కలిగినది చిత్రగంధి" - ఇక్కడ వాసనలు కోరికలకు సంకేతం. మనిషి జీవితం క్షణాని కో కోరికను కోరునట్టిది. ఆ కోరికలు పూర్వజన్మ సంస్కారాన్ని బట్టి ఎన్నోవిధాలుగా కలుగుతుంటాయి- అనే ధ్వని కూడా 'వాసన' అనే పద ప్రయోగం వల్ల కలుగుతుంది.

జనన మరణాలను గురించిన వివేచనతో గూడిన 'జీవనగీత' పూర్తిగా తాత్త్వికతను నింపు కున్నట్టిది. జననాన్ని ఒక మధురరహస్యంగాను మరణాన్ని ఒక విధుర రహస్యంగానూ చెప్తూ " ఈరెండు రహస్యాలవైపు రెక్కలు సాచి పరుగెత్తే పక్షి'గా జీవితాన్ని సంకేతిస్తారు.

"పంచేంద్రియ రథసారధి"గా జ్ఞానేంద్రియ గోపాలుణ్ణి" పేర్కొనడం విజయసారధి గీతాబోధనను స్ఫురింపచేస్తుంది. ఇంద్రియాలను అశ్వాలుగాను, శరీరాన్ని రథంగానూ, మనస్సును కళ్ళెంగాను జ్ఞానాన్ని రథసారధి గాను చెప్పడం సంప్రదాయసిద్ధమైనదే!

" మా ఊరి నుంచి బయల్దేరి మానవలోకమంతా స్పర్శిద్దా"మనడంలో 'ఆనంద స్వరూపుని సర్వాంతర్యామిత్యం" దీపిస్తుంది. "మా ఊరును మీ ఊరిలో దర్శిద్దాం" అనడంలో "త్వమేవాహమ్మనే వేదోపనిషత్సూక్తి ధ్వనిస్తుంది.. భిన్నత్వంలోని ఏకత్వం వెల్లడవుతుంది. "రంగు రుచి రూపం మారినా అంతరంగ వాసనలు మారని అమృతోపమజలం" అన్న ప్రతీకలో విశ్వమానవ యేకాత్మకత వ్యంజితమవుతుంది.

ఎక్కడ పుట్టినా సరే ఒక్కటిగా కలసిపోయే సమన్వయ సూత్రం స్రవంతులకే తెలుసుననడంలో కవిగారి సమైక్యతాదీప్తి ద్యోతకమవుతుంది.

"అక్షరాలకు - అంకెలకు లంకెలు వేసి అస్మదీయ జీవితాన్ని అనంతత్వానికి నడిపిస్తున్నది" అన్న మాటల్లో కవి గారిలోని ఆత్మదర్శనోన్ముఖత వెల్లడవుతుంది.

"నేనంటే నాకున్న అహంకారం త్రుంచుతున్నది.

మనిషి మీద నాకున్న మమకారం పెంచుతున్నవి"

అన్నమాటల్లో అహంకారం నిర్మూలన మైతే గాని ఆత్మసాక్షాత్కారం కాదనే ఆర్షభావం అభివ్యంజితమవుతుంది.

"ప్రేమవెలిగిస్తుంది ప్రమ" - 'ప్రమ' అంటే యాథార్థజ్ఞానం యదార్థమైనది సత్యర్ అదే పరమాత్మ స్వరూపం. ఆపరమాత్మ ప్రతీ ఆత్మలోనూ భాసిస్తూంటాడు. కనుక దైవరూపం అనంతత్వాన్ని ఆవిష్కరిస్తుంది. ఆయదార్థజ్ఞానం పొందడం వల్లనే అహంకార నిర్మూలనమై ప్రతి మనిషి మీద మమకారం కలిగి ప్రేమించడం జరుగుతుంది. తద్వారా సత్యం మరింతగా వెలుగొందుతుంది జ్ఞానిలో, వెలుగును వివేకానికి సంకేతించడం సంప్రదాయం.

యావత్ప్రపంచంలోని నదులన్నీ సాగర సంగమాన్నొందున్నట్టే కవిలో పొంగే "అనర్ఘానుభూతి రసవాహినులు పారి అనంత కవిసాగరంలోకి సాగి శైవశగీతాలై ఆడుకుంటూ పాడుకుంటున్నాయ"ంటారు. 'సాగరారాధనం' కవితలో. మాయామర్మాలు తెలియని, ఏ పాపాలూ అంటని శైశవం దైవత్వానికి ప్రతీకగా చెప్పడం జరుగుతుంది సాధారణంగా.

ఉవ్వెత్తున యెగసిపడే తన కెరటాలలో మన్ను మిన్ను లనేకంచేసే రత్నాకరునిలో "ఆనందాధిదేవత పరమాత్మతత్వాన్ని వ్యజింప చేస్తారు కవిగారు.

జనన మరణాలు రెండూ ఆద్యంతాలూ కాలానికి రెండు వైపులా కనిపించే రెండు పుటలనీ రెండుగా కనిపిస్తున్నా అవి ఒకే పత్రమనీ అయినా ఆ రెంటినీ రెండుగా అన్వయిస్తేనే, ఆశ్రయిస్తేనే తప్ప జగతికి ఉనికి లేదనడంలో ద్వైతాద్వైత వాద సమన్వయ చింతన గోచరిస్తుంది.

"మానవసేవే మాధవసేవ" అన్న కవితలో విగ్రహారాధనపట్ల ప్రజలమతమౌఢ్యం పట్ల వ్యంగ్య విమర్శ కనిపిస్తుంది. భిన్న నామాలతో వేర్వేరు రూపాలతో జనులచేత ఆరాధింపబడే మాయామయదైవం మావుడికి ఎదురు చెప్పకుండా మనిషి పెట్టిన బరువుబాధ్యతలన్నీ మోస్తున్నాడంటారు. దైవం నేడు 'అపత్కాల బాంధవుడిగా నున్నాడనీ, మానవుల్లోని ఐహిక వాంఛనలను తీర్చేవానిగానే జనులు దైవాన్ని తలుస్తున్నారనే విసురుంది.

"సర్వ ధర్మాన్ పరిత్యజ్య" అనే గీతోక్తిని నేటి మానవుడు ఏ విధంగా తన స్వార్థానికనుగుణంగా మలచుకుంటున్నాడో వ్యంగ్య విమర్శగావిస్తారు.

"కొండమీది దేవుణ్ణి కలిచే ఓ బుల్లోడా
*నీ గుండెలోని రామచిలుక గుట్టు తెలుసుకో"*

మనడం లో తాత్త్విక గీతాల పరిమళం వీస్తుంది. దేవుడెక్కడో తిరుపతి కొండమీద లేడనీ, ప్రతి మానవుని అంతరంగంలోనే కొలువై యున్నాడనే సత్యాన్ని చాటుతుంది. అంతరంగ దైవాన్ని తెలుసుకోవడం "గుండెలోని రామచిలుక గుట్టు తెలుసుకోవడం'గా సంకేతిస్తారు.

భగవంతుని సర్వాంతర్యామిత్వాన్ని మరింత స్పష్టంగా 'ప్రణవాకారం' అనే కవితలో

"అనంత సృష్టిలో పరమాత్మ
అనంత పరమాత్మలో సృష్టి" వుందంటారు.

"అతాంత వేదాంతం" కవితలో చిత్ర చిత్ర వర్ణాలతో శోభిల్లే అనంత రూపాలలో విరిసే పూలన్నీ ఒక్కటే" ననడంలో విశ్వమానవాత్మకత లోని ఏకత్వం అభివ్యంజితమవుతుంది.

"అడుక్కునే ఏరు" పూర్తి మార్మికతను కలిగినదట్టిది. దైవాన్ని తెలుసుకోవాలనుకునే జిజ్ఞాసువుకు ప్రతీక.

నేనెవరో తెలిస్తే నీవు నేనే అయిపోతావు

నేను నీవే అయిపోతాను" అన్న మాటల్లో"త్వమేవాహమ్" అన్న వేదోక్తి స్ఫురిస్తుంది.

కవిలోని తాత్త్విక చింతనకు అద్దంపడుతుంది "ఎవరు నేను" అన్న కవిత.

'ప్రణవప్రళయం' పంచభూతాత్మకమైన జీవకోట్లు జగన్నాటక సూత్రధారియైన దైవమాడించే మాయామయరూపక పాత్రధారులుగా వర్ణింప బడతారు. మానవులు పంచేంద్రియాతీతుడైన పరబ్రహ్మ తత్త్వాన్ని గ్రహించలేక అస్తినాస్తివిచికిత్సలో పడి కొట్టు మిట్టాడడం వ్యంగ్యంగాను హాస్య రసస్ఫోరకం గానూ చిత్రితమైంది.

కవిగారి ఆలోచన శిఖరాల నుండి అనుభూతుల లోతుల్లోకి ప్రవహించే చైతన్య భావ ధారలన్నీ స్థూలదృష్టికి అనేకంగా భాసిస్తునా నిశితంగా విమర్శిస్తే ఒకే ఒక సత్య సౌందర్య ప్రకటనాత్మకమైనవేనని స్పష్టమవుతుంది. మన చుట్టూవున ప్రకృతిని పరిసరాలనీ మనం అనుభవించే

జీవితాన్నీ మూడు రంగులుగా చిత్రించుకుని మూడు రంగాలుగా అన్వయించుకున్నట్లు గ్రహించాననీ, అందుకే మనిషి భావాలన్నీ ప్రణయోన్ముఖంగానో, ప్రగతి పరంగానో, ప్రణవాత్మకంగానో ప్రకటితమవుతున్నవనీ, అయితే ఈ త్రివిధాలోచనలు, త్రిముఖానుభూతులు పరస్పర సమన్వయం కలిగి వున్నప్పుడే సమగ్ర జీవితానందం సాధ్యమవుతుందనీ, సరససమన్వమ సాధనమే సాహిత్యం, ముఖ్యంగా కవిత్వమని తన విశ్వాసమంటారు బాపురెడ్డి తమ 'శ్రీకార శిఖరం' గేయ సంపుటిలో.

కవిగారు "కోహం కోహం" అనే కవితలో శ్వేదోపనిషత్సూత్రం "నేనెవరనే" ప్రశ్నకు 'అతనే నేను(సోహం) అనే సమాధానం పొదుపరచడం జరిగింది. "కాలకల్పతరుశాఖల దాగిన కలకంఠం" దైవానిది గానూ "చుక్కల రెక్కల అక్కుల ఒదిగిన శూన్యాండం ప్రాణికోటితో కూడిన సకల భువన భాండంగానూ చిత్రిస్తూ ఆది అంతంగానూ అంతం ఆదిగానూ నిరంతరం కొనసాగుతుంది. అచ్యుత నాటకమంటారు కవి యీ జగన్నాటకాన్ని. అచ్యుత పదాన్నెంతో సాభిప్రాయంగాను, సంప్రదాయ బద్ధంగాను ప్రయోగించారు..

భగవంతుణ్ణి తెలుసుకుని చేరుకోవడాని కుపకరించే మార్గాలు రెండు - జ్ఞాన మార్గం, భక్తి మార్గం జ్ఞానమార్గానికి ఒడినీ భక్తిమార్గానికి, గుడినీ, ఆత్మకు పరమాత్మకు అనుసంధానకర్తలుగ గురువునీ పూజారినీ సంకేతిస్తారు. రెండు మార్గాలలో ఏ ఒక్కటీ పరిపూర్ణము కాదనీ,రెంటినీ జోడిస్తేనే భగవద్రససంయోగము సిద్ధిస్తుందనీ ప్రతిపాదిస్తారు.

మరో కవితలో హరిహరాద్వైత సిద్ధాంతాన్నా విష్కరిస్తారు. శివతాండవం, మురళీగానం సంకేతాలుగా వాడుతూ

"సూరీడు నాయిల్లు' అన్న కవితలో లోక ప్రదీపకుడు సూర్యుణ్ణి పరంజ్యోతికి ప్రతీకగా మలచుకొంటారు. పరతత్వ జిజ్ఞాసువు మొదట్లో ఎదుర్కొనే అయోమయత్వాన్ని ప్రతిబింబిస్తుంది. "ఏ మాదిరిగా జీవించాలి" అనే గేయం. మానవునిలో వెలిగే ఆత్మజ్యోతి ఆ పరంజ్యోతిరూపమేననే యెఱుక కలిగిస్తుంది. "ఊపిరి ఉన్నంతదాకా" అనే కవిత ప్రాణజ్యోతిని దీపంగాను, పరంజ్యోతిని వెలుగు రూపంగాను సంకేతిస్తారు.

భగవంతుని చరణాలపైన భక్తుని శిరసు నుంచితే జడచేతనముల దాగిన జీవనసత్యాలు వెలుగుతాయంటారు. జడచేతనత్వాలకు మూలము శ్రీకారమొకటేనని "నాలీల తిరుమల' గేయంలో వెల్లడిస్తారు. సింహాచల శిఖరంలో స్తంభించిన అజ్ఞానస్తంభం నుండి జృంభించిన ప్రజ్ఞాన సింహాన్ని చూసి దేహాన్ని విస్మరించి మోహాన్ని వీడి దాసోహమ్మన్నానంటూ" దాస్య భక్తి నావిష్కరిస్తారు.

"ఉన్నది నీచేతిలోన చక్రము

పట్టుకున్నది నను

దురాచార నక్రము" అన్న మాటల్లో గజేంద్ర మోక్షేతివృత్తం స్ఫురిస్తుంది.

ఆత్మపరమాత్మైక భావాన్నుగ్గడిస్తూ "దివి భువిలోని దీపమొక్కటే" నంటారు. శ్రీకారంర ఓంకార శిఖరాల మీద శివతాండవమ్మాడతా నంటారు.

అస్తినాస్తి విచికిత్సతో కూడినది "మూర్ఖులు మూడు రకాలు" అనే గేయం. అందులో భగవంతుణ్ణి "మాయా మయుడైన సఖుడు" అంటూ సంబోధించడంలో వివిధ భక్తిమార్గాల్లో సఖ్య భక్తి ద్యోతకం పేరులేని పెన్నిధియైన భగవంతుణ్ణి పెక్కు పేర్లతో పిలుస్తూ ఆరాధించే మానవులు పేరు

పేరునావేరు వేరుగా భావిస్తూ పరస్పర కలహాలతోనూ, విద్వేషాలతోనూ రగిలిపోతున్నాంటూ భగవంతుని ఏకేశ్వరత్వాన్ని ప్రకటిస్తారు.

రాగముంటే గానీ త్యాగముండదనీ, త్యాగము లేనిదే భోగములేదని భోగమే ఓంకార యోగమనీ వేదాంతతత్త్వాన్నుపదేశిస్తారు. ఇది ఉపనిష దుక్తి" తేన త్యక్తేన భుంజీథా"ను స్ఫురింపచేస్తుంది. "జాతస్య మరణం ధ్రువ"మ్మనే. తత్త్వావగాహనతో తనను పిలువవచ్చిన మృత్యురాణితో "సోహమనీ నీకు దాసోహమనే పాగొకటి రాయనీయమంటారు.

'ప్రణవ ప్రణయం' కావ్యసంపుటి అంతా 'ఆనందో బ్రహ్మ' అనే ఉపనిషత్సూత్రాని కను సంధింపబడినట్టిదే. భౌతిక సత్యాన్ని పరతత్త్వాన్ని కలిపే నిశ్రేణి ప్రణయం. కనుకనే భౌతక సత్యాత్మిక భావనందలహరిగా ప్రణవప్రణయకావ్యాన్ని బాపురెడ్డిగారు పేర్కొంటారు. ప్రణవ, ప్రణయ, భౌతిక ప్రగతి శక్తులు మూడు - ఇంద్రియ బద్ధమైన మానవుని దేహాత్మలనుండి ప్రబుద్ధమవుతున్నాయి. "ఇవి విలక్షణమైనవే కాని పరస్పర విరుద్ధమైనవి కావు. సరికదా పరస్పర దోహదకారుల"నీ భౌతిక సంపద బౌద్ధిక వికాసానికి, ప్రబుద్ధ శక్తి పరిపూర్ణ ఆత్మజ్ఞాన దీప్తికీ ఉపకరించాలనీ అందుకే ప్రకృతి పురుషయోగతత్త్వం ప్రతిఫలించే ప్రణయంలో కూడా మానవజీవితానంద సత్యం కావాలంటారు. ఈకావ్యంలో ప్రేయసీ ప్రియానుబంధంలో ఇటు భారతీయ మధురభక్తి తత్త్వాన్నీ, అటు సూఫీ ప్రణయతత్త్వాన్నీ పొందుపరుస్తారు. మన మధుర భక్తితత్త్వంలో జీవాత్మను ప్రేయసిగానూ పరమాత్మను ప్రియునిగాను సంకేతిస్తే సూఫీ ప్రణయతత్త్వంలో పరమాత్మను ప్రేయసి గాను, జీవాత్మను ప్రియునిగాను, ప్రేమను మధువుగాను, జీవాత్మ పరమాత్మల మధ్యనుండే మాయ తెరను మేలిముసుగు గాను సంకేతించి చెప్తారు. ప్రియాన్వేషణోత్సవ యాత్రను సాగించే ప్రియుడికి నిరంతర ప్రేమ మధుపానం వల్ల ఎప్పటికో సఖి (సకి) క్షమాదృఢహస్తాల వల్లనే మేలి ముసుగు తొలగించబడి ప్రేయసీ ముఖ సందర్శనం (భగవద్దర్శనం) కలుగుతుంది. ఇదీ సూఫీ ప్రణయతత్త్వం.

'అప్రమేయులు' అనే కవితలో ఒకరు లేక ఒకరులేని ఒకే ఉభయులం మేము' అంటూ "ఎవరం ఎవరమో చెప్పలేని అప్రమేయులం మేము" అని జగత్తుకి పితరులైన పార్వతీపరమేశ్వరుల తత్త్వాన్ని విష్కరిస్తారు.

ప్రేయసిని "తానే ఆనందమైన ప్రజ్ఞాన పయోనిధి ఆమె" అనడంలోనూ "నింగినీ నేలనూ కలుపుతూ సింగిణిలా నీవు నడచిపోతూ దేశకాలాలు సమైక్యం చెందిన దీపంలా నిలిచిపోయావు" అనీ, 'సత్యయానం' అనీ ప్రియురాలిగా భగవంతునిగా భావించడంలో సూఫీ ప్రణయతత్త్వం దీప్తమవుతుంది.

మానవుడు - దైవం పరస్పరం ప్రతిబింబాలే నన్న మహోన్నత భావచైతన్యావిర్భూతమైన అద్వైత వాదం బాపురెడ్డి గారి మిగిలిన కావ్యాల్లో కూడా మార్మికతను సంతరించుకుని యెడాపెడా ద్యోతకమవుతూనే వుంటుంది.



# "బాపురెడ్డి గేయ నాటికలు"

- డా॥ తిరుమల శ్రీనివాసాచార్య

బహుముఖ ప్రతిభాశాలి అయిన డా॥ జె. బాపురెడ్డి గారు సాహితీ వ్యవసాయం సాగిస్తూ పద్యకావ్యాలనూ గేయ కావ్యాలనూ వచనకవితా సంపుటాలనూ విమర్శ గ్రంథాలనూ లలిత గీతికాకృతులను వెలయించారు. మరో వైపు ప్రగతి శీల దృక్పథంతో వస్తు వైవిధ్య విలసితులైన నిస్తుల రమణీయాలైన గేయనాటికలను నిర్మించారు. ఈ నాటికలలో సాంఘికాలూ సాంస్కృతికాలూ ప్రకృతి సంబంధాలూ (ప్రతీకాత్మకాలూ) ప్రబోధాత్మకాలూ బాలల గేయనాటికలూ ఉన్నాయి: మొత్తం మీద బాపురెడ్డి గారు పద్నాలుగు నాటికలను రచించారు. వీటిలో రెండు మాత్రం వచన కవితా రూపకాలు. రసవంతాలైన ఈ నాటికలలోని విషయ పాత్ర సందేశాది విశేషాలను వివరిస్తాను.

రాకెట్టు రాయబారం, సాగర సౌధం, భావి జీవులు, యన్.జీ.వో, ప్రజావిజయం, తక్కువే ఎక్కువ అనేవి సాంఘిక గేయ నాటికలు.

'రాకెట్టు రాయబారం' బాపురెడ్డి గారు తొలిసారి వ్రాసిన గేయనాటిక (1960 ప్రాంతం). విజ్ఞాన శాస్త్ర వైదుష్యం చేత మానవుడు రాకెట్టులను సృష్టించి, వియయాన యాత్రను ఆరంభించి, చంద్రమండలంపైన చరణం మోపాడు. ఇది నిన్నటి యధార్థ విషయం. కాని బాపురెడ్డి గారు మొన్ననే అనగా మానవుడు చంద్రగోళంపై దిగకముందే, మానవుడు దిగినట్లు కల్పనచేసి "రాకెట్టు రాయబారం" నాటికను రచించారు. క్రాంతదర్శి అయిన సహృదయ కవి భావన నిజమవుతుంది అనడానికి ఇదొక తార్కాణం. ఈ నాటికలోని పాత్రలు చంద్రకాంత, రాకెట్టు మానవుని రాయబారిగా రాకెట్టు చంద్రకాంత (చంద్రగోళం) వద్దకు వెళ్ళి మాట్లాడడం ఈ నాటికలోని విషయం.

"ఈతి బాధ లేమొ నరుల హింసించెడి వేళ
నీతిలేని స్వార్థమ్ములు రూపించెడి వేళ
నా ఎడంద కరిగి కరిగి తరుగును
నాకన్నుల అమావాస్యలు తిరుగును" వంటి

చరణాలు. బాపురెడ్డి గారి కరుణారసార్ద్ర హృదయాన్నీ మానవతాదృష్టినీ ప్రకటిస్తాయి. రూపంలోనే కాదు ఆత్మలో కూడా కళంకంలేనట్లు చంద్రకాంత పాత్రను చిత్రించారు బాపురెడ్డి గారు. రాకెట్టుతో రాయబారాన్ని పంపి, ఒక నవ్యతను సాధించారు.

'సాగరసౌధం' నాటికలోని విషయం నాగార్జునసాగర నిర్మాణం. కృష్ణవేణి, నాగార్జునుడు, ప్రజాశక్తి ఈ నాటికలోని పాత్రలు. బాపురెడ్డిగారి కవితావేశం కృష్ణవేణిలా పరుగులు తీసింది.

"నేలలు దున్నెడి హాలికులం
ప్రగతీ లతికా పరిపాలకులం
దారిద్ర్య పిశాచీ రిపులం
సమతా జీవన జ్యోతి శిఖలం
శ్రమ ఘర్మ జలసముద్రుల
నవసమాజ నౌకా చోదకులం" వంటి

పంక్తులు ఇందుకు ఉదాహరణలు. "వెలుగు పూయని కాల-వృక్షములను ఊపితిమి" అనే చరణం రమ్యభావనకు నిదర్శనం. "ఏదారి చూచినా హేదారమే; ఏ మోడు తాకినా పూమేడమే; నా చూపులెటు ప్రాకినా పచ్చలే; నా అందె లెటు

ప్రయోగినా అందమే" – వంటి పంక్తులు కృష్ణవేణిలో తరగెత్తిన ఆనందానికి అద్దంపట్టుతున్నాయి. కృష్ణవేణి నాగార్జునల పాత్రలను కల్పించి, ఈ నాటికకు ఔదాత్య గాంభీర్య–ఔజ్జ్వల్యాలను సంతరించి వాస్తవికతకూ భావనకూ వారధిని నిర్మించారు బాపురెడ్డిగారు. కృష్ణవేణి హృదయంలాగ బాపురెడ్డి గారి కవిత కూడా ప్రయోజనాన్ని అపేక్షించిందే. ప్రసారానికి ప్రదర్శనకూ యోగ్యమయింది ఈ నాటిక.

సమకాలీన సాంఘిక సమస్య అయిన కుటుంబసంక్షేమం వస్తువుగా కలిగిన నాటిక 'భావి జీవులు'. ప్రజాసమస్యలను కవితాకళారూపంలో చిత్రిస్తూ , వాటికి పరిష్కారాన్ని సూచిస్తూ సామాజిక శ్రేయోభిలాషను ఈ నాటికలో వ్యక్తం చేశారు శ్రీ బాపురెడ్డి గారు. దేశకాలాలు, భావిజీవులు, ఈ నాటకంలోని పాత్రలు. దేశకాలాలు తల్లిదండ్రులుగాను, భావిజీవులు పుట్టబయే బాలబాలికలుగానూ భావించవచ్చు. దేశ కాలలకూ భావిజీవులకూ మధ్య జరిగిన సంభాషమే ఈ నాటిక.భావిజీవులు పలికిన –

ఇలా గోళం చాలకుంటే – ఇందుగోళం చేరుతాం
ఏమీ పండని ఏడారైనా – సాగు చేసే తీరుతాం

అనేమాటలు వాళ్ళ కార్యదీక్షావేశాల్ని, వాళ్ల జీవశక్తిని స్పష్టీకరిస్తున్నాయి. "అల్పపీడనం వైపే అనిలం వీచుగదా"

"భాజకమును పెంచి, భాగ
ఫలమును తగ్గించుటేల? " – వంటి పక్తులు బాపురెడ్డి గారి శాస్త్రీయ విజ్ఞానాన్ని పరిచయం చేస్తున్నాయి.

ఈనాటికలో ఇంగ్లీషు ఊర్దూపదాలను, కార్యాలయ భాషా పదాలను ప్రయోగించి భావ ప్రకటనలలో ఆధునికతాగంధాన్ని గుబాళింపజేశారు. బాపురెడ్డి గారు.

'యన్.జీ.వో' మూడు దృశ్యాలనాటిక. ఆఫీసరు, ఎన్.జీ.వో, భార్య, అతని పిల్లలు ఈనాటికలోని పాత్రలు, ప్రభుత్వ యంత్రాంగానికి పునాదియైన యన్.జీ.వో. జీవితాన్ని, అతని మానసిక తత్త్వాన్ని, అతడు పడే కష్టనష్టాలనూ, అతడు ఎదుర్కొనే దైనందిన సమస్యలను చిత్రించే నాటిక యన్.జీ.వో. ఈనాటకంలోని సంభాషణలు సహజంగా సరళంగా ఆఫీసుల్లో ప్రయుక్తమయ్యే ఆంగ్లభాషాపదాలతో సజీవంగా సందర్భోచితంగా సాగాయి. బ్రతుకు బాధ చూసి భయపడవద్దనీ, నిజాయితీని విడువవద్దనీ, శ్రమించి, "జాతి జాతకము మార్చే చైతన్యము" పెంచాలనీ బాపురెడ్డి గారు సందేశం అందించారు ఈ నాటిక ద్వారా. ప్రదర్శనా యోగ్యమైంది ఈ నాటిక.

మాజీ భారత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి ఇరవై అంశాల ఆర్థిక కార్యక్రమం వల్ల కలిగిన ప్రజాచైతన్యాన్ని 'ప్రజావిజయం'గా భావించి ఈ రూపకం (ప్రజావిజయం) లో చిత్రించారు శ్రీ బాపురెడ్డి గారు. ఈనాటికలో ప్రజాశక్తి, దుష్ట శక్తులు, ప్రగతి లక్ష్మి.

"ఈనదులు మన ఎదలు ; ఈ కొండలు మన కండలు;
ఈ గనులు మన కనులు; ఈ అడవులు మన తొడవులు
ఈ పొలాలు మన బలాలు;
ఇవి మన అందరి కోసం – ఇది మన భారతదేశం
" వంటి

పంక్తులు బాపురెడ్డి గారి దేశభక్తికీ కవితా శక్తికీ ఉదాహరణాలు. రాష్ట్ర సంగీత నాటక అకాడమీ వారు నిర్వహించిన నృత్య సంగీత నాటికల పోటీలో ఈ నాటిక ప్రథమ బహుమతిని గెలుచుకుంది.

'తక్కువే ఎక్కువ' అనే నాటిక ఇద్దరు పిల్లలు చాలు అనే కుటుంబ సంక్షేమ కార్యక్రమాన్ని ప్రచారం చేసే దృష్టితో రచింపబడింది. అధిక సంతానాపేక్ష గల భార్య, పరిమిత సంతానాన్ని కోరుకునే భర్త - వీరిద్దరి మధ్య జరిగిన సంభాషణ సన్నివేశమే ఈ నాటిక. భార్య, భర్త, సన్యాసులు, యువతీ యువకులు ఈ నాటికలోని పాత్రలు. భర్త చెప్పిన మాట విని చివరకు భార్య కుటుంబసంక్షేమం పథకానికి అంగీకరించడంతో నాటిక ముగుస్తుంది. "చందమామ వంటి బాబు - మందారం వంటి పాప" చాలు అనే భర్త మాటలు ఎంతో బాగున్నాయి. "సన్యాసుల కేమి ఎరుక - సంతానం సంగతి" అన్న వక్తులు హాస్యరసతరంగీ గితాలు. "మనకున్నవి రెండే రెండు ఫలాలు - మన ప్రేమకు మన నోముకు ప్రతిఫలాలు" అనే పంక్తుల్లో ఈ నాటిక చక్కని సందేశాన్ని అందిస్తున్నవి. "తక్కువ సంతానమే ఎక్కువ లాభం" అన్న దాన్ని "తక్కువే ఎక్కువ"గా చేశారు కవి. "సకల జన సంక్రాంతి" అనేది సాంస్కృతిక నాటిక. సంక్రాంతి పండుగ వచ్చిందని కొందరు సంతోషిస్తే,మరి కొందరుఎంతో బాధపడతారు. 'సంక్రాంతి'లో ఆశనిరాశలు జరిపే అభిభాషణమే ఈ రూపకం. ప్రజవాణి, ఆశ, నిరాశ, సంక్రాంతి ఈ నాటికలోని పాత్రలు.

*"గజ్జె కట్టి గంగిరెడ్లు గంతులు వేశాయి.*
*డోలుకట్టి దిక్కులన్ని ఈలలు వేశాయి"*

అంటూ ఆశా గళాలు ఆనందిస్తే -

*"మనిషిని పీడించి, మనిషి*
*మహిషాసురుడవుతుంటే*
*మనిషిలోని దేవునికి - మతిపోతున్నది నేడు"*

అని నిరాశాగళాలు నిట్టూర్పులు విడుస్తాయి. "మనిషిని మనిషినిపిల్చి - మనుటమానిన నాడే - సమతతో సహృదయత-సఖ్య మందిననాడే - సంక్రాంతి నాపేరు - సార్థకమై పోవు" అనే సంక్రాంతి మాటలే ఈనాటిక అందించే సందేశం.

ఋతువులను పాత్రలుగా కల్పించి గేయైక నాటికలు వ్రాయడంలో ప్రథములు ఆచార్య పి. నారాయణరెడ్డిగారు. ఆనాటిక - 'ఋతువుల రాణి' ఈ నాటికలో శిశిరవసంతర్తులు రెండు మాత్రమే పాత్రలుగా చిత్రింపబడగా - బాపురెడ్డి గారి నాటిక - 'ఋతురాగం'లో ఆరు ఋతువులూ పాత్రలైనాయి. అందువల్ల ఋతువులన్నీ పాత్రలు గాగల్గిన ప్రథమ నాటిక 'ఋతురాగం'. ఇది దీని ప్రత్యేకత. ప్రకృతి సంబంధమైన (ప్రతీకాత్మకమైన) నాటిక ఇది. వసంతాది షడృతువుల వల్ల కాల స్వరూపం సమగ్రమవుతున్నది. ఒక్కొక్క ఋతువు ఒక్కొక్క ప్రభావాన్ని ప్రసరిస్తూ మానవజీవితంలో ప్రాధాన్యాన్ని వహిస్తున్నది. ఏ ఒక్క ఋతువులో ప్రకృతి ప్రగతి జీవనం పరిపూర్ణం గాదు. అన్నీ సమానమే. అన్నీ అనివార్యాలే. ఈ విషయాన్నే బాపురెడ్డి గారు 'ఋతురాగం'లో వ్యక్తం చేశారు. వర్షాసుందరీ, శరద్బాల, హేమంతకాంత, శిశిరభామిని, వసంతకుమారి, గ్రీష్మా రాగిణి, కాలపురుషుడు - ఈ నాటికలోని పాత్రలు. విభిన్న శక్తులు ఐక్యమై ఏకరూపత దాల్చినపుడే సమాజం సర్వతోముఖంగా అభ్యుదయాన్ని సాధిస్తుందనే యథార్థాన్ని ఈనాటికలో వ్యంగ్యంగా హృద్యంగా అభివర్ణించారు కవి. ఈ రూపకంలో బాపురెడ్డి గారి ప్రకృతి వర్ణనా

వైశారద్యం కవితావేశం పదపదాన ప్రత్యక్ష మవుతున్నాయి. గ్రీష్మరాణి – "శిరముపై చండనవి-భాండమ్మును వహించి; శివుని ఫాలాగ్ని కీలమాలలు ధరించి" వచ్చిందట ఈ పంక్తులు కవి భావనాశక్తికి. ప్రబల నిదర్శనం. మబ్బు పడకలు, శంపా సర్పములు, వెన్నెల కోకలు, మంచుపైట – వంటి హృద్యమైన పదబంధాలు ఈ నాటికలో చోటుచేసుకున్నాయి. ఆకాశవాణి హైద్రాబాదు కేంద్రంనుంచి ప్రసారితమైన ఈ నాటికను విశాఖ వైద్య కళాశాల విద్యార్థినులు ప్రదర్శించారు.

కల్యాణ యాత్ర, విజయహేల, స్వాతంత్ర్యహేల- అనే నాటికలు ప్రబోధాత్మకాలు. సర్వ శక్తులను తనలో లీనం చేసుకుని, మానవుడు సమన్వయ శీతలంతో బ్రదుకును సాగించాలని 'కళ్యాణ యాత్ర' అనే నాటిక ద్వారా ప్రబోధించారు. మానవుడు, ప్రకృతి, ప్రేయసి, మాతృదేవి, కష్టజీవి, భాగ్యదేవత, దేశమాత,- ఈ నాటికలోని పాత్రలు. ఈ నాటిక హైద్రాబాదు ఆకాశవాణి కేంద్రం నుంచి ప్రసారమైనది. మానవుని నమనస్సులోని భావఘర్షణకు అక్షరరూపం ఈ రూపకం.ఒకవంక ప్రకృతి సౌందర్యం, ఒక వంక ప్రణయిని, ఒక వైపు తల్లి ప్రేమ, ఒక వైపు కష్టజీవులు, ఒక దిక్కు భోగభాగ్యాలు, మరో దిక్కు మాతృదేశం, మానవుణ్ణి అకర్షిస్తుండగా, అ ఆ అందరినీ సమాదరించి, అన్ని ఆకర్షణలనూ సమన్వయించుకుని, జీవితాన్ని రసాత్మకంగా, శుభంకరంగా ఆర్ద్రంగా శివంకరంగా మలుచుకోవడమే జీవిత ధ్యేయంగా ఉండాలి అనే సందేశానికి నాటికారూపం కల్పించిన తీరు పరమరమణీయంగా ఉంది. "నాలో విషనాగఫణాలను నాట్యము చేయిస్తారేల" అనే పంక్తులు మానవుడు పొందిన బాధాతీవ్రతను చక్కగా వ్యక్తీకరిస్తున్నాయి.

విజయానికి ప్రతీక అయిన విజయదశమి ప్రాశస్త్యాన్ని వివరించే నాటిక – 'విజయహేల' ఈనాటికలోని పాత్రలు విజయదశమి, నాలుగు కంఠాలు (స్త్రీ పురుషులు). విజయదశమి శక్తిస్వరూపిణి అయిన దేవికి సంకేతం. మహాకాళ్యాది నవావతారాలెత్తి మధుకైటభాదులను మట్టుపెట్టి లోక కళ్యాణం గావించిన విజయదశమికి నరనారులు స్వాగతమిస్తారు. రాముడు, పాండవులు, గాంధీ విజయాలన్నీ విజయదశమి ఆశీస్సుల వల్లనే అని ఆ దేవిని ప్రశంసిస్తారు. అజ్ఞాన దారిద్ర్యాదులను ప్రతిఘటించ డంతో తమకు శక్తిని ఇవ్వాలనీ, విజయాన్ని సిద్ధింపజేయాలనీ ఆ దేవిని ప్రార్థిస్తారు. ధర్మానికి జయం కలుగుతుందని విజయదశమి వాళ్ళను ఆశీర్వదిస్తుంది. దీనితో నాటిక పూర్తవుతుంది. బాపురెడ్డి అభ్యుదయ దృక్పథాప్పిలోకకళ్యాణా కాంక్షను ఆత్మశక్తిని, దేశ భక్తినీ ఈనాటిక చక్కగా వ్యక్తం చేస్తున్నది..

"అణ్వాయుధ శక్తికన్న – ఆత్మబలమే మిన్న
బాంబు బలము కాదు దేశ – భక్తిని పెంచాలన్నా"

అని విజయదశమి ముఖతః ప్రబోధం చేశారు బాపురెడ్డిగారు. ఈనాటికి ఆకాశవాణి హైద్రాబాదు కేంద్రం నుంచి ప్రసారమైంది.

బాపురెడ్డి గారు ఈ నాటికలోని కొంత భాగాన్ని గ్రహించి, దానికి ఇరవై సూత్రాల ఆర్థిక కార్యక్రమాల్ని జతచేసి 'విజయవీణ' పేరుతో 1975లో ఆకాశవాణి హైద్రాబాదు కేంద్రంనుంచి ప్రసారం చేశారు.

సమకాలిక స్వతంత్ర భారతదేశ వాస్తవ పరిస్థితులకు ఆశావాదులు నిరాశపడుతూ ఎలా ప్రతిస్పందిస్తున్నారో, దేశమాత సౌంతంత్ర్యలక్ష్మి వాళ్లను ఎలా ప్రగతి పథంలో నడవమని

ప్రభోదిస్తున్నదో - నిరూపించే నాటిక "స్వాతంత్ర్య హేల". త్రికరణశుద్ధితో అందరూ సమైక్యంగా కృషి చేస్తే ఈదేశ భవిష్యత్తు సముజ్జ్వలంగా ఉంటుందనే భావనను ప్రజానీకంలో కలిగించే ఉద్దేశ్యంతో ఈ రూపకాన్ని రచించారు బాపురెడ్డి గారు. ఆశావాదులు నిరాశావాదులు, భరతమాత్ర, స్వాతంత్ర్యలక్ష్మి - ఈ నాటికలోని పాత్రలు

"స్వాతంత్ర్యం ఏమి చేస్తున్నది? - స్వార్థపరతకు ఎదురౌతున్నది. అభివృద్ధి ఏమి అవుతున్నది? అసమానతకు బలౌతున్నది" అని నిరాశావాదులటే - "నీదేహమున కన్న - నీ దేశము ప్రేమించుము" మంచి చెడుగుల బాధ్యత - మనదే మనదే మనదే " - అని ఆశావాదు లంటారు. "మీ సమైక్యత బలమే -నా సుందర రూపము"

మీ సమతా భావనమే - నా సుయశోదీపము" - అని దేశమాత సందేశిస్తుంది. "కర్షకులూ కార్మికులు - క్రాంతి కథానాయకలై,నేను కన్న కలలన్నీ - నిజాలు చేస్తుంటే-నా దేశం నవ్వుతూంది. నందన వనంలా" -అని స్వాతంత్ర్య లక్ష్మి సంతోషిస్తుంది.

మొత్తానికి మనదేశం మారిందనీ, ప్రగతినౌక గమ్యం చేరిందనీ నేపథ్యకంఠంగా కవి తమ ఉద్దేశాన్ని ప్రకటించారు నాటికాంతంలో.

నవభారత నిర్మాత పండిత జవహర్‌లాల్ నెహ్రూ జన్మదినోత్సవ సందర్భాన్ని పురస్కరించుకుని శ్రీ బాపురెడ్డి గారు "చాచానెహ్రూ" అనే బాలల గేయనాటికను రచించారు,. గులాబీలు, బాల బాలికలు, చాచాజీ ఈ నాటికలోని పాత్రలు. సమకాలీన సమాజంలోని స్వార్థం, సంకు తత్వం, వంచన, అభ్యుయయ సాధనలో అటంకాలుగా నిల్చిన దుఃస్థితిని ఎత్తిచూపుతుంది ఈ నాటిక.

"పారతంత్ర్య మును ఏ రూపమున నున్న చీల్చండి - కులమత నిర్మిత విబేద - కుడ్యాలను కూల్చండి" అంటూ భావిపౌరులైన బాల బాలికలను ప్రబోధించారు బాపురెడ్డి గారు ఈ నాటిక ద్వారా.

బాపురెడ్డి గారు వచన కవిత్మకాలైన రూపకాలను కూడా రచించారు. - అవి పిల్లల మర్రితో ఇంటర్వ్యూ, చేతనా కేతనం -అనే నాటికలు 'పిల్లల మర్రితో ఇంటర్వ్యూ' అనేది చారిత్రిక నాటిక. మహబూబ్‌నగర్ జిల్లాలో ఉన్న మహావృక్షం పిల్లల మర్రి. దాని వయస్సు 450 సంవత్సరాలు. ఈ కవి దృష్టిలో అది ముదిమి లేని అందాలరాణి" "సహస్రనిసర్గ సుందరవేణి""కవి పిల్లల మర్రిని దర్శించునప్పుడు కల్గిన అపూర్వభావానుభూతికి వచన కవితారూపం ఈ రూపకం" అని బాపురెడ్డి గారే అన్నారు. పిల్లలమర్రి తన పుట్టుపూర్వోత్తరాలను కవికి వినిపించడం - ఈ నాటకంలోని కథాంశం. పాత్రలు రెండే - కవి, పిల్లలమర్రి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తనసన్నిధిలో యాత్రికుల కోసం ఏర్పరిచే సౌకర్యాలను గాంచి సంతోషిస్తుంది. పిల్లలమర్రి కవీ పిల్లలమర్రీ ఇరువురూ తమ భావువైక్యాన్ని నివేదించుకుని సంతోషపడతారు.

'చేతనాకేతనం' ప్రబోధాత్మకనాటిక. స్వాతంత్ర్యానంతరం సాధించిన ప్రగతీ దానికి అవరోధంగా నిల్చిన , నిలుస్తున్న చీకట్లూ, వాటిని తొలగించి ముందుకు సాగుతామని ప్రజలు ప్రతిజ్ఞచేయడం, భరతమాత, స్వాతంత్ర్యలక్ష్మి విజయోస్తు అని దీవించడం.. ఇవీ ఈ నాటకంలోని కథాంశాలు "దొంగలున్నారు జాగ్రత్త! ఇంటి దొంగలున్నారు జాగ్రత్త 'చేతనా కేతానాన్ని -శిశిరం చేతికి చేరనీయ వద్దు జాగ్రత్త" అనే పంక్తులు ఈ నాటికలో భరతమాత ముఖతః వెలువడిన కవి సందేశం.

ఛందోభాషా దృష్టిలో, రస దృష్టితో జాబితా దృష్టితో శిల్ప దృష్టితో ఏ దృష్టితో చూసినా శ్రీ బాపురెడ్డి గేయ నాటికలు సహృదయ హృదయ రంజకంగా సామాజిక ప్రయోజన మహితంగా ఉన్నాయి.గేయ నాటికలు సంగీత సాహిత్య నృత్యకళా సంభరితాలు. కవి అయిన బాపురెడ్డి గారికి ఈ మూడు కళలతో చక్కని పరిచయమున్నది. అందుకే వారి నాటికలు కవితా సంగీతనృత్యకళా సుమ వాటికలు. ఆందుకే మహాకవి దాశరథి గారు ఈ గేయ నాటికలను చదివి, ఉత్ఫుల్ల హర్షంతో -

"గేయనాటికలు - కావ్యనాటికలు
రమ్య చేటికలు - రత్న పేటికలు" అని

అన్నారు. ప్రయత్నంగా ఈ మాటలు బాపురెడ్డి గేయ నాటికలకు అక్షరాలా వర్తిస్తాయి. అందుకే "బాపురెడ్డి గేయనాటికలు " అనే సంపుటి ముచ్చటగా మూడు ముద్రణలను పొందింది. 1970లో; 1973లో 1989లో.

శ్రీ డా॥ తిరుమల శ్రీనివాసాచార్య
8-73, గౌతమ్‌నగర్ కాలనీ
దిల్‌సుఖ్‌నగర్
హైదాబాదు - 500 660.
ఫోన్ : 875793

# 'మనచేతుల్లోనే ఉంది' – ఒక పరిశీలన

**– డా॥ రావి భారతి**

"మన చేతుల్లోనే ఉంది" అన్న శీర్షికతో 1986లో వెలువడ్డ ఈ కవితా దర్శనం ఒక అభ్యుదయ శీల కవితా దర్పణం. మూడు దశాబ్దాలుగా శ్రీ బాపురెడ్డి గారి మనసుల్లో మొదలుతూ వచ్చిన చైతన్యానుభూతులుకూ, ఆలోచనలకూ అక్షర రూపమిది. సమాజంలోని ఆర్థిక సాంఘిక రాజకీయ పరిణామాలకు ఎప్పటికప్పుడు నిత్య చైతన్యంతో ప్రతిస్పందించిన ఆయన కలం సృష్టించిన అపూర్వ కవితా సంకలన మిది. ఇందులో అరవైకి మించి ఖండికలున్నాయి. ప్రతిఖండికలో ఏదో ఒక రూపంలో సామాజిక నత్యజీవిత సత్యాలను నిక్షిప్తం చేసి ఆయన మన కందించారు. భౌతిక జీవన వికాసానికి మానవ సంక్షేమానికీ అవసరమైన అనువైన ముడిసరుకు నిందులో భద్రపరిచారు. ఒక్క మాటలో చెప్పాలంటే తెలుగునాడు నుండి థేమ్స్ నదీ తీరందాకా కుటుంబ సంక్షేమం నుండి వసుధైక కుటుంబ భావన దాకా, గ్రామ సీమల నుండి వ్యోమసీమల దాకా ఈకవితా వస్తువు విస్తరించి విశ్వరూపం దాల్చింది. కుక్కను గురించి రాసినా కువలయాన్ని వర్ణించినా సంయమనాన్నీ సమదర్శనాన్ని ప్రదర్శించిన ప్రాజ్ఞుడు బాపురెడ్డి గారు. 1989లో తెలుగు విశ్వవిద్యాలయయం సాహితీ పురస్కారాన్ని అందుకున్న ఈ సంకలనం కవి ప్రతిభ యొక్క పరాకాష్ఠ స్థితిని సూచిస్తున్నది.

శ్రీ బాపురెడ్డి గారి కవిత్వాన్ని మనం పరిశీలించి చూస్తే ఈయన ప్రత్యేకించి ఏ *ఇజా'నికీ కట్టుబడి ఉన్న కవిగా కనిపించరు. ఈయనలో కవిపించేది ఒకే 'ఇజ'ం. అది హ్యూమనిటేరియనిజం. అభ్యుదయ దృక్పథంతో మానవవత్వాన్ని ఊతగా గొని గమ్యం వైపును నడిచిపోతున్న కలం బాపురెడ్డిది. నిర్మూలన కంటె నిర్మాణం, సాయుధ విప్లవం కంటే సాంఘిక వికాసం – ఇవీ ఆయన ధ్యేయాలు. అందుకే ఆయన్ని వీరేశలింగం గారు ఆకర్షించారు.

"సాయుధ విప్లవాలతో సాధించలేని
సంఘ సంస్కరణను
సాహితీ సౌరభాలతో
సాధించిన కీర్తి శృంగాన్ని" వీరేశలింగాన్ని మనసారా ప్రశంసించాడు. నిర్మాణాత్మకమైన పథకాల ద్వారానే సాంఘిక విప్లవాన్ని సాధించవచ్చు నన్న నమ్మకం ఆయనకున్నది. కనుకనే "ఇరవై రంగుల ఇంద్రధనున్సు వెలుగులో ఆర్థిక విప్లవాన్ని సాధించాలనీ ప్రజాస్వామ్య పీఠంపై సాంఘిక విప్లవాన్ని ప్రతిష్టించాలని కలలు కన్నాడు. "మానవత బ్రతికి ఉంటే మనిషికి భయం లేదని" దేన్నయినా సాధించగలడని నమ్ముతున్నాడు ఈ కవి దేశాన్ని చాలావరకు ఒక ఆశావాది గానే దర్శిస్తాడు. దాన్ని ఒక నందనవనంలాగా ఒక నాదస్వరం లాగా భావించి మురిసిపోతాడు.

"కన్నీళ్లు పండిన కష్టజీవుల బ్రతుకుల్లో
కాంతి రేఖల్ని పండించి
చెమట బిందువుల్లో
నవజీవన సింధువుల్ని సృష్టించి
బంజరు భూముల్లో బ్రతుకుబాటలు వేయించి
కర్షకుణ్ణి కార్మికుణ్ణి కష్టించే ప్రతి జీవిని
రక్షారథం ఎక్కించి

నా దేశం నవ్వులొందె నాదస్వరంలా"

ఏ సమాజంలో నైనా అత్యధిక సంఖ్యాకు లెవరైతే ఉంటారో వారి సమస్యలే నిజమైన సమస్యలు, కార్మికులు, కర్షకులు, రెక్కాడితేనే డొక్కాడని నిరుపేదలు, బడుగు వర్గాలు వీళ్ళను గురించి సానుభూతితో ఆలోచిస్తూ వాళ్ళలో చైతన్యశక్తిని చిందింపచేసే రచనలు చేసే కవే నిజమైన ప్రజాకవి. మానవతావాదానికి కట్టుబడ్డ కవి. అలాంటి కవే జాతి జీవితంతో మమేకం పొందగలడు జాతీయ కవిగా అవతరించగలడు. జాతి జీవితంలోని ఆటుపోట్లకు ఎప్పటికప్పుడు ప్రతిస్పందిస్తూ ఆశావాదిగా పురోగమిస్తూ ఉంటాడు. అలాంటి కవి శ్రీబాపురెడ్డి.

1984 అక్టోబర్ 10వ తేదీ. శాంతి కపోతం మూగవోయిన రోజది. ప్రజాస్వామ్య పరాశక్తిని మతమౌఢ్యం బలి తీసికొన్న రోజు. విశ్వమంతా విలపించిన రోజు. ఒక్క క్షణం ప్రజాజీవన ప్రగతి యాత్ర స్తంభించిన రోజు. అయితే ప్రగతి ఆగిపోయిందా? లేదు. ప్రగతికి పురోగమనమే కాని తిరోగమనం లేదని కవికి తెలుసు. ఏ హత్యలూ, అడ్డంకులూ కుటిల తంత్రాలు జాతి జీవన గమనాన్ని ఆపలేవని కూడా ఆయనకు తెలుసు. కనుకనే ఆసత్యాన్ని ఇలా వ్యక్తీకరించాడు.

"భారతరత్న గర్భ నుండి
చిందిన ప్రతి రక్త కణం
మానవాభ్యుదయాకాశంలో
భావిభానువులై ప్రజ్వలిస్తాయి.
భరతజాతీందిరకన్న
భాగ్యోదయ స్వప్నాలు
జన జీవన కాసారాలలో
నిజ రాజీవాలై వికసిస్తాయి".

– ఒరిస్సాలో జరిగిన ఒక బహిరంగ సభలో "నా చివరి రక్తంబొట్టు దాకా ఈ దేశానికి ధారపోస్తానన్న" ఇందిరా గాంధీ ప్రతిజ్ఞలతో పొందిన స్ఫూర్తే ఈ కవితకు కారణం కావచ్చు.

కలం –గళం ఈ రెండు చాలా శక్తిమంత మైనవని నమ్మే వాళ్లలో బాపురెడ్డి కూడా ఒకరు.కనుకనే ఈ రెంటినీ ఎక్కుపెట్టి జాతిలో జాగృతిని కలిగించే ప్రయత్నం చేస్తున్నాడు. "దేశం ముందడుగు వేయాలి" అన్న కవితలో దేశం యొక్క ఆర్థిక వ్యవస్థను అన్నివిధా లాస్తవ్యస్తం చేస్తున్న దుష్ట శక్తులను శిక్షించి దేశాన్ని రక్షించుకోవాలన్న ఒక విప్లవ సందేశాన్ని ప్రజల కిలా అందించాడు.

"కల్తీలతో తిండిని విషం చేస్తున్న
కసాయి వాళ్ళను
దొంగ నిలువలతో నీ బ్రతుకు విలువలు దోస్తున్న
నీచపు తోడేళ్ళను
సిమెంటు బూడిద చేస్తున్న మాయావులను
నూనెను గోమూత్రం చేస్తున్న బాబూలను
నీతిని కాటేస్తున్న భుజంగాలను
రవిని మింగేస్తున్న పైరవి గాళ్లను
కదం తొక్కి నీపాదాల క్రింద నలిచేయి."

అంటూ ప్రజల్ని, జాగృతం చేయడానికి తన పెన్నునే ఒక గన్ను లాగా దుష్టులపై ఎక్కుపెట్టిన చైతన్య కవి బాపురెడ్డి. ఇలా ఒక్కొక్క మారు చాటుగా సాంప్రదాయబద్ధంగా కాక ఘాటుగా బల్లెపుపోటులా సత్యాన్ని చాటడానికి ప్రయత్నిస్తాడు. సమాజ జీవిత పురోగమన మార్గాన్ని అడ్డుకునే ఏ దుష్ట శక్తయినా ఆయన కలం పోటుకు గురి కాక తప్పదు.

బాపురెడ్డి గారి భావనలో కులం వేరు.

కులతత్వం వేరు గతంలో కులాలు మాత్ర మున్నాయి. కులతత్వం పడగవిప్పలేదు. ఈనాడు ఒక వైపు కులాల గోడలు కూలి పోతున్నాయని నాగరిక ప్రపంచం జబ్బలు జరుచుకుంటూ ఉంటే మరో వైపు కులతత్త్వం తన కోరల్ని విప్పి కాటేస్తున్నది. ఈ విషయం గమనించిన కవి దళిత జాతుల హృదయ కుహరాలలో ఆశాదీపంగా వెలిగిన అంబేద్కర్‌ను స్మరిస్తూ -

"కుల నిర్మూలనం నీవు కోరితే
మాటను కొంచెం మార్చి
కుల నిర్మాణం చేస్తున్నారు
కులవ్యవస్థను పునర్నిర్మాణం చేస్తున్నారు"

అంటూ ఆవేదన చెందుతున్నాడు. జాతీయ జీవనానికి ఆర్థికపుష్టి సాంఘిక తుష్టి కలగాలంటే వివిధ వర్గవర్ణ మతాల మధ్య సామరస్యం తప్పనిసరి. అది లోపించిన నాడు జాతీయ జీవనమే ఛిన్నాభిన్న మౌతుంది. అలాంటి సమైక్యతా స్పృహ ప్రజానీకంలో కల్గించడం చాలా అవసరం. ఆ విషయం బాపురెడ్డి గారికి బాగా తెలుసు. ఇలా సమాజానికి సందేశ మిస్తున్నాడు.

"నావిశాల కుసుమ వనంలో
నాగుపాముల్ని జొరనీకండి - అవి
కాటువేయకుండా కపాడండి
ఆవేశాలు కావేశాలు మాని
అందరూ కలిసి ఆలోచించండి
సమైక్యతనూ సర్వతోముఖసౌభాగ్యాన్నీ సాధించండి."

తరతరాలుగా ఏదో ఒక రూపంలో సమాజంలో తలెత్తుతున్న స్త్రీ సమస్యలకి కూడా కవి స్పందిస్తూ ఉంటాడు. ఒకనాడు వీరేశలింగం గారు నాటిన వెలుగు తోటలు ఈనాడు నారూ నీరు లేక వెల వెలపోతున్నాయని కవి వేదన. అంతేకాక ఆనాడు పంతులుగారు కలలుకన్న స్త్రీ స్వేచ్ఛ యొక్క నిర్వచనం ఎలా వక్రమార్గం పట్టిందో వ్యంగ్య గర్భితంగా వక్రీకరిస్తున్నాడు.

"స్వేచ్ఛ కావాలనుకున్నావు నీవు స్త్రీకి
ఇచ్చేశావు బోలెడంత స్వేచ్ఛ ఆమెకు
ఏమి టా స్వేచ్ఛ అంటున్నావా
స్వేచ్ఛ లేదు అని చెప్పే స్వేచ్ఛ
స్వేచ్ఛకావాలని స్వేచ్ఛగా అడిగే స్వేచ్ఛ"

స్త్రీ స్వేచ్ఛ యొక్క నిజస్వరూపమిది! ఈనాడు స్త్రీ పట్ల సమాజం చూపుతున్న ద్వంద్వవైఖరిని కవి కనిపెట్టాడు. తరతరాలుగా వస్తున్న సాంప్రదాయపు సంకెళ్ళనుండి స్త్రీని విముక్తను చేయాలనే పురుష సమాజం ఉబలాటపడుతున్నది. కానీ తీరా స్త్రీ ఆ స్వేచ్ఛను ఆసరా చేసుకొని సమాజ జీవితంలో పాలు పంచుకోవడం చూచి సహించలేకపోతున్నది. స్త్రీ కిదొక సంధియుగం. కనుకనే "పరిష్కారాలు సమస్యలై పోతున్నవి. సంస్కరణలను స్వార్థాలు కాటేస్తున్నవి". సంధియుగంలో సంఘర్షణ తప్పదు. అయితే ఆ సంఘర్షణ నుంచే ప్రగతి పుట్టు కొస్తుందన్న మాట కూడా మనం మరువకూడదు.

"మన చేతుల్లోనే ఉంది" అన్న చిట్టచివరి ఖండిక తక్కిన ఖండికలన్నింటికి కరదీపికలాంటిది. సమాజంలోని మంచి చెడులకూ, సుఖదుఃఖాలకూ ఆవేదనానందాలకూ మనిషి ప్రవర్తనే ఏకైక లక్ష్యంగా గుర్తించడం ఒక హేతువాది తప్ప మరొకరు ఆసాహసం చేయలేరు. ఏదీ మన చేతుల్లో లేదనీ అంతా దైవాధీనమని తప్పించుకునే పలాయన వాదుల కిదొక గొడ్డలిపెట్టు.! అయితే బాపురెడ్డి ఒక

సమన్వయవాది. తాత్త్వికవాదానికి సమతావాదానికీ అద్వైతతత్వానికి అభ్యుదయ భావానికి సమన్వయాన్ని సాధించిన దార్శనికుడు బాపురెడ్డి.

"ఆది శంకరుల అద్వైత తత్వం-మాయావాదం
మార్క్సుమహాశయుని
అభ్యుదయ తత్వం సమతావాదం
ఘోషించే సత్యం ఒకటే
"ఈ జీవితం ఒక తెల్లకాగితం
నీ జాతకం నీవే వ్రాసుకో"

-జీవితగతినీ సమాజప్రగతినీ నిర్దేశించినీ నడిపించే శక్తి మనిషికే ఉందనీ, జీవితాన్ని నిర్మించాలన్నా నిర్మూలించాలన్నా అతని చేతుల్లోనే ఉందని చెబుతూ విశ్వనిర్మాణానికి మనిషినే కేంద్రబిందువుగాచేసి తరతరాల సాంప్రదాయిక భావజాలాన్ని బద్దలుకొట్టి మనిషి ప్రతిష్ఠను పెంచిన వాడు మహాకవి కాక మరేమవుతాడు?

వస్తుత్వం-కవితాగుణం ఈ రెండూ పరస్పర స్ఫోరకాలు. వస్త్వౌన్నత్యం లేని కవితాగుణం బూడిదలోపోసిన పన్నీరౌతుంది. అలాగే కవితావిలువలు లేని వస్తువు వాసనలేని రంగు కాగితం పువ్వులాంటిది. ఈ రెండు ఒకచోట చేరితే బంగారానికి తావి అబ్బినట్లుంటుంది. ఒక కవి ఏంచెబుతున్నాడనే కాక ఎలా చెబుతున్నాడన్న అంశం మనల్ని ఆకర్షించినప్పుడు అతడు నిక్కచ్చిగా గొప్పకవి. బాపురెడ్డి గొప్పకవి అనడానికి ఒక్క ఉదాహరణ చాలు. ఒక్క చోట కాశ్మీరు సమ్యను స్పృశిస్తూ ఇలా అంటాడు.

కలలూ కళలూ పూచిన
కాశ్మీరదేశమా
"నీ పూలగుండెల లోయల్లో
జాలువారే మాస్నేహ పరిమళం
విశ్వమానవ జీవన వీధుల్లో
విశాల భావ వీచులైనవి"

ఈకవితా ఖండికలోని "పూల గుండెల లోయలు" అన్న రూపకం ద్వారా పూలలోయల్ని గుండె లోతుల్నీ కూడా స్పృశించాడు కవి. కాశ్మీరులోయలోని అందమైన భౌగ ళిక పరిసరాలను మన కళ్ళముందు కదిలించడమే కాకుండా అనాదిగా కాశ్మీరంతో మనకుండే అతి సున్నితమైన సంబంధాన్ని "పూల గుండెలు" పదం ద్వారా సూచిస్తూ ఇటు కవితావిలువల్ని నిలుపుతూనే అటు రాజకీయ స్నేహాన్ని కాపాడుతున్నాడు. కశ్మీరసమస్య ఎంత సున్నితమైనదో సూచిస్తున్నాడు.

ఈ కవికి శబ్దంపైన ఎంత అధికారముందో అర్థవ్యక్తీకరణంలో అంత సామర్థ్యముంది. శీర్షిక మొదలుగా చివర చరణం వరకు శ్లేషో, అంత్య ప్రాసో అలంకారమో, ఉక్తివైచిత్రో ఏదో ఒకటి ఖండికలో చోటు చేసుకుంటుంది. "ఎన్నికలలో-ఎన్ని-కలలో",, "రవి-పై రవి" వంటివి సభంగ శ్లేష చమత్కారాలు. చిత్తం విత్తం, కష్టం స్పష్టం, ఇష్టం వంటివి అలవోకగా కుదురుకున్న సార్థకమైన అంత్యప్రాసలు. ఇకపోతే వ్యంగ్యోక్తులుగా విరబూసిన ప్రౌఢోక్తు లెన్నో.

ఒక ఉత్తమకవికి ప్రాంతీయ పరిమితి లేదు. ప్రాంతీయ, జాతీయ అంతర్జాతీయ ఎల్లలు చెరిపేస్తూ ఆయన కలం ముందుకు దూసుకొనిపోతూ ఉంటుంది. బాపురెడ్డికలం అలాంటిది.

కరీంనగర్ జిల్లాలో ఒక సామాన్య రైతు కుటుంబంలో పుట్టి అంచెలంచెలుగా ఒకవైపు పరిపాలనాధికారిగా మరోవైపు పరిపూర్ణకవిగా సవ్యసాచిత్వం చేస్తూ జాతీయంగా అంతర్జాతీయంగా ఎదుగుతున్న బాపురెడ్డిని కన్న తెలంగాణా గడ్డ

ఈనాడు గర్విస్తున్నది. బాపురే! బాపురెడ్డి అని ప్రశంసిస్తున్నది.

శ్రీ జె.బాపురెడ్డి గారితో నా కున్న చిరకాల పరిచయానికి చిహ్నంగా రాసిన ఈ చిన్న వ్యాసం ద్వారా హార్దికాభినందనల్ని అందజేస్తున్నాను. జ్ఞానపీఠందాక ఎదగాలని ఎదలో ఆకాంక్షిస్తున్నాను.

శ్రీ బాపురెడ్డిగారి కవితాభినందన అక్షరరూపాన్ని పొందించడంలో నాకు కూడా అవకాశాన్ని కల్పించిన యువకళావాహిని వారికి హార్దిక కృతజ్ఞతల్ని తెలుపుకుంటున్నాను.

**రావి భారతి**

తెలుగు శాఖ,

ఆర్.బి.వి.ఆర్. మహిళా కళాశాల

నారాయణగూడ, హైదరాబాదు.

# "నాదేశం నవ్వుతూంది నందనవనంలా"

- శ్రీమతి ఎ. పద్మ

నిరంతర కవితా కళాతపస్వి, కవిలోక యశస్వి.మధురవచస్వి, మధుమయ మనస్వి డా॥ జె. బాపురెడ్డిగారిని గురించి కాని, వీరు సృష్టించిన కళాఖండాలను గురించికాని వ్రాయడమంటే ధీర గంభీరమైనటు వంటి సముద్రం యొక్క లోతుని కొలిచే సాహసం చేయడమే అవుతుంది. అయినా ప్రయత్నించడంలో తప్పులేదుకదా!

సుకవి, పరిపాలనా దక్షుడు మన బాపురె
కుల, మత,వర్గ బేదాలు లేవు వీరికి
పద్యం అల్లినా
గద్యం వ్రాసినా
గేయం నడిపినా
రమ్యత వీరి సొత్తు
నవత వీరి సొమ్ము
సాహిత్యరీతి ఏదైనా పదాల నృత్య భంగిమ మిన్న
కవితా సౌగంధ్యం వర్ణనాతీతం
మన్నన అంటే మక్కువ ఎక్కువ
మాటలలో మాధుర్యం
చేతలలో నైపుణ్యం
చెప్పదలచుకున్న విషయాన్ని స్పష్టంగా చెప్పగలిగే సహజకవి
ఎంతమంది కవులున్నా తనకంటూ
ఓ ప్రత్యేకస్థానాన్ని ఏర్పరచుకున్న ప్రతిభామూర్తి
రాయిని రత్నంగా మలచగలిగే కావ్యశిల్పి
వాదాలు, వివాదాలు ఎరుగని సామ్యవాది
సాహిత్యపు లోతులు తెలుసుకోవాలన్న జిజ్ఞాసి
మన ఖ్యాతిని నలుదిక్కుల విస్తరింపజేయాలన్న
మహోన్నత ఉద్దేశ్యమున్న మహామనీషి
'పేరులో ఏముంది పెన్నిధానం' అని తలంచక;
పెద్దలు పెట్టిన పేరుకు పేరు తెచ్చిన మాన్యులు
జాతిపిత మన బాపూజి
జాతి హితైషి మన బాపురె
బాపురె నిండు గుండె వణకదు
ఆయనకు స్ఫూర్తి కవితా వస్తువు
ఆయన మనస్సు మమతల మల్లెపూదండ
ఆయన రచనలో వెరయిటీ
ఆయన మాటలో స్పెషాలిటీ
ఆదర్శం, ఆత్మీయత
స్నేహభావం, సౌమ్యస్వభావం
సహృదయం, సాంకేతిక పరిజ్ఞానం
నిశిత దృష్టి
మంచిగళం, మెత్తని దరహాసం
ఆయనకు పెట్టని ఆభరణాలు

క్షణం విశ్రాంతిలేకుండా సాహిత్యపు పంటలు పండించి 'బ్యాంక్ బ్యాలెన్స్' పెంచుకోవడం కంటె, వినూత్నప్రయోగాలు చేసి రిజర్వుబ్యాంక్‌లాంటి పాఠకుల అభిమానాన్ని సదా కాపాడుకోవడం ఒక కవిగా తన విధియని భావించే లక్ష్యసాధకుడు మన బాపురె. వీరిని ఒక మహాకవి అనడంకన్నా ఋషి అంటే సమంజసంగా ఉంటుందేమో!

కవితా ప్రపంచం వీరికో అద్భుతం. చిన్ననాటి నుండే కవిత్వం ఊపిరయింది. వీరి సులోచనాల వెనుక అన్నీ ఆలోచనలే. ఆయన కవిత్వాన్ని చదివిన ఎలాంటి విమర్శకుడైనా విశేషణాలకోసం ఆలోచించవలసిందే. వారు ఏ రచన చేసినా దాన్ని

నూటికి నూరుపాళ్ళూ పండించగల సమర్థులు. అసలు వారితో మాట్లాడటమే 'ఎడ్యుకేషన్' అనిపిస్తుంది. ఆయన రచనలు ఆకర్షించవు, ఆలోచింపజేస్తాయి.

బాపురెడ్డిగారు మనస్సుతో కవిత్వం వ్రాస్తారు. ఆయన కవిత్వం చదువుచున్నంతసేపేకాక చదివిన తరువాత కూడ ఒక మధురానుభూతి మనకు మిగులుతుంది. వారు వ్రాసిన కొన్ని కవితలు వింటుంటే విరబూసిన విరజాజిపూలు గట్టువెంట గాలి పీల్చుకుంటూ షికారు చేస్తున్నట్లుంటుంది.

కవిగా వీరి ఆశయం 'కొత్తసత్యాలను దర్శించి' వాంఛనీయమైన సామాజిక విలువలకు అనుగుణంగా వాటిని అన్వయించి మనిషిని అభ్యుదయోన్ముఖుడ్ని ఆనందోన్ముఖుడ్ని చేయడం. భావసత్యాలను భౌతికసత్యాలుగా మార్చగలిగే విశ్వాసాన్ని కలిగించడం.

'భావుకత లేని కవిత నేను వ్రాయలేను' అంటారు బాపురెడ్డిగారు. అందుకే ఒకమహాకవి "అనుభూతి, అభివ్యక్తి, సౌందర్యం, సందేశం అనువుగా రూపొందిన నవ్యార్తి బాపురెడ్డి కవితామూర్తి. చెప్పదలచుకున్నదాంట్లో నిర్దిష్టత, చెప్పే విధానంలో నిర్దుష్టత బాపురెడ్డి సాధించిన విశిష్ట గుణద్వయం - పద్యంలో పలికినా, గేయంలో పాడినా భావుకత అతని జీవలక్షణం-" అన్నారు.

బాపురెడ్డిగారు చేస్తుండేది ఊపిరినలపని అత్యున్నత ప్రభుత్వోద్యోగమైనా, విశ్రాంతి లభించిన ప్రతిక్షణం కవితా వ్యవసాయంలో నిమగ్నం కావడమనేది వారి ప్రవృత్తి. వృత్తికి ప్రవృత్తికి ఎంతోదూరం ఉన్నా అన్నింటిని సమన్వయ పరచుకోవడంలో వారి అనితరమైన కౌశల్యం ప్రస్ఫుటమౌతూవుంటుంది. ఎంతటి నీరస హృదయులనైనా వారు తమ కవితా కమనీయ వాగ్జాలంతో చలనం గలిగిస్తూ, ఉత్తేజపరుస్తూ, ఉత్తేజితులవుతూవుంటారు.

ఆయన దాదాపు 35దేశాల్లో వివిధ కార్యక్రమాలపై పర్యటించి మన ఆంధ్రసంస్కృతిని, జాతివైభవాన్ని తన అమృత వాక్కులతో, కవితాగానంతో అక్కడి ప్రజలకు తెలియజేసి, వారిని ఆనందడోలికలలో పయనింపజేశారు.

దీక్ష, పట్టుదల, ధైర్యం, ఆత్మవిశ్వాసం కలబోసుకున్న బాపురె ఇంకా ఎదో సాధించాలని, కొత్త ప్రక్రియల్ని సృష్టించాలని తపిస్తూవుంటారు. కవిగా వీరు 'సంపాదించింది' రసజ్ఞుల విజ్ఞుల ఆదరాభిమానాలే. నిజమైన కవి కోరుకునేది కూడ ఇదే. ఎన్నిరచనలను తన హావభావాలతో నడిపించాడీమహాకవి. తను ఇష్టపడే ఈ కళలో 'జీవించడం' వీరికిష్టం. వీరి ప్రతిభే వారికి తరగని కలిమి.

*వాల్మీకి వ్రాసినది రామాయణం*
*బాపురె వ్రాసినది మనుజాయణం*
*"ఒక బాపు నిర్మించింది నవభారతం*
*ఒక బాపు చిత్రించింది కళా నీరాజనం*
*ఒక బాపు సృష్టించింది కవితానికేతనం"*

అంటూ ఒక ప్రసిద్ధ విమర్శకులు భావించినట్టు శ్రీ బాపురెడ్డిగారు సృష్టించిన మరొక కవితానికేతనం 'నాదేశం నవ్వుతూంది'. అనునిత్యం వాగ్దేవీవరివస్యలో మునిగి తేలుతూ వుండే డా॥బాపురెడ్డిగారి వినూత్న మధు మనోజ్ఞ కావ్యం 'నాదేశం నవ్వుతూంది'. ప్రతిక్షణం దేశంలో వస్తున్న ప్రగతి నిష్కల్మష నిర్మమత్వ సంయమన దృష్టితో దర్శించే డా॥ బాపురెడ్డి గారి వంటివారికే సాక్షాత్కరిస్తుంది. అందుకే క్రాంత దర్శిత్వంతో వారు కవి పుంగవులయ్యారు.

ఈ గేయసంపుటి ఆర్థిక సామాజిక ప్రగతి ప్రబోధాత్మక కవితాత్మ. ఇది "రెడ్డిగారి అభ్యుదయ భావ జ్వాలాహేల-సమదర్శనం నినదించిన సాహిత్య సామ్యవేదం".

దాస్యశృంఖలాలను త్రెంచుకొని స్వేచ్ఛాగాలులను పీల్చుకుంటూ అంధకారానికి వీడ్కోలు చెప్పి వెలుగుకు స్వాగతం పల్కి దేశాన్ని అన్ని విధాల ప్రగతివైపు మళ్లించుకుంటూ వెళుతూ దేశ విదేశాలలో కీర్తి బావుటాలను ఎగురవేస్తూ హిమాలయ పర్వతాలకంటె ఉన్నతమైన ఉన్నతిని సాధించిన మనదేశం నవ్వుతూంది. ఎలా?

"మార్పు రథం తోలుకుంటు
మధుగీతం పాడుకుంటు
కారుచీకటులను దున్ని
కాంతిని పండించుకుంటు
నాదేశం నవ్వుతూంది
నందనవనంలా ............. "
ఎందుకు?
"హిమగిరి శిఖరాల ఎత్తు
హిందూసాగరపు లోతు
అందరి ఆశయాలకు
ఆదర్శం అవుతుంటే"

భారతీయుల గతవైభవాన్ని, పౌరుషాన్ని, ఉనికిని, ప్రకృతి సంపదను వివరిస్తూ భారతదేశాన్ని గూర్చి రెడ్డిగారు వ్రాసిన భావనలివి.

" యుగయుగాల చరిత్రసారం
ఒలుకబోసెడి గంగానీరం
హితములెన్నో మతములెన్నో
శ్రుతులుపాడే కృష్ణతీరం - "
"ఐకమత్యం ఆయుధంగా
అసురులను దుష్టులను త్రుంచి
రామలక్ష్మణ పాండవేయులు
ప్రేమ నేలిన ధర్మభూమి-"

మానవ మనుగడకు ప్రగతి కావాలని. అన్నీ ఉండి ప్రగతి లేకపోతే జీవితమే అంధకారమయం. కోకిలల పాటలకన్నా, తారల ఆటలకన్నా తరులమీది విరులకన్నా, సైకతాల విహారాలకన్నా ప్రగతిపాట మిన్న.

"పాడదా ఒక ప్రగతిపాట
బ్రతుకు తోటలు పల్లవించ
పచ్చదనముల వెచ్చదనముల
పల్లెకోకిల పరవశించ-"

"ప్రగతినోట మనిషిగెలుపు
పాట వినాలి
బడుగు బ్రతుకులందు, సిరుల
బాట కనాలి-"

మనము జరుపుకునే పండుగలను గురించి కవిత్వము వ్రాయనప్పుడు కూడా దేశప్రగతిని మరువక, పాఠకులకు మరపురాని, మరువలేని మధుర సందేశమిచ్చి, ఔన్నత్య శిఖరాలనధిరోహించి, పాఠకుల హృదయాలలో చిరస్థాయిగా నిలచిన ఆదర్శమూర్తి డా॥ బాపురెడ్డిగారు.

"నింగిముంగిట గంగిరెద్దై
ఆడినవి రాకెట్టులు
................
కడలి ఒడలిన తైలధారల
కడిగి దీపం ఎవరు పెట్టిరి
పంటకుప్పలు ఫ్యాక్టరీలు
గొబ్బిళులుగా ఎవరు పెట్టిరి"

జాతి జీవనానికి పునాది రాళ్ళుగా నిలచి,

బ్రతుకులకు బాటలు నిర్మించి, నిత్యము చమటోర్చి శ్రమించే శ్రామికుల, కార్మికుల, కర్షకుల జీవనం డా॥ బాపురెడ్డిగారి కవితలలో జీవించినది.

"శ్రమజీవుల కొలచి చూడు
చైతన్యం చిందునురా
పేదల ఎద వట్టి చూడు
పెన్నిదులే నిండునురా-"

జనాభా పెరిగి ఉత్పత్తి తరిగిన కలుగును సంక్షోభం. జనాభా తరిగి ఉత్పత్తి పెరిగిన కలుగును సంతోషం. అందుకే అందరూ ఆనందంగా ఆచించాలి పరిమితకుటుంబ పద్ధతులను. కుటుంబ నియంత్రణ ఆవశ్యకతను గూర్చి తెల్పే కవితలు ఈసంపుటిలో వున్నాయి.

"తల్లి ధరణి కనులవెల్గు
తనయులు రవిచంద్రులట"

"చక్కనైన శకుంతలకు
ఒక్కడే కుమారుడు"

"కరిగతిలో ఆదాయము
పెరుగుతునే ఉన్నది
హయగతిలో జనాభా
అందకుండ పోతున్నది .......... "

తెలుగుభాష అన్ని భాషలకు ఆత్మబంధువు. అన్ని సంస్కృతులకన్న మన సంస్కృతి మిన్న. అందుకే డా॥రెడ్డిగారికి మాతృభాష అన్న మాతృభూమి అన్న మక్కు ఎక్కువ.

"వెలుగంటే వెలుగురా
వెలుగంటే వెలుగురా
వెలుగు వెలుగు దూర దూర
దీరాలను వెలిగెనురా!"

నేటి మానవుడు వింతపశువు కాకూడదని విద్యనభ్యసిస్తున్నాడు. అక్షరాలలో ఎంతో అమృతం, వెలుగు, శక్తి ఉన్నవి. ప్రతి ఒక్కరూ అక్షరాస్యులు కావలననే ఉద్దేశ్యంతో ప్రభుత్వం వయోజన విద్యా కార్యక్రమాన్ని కొనసాగిస్తున్నది. ఇది మన ప్రగతిలో ఒక భాగమే.

"ఓనమాలు దిద్దుతుంటె
ఒళ్ళు పులకరిస్తోంది
బాలశిక్ష పట్టుకుంటే
బ్రతుకు పరిమళిస్తోంది.
రాత నేర్చుకుంటే
తలరాత మారిపోవురా!"

భారతీయులందరిదీ ఒకే కులం అని అందరూ అనుకోవాలి. కుల, మత వర్గ వర్ణ బేదాలతో ప్రజలు కలహించుకుంటే జాతిగతి ఏమగును? విభేదాలు మాని అందరూ ఒకే బాటపై మాటపై నిలువగలిగితే మనజాతి బాగుపడును. హరిజనోద్ధరణ జరగాలన్నదే రెడ్డిగారి ఆకాంక్ష.

"మనకు మనం పులుముకున్న
మలినం రా కులం
మనకు మనం చేసుకున్న
మోసంరా కులం-"

"మన జాతి చేవను చంపిందిరా కులం
మన చరితను మలినం చేసిందిరా కులం
మన సమాజ దురాచార కారణం కులం
తరతరాల దరిద్రాల కారణం కులం -"

బుద్ధిబలం పెంచుటకు, అమృతమయమైన ఆలోచనలను కలిగించుటకు, భాషలన్నింటికి ప్రాణంపోసేవి., మన హృదయాలను కరగించేవి గ్రంధాలే. అందుకే ఉండాలంటారు రెడ్డిగారు

గ్రంథాలయములు

"గ్రంథాలయమంటె
భావ గంధాలయం
అక్షరాల వెలిగే
ఆనందాలయం-"

స్త్రీలపట్ల ఆయనకున్న గౌరవానికి నిదర్శనం ఈ పంక్తులు -

"ఒక సతిజోలికి పోయి
ఓడారు త్రిమూర్తులే
రావణుడని ఏమయ్యె
రమణిని అవమానించి ?"

ప్రతి భారతీయుడు చదువు, సంస్కారం, కలిగి వుండి యోగ్యుడనిపించుకొనవలెను. చెడ్డపేరు రాకుండుటకు మధుపానం, పొగత్రాగుట, గుర్రపు పందెములలో పాల్గొనుట మొదలుగాగల అలవాట్లకు దూరంగా వుండాలని హెచ్చరించినారు.భావిభారత నిర్మాతలయిన నేటి విద్యార్థులే భారతదేశాన్ని ప్రగతి పథంలో నడపాలి. కాని, వీరు అప్పుడప్పుడు ఏవో రాజకీయ కుతంత్రాలలో చిక్కుకొని ప్రాజెక్టులు, ఫ్యాక్టరీలను నిర్మూలిస్తున్నారు.

"మంటలార్పగల వారే
ఇంటిని తగలేస్తారు?

మనదేశ స్వాతంత్ర్యం కొఱకు తమ జీవితాలను త్యాగం చేసిన జాతిపిత బాపూజీని, చాచా నెహ్రూని, మనప్రజలను అన్నివిధాల ముందుకు నడపి దేశ ఔన్నత్యాన్ని విదేశీయులు కూడ గుర్తించ గలిగేటట్లు కృషిసల్పిన భారతరత్న ఇందిరాగాంధీని, యువశక్తికి తిరుగులేదని చాటిచెప్పిన సంజయ్‌గాంధిని, మొదలు -గాగల అమరవీరుల జీవితగాధలను గేయరూపంలో డా॥రెడ్డిగారు మనకందించినారు.

"ఏ తోటను పూచిన నీ
ఎదయే మా గమ్యము
ఏ పాటలు పాడిన నీ
ఎలుగే కడు రమ్యము-"

ప్రకృతిని పలకరించి పులకరించడం కూడ వీరికి తెలుసు

"ఆశలు కుసుమాలై
ఆవులొస్తున్నవి
చెట్టు చెట్టుపై
నాకనుల గట్టుపై
ఈ వసంతాగమ వేళ -"

ప్రకృతి సంపద లేనిదే దేశానికి లేదు సంపద. ప్రకృతి లోపించిన మన బ్రతుకులు వక్రతములు. చెట్లులేనిదే మనకు మనుగడ లేదు. ఇవే మనకు తోడూ, నీడా మరియు ప్రాణం.

"చెట్టు పచ్చగా శిరమెత్తినచో
ఎండల గుండెలు అదరునురా"
అందుకే
"చెట్టు పెట్టుటే పుణ్యంరా
చెట్టుకొట్టుటే పాపంరా!"

భారతీయులు పల్లెలో ఉన్నా, పట్టణాలలో ఉన్నా ప్రకృతిని వశపరచుకుని ప్రగతిని సాధించారు చాలవరకు. కాని పేదరికం అక్కడక్కడ ఇల్లుకట్టుకుని ఉన్నది. ఎన్ని ప్రణాళికలు సాగినా కొందరి స్వార్థం, మోసం, ద్రోహం, దోపిడీల మూలంగా ప్రగతి ప్రతి ఒక్కరికి అందుబాటులోనికి రాలేదు. శ్రమజీవుల బ్రతుకుల్లో ఇంకా చిచ్చురేగుతూనే ఉన్నది. ఈ పేదరికాన్ని పారద్రోలుటకు ప్రతి ఒక్కరు పొదుపు చేయాలి. ఆదాయం తెలుసుకొని ఖర్చుచేయాలి. పొదుపే రేపటి సుఖం, కష్టాలు, నష్టాలు రాకుండుటకు చేయాలి పొదుపు.

"కూలివాడు పొదుపు చేసి కుబేరుడై పోవచ్చు
కోటీశుడు పొదుపు లేక కూలివాడు కావచ్చు"

నేటి బాలలే రేపటిపౌరులు కన్నతల్లిదండ్రులకు కదలాడే బొమ్మల లాంటివారు వీరు. ఆటపాటల్లో ఆదమరచుజీవులు. కలలుగనే పూవులు. చదువుకొనే దీపాలు. కులమతాల గొడవలేని గుణధనులు. ప్రేమరసం కురిపించేవారు. దోపిడీలు, దుండగాలు, పాపాలు చేయుటలో అనుభవంలేనివారు. ఆనందంపంచి అనురాగం పెంచేవారు. ఇటువంటి నిష్కల్మషమైన హృదయమున్న బాలాలికలే భవిష్యత్తులో భారతదేశాన్ని ప్రగతిలో నడిపి కీర్తి బావుటాను ఎగురవేసి అన్యదేశీయుల కంటె మిన్న అని అనిపించుకోగలరు. కన్యాకుమారి నుండి కాశ్మీరు వరకు విస్తరించి జీవనదులలో సస్యశ్యామలంగా వర్ధిల్లి అందరికీ ఆనందాన్ని అందించేది మన భారతదేశం. అందుకే డా॥జె.బాపురెడ్డిగారు

"మనిషిని దేవుని ఒకటిగ మలిచే
భూతల స్వర్గం నాదేశం –" అన్నారు

ప్రతి మనిషి ఇతరులనుండి ప్రతిఫలం ఆశించటం కన్న తాను ఇచ్చి ఆనందించుట మిన్న. త్యాగశీలతయే మానవనైజంగా ఉండాలి. మబ్బు ఆత్మార్పణ చేసి, చెట్టు ఫలపుష్పాలనందించి ఆనందించును. సూర్యచంద్రులు వెలుగును ప్రసాదించి, భూగోళం మనిషికొఱకు తిరిగి తన్మయత్వం చెందుట లేదా!

"ఇచ్చుకొనుటలోని కలిమి
పుచ్చుకొనుటలో లేదు
పుచ్చుకొన్నదైన తిరిది
ఇచ్చుకొనుటయే చెలిమి!"

'అంత్యప్రాసలకోసం' అనే గేయంలో ఈ విధంగా అన్నారు –

"భాషపోతే పోయెగాని
భావంపోయిన కవిత
జవం పోతె పోయెగాని
జీవంపోయిన కవిత
కాదని, రసధునీ కవిత వ్రాస్తున్నాను –"

ఈ సంపుటిలోని ప్రతిగేయం ఓ ఆణిముత్యం, ఓ వైతాళిక ప్రబోధం, ఓ ప్రగతి నినాదం. ఏవిధంగా ఆలోచించినా, ఎన్ని విధాల పరిశీలించినా చదువరుల మనస్సుల నాకర్షించిన గేయ సంపుటి ఇది. అందుకే ఆకర్షించింది నన్నిలా.

**ఎ. పద్మ**
**గుంటూరు.**

# రంగుల పల్లకీ

**డా॥ ముక్తేవి భారతి**

'ప్రణవప్రణయం' ఒక ప్రయోగాత్మక రసానంద కావ్యమనీ, తన సాహిత్య తపస్సులో ఆత్మజ్ఞానోద్దీప్తమైన కావ్యమనీ, ఈ కావ్యం గురించి పరిచయ వాక్యాలలో కవి బాపురెడ్డిగారు చెప్పిన మాటలివి. ఉత్తర అమెరికాలో జరిగిన ఏడవ తెలుగు మహాసభలకు ప్రణవప్రణయాన్ని కానుకగా తీసికెళ్లి అందించారు అక్కడి తెలుగు వారికి బాపురెడ్డిగారు.

ఈ కావ్యరచన ఒక కొత్త ప్రయోగమే. కావ్యంచూడగానే ప్రణయం అనేమాట కనిపించగానే, గొప్ప శృంగారకావ్యం అనే భావంతో పేజీలు తిరగవేస్తాము. అయితే, అది లౌకిక శృంగార కావ్యమేకాదు అనుకుంటూ ఇంకా పేజీలు తిరగేస్తుంటే, అందులోంచి ప్రేయసీప్రియులు, సతీపతులు, ప్రకృతి పురుషులు తొంగి చూస్తారు మనకేసి. ఈ కావ్యంలో ఏముందో చూద్దామనే ఉత్కంఠతో మనల్ని చివరి వరకు చదవిస్తుంది. ఈ 'ప్రణవ ప్రణయం'

ఈ కావ్యంలో నలభైఅయిదు ఖండిక లున్నాయి. అప్రమేయులు., ప్రణయపారిజాతం, ప్రాణశక్తి, వల్లవిలేని పాట, అంతరంగశోభ, ప్రణయగీత - ఇలా చిన్న చిన్న ఖండాలున్నా యిందులో. బాపురెడ్డి గారు ఈ కావ్యంలో ఆదిలో అప్రమేయు -లను చూపి, అంతంలో ప్రణవప్రణయాన్ని చూపించి, కావ్యానికి భరత వాక్యం చెప్పారనిపిస్తుంది. ఆద్యంతాలలో ప్రణవప్రణయ సాక్షాత్కారం చేయించారు కవి.

అప్రమేయులుగా మొదలైన ప్రేయసీప్రియుల రసానందం రసస్థితిని చేరింది.

"మనది ప్రణవ ప్రణయం
ప్రణయ ప్రణవం
జీవిత రథసారథ్యం
సప్తస్వరసంగీతం

భావ భౌతిక జీవితం - "భావభౌతిక జీవన మార్గ సమనవ్వయ స్థితి చూపిస్తూ, కామంలేని ప్రేమ వాసనలేని పుష్పమని, ఇహం లేనిపరం చీకటిలేని వెలుగు, శరీరంలేని ఆత్మ గూడులేని పక్షి అని ఇహపరసాధకమైన శరీరధర్మాన్ని గూర్చి వివరించారు ఇందులో.

ఈకావ్యంలో నాయికానాయకులు ప్రేయసీప్రియులు, సతీపతులు, స్నేహితులు, సన్నిహితులు ఎవరైనా కావచ్చు. ఈ 'ప్రణవ ప్రణయం' అనందోబ్రహ్మ అనే బ్రహ్మానంద సహోదరమైన రసస్వరూపానికి, అద్వైత తత్వానికి ప్రతీక. "ఆనందోబ్రహ్మయటంచు ప్రాజదువు" అంతర్బుద్ధి ఊహించుటయే దీని లక్ష్యం. కావ్య రూపంలో భౌతికమైన ప్రకృతి, పురుషుల ప్రణయం, భావనలో ఇంద్రియాతీతమైన, రసావిర్భావమైన, లోకాతీతమైన ప్రణయం. ఇది ప్రణవంలోంచి ఉద్భవించిన ప్రణయం.

ప్రణవం అనే మాటకి ఓంకారం, పరమాత్మ అనే అర్థాలున్నాయి. ఓంకారానికి పరమాత్మ స్వరూపానికి అభేదమే ప్రణయం అనే మాటకి చాలా అర్థాలున్నాయి-ప్రేమ, వలపు, చెలిమి, మైత్రి, విశ్వాసము, ప్రార్థన, యాచన, మోక్షము - ఈ అర్థాలన్నీ ఏదో ఖండికలో ఏదో రూపంలో కావ్యంలో వున్నాయనిపిస్తుంది.

ఈకావ్యం చదువుతుంటే,
వాగర్థావివసంపృక్తౌ
వాగర్థ ప్రతిపత్తయే - అనే శ్లోకం చెవిలో మారుమ్రోగి, అర్ధనారీశ్వర ప్రణవ ప్రణయం భావంలో మెదులుతుంది.

కాల్పనిక కవితాలక్షణం ఈకార్యం అంతటా భాసిస్తోంది. కాల్పనిక కవులు అనుభూతి వాదానికి చాలాప్రాధాన్యం యిచ్చారు. అనుభూతి వలన కలిగే కవితావేశం కవిత్వనజీవత్వానికి మూలంగా విశ్వసిస్తారు. ప్రేమ తత్వంలో ప్రేయసి అంగాంగసౌందర్యం కాదు గోచరించేది, శరీరసౌందర్యారాధన కాదు. ప్రేయసిలోని ప్రేమ స్వరూపమే వారికి మనోనేత్రం ముందు సాక్షాత్కరించేది. స్త్రీని స్త్రీలాగ చూడరు. ఆమె ప్రేయసి, నెచ్చెలి, గురువు, దైవం, ప్రాణం, ప్రణయం - సమస్త చరాచర సృష్టిలోనూ ఆమె ఉంది. ఇలాంటి ప్రణయ తత్వాన్నే సౌందర్యారాధనలో సమ్మిశ్రమము చేసి, రంగరించి రూపొందించిన 'రసవర్ఝురిగా' 'ప్రణవ ప్రణయం' అనే కావ్యాన్ని అవతరింపచేశారు బాపురెడ్డిగారు.

ప్రేమ విశ్వవ్యాప్తమైనదని, ప్రేమ అనంత మైనదని, ప్రేమ పవిత్రమైనదని, విశ్వాన్నే తనలో దాచుకోగల ప్రేమతత్వాన్ని ప్రబోధించారీ కావ్యంలో బాపురెడ్డిగారు. సృష్టిస్థితిలయ కారణమైన శక్తిస్వరూపిణి స్త్రీమూర్తిలో ప్రేయసిని భావించ గలగటమే కావ్యం యొక్క అంతరంగం.

'అ ప్రమేయులు' అనే ఖండిక ఈ కావ్యంలో మొదటిది. అప్రమేయం అంటే ఇంత అని మితి ఏర్పరచటం సాధ్యంకానిది, అని అర్థం. బాపురెడ్డిగారి 'అప్రమేయులు' ఎవరు అని ఆలోచిస్తే. ప్రేయసీ ప్రియులో, ప్రకృతి పురుషులో కవాలి.

"ఆమె మనస్సేమో నింగి
నామనస్సేమో నేల" - ఆమె, అతడు అనే అర్థంలో సాగి,
"ఒకరు లేక ఒకరు లేని
ఒకే ఉభయులం మేము
ఎవరం ఎవరమో చెప్పలేని
అప్రమేయులం మేము"

- అంటూ అద్వైతాన్ని బోధిస్తూ, ఆనందంకోసం వెదుకుతున్న అజ్ఞాన నదిని నేను, తానో ఆనందమైన ప్రజ్ఞానపయోనిధి ఆమె అంటారు అక్కడ తాత్వికమూర్తిలా కనిపిస్తారు కవి మనకి.

మరో ఖండిక 'ప్రణయపారిజాతం'. ప్రణయాన్ని పారిజాతంతో అభేదించటంలోనే వుంది విశేషం. పారిజాతం దేవవృక్షం. వాడదు, పరిమళము చెడదు నశించదు. ప్రణయమూ అంతే. అలాగేప్రణయగీతంలో" రసజగద్రహస్యాల ముడి విప్పారు. ప్రణయ సామ్రాజ్యంలో పరవశించిన ఆమెని ప్రగాఢ ప్రేమాభివ్యక్తిగా చేసుకో, పరవ శించిన నాదేహంలో పంచప్రాణాలు చేదుకో అని ఆర్తిని కనబరుస్తుంది. 'రసతవస్సులో' దయార్ద్రైర్యవీక్షణాలతో రసానందం అనుగ్రహించమనీ, జరామరణభయంలేని పరారంభ సుఖంలో బంధించి రక్షించమనే ప్రార్థనవుంది. రసానందంలో నుంచి తనకు తెలియని రహస్యాన్ని అన్వేషిస్తూ, సృష్టిరహస్యానికై శోధిస్తున్నాడు ప్రేమికుడు.

*రసావతారమూర్తివైన నీవు*
*రసోహం అనుకునే నాకు*
ఇంకొక రహస్యంగానే వున్నావు" అంటూ భక్తుడు భగవంతునికై అన్వేషించేటట్లు విశ్వమంతా సంచరిస్తున్నాడు

'ఈకొండలు, కోనలు, మబ్బులు

ఈ మెరుపులు, ఉరుములు, జల్లులు
ఈ వంపులు ఈ సొంపులు, ముంపులు
మలయమారుతాలు, విలయాఘాతాలు
గురుత్వాకర్షణ, విభిన్న తత్వఘర్షణలు
నీడలుగా, జాడలుగా భావిస్తున్న
సృష్టిరహస్యాన్ని శోధిస్తున్న " -

ఈ రహస్యాన్ని శోధిస్తే, ఛేదిస్తే విశ్వమానవ ప్రేమ తత్వం వెల్లివిరుస్తుంది. ఈ చరాచరసృష్టికి మూలం అయిన నిర్గుణము , నిరాకారము అయిన చిన్మయానంద మూర్తిలోని ప్రేమతత్వం నివిడీకృతమైందనీ తాత్విక భావపరంపర అంతర్లయగా సాగింది "సృష్టిరహస్యం".

నిజమో, కలో అనే సందేహం కలవటం ఎంతటి తాత్వికుని కైనా చివరకు మిగిలే ప్రశ్న. ఎవరని నిర్ణయించేదిరా, శివుడవో, మాధవుడవో, కమలభవుడవో ఎలా చెప్పటం అని సృష్టి స్థితి లయకారత్వంలో మనకి అర్థంకాని, అయోమయంగా మిగిలిపోయిన ఎన్నో ప్రశ్నపరంపరలకు ఒకటే సమాధానం, అదే ప్రేమ, అలౌకికానందం, రసానందం..

ఆధ్యాత్మిక భౌతిక సత్యాలు నిత్యసత్యాలుగా భావించటం 'ప్రణవ ప్రణయంలో భాగమే. దీన్నే చివరిలో బాపురెడ్డిగారు, ఒక సమన్వయ రీతిలో అద్భుతంగా మలిచారు.

"అద్వైతులమై
అద్వితీయ ప్రేమావేశంతో
ఆనందకేళి సలుపుదాం
'నిత్యసత్యసాంగత్యంలో',
నిర్జీవులమైపోదాం'

మానవ శరీరం పట్టి మట్టిమయంకాదు. పుట్టుకతో పుట్టిన ఇంద్రియాలను తిరస్కరించలేము. అంతరింద్రియ బహిరింద్రియ సమన్వయంతో, దేహాత్మల సంయోగంలో పొందే పరమానంద రసస్వరూపమే ఆనందకేళి, అదే,

"మనది ప్రణవ ప్రణయం
ప్రణయప్రణవం " - అంటారు కవి.

కావ్యాన్ని పూర్తిచేస్తూ.

ఈ కావ్యంలో వస్తువు ఆధ్యాత్మిక భౌతిక తత్వ సమన్వయమయితే, కవితా పరంగా ఇందులోని పరజాలం అందే ప్రేమమయమే. ప్రణయామృతం., ప్రేమకలశం, ప్రణయాలయగోపురం, ప్రణయతత్వ తరంగాలు,-ఇలా పరప్రయోగాలు ఎన్నో వున్నా యిందులో. ఇందులోని అలంకారాలు ఇతివృత్తానికే అలంకారాలయ్యాయి. సంప్రదాయపరంగా, ప్రబంధరచనలో కనిపించే అలంకారాలు ఎన్నోవున్నాయి ప్రణవ ప్రణయంలో భావచకోరాలు, శంఖంలాంటి కంఠం, పూలడోలిక సైకత శయ్యలు, నక్షత్రమల్లికలు, తరంగతురంగాలు- ఇలాంటివి మరెన్నో.

"కర్మసాక్షి కరుణాకిరణాల
కళ్యాణ మంటపంలో
ధర్మపత్నీపతులమై దర్శిందాం జీవితాన్ని
మాయామర్మాలు లేని మానవత్వాన్ని
మధురానంద ప్రేమ తత్వాన్ని" -

బాపురెడ్డిగారి 'ప్రణవప్రణయం' భౌతిక తాత్విక భావలహరికి అక్షరరూపం. బాపురెడ్డిగారి 'ప్రణవప్రణయం' మధురానంద ప్రేమతత్వంతో రంగుల పల్లకీలో అనంతప్రయాణం సాగిస్తోంది !!

**ముక్తేవి భారతి**
తెలుగు శాఖ
ఆర్.బి.వి.ఆర్.మహిళా కళాశాల
నారాయణగూడ, హైదరాబాదు.

# బాపురెడ్డి వచనకావ్యాలు – వాడిపోని వసంతాలు

– డా॥ అనంతలక్ష్మి

"మునీశ్వరుడైన లోచూపురెడ్డి" నని చెప్పుకున్న బాపురెడ్డి గారి రచనలు, క్రాంతదర్శనం కవికి అవసరం అనే విషయాన్ని మరొక్కసారి నిరూపిస్తున్నాయి. రచయితే తన కవితా ప్రస్థాన త్రయాన్ని ప్రణవ,ప్రణయ, ప్రగతి నామాలతో సంకేతించారు. తన రచనలను ప్రక్రియాపరంగాను ఇతివృత్తపరంగాను కూడ తనే విశ్లేషించి, ఆ భావ స్రోతస్వినులను చక్కని సంకలన కాసారాలనుగా కూర్చిన సాహితీ మర్మజ్ఞుడు. సామాన్యంగా కవులలో కనపడే భావావేశానికి తోడైన ఈ విశ్లేషణ కవిసాహితీ వ్యక్తిత్వానికి మరింత వన్నె పెడుతుంది.

హృద్యమైన పద్యాలను, కమ్మని గేయాలను రసరమ్యంగా రూపొందించిన వీరి కలం వచన కవితను నిసర్గలయాత్మకంగా పలికించింది. వీరి వచన కవితాధార ప్రణవ, ప్రణయ ప్రగతి భావాలు మూడు కలిగిన త్రివేణీసంగమంగా ఉంటుంది. వీరు ఛందస్సుకి వ్యతిరేకులు కారు. అలాగని ఛందస్సుని పట్టుకొని ప్రాకులాడే ఛాందసులు కూడా కారు. భావానుగుణంగా రచన చేసేప్పుడు, అవసరమైతే ఛందస్సు ఉంటుంది. గీతిగుణం ఉంటుంది, లేదా లయ ఉంటుంది. అంటే భావం రూపాన్ని నిర్దేశిస్తుంది.

వచన కవితను తన భావాలకి వాహికగా ఎన్నుకోడానికిగల కారణాలను కవి "పల్లవిలేనిపాట"లో వివరిస్తారు.

"ఛందస్సువదలని
సంప్రదాయ పద్యములాంటి
సంగీతంలేక కదలని
శాస్త్రీయ గేయంలాంటి ప్రియుని కోసం
అన్వేషిస్తున్న నన్ను
వచన కవిత్వంలా వచ్చి
పట్టుకొన్నావు నీవు–"

'నియమంలేని పద్యపాదాలు, 'యతిప్రాసలు' 'గణవిభజన',

'గురు లఘువులు'- తెలియకపోవటం, – వచనకవిత యొక్క మరికొన్ని లక్షణాలుగా పేర్కొంటారు.

'భాష–భావం' అన్న కవితలో భాష భావాన్ని మింగెయ్య కూడదంటారు.

''గాడిదమీద మూటలు మోయించినట్లు
కవితతో మాటలు మోయించకు
బాలపల్లవ వాగ్దేవితో
బస్కీలు తీయించకు, కుస్తీలు పట్టించకు "(రసజ్ఞుని విజ్ఞప్తి)

అంటూ భావానికే ప్రాధాన్యం ఇచ్చారు.

భాష,భావం,ఛందం–వీటిని గురించి ఇంత చర్చించిన తర్వాతే నిసర్గ రమణీయమైన వచనకవితను వీరు ఎన్నుకోవటం జరిగింది.

వచన కవితా పితామహుడైన కుందుర్తి వచన కవిత్వానికి ముఖ్యలక్షణం 'కమిట్‌మెంట్' అనీ, సామాజిక ప్రయోజనంకోసమే ఉద్దేశింపబడినదిగా ఉండాలనీ, ఇతర రసాలుఈ ప్రయోజనానికి భంగం కలగనంతవరకే అని చెప్పాడు. అంతేకాదు. వచన

కవిత్వంలో అనుభూతి వాదాన్ని ఖండించాడు. వర్తమానకాల పరిస్థితులకు, సమకాలీన ప్రజల హృదయాలకూ, దగ్గరగా నడుస్తున్న శైలి అయిన వచన కవితను తన భావ ధారలకు మాధ్యమంగా చేసుకున్న బాపురెడ్డి రచనలలో కమిట్‌మెంట్ ఉంది, కానిసామాజిక స్పృహకి ప్రణయక భావానికి, ఆధ్యాత్మిక తత్త్వానికి భేదం పైపైనే కాని అంతస్తత్వంలోకాదు అని తాను నమ్మిన సత్యాన్ని తన రచనలలో నిరూపించటం చేత, అన్ని భావధారల వ్యక్తీకరణకి వచన కవిత్వం ఉపకరణమయ్యింది. మానవుని ఆర్థిక సామాజిక జీవితం, అధ్యాత్మిక జీవితం ఎలా పరస్పర సమన్వయ సూత్ర బద్ధంగా నిర్వచించి నిరూపించే సమతా సత్య ధర్మ వ్రత సాధనమే సాహిత్య ప్రయోజనం అని వీరి విశ్వాసం. ఈ విశ్వాసానికి ఆవిష్కరణమే "ప్రణవప్రణయం" ఒక వంక శృంగారం , మరొక వంక ఆధ్యాత్మికత సమపాళ్ళలో సంయోజన చెందిన రసమయాకృతి 'ప్రణవ ప్రణయం' "ఈ కావ్య సంపుటిపై అభిప్రాయం వ్రాయాలంటే ఏదో ఒక పీఠిక కాదు వ్రాయవలసింది. ఒక సమగ్ర సంపూర్ణమైన పరిశోధనాత్మక థీసిస్సు " అని పీఠికలో పేర్కొన్న కళాప్రపూర్ణ, పద్మశ్రీ బోయి భీమన్న గారి అభిప్రాయం అక్షర (నక్షర) సత్యం. "ఆపని ఎవరో చేసే దాకా వేచి ఉందాం. అని రచయిత తన గ్రంథాన్ని గురించి లేఖామాత్రంగా సూచన యిచ్చారు. ఆలోచనామృతమైన ఆ గ్రంథాన్ని మననం చేసినకొలదీ అనుభూతమయ్యే మాధుర్యాలు, దర్శనమిచ్చే తత్వరహస్యాలు, ప్రకృతి పురుష ప్రణయ మర్మాలు, జీవిత సత్యాలు- అనంతాలు, అనిర్వచనీయాలు.

సాధారణంగా భక్తకవుల రచనలలో కనిపించే మార్మికత వీరి వచన కవితలో కనిపిస్తుంది. "ప్రణవ ప్రణయం"(వచనకావ్యం) లో ప్రేయసీప్రియులు, లేదా భార్యాభర్తల సంవాదరూపంలో ఉన్న ఖండికలన్నీ మార్మికతతో నిండినవే. మామూలు దృష్టికి భౌతిక ప్రణయం లాగా కనిపించి ఆభావాలన్నీ తత్త్వ ప్రతిపాదకాలే.

*"నాప్రస్థాన త్రయపాండిత్యం*
*నీగభీర నతనాభి లోయలో*
*కూలిపోయింది."*

అన్నప్పుడు పాండితీ పటిమ ప్రేయసిని చూడగానే నశించిందని చెప్పినట్లున్నా, నిజానికి చెప్పదలచింది ఎంతటి పాండిత్యమైనా భగవద్దర్శనం అయ్యేటప్పటికి నిష్ప్రయోజనం- అని

*"అస్తినాస్తి సంగమించిన*
*నీ కటి రేఖా తటి మీద....."*

అంటూ సాగిన ఖండికలలోని తత్వ ప్రతిపాదన ఆలోచనల అంతుచూస్తుంది." సృష్టి రహస్యం" మొత్తం ప్రతీకలతో కూర్చిన ఖండిక' ఊపిరి ఊయల' లో ప్రతీకాత్మకంగా చెప్పింది.

*'కుండలిని' గూర్చి*
*"శంగారసాగరతరంగ*
*శేషతల్పం నుంచి లేచివచ్చిన*

పురుషోత్తము"ని ప్రణయాన్ని ప్రణవరూపంగ దర్శించిన తాత్విక శృంగార ప్రబంధం 'ప్రణవ ప్రణయం.

త్వమేవాహం, తత్వమసే, అహం బ్రహ్మాస్మి, ఆనందో బ్రహ్మ, రసోవైసః వంటి ఉపనిషత్ సూక్తులను యధాతథంగా ఉట్టంకించటమేకాక ఆ భావాలని సంకేతించిన ఖండికలు కూడా ఉన్నాయి. 'తదాత్మ్య" 'అడుక్కుతినే ఏరు, త్వమేవాహం అన్న

భావాన్ని ప్రతిపాదించేవే.

మార్మికత ఉన్నదే కాని, వీరి కవితల్లో భక్తిధోరణి అంతగా గోచరించదు. వీరిప్రగతిశీల. అభ్యుదయ దృష్టికి మనిషి కేంద్రం, అందకే 'మనిషి నుండే ప్రారంభిద్దాం' అంటారు, 'మనిషిని చదువుతున్నాను. అంటారు అంతేకాదు. దైవత్వాని కన్నా మానవత్వమే అధికమనే భావం అనేకచోట్ల కనిపిస్తుంది. 'దేవుడి బ్రతుకు గోవిందా' (ఆపద్బాంబాంధవుడులో)"దేవుడంటే అందుకే నాకుజాలి" (నిస్సహాయుడుదేవుడు)" అమాయక మానవుల అంతేవాసి మాయామయదైవం" (మానవసేవకూడు మాధవుడు) తన భావాలని సమర్థించుకుంటారు. అంతేకాదు. మనిషి భగవంతుని ఆధిక్యాన్ని అంగీకరించటానికి కూడ మనిషిలోని బలహీతలే కారణం అని *త్రి-ఆ-కారాలు"లో అంటారు.

"దేవుడు వేసిన ప్రశ్న మనిషి
మనిషి చెప్పిన జవాబు దేవుడు"

అంటూ తత్త్వాన్ని ఒక కొలిక్కి తెస్తారు.

'భావభౌతికవాదం అంటూ ఒక కొత్త వాదాన్ని ప్రతిపాదించి దాన్ని ఇలా నిర్వచించారు.

"భావాన్ని బట్టి భౌతికం
ఆలోచనని బట్టీ అనుభూతి" అని.

"భావభ్రమరభ్రమాభ్రాజితి భౌతిక లోకం" అంటూ శంకరులు చెప్పింది కూడ భావభౌతిక వారమే మాయా వాదం కాదంటారు.

ఈభావభౌతిక వాదం మూలంగా మంచి భావాలు పండించి, బ్రహ్మానందానుభూతి అందరూ పొందాలనే సద్భావన వీరి కవితా ప్రపంచమంతా నిండి ఉంది. ఇలాంటి సర్వజనానంద సత్యయోగం సాధించటం"మన చేతుల్లోనే ఉంది" అని వీరి ప్రగాఢ విశ్వాసం. ఆస్థిని సాధించటానికి అవలంబించవలసిన మార్గాలేవో సందర్భానుసారంగా ఎన్నోమార్లు నొక్కి వక్కాణిస్తారు. ఒకే భావ శకలం, ఆదర్శం, ఆశయం, ఎన్నోమార్లు దర్శనమిస్తుంది. దానికి ఆ భావం పై కవికి ఉన్న ప్రగాఢ విశ్వాసమే కారణం. అది ఎంతటి తీవ్రమంటే అసందర్భంగా అనిపించే తావుల్లో కూడ తొంగి చూసి పలకరిస్తూనే ఉంటుంది. అలాంటి వాటికి కొన్ని ఉదాహరణలు- 'శృంగారవచన కావ్యం' అని కవి తానే చెప్పిన 'పంచబాణసంచా' సంకలనంలో 'పంచబాణసంచా' పేరుతో ఉన్న ఖండకావ్యంలో శృంగార రస వర్ణనల మధ్య "పరిమిత సంతాన ప్రాప్తికోసం " అంటూ ఇతర ప్రగతి భావం చోటుచేసుకోవటం ప్రజోత్పత్తి పేరును ప్రజానియంత్రణగా మార్చాలనటం, శృంగార వర్ణనల మధ్యకూడా మాయా వాదం, మిధ్యాభావం (జోహూ-సోహో) దర్శనమియ్యటం మొదలైనవి ఎన్నో.

ఎంతో శృంగారాన్ని వీరు వర్ణించినా హద్దుమీరటాన్ని వీరు నిరసించారు. వద్దంటే ముద్దు పేరులోనే నిరసన వ్యక్తం అవుతుంది. 'తమస్సులో మనస్సు' ఖండికలో దేవదేశాలలో చూచిన కామాగ్నియజ్ఞాలను

"దర్శించిన నాకళ్లు
కడుక్కుంటున్నాను
వేదవేదాంత కాసారాలలో
దేశకాల సారావారాలలో"

అంటారు. సౌందర్య., సృజన లక్షణాలుకల 'కాముని శక్తి' యొక్క పవిత్రత తాను చూచిన దేశాలన్నిటా ఎలా ఉన్నదో వర్ణిస్తూ, అది ఆనంద దాయకమే కాదు. సృష్టికారకం కూడ అని దర్శించిన

దానికి చిహ్నమే 'గర్భకోశకేదారం' 'సృష్టిరహస్యం' 'సుషమోదర క్షేత్రం' ఆశలబీజాలు మొలకెత్తేకేదారం, 'సృజన శృంగార సంగరం వంటి ప్రయోగాలు.

కొత్త భావాలు, ప్రతీకలు, పదాల ప్రయోగాలు వారి రచనలలో దర్శనమిస్తూనే ఉంటాయి. 'తులాభారం' 'వస్త్రాపహరణం' అనే భావాలని వీరిచ్చిన క్రొత్త నిర్వచనాలు అపూర్వాలు శవాలు లేస్తున్నాయి విగత జీవుల స్వగతాలు వింటున్నాను. ప్రణవ విప్లవ వేణునాదాలు, అస్థివేణువులు, చుంబన శ్రీకారాలు, రాగధనుడు, నగరమ్మ వంటి క్రొత్త ప్రయోగాలు కవి ప్రతిభకు నిదర్శనలు. ఆపాదమస్తకం పుస్తకం' 'ఏకనామిక్సుసుందరి' ఇతివృత్తం ఏదినా శృంగారభావ ప్రకటనకి పనికివస్తాయని నిరూపించే కవితలు.

సమాజం ఆర్థికంగా అభివృద్ధి చెందితే, ఆధ్యాత్మికంగా కూడ పురోగమిస్తుందని, సరియైన తీరులో వినియోగిస్తే శృంగారం కూడ అందుకు తోడ్పడుతుందని ఇదంతా 'మనచేతుల్లోనే ఉంది' అని చెప్పే అవి రక్తపాతంతో, హింసతో కూడినవి కావు. ఆర్థిక సాంఘిక విప్లవాలు. నిర్మాణాత్మకమైనవి మాత్రమే.

కుటుంబ నియంత్రణ, కులనిర్మూలన తనకవితా శాసనాలంటూ ప్రగతి మార్గాలంటూ అనేక మార్లు నొక్కి వక్కాణించారు. ప్రజాశక్తి, దేశభక్తి, ఆశావాదం వీరి కవితకు పెట్టుకొమ్మలు. మానవ మేధపై, మానవతపై విశ్వాసం, పరిణామం, ప్రగతిశీలత, అభ్యుదయ భావాలు, విశ్వజనీనత ముఖ్యలక్షణాలు. వీరి విశ్వజనీన దృక్పథానికి ప్రపంచ ప్రదక్షిణాలు కూడ దోహదం చేసి ఉండవచ్చు.

"ప్రపంచంలో ప్రకృతి అన్నిచోట్లా ఒక్కటే (సాగరారాధను)

"అన్ని నదులలో స్పందించేవి
మన అనుభూతి వీచికలే
అన్ని వీచికలలో నినదించేవి
ఆవేదనానంద గీతికలే " (త్రయీజీవనం)

అంటూ దేశకాలాలు మారినా ప్రకృతి, మానవుని అనుభూతులూ మారవన్న సత్యాన్ని చెపుతారు. రోమ్‌నగరం, థేమ్స్‌నదీ, న్యూయార్క్, స్కాండినేవియా, రోమ్‌నగరం, జర్మనీ వీరి మానవతా దృక్పథానికి సాక్షులు.

చక్కని భావచిత్రాలు కవికి వర్ణ్య వస్తువుతో గల తాదాత్మ్యానికి తార్కాణాలు.

"రోదసీయాత్రికునికి ధరిత్రిలాగా
రోంనగర యాత్రికునికి చరిత్ర
కాలపు మైదానంలో జాలిగా పడిఉన్న
బంతిలా కనిపిస్తుంది"

ఇటువంటివెన్నో ఉదాహరణకి చూపించ వచ్చు.

ప్రపంచం చుట్టి వచ్చినా, భారతీయమైన భావాల మీత, సంస్కృతాంధ్రభాషలమీద వీరికున్న మక్కువ మిక్కుటమైనదే కాని తగ్గలేదు. చక్కని పదాల పోహళింపు వీరి రచనకు వన్నె పెట్టేలక్షణం. భ్రమాభ్రమర భ్రమణం, వంటి కొత్త సంస్కృత సమాసాలు తళుక్కు మంటూనే ఉంటాయి. "పంచబాణసంచా" 'ప్రణవ ప్రణయం వంటి కొత్త పదాలు, పదబంధాలు, సమాసాలు కొత్త భావనలకు సంకేతాలు మాత్రమే. అందుకే అవి గ్రంధనామాలు కూడా అయినాయి. ఎంతటి ఆధునిక భావాలని, విదేశాలవిశేషాలని వర్ణించినా తప్పనిసరి అయినప్పుడు తప్ప ఆంగ్లపదాలు కనిపించవు.

'చూపిస్తున్నావా' వంటి అచ్చ తెలుగు పదాలలో శ్లేషని పొందుపరచటం వీరికి భాషపైగల అధికారానికి చిహ్నం.

జీవితాన్ని మహాకావ్యంగా దర్శించిన కవితాతత్త్వ వేత్త బాపురెడ్డిగారు. (జీవితం మహాకావ్యం). ఆ జీవితత్త్వాన్ని వివరించే ప్రయత్నం 'జీవన గీతలో కనిపిస్తుంది. అందుకే ప్రతి చిన్న సంఘటనకు స్పందించటం, అనుభూతి చెంది దానిని అక్షర బద్ధం చెయ్యటం వీరి సహజగుణంగా కనిపిస్తుంది. అందుకే వీరి కలం మానవజీవితంలోనూ, సంఘ జీవితంలోనూ అతి మామూలు కోణాలని కూడ పరామర్శిస్తుంది. ఎన్నికలు, తుఫాను కుక్క వంటి సామాన్య విషయాలు కందుకూరి, అంబేద్కర్, వెంకట్రామరెడ్డి వంటి మాన్యులు కవితా వస్తువులవటమే కాక మలేరియాని ఆరు ఋతువుల సమ్మేళనంగా దర్శించటం, కత్తులతో పరీక్షలు రాసిన విద్యార్థు లిప్పుడు కలాలతో రాస్తున్నారనటం వీరి కలం చేసిన స్వైర విహారానికి మచ్చు తునకలు.

'వెలుగులోంచి పుట్టింది తెలుగు' అని ఇచ్చిన నిర్వచనం 'బాపురె' (డ్డి) ! తెలుగంటే ఎంత అభిమానమో! అనిపిస్తుంది. ఇలా చెప్పుకుంటూ పోతే పద్మశ్రీ బోయిభీమన్నగారన్నట్టు దీసిస్సు అవుతుంది.

కొన్ని రచనలు తాత్కాలిక ప్రయోజనాన్ని ఆశిస్తాయి. కొన్ని సార్వకాలిక లక్షణాలని కలిగి ఉంటాయి. సమస్య తాత్కాలికమైనా సాహితీవిలువలు సార్వజనీనంగా, సార్వకాలికంగా ఉండేట్టు రచించగల వాడు గొప్పకవి. అలా వాడని వసంతాలుగా పరిమళించే నాలుగు వచన కావ్య సంపుటాలని ఆంధ్రసాహిత్యారామానికి ఉపహారమిచ్చిన బాపురెడ్డిగారి సాహితీమూర్తి ఆంధ్రభారతి ప్రపంచానికి గర్వంగా ఎత్తి చూపించే కీర్తిపతాక. బాపురెడ్డిగారు తన సాహితీ వ్యవసాయంలో పూచిన మరిన్ని వచన కావ్యసుమాలతో విశ్వవ్యాప్తంగా తెలుగు పరిమళాన్ని గుబాళింపు చేయగలరని ఆశిద్దాం.

**అనంత లక్ష్మి**
తెలుగు ఉపన్యాసకురాలు
రైల్వే డిగ్రీ కళాశాల
సికిందరాబాదు.

# బాపురెడ్డి సాహితీ వ్యవసాయంలో ప్రభవించిన
# అభినవ కవితా శిశువు 'రంగు రంగుల చీకట్లు'

**- డా॥ వెలుదండ నిత్యానందరావు**

ఆధునికాంధ్ర సాహిత్యకాసారంలో అరవిరిసిన పరిమళభరితమైన కుసుమం జె. బాపురెడ్డి. నిజాలను బలిపెట్టే ఇజాల ముసుగుల్లో పడి కళ్ళెదుట కనిపించే కాదనరాని అనుభవసత్యాన్ని పై పెదవులతో తిరస్కరించే కవికాడు బాపురెడ్డి. సామాజిక దురన్యాయాల పట్ల ఆగ్రహోదగ్రుడై ఫాలనేత్రునిలా అంగారాన్ని ఒక పక్క కురిపిస్తూనే, మరో పార్శ్వంలో శిరీష కుసుమపేశల సుధామయోక్తుల శృంగారాన్ని సమాశ్వాసించగలడు. కనిపించిన ప్రతి వస్తువును కమనీయమైన కవితాచిత్రంగా మలచడం (పైన పేర్కొన్నట్లు), అంగారం, శృంగారం ఆయన కవితకు ప్రాణభూతమైన లక్షణాలు. నిరంతరం పైళ్ళతో కుస్తీపడుతున్నా ; ప్రజా సమస్యలతో సతమతమవుతున్నా అంతరంగంలో మాత్రం సతతహరిత కవితాచందనాన్ని ఎండిపోకుండా కాపాడుకుంటూ వస్తున్న అదృష్టవంతుడు బాపురెడ్డి.

పరువంలో సాహితీస్పృహతో విరివిగా రచనలు చేసి వెలిగిపోయి జీవితంలో ఒకటొకటే ఎదురు దెబ్బలు తగుతుతూ ఉంటే నిరాశ నిస్పృహలతో, నిర్వేదంతో సాహిత్య వ్యాసంగానికి స్వస్తి వాచకం పలికిన వారెందరో లోకంలో ఉన్నారు. సుఖలాలసులై ధనదాసులై చిన్ననాట వెలిగిన సాహితీ పిపాసను గాలికి వదిలిపెట్టిన వారు కూడా ఉన్నారు. అనంత జీవన రంగస్థలంలో రకరకాల వైవిధ్యాలు తాత్త్విక కోణాలు ఆటుపోట్లు ఎన్నో ఉంటాయి. కొందరికి కాలం కొన్ని అవకాశాలను ప్రసాదిస్తుంది. దాంతో వారు ఆకాశాలు చుంబిస్తారు. మరికొందరిని కాలం పరీక్షలకు గురి చేస్తుంది. అది వారిని సుశిక్షితులుగా మలచడానికే కావచ్చు. కానీ వారు 'డీలా' పడి వెనుకడుగు వేస్తారు. కాల ప్రవాహాన్ని అంది పుచ్చుకొని ముందుకు పోజాలరు. కొందరిని కాలం పాతాళానికి అణగద్రొక్కుతుంది. వారు కాలసర్పదష్టులు. సృష్టి పరిణామ చక్రం సాఫీగా సంతత చైతన్యంతో సాగిపోవాలంటే 'అన్ని రకాలు' - 'ఇష్టా నిష్టా మిశ్రమ ఫలితాలు' జీవితంలో ఉండవలసిందే. ఈ అనుభవ సత్యాన్ని గ్రహించ నొల్లని వారు ఏదో ఒక దానికే ఏదో ఒక ఆలోచనకే నిబద్ధులయి తమ జీవితాలను ఆలోచనలను సంకుచితం చేసుకుంటారు. అలాంటి పరిధులు, పరిమితులు లేని కవి బాపురెడ్డి. ఎలాంటి ఎల్లలకు బందీ కాని, బానిస కాని స్వచ్ఛమైన కవి ఆయన. పదవు లెన్ని మారినా పరువం వీడని పరిమళం వాడని కవితా పారంవశహృదయు డాయన.

బాపురెడ్డి సాహిత్య వ్యవసాయంతో ప్రభవించిన అభినవకవితా శిశువు 'రంగు రంగుల చీకట్లు' ఈ కవితా సంకలనం వయస్సు నేటికి రెండేళ్ళు (1990). బాపురెడ్డి హిత చింతకులు, సకలాంధ్ర సారస్వతోర్వీసుప్రశంసితుడు నిరంతర సాహిత్య చైతన్యజీవులు అయిన ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యం గారికి రచయిత 'మైత్రీకానుక'గా సమర్పించడం బహుధా ప్రశంసనీయం. పాత్రత నెరిగిన దానం.

అభినందన కవితలు, సంతాపకవితలు, పండగ కవితలు, కవితలు అన్ని కలబోసుకున్న రంగు రంగుల హరివిల్లు ఈ 'రంగురంగుల చీకట్లు'. ఈ సంకలనంలో శేఖరాయమాణమైన కవిత 'రంగు రంగుల చీకట్లు', అదే గ్రంథ నామంగా స్వీకరించ బడింది. వస్తువు ఏదైనా,సన్నివేశమేదైనా, సందర్భం

ఏదైనా అన్ని కవితల్లోను అంతర్గతంగా ప్రవహించిన భావధార ఒకటే. పరమసాధువులా, శ్రేయఃకాంక్షిలా అక్కున జేర్చుకొని అమాంతం కుత్తుక నుత్తరించే పరమనైచ్యాన్ని, మేకతోలు కప్పుకొని సంచరించే పులిలాంటి మోసాన్ని గుర్తుంచుకొని జాగరూకతతో జీవితంలో అడుగేయాలని హెచ్చరించడం ఈ సంకలనం ఇచ్చే సందేశం.

బాపురెడ్డి విధ్వంసకతత్వాన్ని (distructive attitude) ప్రబోధించడు. మొదట సృష్టిని నాశనం చేశాక దాని మీద ఏదో ఒక స్వర్గసౌధాన్ని నిర్మిస్తామని బుకాయించడు. అట్లాగని సమాజ పురోగమనానికి ప్రతిబంధకమైన భావాలను వ్యక్తీకరించడు, సమర్థించడు.... విధ్వంక దావాగ్ని నేలనిండా ప్రవహిస్తున్నా మనిషి ప్రమాదకర ఉన్మాదంలో పడిపోతున్నా (పుట 7) ప్రేమతోను సంస్కరణ దృక్పథంతోను మార్పును Possitive attitude తో సమాహ్వానిస్తాడు.

*నేటి ప్రపంచం వినిపించే*
*పంచమస్వరం – శాంతి*
*నేటి సమాజం చిత్రించే*
*ప్రగతి వర్ణం – సహనం*
*నేటి కాలం ప్రతిపాదించే*
*కార్యాచరణం–సంస్కరణం (పుట 69)*

అని బాపురెడ్డి తలపోస్తాడు.

*చీకటి వేస్తున్న ప్రణాళికలో*
*ప్రతిభ కాదు కావలసింది*

*పలుకుబడి*
*గుణం కాదు అర్హత – కులం*
*దేశం కాదు ముఖ్యం – వేషం*
*పెట్టడం కాదు గొప్ప – పడకొట్టడం*
*లక్ష్యం సీటు, సాధనం ఓటు*
*తదితరం చేటు (పుట 82)*

అని వర్తమాన స్థితిని నిశితంగా విమర్శిస్తూ సమతాసత్య సముద్దీపితమైన సంపూర్ణ జీవితానందానికి భంగం కలిగిస్తూ స్వార్థం, మోసం, దోపిడి, సంకుచితత్వం, అజ్ఞానం వంటి దుష్ట శక్తుల వికృత పద ఘట్టనల కింద పడి నలిగిపోకుండ మనిషి చైతన్యవంతుడు కావాలని బాపురెడ్డి ప్రబోధిస్తాడు.

*మన జాతి పక్షి నెమలి కదా*
*మన జాతి సుమం పద్మం కదా*
*మరి మన జాతి గుణం ఏమిటంటే*
*'మోసం' అని చెప్పుకుంటే*
*ముచ్చటగా ఉంటుందేమో !*
*మన జాతి రంగు ఏమిటంటే*
*'చీకటి' అని ఒప్పుకుంటే*
*చైతన్యం కలుగుతుందేమో*
*స్వాతంత్ర్యం వెలుగుతుందేమో! (పుట 84)*

కాలం అతి వేగంతో పయనిస్తుంది. అది పురోగమనమో తిరోగమనమో ఎటూ తేల్చుకోలేని సందిగ్ధ స్థితిలో పడిపోయాడు సామాన్య మానవుడు పూర్వానికి నేటికి విలువల్లోను, అభిప్రాయాల్లో అభిరుచుల్లో ఎంతో తేడా వచ్చింది. పూర్వం లంచాలు మేసే వారు కానీ తాగేవారు కానీ వ్యభిచారం చేసే వారు కానీ వాటిని తప్పు అని అంగీకరిస్తూ తమ బలహీనతలకు బాధ పడేవారు. (మానుకోలేక పోయే వారు లేండి). కానీ నేడు అవన్నీ తప్పులు కాకపోను 'స్టేటస్ సింబల్' గా మారడం అవి చేయ (లే) ని వాడు మంచివాడు కాకపోను. 'సత్తెకాలపు సత్తెయ్య'గా 'బి.సి.కాలం మనిషి'గా అవహేళన పాత్రుడు కావడం విషాదకరమైన పరిణామం. మోసాలు చేయగల్గడం, అక్రమమార్గాల్లో లక్ష్యాలను సాధించుకోవడం ఈనాడు వ్యక్తి సామర్థ్యానికి, నేర్పరి తనానికి ప్రతీకలయ్యాయి. అందుకే బాపురెడ్డి మన జాతిగుణం 'మోసం' అనీ మన జాతి రంగు 'చీకటి' అని సాభిప్రాయంగా నిర్మొహమాటంగా చెప్తాడు.

అడ్డంగా రాసే వచనాన్ని నిలువుముక్కలుగా పేర్చి కవిత్వంగా దబాయించే కాలం ఇది. విషయాన్ని నేరుగా అందించే శుద్ధమైన వాక్యానికి కవితీకరణంతో చెప్పిన అదే వాక్యానికి ఎంతో తేడా వుంటుంది. తుఫాను తాకిడికి గురయిన ఆంధ్రప్రదేశ్‌ను ఒక కవితలో బాపురెడ్డి ఇలా అభివర్ణిస్తాడు.

*ఊళ్ళన్నీ నీళ్ళై పోయాయి*
*పట్టణాలు చెట్టుకొమ్మలను*
*పట్టుకొని వ్రేలాడాయి.*
.....

అని గ్రామంలోకి నీళ్ళు ప్రవేశించి బీభత్సం చేయడం, పట్టణంలోని పెద్ద పెద్ద భవనాలు మునిగిపోయే దుస్థితి ఏర్పడడం కవితాత్మకంగా చెప్పడం గమనించవచ్చు.

*పేదవాళ్ల ఇంటి కప్పులు*
*పెను తుఫానుకు చెదిరిపోయి*
*నేల మీద తల దాచుకొన్నాయి (పుట 78)*

అని వరదతాకిడికి గుడిసెలు కొట్టుక పోవడాన్ని రమణీయంగా చిత్రించాడు. అట్లాగే 'కోవెలం' బీచి సౌందర్యానికి మురిసిపోయి

*ఎండల గోచీలు పెట్టుకొని*
*కొండలు స్నానాలు చేశాయి*

అని బాపురెడ్డి భావాంబర వీధుల్లో విహరింప చేస్తాడు.

బాపురెడ్డి కవితావిష్కృతికి 'దృష్టి దోషం' తగులకుండా కాపాడడానికి ఒకటి రెండు అంశాలు ప్రస్తావిస్తాను.

*'కొన్ని పుట్టి కోట్ల యేండ్లు అయింది'*
*(పుట 1)*
*నెరసి పోతున్న నీ నీలాలలకలు*
*శివసుందర సత్యాలు కురిపిస్తున్న*
*మేఘకిరీటం అయింది (పుట 5)*

*అందులో*
*నా జీవిత తారక*
*బ్రహ్మోత్సవం జరిపించాయి (పుట 65)*

మొ॥ వాటిల్లోని వచన సాంకర్యం.

*హద్దులు లేని నా ఆత్మాలయానికి*
*శ్రీకార శ్రీనివాస సౌధానికి*
*ప్రాకారాలు నిర్మించాయి. (పుట 65)*

ఇందులో కర్తృవాచకం మృగ్యం. బహుశః పూర్వభాగంలో వున్న 'యోగుద్రితనయనాలు' కవిభావన కావచ్చునేమో సందేహాస్పదం. కాని బాపురెడ్డి 'హద్దులు లేని నా ఆత్మాలయం' అని వ్రాసి ఉండవచ్చు. ఫేయిర్ చేస్తున్న దశలో ఈ పొరపాటు దొర్లి ఉండవచ్చు. కాకితత్వం, కోకిలత్వం (పుట 54) లాంటి శబ్దాలు – పునర్వీక్షణాపేక్షితాలు.

'కాలం వేసిన గాలం' 'సత్యదర్శనం' లాంటి కవితలు చిరంతన భారతీయ ఆలోచన ధోరణిని, బాపురెడ్డి హృదయగీత సంస్కారాన్ని, ఆయనకున్న తాత్విక నేపథ్యాన్ని ప్రతిబింబిస్తున్నాయి.

*ఆశ నీ భాష*
*ఆలోచన నీ శైలి*
*ఆవేశం నీ శిల్పం*
*ఆనందం నీభావం*
*కవిత నీ బ్రతుకు*
*జయోస్తు ! బాపురెడ్డి ! విజయోస్తు.*

**వెలుదండ నిత్యానందరావు**
1-8-726/9, అచ్చయ్యనగర్,
నల్లకుంట, హైదరాబాద్ - 44.
ఫోన్ : 668748

# "ఆధ్యాత్మికభావశిఖరం శ్రీకారశిఖరం"-

- డా॥ అన్నపురెడ్డి శ్రీరామరెడ్డి

జీవితం విభిన్న ప్రవృత్తుల, పరిస్థితుల సంగమం, సమన్వయం. ఆశానిరాశల, సుఖ దుఃఖాల సమరస వేదిక. పరిమళాలను పంచేపూలు, తీరాలను పచ్చికతో నింపే నీళ్ళు జీవితానికి కళ్ళు. ఈ కళ్ళతో చూడగలిగిన జీవితం భూమ్యాకాశాలమధ్య నిర్మించబడిన స్నేహసేతువు. ఈ దారిలో ప్రయాణిస్తే మనం చేరుకొనేది భగవన్నిలయం- "శ్రీకారశిఖరం!"

జీవితంలోని సుకుమార, సుందర భావతరంగ భంగిమ కళావిన్యాసం. ఆవిన్యాసంలోని సూక్ష్మభావ విద్యుల్లత కవిత. ఈకవిత్వపు హరివిల్లు జీవితాన్ని మంచిగంధంలాంటి అందాల బాటలో నడిపించి మధుమయం చేస్తుంది, అమృతాన్నం దిస్తుంది. ఇది "సౌందర్య శ్రీకారశిఖరంః"

పదచిత్రవిన్యాసంలో అందెవేసిన , చెయ్యి తిరిగిన సహజతెలుగుకవి డా॥జె.బాపురెడ్డిగారి కవితల పూలతోట వివిధగుణ-గంధ- సంపన్నమై పరిమళాలు పంచుతున్నది. వీరి కావ్యసరిత "ప్రణయ-ప్రగతి-ప్రణవ" గుణగర్భితమై త్రివేణీ సంగమంలా అనన్య భావధారలనందిస్తున్నది!

ప్రస్తుత కావ్యం "శ్రీకారశిఖరం" ప్రణవగుణసంపన్నం, ఆధ్యాత్మికభావసిక్తమైన ఆనందశిఖరం. స్వచ్ఛమైన కృష్ణప్రేమ కంకితమైన గోపిజనంలాంటి మనోభావ సమగుచ్ఛం పునాదిగా ప్రారంభమయిన శ్రీకార శిఖర కావ్య భవనం బృందావనం లాంటి ప్రేమ-భక్తి క్రయారంగమై, ఆనందశిఖరమై కళకళలాడుతున్నది, కనువిందులు చేస్తున్నది.

జీవితనాటక వేదిక మీద "ప్రశ్నోత్తరములు రెండే పాత్రలు" అని చెప్పటం ద్వారా కవి సమస్యా పరిష్కారం దిశలో ముందుకు సాగుతున్నట్లు విదితమౌతున్నది. ప్రశ్నలు వికాసానికి మూలం గదా!

లోకంనిండా వ్యాపిస్తూ మానవ హృదయాలను తొలచికలచి వేస్తున్న 'వ్యథ' కవిదృష్టి నాకర్షించింది.

''ఆర్తవేణు కంటపడగానే ఆరిపోవునా పెదవులు
*హితజీవిత శిలలమీద ఆగిపోవునా పదములు-"*
అంటూ కవి మానవ జీవితాన్ని సుసంపన్నం చేసే కలలు కంటున్నాడు చూడండి.

"ఏశిల నేతాకినా హిమగిరియై పోతున్నది
ఏకలనే కనినా వాస్తవమైపోతున్నది"

కవిదృష్టిలో అహంకారరాహిత్యం భక్తియాత్రకు మొదటి మెట్టు. ఈ సందర్భంలో బాపురెడ్డిగారు చెప్పిన మాటలు వినదగినవి, మననం చేయదగినవి.

"నాకు తెలిసిన దొక్కటేగా
నాకు తెలియనిదొక్కటేయని"

ఏమీ తెలియక చీకట్లో కొట్టుమిట్టాడుతున్న మనిషికి వెలుగు చూపించే భగవంతుని రూపం దీపంలా గోచరిస్తుంది.

"ఈ ఊపిరి దీపము నీ వెలుగు రూపము

భక్తుని దృష్టిలో లోకమంతా సమానం, ఆలోకకమయం. అందుకే కవికి

''ఓతల్లీమోములో ఓతల్లి కనిపించు
ఏతల్లయినా నాకు నాతల్లెయనిపించు"

అనిపిస్తుంది. ఈ ఏకత్వమే శ్రీకారశిఖరానికి పునాది! బహిరంతర ప్రవృత్తుల సమన్వయం వాస్తవానికి జీవితానికి కావలసిన అమృతతత్త్వం బుద్ధి, హృదయం కలిస్తే నిజమైన ప్రేరకశక్తి, అదేజీవితయాత్రారథం.

"శక్తులన్నిటికాది భక్తియే అంటుంది
ప్రగతి యాత్రారథము ప్రణవమే అంటుంది!"

ప్రశాంత ప్రయాణానికాలంబనం ప్రణవమే గాదా మరి!

లోకంలో సహజంగా కళ్ళు తెరిస్తే మనకు వస్తువులు కనిపిస్తాయి. కాని కళ్ళు మూస్తే భగవంతుని సత్యస్వరూపము కనిపిస్తుందని అంటారు కవి. అంటే భగవంతుని దర్శించేందుకు ధ్యానం అవసరమనే కదా అర్థం.

"కనులు మూయగలిగితే కనిపించనిదేది?
మూలతమము కనిపించు ముకుళితమనే త్రాలకే"

భగవంతుని రూపం దీపంలా దేశకాలాల కతీతమైన సమరస సూక్ష్మరూపం . అందుకే అంటారు కవి

"దేశమని కాలమని దేనికది చూడలేను
వెలుగును దీపమునుండి విడదీయుట గ్రుడ్డియాట!"

భగవంతుని సూక్ష్మసుందరరూప-దీప దర్శనంతో పరవశించిన కవిహృదయం తన్మయత్వంతో శివతాండవమాడుతున్నది- చూడండి.

"శ్రీఓంకారశిఖరాలమీద
శివతాండవమ్మాడెద విప్లవ తాండవమ్మాడెద!"

విప్లవాత్మక శివత్వం సమాజ శ్రేయస్సుకు ముఖ్యం గదా!

జీవితంలో సాధనావస్థ, సిద్ధావస్థ (ప్రయత్న పక్షం, ఉపభోగపక్షం) రెండూ ప్రధానాంశాలే. ఫలితమెంత గొప్పదో ప్రయత్నం గూడ అంత ముఖ్యమైనదే! ఫలాపేక్షతో నిమిత్తంలేని ప్రయత్నమే కర్మయే నిజమైన ఫలం గదా! గీతాసారంగూడ!!

"వెదకిన దొరకనిది లేదు కోరిన తీరనిది లేదు
వెదకుటయే దొరుకుటేమొ కోరుటయే తీరుటేమొ!"

అనే కవిభావం 'శ్రీకారశిఖరం' స్థాయిలోనే ఉన్నది.

సమస్తసృష్టిలో వ్యాపించియున్న భగవంతుడు ఏ ఒక్క అణువులోనో వెదికితే ఎలా కనిపిస్తాడు? అణువువణువు వెదకాలి గదా! అందుకే కవి రాయి రాయిలో, చెట్టు చెట్టులో, మట్టిలో ఉన్న పరమాత్మను దర్శించేందుకు పక్షిలా పైకెగరు తున్నారు, ఎదుగుతున్నారు రాత్రింబవళ్ళు రెక్కలు ధరించి-

"రాయిరాయిలో సృష్టిరహస్యం వెదకుచుంటి
చెట్టు చెట్టులో మట్టి గుట్టును కవి పెట్టు చుంటి!"

కవిదృష్టి కేవలం ఆకాశంమీదనే లేదు, సృష్టికాధారమైన భూమి మీద గూడ నిలిచి ఉంది నిజానికి వారి దృష్టిలో భూమ్యాకాశాలు వేరు వేరు కాదు, ఏకరూపం, సమరదీపం.

"మింటిలోని అందాలను మింటిలోన కలుపనా!
మంటి గోళమును తారామండలాని కెత్తనా!"

ప్రణవభావ ప్రధానమైన ప్రస్తుతకావ్యం 'శ్రీకారశిఖరం' లో కవిదృష్టి నేల విడిచి సాము" అనే పద్ధతిలో లేదు. దేవునివతోపాటు మనిషికీ గూడ ఎంతో విలువ ఉందని, దాన్ని కాపాడాలని అంటారు కవి

"రాయిని దేవుని చేసే మనిషిని బలి చేయకురా
మనిషిని దేవుని చేసే జడతను తొలిచేయరా!"

మానవసమాజంలో - ప్రత్యేకించి-

భారతసమాజంలో ప్రబలంగా ఉన్న అర్థరహితమైన మూడాచారాలను ఖండించేకవి బాపురెడ్డిగారి సామాజిక స్పృహ స్వయంగా భగవంతుడే మెచ్చుకొనేలా ఉంది. 'మానవసేవయే మాధవసేవ' అన్నారు గదా పెద్దలు!

ప్రస్తుత కావ్యంలో కొన్ని విశేష ప్రయోగా లున్నాయి. "మనిషి ఒక ఆటోమ్యాటిక్ గడియారం" అంటున్న కవి భావన కావ్య సౌందర్యాన్నినుమ డింపజేస్తున్నది. జీతితంలోని అనిత్యతను-పరిణతిని గూడ సూచించే ఈ ప్రయోగం గమనించదగింది-

*"ఆగిందే ఆగిందే ఆటోమ్యాటిక్ గడియారం-*
*పోయినదారినెపోయిపోయీ*
*చేరినచోటికే చేరీచేరీ*
*వృత్తం పునరావృత్తం బ్రతుకని*
*వెర్రిమొర్రిగా తిరిగిన యంత్రం-*
*ఆగినచోటే అసలు గమ్యమా !"*

ఇలాంటి అనిత్యతోకూడిన జీవితాన్ని అజరామరం చేసేందుకు సుర-నరులను ఏకంచేసి, సరికొత్త చేతన సృష్టి చేయటమొక్కటే మార్గమనే కవి భావం-చూడండి ఎంత ఉదాత్తమో-

*"నరులకు సురులను చూపెడి సురులకు నరులను చూపెడి*
*తేజోమయ గేయం నాజీవితధ్యేయం !"*

ఈ తేజోమయ-సురనరసమన్వితమైన-గేయంముందుకు సాగి-సాగి సదానంతసాగర దర్శనం చేసే త్యాగయ్యను దర్శిస్తుంది-మీరూ దర్శించండి-

*"బ్రతుకు నదీనదాలతుది సదానంత సాగరమని - త్యాగయ్య పాడుకొనెను!"*

త్యాగయ్య మనోనయనాల సారాన్ని తమకళ్లలోనింపుకొని, కవి జీవితయాత్రా ప్రధాన-ప్రణవప్రగతి రథం మీద- ముందుకు సాగినప్పుడు సమస్త సృష్టిమనోహర కావ్యంగా కనిపించింది, అద్భుత మనిపించింది-

*"చుక్కలనే అక్షరాలతో శూన్యమనే కాగితాలపై*
*ఏ కవి వ్రాశాడో ఈ అనంత కావ్యం !*
*ఎరుగరాదు-ఏలిపియో ఈలీలాగ్రంథములో!"*

ఆశ్చర్యనందసాగరాన్ని చిత్రించే మనోజ్ఞపద చిత్రంగదా! సృష్టి రహస్య వివరణ పత్రంగూడ !!

భగవంతుని రూపం కరణ-క్రోధగుణ సమన్వితం. వారు కరణిస్తే అంతా పచ్చిక, కోపం ప్రదర్శిస్తే అంతా బూడిదేమరి! ఈ వాస్తవాన్ని గమనించిన కవి బాపురెడ్డిగారేమంటున్నారో విందాం-

*నీ ప్రేమ ముందు నేనోతృణమ్మైపోదు*
*నీకోపశిఖల నేనో సమిధనైపోదు !"*
*గురుతరరూపం భగవంతుని ముందు భక్తుడు లఘువేగదా!*

నిండు హృదయంతో సేవించి భగవంతుని పొందగలిగిన క్షణాన భక్తుడు పులకించిపోతాడు, అతని జీవితమే సంగీత మవుతుంది, చూపులే దధాలై లక్ష్యాన్ని-భగవంతుని చేరుకొంటాయి-గమనించండి-

*"వీణలేని వైణికుడను, రథము లేని సారథిని*
*వీణ కొరకు చేయిసాచనా పాణియెవీణయయ్యె*
*రథముకొరకు పథమువెదకనాచూపేరథమయ్యెను".*

చైతన్యగుణ సంపన్నుడైన బక్తుడు చేసే క్రియలన్నీ భగవంతుని చేరే భక్తిమార్గాలేనంటారు కవి-వినండి-

"ఏ భావకిరణమైనా ఆనీరధినే దూరును

ఏ రాగతరంగమైనా ఆతీరమే చేరును."

భక్తి మార్గాన పయనించే భక్తుడు సమున్నత దృష్టి కలిగి ఉంటాడని కవివిశ్వాసం. అలాంటి పరిష్కృత దృష్టికి ఎంతో వెలుగు కనిపిస్తుంది. అతనికళ్ళేదీపాలై భాసిస్తాయి, అతనికి భగవంతుని సమజ్వలరూపం దర్శనమిస్తుంది-చూడండి!

"చూపు పైకి లేపగానే దీపకోటి వెలిగింది
మనసు తలుపు తీయగానే మహా మాయ తొలగింది.
చక్కలసాగరంలో స్నానం చేసిన ఫలితమే ఇది!

కవి కొన్ని విషయాలను చెప్పటానికి వ్యంగ్యాన్నాశ్రయిస్తాడు. నేడు-లోకంలో నలువైపుల విస్తరించి ఉన్న అన్యాయాన్ని వేలెత్తి చూపటానికి కవి వ్యంగ్యమార్గాన్నెన్నుకున్నారు. దీన్లో విషయ వివరణతో పాటు కావ్య సౌందర్యం గూడ ఇమిడి ఉంది-గమనించండి.

" శ్రీరామచంద్రునికి
అరణ్యవాసం !
పాదరక్షలకేమొ
పట్టాభిషేకం !"

అంటూ కవి మర్యాదాపురుషోత్తముడైన రాముని పట్ల తమ సద్భావం వ్యక్తం చేయటమే గాక నేటిలోకం తీరును గూడ వ్యంగ గర్భితంగా చెప్పారు.

యువదశలో ప్రణయం, మధ్యలో సామాజిక స్పృహ ప్రగతితత్వం, జీవిత చరమదశలో ప్రణవం మనిషిలోని సహజగుణ పరిణామమనే కవి అభిప్రాయం గ్రహించదగింది-

"ప్రణయగీతాలు వ్రాసి, ప్రగతిగీతులు వ్రాసి
ప్రణవగీతాలలో పరవశిస్తున్నాను!"

"నను పిలువవచ్చిన నా మృత్యురాణి" అంటూ కవి వ్రాసిన చివరి గీతం ఎంతో ఆర్ద్రంగా ఉంది." పయనమయ్యేముందు పాటొకటి రాయనీ"

అనే పంక్తులు గుండెలను కరిగించేలా ఉన్నాయి. మరికొన్ని పంక్తులు చూడండి-

"ప్రతిత్రుటిని శ్రుతిచేసి పాటలన్నీ వ్రాసి
ఇంకేమి వ్రాయునని శంకించుచుంటినో!

..............................................

పాట అంటే మరేదో పాట కాదమ్మా!
సోహమని నీకు దాసోహమయెను పాట "

ఇదే భక్తుని బాట మరి!

ఈ విధంగా ఆధ్యాత్మిక భావసోపానాలపై నిర్మించబడిన కావ్యం 'శ్రీకారశిఖరం' పరిష్కృత భావశిఖరం, సుందరలోకకళ్యాణతోరణం, భక్తి కావ్యానంద నిలయం! కవివర్యులు డా॥ జె.బాపురెడ్డి గారు అభినందనీయులు.

**Dr. A. Srirama Reddy**
Head of the Dept. of Hindi
4-22-25, Saibaba Road, Chaitanyapuri,
Chandramoulipuram P.O.
Guntur - 522 007.

# ప్రముఖులతో



J. Bapu Reddy receiving a presentation from Dr. Sarvepalle Radhakrishnan at Visakhapatnam in 1961 alongwith Sri K. Jaya Bharat Reddy, IAS (under Trg.), now Secretary to Govt. of India.



With Sri. P.V. Narasimha Rao at Second North American Telugu Conference in Detroit in 1979



With Sri Lal Bahadur Sastri in Visakhapatnam in 1963



J. Bapu Reddy presenting his book "In Quest of Harmony" to Smt. Indira Gandhi in the presence of Sri. N. Janardhana Reddy and Sri K. Purushottam Naidu, at Tirumala



Receiving felicitations from Dr. M. Channa Reddy, Chief Minister at a Poets' gathering in 1978

With Smt. Indira Gandhi, Prime Minister of India
Bapu Reddy as District Collector, in 1980





Meeting Dr. Neelam Sanjeeva Reddy, President of India



J. Bapu Reddy felicitating Sri Jandhyala Papaiah Sastri Karunasri

J. Bapu Reddy as District Collector, Medak receiving nomination papers from Smt. Indira Gandhi in 1980.





J. Bapu Reddy felicitating renowned Poet and Scholar Dr. Puttaparthy Narayanacharyulu



J. Bapu Reddy with Sri Fakruddin Ali Ahmed, President of India

Meeting Sri Charan Singh, Prime Minister of India in 1980.





Dr. Sankardayal Sharma, as Governor of A.P. felicitating Sri J. Bapu Reddy at Ravindra Bharathi on the occasion of release of his book Srikara Sikharam. Sri M.K. Ramu of Rasamayi was also present





With Sri N. Janardhana Reddy, Chief Minister of A.P.
and with Pendekanti Venkata Subbaiah





J. Bapu Reddy with Sri T. Anjaiah, Chief Minister of A.P. and with Sri Dasarathi, Poet.



Dr. J. Bapu Reddy with Smt. Jamuna Ramanarao noted film artiste at a public meeting function in Medak.



Dr. J. Bapu Reddy with Sri Bhagwan Das, I.A.S., then Chief Secretary



Dr. J. Bapu Reddy with Sri N.D. Tiwari at the Indian Exhibition in London in 1982



Dr. J. Bapu Reddy presenting his book to Prof. G. Ramireddy at Vancouver, Canada



Dr. J. Bapu Reddy with Sri Prema Dasa, President of Srilanka at Tirumala.



At 1st World Telugu Conference, with Sri J. Vengalarao then C.M. and Sri Mandadi Venkatakrishna Rao.



Participating in the 2nd North America Telugu Conference at Detroit, USA in 1979.



Dr. J. Bapu Reddy dedicating his book
Bapu Reddy Gadya Kavyam to Dr. Bejawada Gopal Reddy.



Dr. J. Bapu Reddy with renowned writer, Singer and film artiste
Smt. Bhanumati Ramakrishna.



Dr. J. Bapu Reddy with Sri C.N.Rao at the United Nations Organisation Office.

Dr. J. Bapu Reddy with renowned Singer Sri Yesudas.





*Meeting Dr.P.V.Narasimha Rao, Prime Minister of India at a Special Sethavadhanam function in Ravindra Bharati, Hyderabad.*





Dr. J. Bapu Reddy being felicitated by Dr. P.V. Ranga Rao Minister for Education and By Smt. Lakshmi Devi (Minister).



*Bapu Reddy with his wife Smt. Rajeswari at the Kanchi Kamakoti Peetham of Shankaracharya.*



*Bapu Reddy presenting his books to Sri Ramoji Rao, Chairman Eenadu and Margadarshi Group.*



*Bapu Reddy with Sri G.V.K. Reddy, Chairman G.V.K. Industries, at his factory Office (GVK Amrica Inc) in BISCOE, North Carolina, USA.*



*Bapu Reddy with Mr. S.K. Chatterjee of Germany, Shri P. Mahender Reddy and Sri M. Seshagiri Rao, Industrialists.*



*Chief Justice Sri Prabha Shankar Mishra felicitating Dr. J. Bapu Reddy in Satya Sai Nigamagamam in the Presence of Sri AVS Raju, Sri Srinadh and Sri M. Chittaranjan.*



*With a visiting Full bright Faculty Fellow Dr. Dorthy J. Deering (USA).*



*Dr. K. Rajaiah, eminent artist presenting his painting to Dr. J. Bapu Reddy at Siddipet.*



*Bapu Reddy and Sri M. Chittaranjan with Mr. Jinnuri Vineatraju and Smt. Janaki of France.*



*Sri S. Kondal Rao Felicitating Bapu Reddy at a function.*



*With Dr. K.V. Reddy at the famous lake District in U.K.*



*Bapu Reddy being felicitated by Mr Pal Naidu and other members of Malaysia Telugu Association at Kulalumpur.*



*With Sri T.R. Prasad, I.A.S., Secretary Industries Govt., of India in Udyog Bhavan, Delhi.*



*With Ravindra Gujjula, Mayor, Artslangberg, Germany.*



*Smt. Ambika Ananth and Prof. T.V. Subba Rao felicitating Bapu Reddy at Bangalore.*



*Bapu Reddy in Ravindra Bharathi With Shri S. Kondal Rao, Shri A. Madhava Reddy, Hon'ble Home Minister, Govt. of A.P., and Shri A.V.S. Raju.*



*With Dr. P. Goverdhan Reddy and Dr. K. Satyanarayana in London.*



*Bapu Reddy and the Office bearers of European Telugu Association calling on the A.P. Chief Minister, Sri N. Chandrababu Naidu.*



*With Dr. Y. Venugopal Reddy, IAS., Secretary, Banking Government of India, at New Delhi.*



*With Sri Vasantha Sathe at Delhi.*



*Prof. Kakarla Subba Rao, President International School, Hyderabad felicitating Bapu Reddy.*






*Bapu Reddy addressing a Literary meeting of Bharatiya Bhasha Parishad at Calcutta in the presence of Balashowri Reddy (Director) and Dr. Kusum Khemani, Secretary.*



*Felicitating Dr. P. Susheela (eminent play-back singer) at a Function. organised by M.K. Ramu & Smt. Asha Latha of Rasamayee Organization*



*Bapu Reddy and Prof. G.V. Subramanyam at a book releasing function in Ramayampet, Medak District.*



*Being felicitated by Dr. S. Rahamatullah and G. Hemachalam on behalf of Chaitanya Andhra Shitee Samskriti Samthi at Parlakhemundi, Orrissa.*



*Addressing a meeting of Viswa Sahiti in the presence of Dr. Pothukuchi Sambasiva Rao & Dr. V.Malakonda Reddy.*



*Sri G. Venkataswamy (Union Minister) felicitating J. Bapu Reddy at a function in Ravindra Bharathi.*

# బాపురెడ్డి పద్యకావ్య ప్రశస్తి

- ఆచార్య దివాకర్ల వేంకటావధాని

శ్రీ బాపురెడ్డిగా రిదివరకు ప్రశస్తములైన గేయకావ్యసంపుటములు మూడు నాలుగు ప్రచురించి యాంధ్ర సహృదయుల మన్ననలందుకొని యున్నారు. రసజ్ఞ రంజకమైన భావుకత, ఉదాత్తమైన భావ సంపద, సరసమంజులమైన శైలి పరిపాకము, అవిచ్ఛిన్నమైన అభ్యాసము పుష్కలముగాఁగల యువకవిపుంగవులు వారు. ఔద్యోగిక కార్యభార వ్యగ్రులయ్యును వారెట్లో వీలు చిక్కించుకొని కవితావ్యవసాయమునకుఁగడంగు చుండుట వారి రసప్రసవోద్యానవాటికా విహార పరాయ ణతకుఁ దార్కాణము. అస లానందమందిరమైన వారి యీ కృతి విశేషముననే కవితనము కదలాడు చున్నట్లుండును. గేయకవితా విలాసినీ వశంవదమైన హృదయము నిప్పుడు పద్యకవితాకాంతపైకి మరలించుట వయోనుగుణమైన వారి ప్రౌఢతాప్రియం భావుకతను చెప్పక చెప్పుచున్నది. ఛందోవిన్యాసమున కించిద్విశేషమున్నను పద్యగేయములు రెండును కవితా హృదయ వ్యక్తీకరణమున సమాన సామర్థ్యము కలిగి నట్టివే. ఈ పద్య కావ్యాల ప్రకటనము శ్రీ బాపురెడ్డిగారి కారెండిటఁగల సవ్యసాచిత్వమును వ్యక్తము చేయు చున్నది.

ఈ ప్రథమ ముద్రణ సంపుటమున సుమారిరు వదియైదు ఖండకావ్యములున్నవి. వీనిలోఁ బెక్కాత్మా శ్రయ భావ సంభృతములై భావకవితా పద్ధతికిఁ జెంది యున్నవి. కొన్ని యాధునిక కాలపు విజ్ఞాన శాస్త్రాభ్యు దయమునకు సంబంధించియున్నవి. కొన్ని యాంధ్ర రాష్ట్రావిర్భావమును బ్రకృతిని వర్ణించుచున్నవి. కొన్ని కవిగారికి సాగరము, రవీంద్రుఁడు, మృత్యువు మున్నగు విషయములపైఁగల భావములను వ్యక్తీకరించుచున్నవి. ఈ విధముగా నీ సంపుటము కవిగారి కవితాభావ వైవిధ్యసంపదను వెల్లడించుచుఁబఠితల కానందమును గలిగించుచున్నది.

కవితా ప్రస్థాన మను ఖండకావ్యమున శ్రీ బాపురెడ్డి గారి కాదర్శములైన కవితాశయములు వ్యక్తీకరింపబడినవి. నిత్యనూతనత వారి ప్రత్యేకత, నిసర్గస్వాదు సౌందర్యభావ ప్రక్షేపము వారి విలాసము. నక్షత్రాలే వారి కావ్యములు, కవితా ప్రపంచమున గణ యతి ప్రాసాదులు, ఉదాత్తములైన భావములు, రమణీయమైన శైలి కావలసినట్లే, వారికి బాహ్య ప్రపంచమున సూర్యతారకాదులు, గ్రహోపగ్రహములు, శాస్త్ర విజ్ఞాన శస్త్రములు, దౌత్యాశయ దివ్య దిగ్విజయములుకూడఁ గావలయును. ప్రయోగముతో పాటు యోగమును గూడ నుజ్జగింపకుండుట వారి కిహపరములు రెంటింటఁగల పరాయణతను బ్రకటించుచున్నది. అందుచేతనే వారు బాహ్యములైన చర్మచక్షువులను అంతరములైన 'లోకన్నులను'గూడ జగద్దర్శనార్థమై వినియోగించుట కువ్విళులూరు చుందురు. సుఖదుఃఖమిశ్రిత మైన జగమ్మున కవికి వర్జనీయమైన దేదియు నుండదు. ప్రేయసి హాసముతో వలెనే నిరుపేదల వేదనలతోడను అతనికి సంబంధము కలదు. ఈ సంబంధము లేనిచోఁ గవిత సాక్షికమై జగత్ప్రతిబింబమును, నవరసరుచిరమును గాఁజాలదు. శ్రీ బాపురెడ్డి గా రద్వైతమను ఖండకావ్యమునందలి-

*వ్రాయఁగనే విలాసినులపై గేయములను*
*కూలిపిల్లను మఱచు మూర్ఖుఁడను గాను*
*ప్రకృతి సౌందర్యమును గూర్చి పాడఁగానె*
*మానవుని కష్టసుఖము లే మఱవలేను.*

అను పద్యమున నీ భావమునే వెల్లడి చేసియున్నారు. కవితా ప్రపంచమున 'కష్ట సుఖములు రెంట భాగమ్ముగొంట' సంపూర్ణతా లక్షణము; అభ్యుదయ భావ సంపదకు సూచన.

మానవుడు 'పుట్టి స్వప్నబింబములనుండి స్వప్న గోళముల చుట్టు భ్రమణ మొనరించుచు స్వప్న భవనములందు వాసమొనరించి స్వప్న విశ్వముల చేర' ప్రయాణము సాగించుచుండునని శ్రీ రెడ్డిగారి భావము. వర్తమానము గతము కన్న స్వప్నమేయనియు, భవిష్యత్తు వర్తమానపు మూగకనుల నిగూఢముగఁదోచు వెలుఁగు రేఖ యనియు ననుకొనుటలో నసత్యము లేదు. నిదురలోఁ గల మానవుని యెదను మేలుకొలుపునని కవి గారి భావము. ఆపదలందు సంపద్రేఖ స్వప్నముగా గోచరించి మానవు నోదార్చును. కవి, వైజ్ఞానికుఁడు, శ్రామికుడు, విరహి మున్నగు వారందఱును స్వప్న సరస్సులలోఁ దేలిపోవుచుందురు. వా రొకప్పుడు కన్న కలలే నిక్కములై వారి కానందము కలిగించును. అందుచేతనే శ్రీ రెడ్డి గారు-

నరుని కిల స్వప్నమే చేతనా రథమ్ము
కలల అలల జీవనకథ యిల చరిత్ర

అని గొంతెత్తి ఘోషించినారు. వారి కల భ్రాంతి మయము కాదు, భవిష్యదభ్యుదయ సంపత్సూచకమైన నిత్యసత్యము.

స్వప్నము సత్యమైనప్పు డెంత యానందము కలిగించునో యసత్యమైనప్పు డంత నిరుత్సాహము నావహించును. అందుకు స్వప్నానుభూతివలనఁ గలిగిన యాశ కారణము. అందుచే నాశ పెంపొందించు కొనుటకు ముందు లక్ష్యములైన వస్తువుల బహిరంతరములను సూక్ష్మేక్షికతోఁ బరిశీలింప వలయును. ఈ పరిశీలనము లేనిచో మోసము తప్పదు.

"ఈ పూలతల మాటునే విష సర్పాలు
పొంచియుండుట నే గ్రహింయింపనైతి......
నా దేహము గేహమున్ మఱచి దివ్యపథమ్ముల
స్వప్న చంచలావాహన మెక్కుటేల
భువి వ్రాలిపడం బరితాపమేలకో"

యను కవిగారి వాక్యము లాపరిశీలనము యొక్క యావశ్యకతను నొక్కి చెప్పుచున్నవి. అలభ్యములైన యాశలు పెంచుకొని యనుతాపమందుటకంటె తృప్తి వహించి-

విశ్వమెల్ల ప్రేమించి జీవించనేర్చి
వాస్తవ జ్ఞాన భాస్వర పథము నడచు టొకటె

సౌఖ్యకరమని వారు కావించుకొన్న నిశ్చయము.

స్వచ్ఛప్రేమరూపమైన స్నేహమునకు మోహము నకును విశేషమైన యంతరమున్నది:

మోహము లేని స్వచ్ఛతను మోదము కూర్చు
నిసర్గరంజక స్నేహముమించు భాగ్యనిధి సృష్టిని

లేదు-

అని కవిగారి యాశయము. స్నేహబంధమునకు 'లౌకిక స్వార్థచింతనానేక బాహ్యబంధములుండ' రాదనియు ప్రేమ యమరమై శాశ్వతమై యలరారుననియు వారి విశ్వాసము. పరీక్షయను ఖండకావ్యమును వారు ప్రేమించుట కచ్చమైన మానవత్వము వలె మోహజనక మైన బాహ్య సౌందర్యము కారణము కాదని వ్రాక్కుచ్చినారు.

..........................................

అట్టి కన్యపై ఇచ్ఛయు లేదు
చల్లగ చలించెడి మానవతా లతాంకమున్
విచ్చుచు నున్న
నిన్నెద జపింతు వరింతు మనుష్య భామినీ

యని వారు ప్రకటించుట యిందుకు నిదర్శనము. తళతళలాడు చూపులు, మధురమైన కంఠస్వరము మున్నగు దైహిక సౌందర్య చిహ్నములు-

వాక్కుల కందరాని భగవంతుని సృష్టికె
మూలమౌ, ఎదో చక్కదనమ్ము

వలపునకు హేతువై యుండవలెనని చెప్పుట వారి ప్రేమదివ్యత్వమును జెప్పక చెప్పుచున్నది. స్వచ్ఛప్రణయ మహిమ యెన్ని విఘ్నములనైనను గండములనైనను, దొలగించును. కొఱగాని లోకమున నడుగడుగునఁ గనవచ్చుక్షణికసుఖములపై భ్రాంతివీడి యాంతరమైన దివ్యకాంతి సంపదను గాంచుచు రసలోక తపస్విమై కాలము పుచ్చవలెనని వారి యాదర్శము.

ఈ వాసంత వసంతికారవములున్........
దేవీ జీవకళా విలాసములో దీపింపలేనప్డు
నిర్జీవమై చనుగాన ఈ ప్రకృతిలో
జీవింతు దేవీ హృదిన్

అని వారు వాంఛించుట కీయాదర్శమే మూలము. ఇట్టి యాధ్యాత్మిక వాసన బలవత్తరముగా హృదయము నావరించి యుండుటచేతనే వారు "నివేదన"లో

నా క్షుభితమైన మేధకు
వీక్షణమున శాంతి లేదు ఈ చీకటిలో
చక్షువు నా కీవే పరి
రక్షణ మీవేను చూపరా వెల్గు, ప్రభూ!

అని పరమేశ్వరుని వినయముతో ప్రార్థించినారు.

వస్తువులపై స్వామ్యమెవ్వరికున్నను వాని యందుగల సౌందర్యము సర్వసాధారణ మనియు దాని ననుభవించుట కెల్లరికధికారము కలదనియు కవి గారి భావము.

పూవుల అందమందరిది పూచిన తీవ ఎవళ్ళదైన,
సద్భావరసమ్ము అందరిది భావుకుఁడే గృహ వాసియైన

నని వారు చెప్పుట యిందుకు నిదర్శనము. కళావిభవానుభవ మందఱికి జూఱ యిచ్చుటకై స్వామ్య సంబంధమైన స్వార్థమును వర్జింపవలెనని వారి యుపదేశము.

అందము అందవే మనకు అందిన అందకపోయినన్
మనఃస్పందన వేరు తార్కిక వినాదమువే

రని చెప్పుట వారికి సౌందర్య దిదృక్ష యందుఁ గల యుత్కంఠవ్యక్తము చేయుచున్నది. మానవుడు చంద్రగోళంపై నడుగుపెట్టిన పిమ్మట నచ్చట రాలును రప్పలును కొండలును గోతులును తప్ప మఱేవియు లేవని తెలియవచ్చినది. ఇదంతయు సత్యమేయైనను 'రేల నభోంతరాల శశిరేఖలఁజూచి చలింపకుందుమా' యనియు శరీరము చర్మ రక్తాస్థిమాంసములకూడిక యని తెలిసియు 'రమణులఁ జూచినప్పుడు సరాగ పరాగము పొంగులెత్తదా' యనియుఁ గవిగారు ప్రశ్నించుచున్నారు. 'పడగెత్తిన ధీబలశక్తిముం దింద్రి యానుభూతీందిర పేదవోదు.' అందుకుఁ గళాతృష్ణ కారణము. విజ్ఞానశాస్త్ర విజృంభణము కళలకును కవనమ్మునకు విఘ్నమాపాదింపఁజాల దనియు గళాతృష్ణ జాబిలివలె శాశ్వతమనియు శ్రీ రెడ్డిగారు చెప్పుచున్నారు.

మానవత్వము హృదయ సంపన్నిర్ణేయము కాని యాకృతి మాత్ర నిర్ణేయము కాదు. ప్రకృతి దేవియే మానవునకు విశ్వరహస్యములన్నియు విప్పిచెప్పి యాతబలవంతునొనర్చెను. స్వార్థద్రోహచింతా పరాయణుండై యాతఁడామెనే వికృతను గావించి కృతఘ్నుత ప్రకటించి నాఁడు. దీనిని గర్హించుచుఁ గవిగారు మానవుఁడు తాను వానరుఁడుగాని దానవుఁడుగాని కాఁడనియు మానవుఁడనెడి కీర్తిని సంపాదింప యత్నింపవలెననియు నుపదేశ మిచ్చుచున్నారు. మానవుడు-

స్వార్థతానురాపాన మదాంధుఁడై తన ప్రపంచంలో
విలయాగ్ని రేపఁగ పూనెడి కుట్రలందెలిసి

భూజనయిత్రి మనమ్ము విదల్చుకొని యేడ్చుచున్నదని

బట్టబయలు చేయుచున్నారు. మానవుఁడు యంత్రముల మాయలోఁపడి మానవులనే వేటాడ మరగినాఁడనియు, హంతయైన యాతనిఁజూచి శాంతిదేవి బెదరి యడవులకుఁ బాఱిపోవుచున్నదనియు వారు చెప్పినది సత్యము.

*దుర్మార్గమున్ వీడి ఉజ్జ్వల సౌభ్రాత్రము సౌమ్యమున్*

*వెలుఁగ విశ్వమ్మంతటన్ పంచి శాంతిలతల్ పెంచుము*

*ప్రేమ జీవనములన్ దీవించు నిన్ సృష్టియున్*

అని వారు కావించిన మహోపదేశము మానవులందఱును స్మరింపఁదగినట్టిది. మనుఁజుడు చంద్రలోకమున నడుగుపెట్టఁజాలుటచే 'భూమాతయు చంద్రమాతయు' కలిసెనని వారెంత సంతోషించుచున్నారో మానవుఁడు స్వార్థ లోభాలకుఁ జిక్కి తన లోకమైన భూలోకకీర్తి సాధనకు సర్వలోకాల శాంతి సుఖము చెరగొనునేమో యని యంత భీతి నందుచున్నారు.

వసంతోదయ మను ఖండకావ్యము కవిగారి ప్రకృతి పరిశీలనమును వర్ణనపాటమును వ్యక్తము చేయుచున్నది. వాసంత వాతావరణమున వియోగబాధ హెచ్చఁగా నొకదేవిమోవి వారి నొక భావకవిని జేసినది. శిశిరానంతరము వచ్చిన వసంతమును సూచించుటకు వారు వాడిన యుపమానములు రెండును అద్భుతముగా నున్నవి. శిశిర దుశ్శాసనుఁడు పసుపు చేలములు తొలఁగింపగానే వనకుమారి పచ్చపచ్చని క్రొవ్వలిపములు దాల్చి వసంతాకృతి దాల్చినది. ఏ మురారియో యామె మొరాలించియుండునని వారి భావన. శిశిరమందలి హిమశిలలు వాసంత కోష్ణ నిశ్వాసములచే కరంగి ఝరులుగాఁఱుట వారికి 'విప్లవోష్ణనిఃక్రాంతి వీక్షణాల కరగి' దాస్యాంధకారము పాఱుటవలె గోచరించినది. కవి శిశిరమున జీర్ణ లోకము చూడలేక యేడ్చియు, వసంతమున నుప్పొంగి శుభగీతి పాడియుఁ బ్రకృతి తాదాత్మ్యమును సాధర్మ్యమును బ్రకటించునని కవిగారి యభిప్రాయము.

మహోదయము, సుప్రభాతము అను ఖండ కావ్యములు ఆంధ్రప్రదేశ్, విశాలాంధ్రావతరణ సందర్భములందు రచింపఁబడినట్టివి. ఎన్ని వసంతములు గడచినను, ఎన్ని ఉగాదులు వచ్చి పోయినను కలుగని యనిర్వాచ్యమైన యనుభూతి కవిగారి కాంధ్రరాష్ట్రావతరణమునఁ గలిగియుండుట వారి యందలి యుత్కటమైన యాంధ్రాభిమానమునకు నిదర్శనము.

*గున్నమామిడి తన ప్రియ కోకిలమ్మ*
*వీడిపోయి ఆనాఁడు తపించి తిరిగి*
*నవ్యముగ నేడు కూడి గానమ్ము చేయు*
*నాంధ్ర తెలంగాణ మేకమైనట్టి తమిని*

అని వారు విశాలాంధ్ర ప్రాదుర్భావమును బ్రశంసించినారు. ఆ యుత్సాహానందములచే వారికి దుర్ముఖియు సుముఖిగానే కనిపించెను. 'శుక్తిగర్భాసపడు చిన్కు ముక్తకాదె' యని వారిచ్చట వాడిన యర్థాంతర న్యాసము రమణీయముగా నున్నది. 'ఎదలోని కల్మషము నీటను దోసి మనోజ్ఞ దివ్యశోభా యుతమైన దివ్యసుమ వాటిని నాటు' మని వారొసంగిన సందేశ మాంధ్రులెల్లరును ఎల్లపుడును స్మరించి యనుసరింపఁ దగినట్టిది.

కవిగారు తాము నెదరులాండులో గాంచిన విశేషములను సుస్పష్టరేఖలతో విశదముగా వర్ణించి యున్నారు. ఇది వారి నిశిత పరిశీలకును, సౌందర్య దిదృక్షకును, వర్ణనాచాతుర్యమునకును తార్కాణముగా నున్నది. అచ్చటి దృశ్యములు 'వింతలకే గిలిగింతలు' కలిగించునని చదివినప్పుడు పాఠకు లెల్లరును నెదరులాండున కేగుటకై యువ్విళులూరక మానరు. 'సరససాగరుడు' కవిగారి భావ గాంభీర్యమునకును, భావనా పాటవమునకును దృష్టాంతముగా నున్నది.

సాగరుని సరసత్వమును వారు చక్కగా వర్ణించినారు. సముద్రము సౌందర్యానందములకు 'శరధి'.

పులకరించితివేని సజ్జలకణములు
ముక్తిపొందియైపోవును మౌక్తికములు
రక్తిచెందెదవేని చిరత్నశిలలు
ధన్యతను జెంది కావె రత్నాల జాలు

అను పద్యము చిన్నదయ్యును మార్దవ గాంభీర్యముల నొక్కచో ముడిపెట్టుచున్నది. మృత్యువును సంబోధించుచు వారు వ్రాసిన పద్యములు సహజములును భావప్రేరకములునై మృత్యువు స్వభావమును జక్కగా వ్యక్తము చేయుచున్నవి. 'చావు లేదటవే మృత్యుదేవి నీకు' అని వా రడుగుట ఆమె కరాళదంష్ట్రలఁజిక్కి మాయమైన జీవకోటులపై వారికిఁ గల సానుభూతిని జాలిని శక్తిమంతముగా వెల్లడించు చున్నది. నిజముగా మృత్యుభయమేలేనిచో గర్వలోభా వృతుఁడైన మానవుడీ 'జగమున నెన్నెన్ని హిరోషిమాలు నరకమ్ము ల్నించునో' యని వారు సందేహించుట మృత్యువుకంటెను గ్రూరతరుఁడైన మానవుని దుస్స్వభా వమును జెప్పక చెప్పుచున్నది.

నెహ్రూ, సుభాసు, రవీంద్రులు గూర్చి కవిగారు రచించిన ఖండ కావ్యములు వారి దేశభక్తిని దేశనాయక మహాకవి భక్తిని ప్రకటించుచున్నవి. ఆ మహనీయు లందుఁగల మహాగుణ సంపద నీ కావ్యములలో వారు చక్కగా నిరూపించినారు. 'తాను భారత దేశముగాను భరతదేశవే తానుగానూ' వర్ధిల్లి పోయిన దేశభక్తాగ్రగణ్యుడు నెహ్రూజీ. 'సుభాసువాణి' నుత్తమ పురుషమున జెప్పుట రమణీయముగా నున్నది. 'బ్రతికి వచ్చిన వీరసుభాసు నేను, చచ్చి బ్రతికిన జీవనాశయము నేను' అనియతఁడనుట యాత్మశ్లాఘకాదు - పరమసత్య శోభితము.

మనుషులు మహాత్ములెందరు మరుగుపడిన
మరుగుపడరాదు స్వాతంత్ర్య తరణిదీప్తి
చితికిపోరాదు ఏ పరిస్థితులనైన
మీ మనోగతమానవతామతల్లి

యని కవిగారు సుభాసు నోటఁబలికించిన సందేశమున భారతీయులందఱికిని శిరోధార్యమైనట్టిది. రవీంద్రుడు 'దుర్భరదాస్య విశీర్ణసాహితీప్రాంగణమందు' విలసద్రస పారిజాతములు నాటఁజాలిన మహాకవీంద్రుడు. అతడు గురువునొద్దనధ్యయనముగావింపకయే, బడికేగకయే, దాతృవిరచిత ప్రకృతి పుస్తకమును మాత్రము పట్టి కవీంద్రుడై ఖండాంతరముల భరత ఖండమున కఖండ కీర్తి గడించి పెట్టిన మహనీయుడు.

ఈ ఖండ కావ్యములలో నెడనెడ శ్రీ బాపురెడ్డి గారు వెల్లడించిన భావములు గంభీరములై పూర్వ మహాకవుల భావములను స్మృతికిఁదెచ్చుచున్నది. స్నేహ సౌరభము నందలి-

ఒకరిని చూడగానె యెదియో అనురాదము
మోసులెత్తు, వే
రొకరిని చూచి చూడగనె ఓర్వమి ద్వేషము
పొంగులెత్తు దీ
నికిఁగల కారణమ్ము రమణీ కనరాదు వితర్క
హేతువా
దికి మరి జన్మజన్మలకు తీరని వాసన
లుండకుండునా?

యను పద్యము జగత్ప్రసిద్ధమైన కాళిదాసుని 'రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్యశబ్దాన్..... భావ స్థిరాణి జననాంతర సౌహృదాని' యను శ్లోకమును తలంపునకుఁ దెచ్చుచున్నది. నివేదన యందలి-

తెలిమబ్బుల మైదాన
మ్ముల జాబిలి బంతి యాడఁబోయి నిరాశన్
జలధి హృదంతమౌక్తిక
ములరత్నము లేరుకొనఁగ ముచ్చట పడుదున్

అను పద్యము పదముల కూర్పు చేతను, భావ వ్యక్తీకరణము చేతను, అలంకార సంఘటనము చేతను

గడుంగడు రమ్యమై పాఠకుల నాలోచనాబ్ధి తరంగముల నుయ్యాల లూపుచున్నది. మృత్యువు నందలి-

*ఇలవూచినట్టి జీవులు రాలి నీ కంఠ*
*హారమ్ము(జేర నున్నట్టి పూలె*

ఇత్యాదిగా(గల సీసము సుందరమైన నడకయు చక్కని భావ వ్యక్తియు(గల్గి యింపు నింపుచున్నది.

శ్రీ బాపురెడ్డి గారి రచన సర్వత్ర వారి హృదయము వలెనే ప్రసన్నమై, మధురమై చదివిన కొలంది చదువలెనను నుత్కంఠను రేకెత్తించుచున్నది. పద్యములన్నియు ధారాశుద్ధి శోభితములును భావ గంభీరములునై మకరంద ప్రవాహములవలె సాగిపోవుచున్నవి. ప్రసాదగుణము వారి కవితకు జీవగఱ్ఱ. వారు వాడిన పదములు కుసుములవలె రస ప్రసారకములు, కిసలయముల వలె మసృణములునై రచన కసమానమైన రామణీయకమును గూర్చుచున్నవి. వికారించు మున్నగు నపూర్వ ప్రయోగము లెడనెడ( గనవచ్చు చున్నవి. వారు పద్యములలో విసంధి చేసి వ్రాసినపట్లు కొన్ని సంధిచేసినచో గణభంగమునకు( దావిచ్చును. అట్టివానిని వారు పరిహరించి యుండ వలసినది. శంకత్వము, శ్రేయోవిర్భవము, స్వార్థాసురకు మున్నగు ప్రయోగములను మలి ముద్రణమున సులభముగా దిద్దుకొనవచ్చును.

శ్రీ బాపురెడ్డి గారు ఈ సంపుటమున సాధారణ వృత్తములతో పాటు "పిన్నలు, పెద్దలు, కన్నెలు, ప్రౌఢలు భేదము లెంచక వీధులలో", 'పాదుపందిరేని లేక పారుతీవలట్టులన్' మున్నగు కొత్త వృత్తములను, రవీంద్రుడను ఖండకావ్యమున ముత్యాల సరములను వాడియున్నారు. వారే వృత్తముల నెన్నుకొన్నను వానిని గుంటుపడనీక ధారాళముగా నడపించినారు. నివేదన యందలి కందములయు నచ్చటచ్చట గలసీసములయు నడక రమ్యముగా నున్నది.

శ్రీ బాపురెడ్డిగా రింతదనుక ఖండకావ్యములనే ప్రతిభా మహితముగా రచించి ప్రకటించి యుండిరి. వారి రచన ప్రౌఢ సుందరమును రస రమణీయమునై వస్తు కావ్య రచనానుకూల్యమును గడించుకొన్నది. తదనుగుణముగా వారింక ప్రౌఢకావ్య రచన కుపక్రమించి యాంధ్ర భాషాయోష కఠినవాలం కృతులు సమకూర్తురనియు, నట్టి యవకాశము భగవంతుడు వారి కొసంగువనియు( గోరుచు విరమించుచున్నాను.

*(1969లో "బాపురెడ్డి పద్యకావ్యాలు" గ్రంథ పీఠికనుండి)*

# శ్రుతి

**- డా॥ బోయి భీమన్న**

*మిత్రమా, బాపురెడ్డీ!*

"పీఠికా పీఠాధిపతి" అంటూ నన్ను నీవు పొగడటం వల్ల, ఆ పొగడ్తకు ఉబ్బిపోయి, నేను నీ కృతికి ఈ శ్రుతిని కూర్చడానికి తయారయ్యానే కాని, నా కంతటి పాండిత్యం ఉండి కాదు. పొగడ్త మాటలకు పుండరీకాక్షుడే ఉబ్బితబ్బిబ్బై పోతాడు కదా! నా వంటి మానవుడి లెక్కేమిటి?

స్తుతి, కీర్తన, భజన, పొగడ్తవంటివన్నీ సహృదయుడైన వ్యక్తి మనస్సును రంజింపజేయడానికి ఉద్దేశించబడ్డ మాటల కూర్పులే కదా?

ఒక్కొక్క దేవుడికి వలెనే ఒక్కొక్క జీవుడికి ఒక్కొక్క గుడి, ఒక్కొక్క స్తుతి పాఠం, ఒక్కొక్క భజన కూటం. లోకాన్ని హితంగానో, అహితంగానో చేసేవి-స్వర్గంగానో, నరకంగానో మార్చేవి, శాంతినో, యుద్ధాన్నో తెచ్చిపెట్టేవి - మాటలే. మాటలకు బానిసలు కాని మానవు లెవరు? మంచికి మంచి, చెడుకు చెడు.

మైత్రివి మెత్తని మాటలు.
కవితవి కమ్మని మాటలు

చెడ్డను సహించి, మంచిని వికసింపజేసే మాటలు మైత్రి అవుతాయి.

శ్రుతిపేయాలైన మాటలు కలిసి - సుభగ సుందరాలైన పద్మదళాలు కలిసి ఒక పద్మమైనట్టు - ఒక కవిత అవుతాయి.

సరస్సులోని అమనోజ్ఞాలైన నాచు, నత్తలు, కొంగలు, కాడలు, పడవలు, పల్లెవాళ్ళ వలలు ఎలా హృద్యాలు కావో - అలానే వాఙ్మయంలోని శ్రుతి సుందరాలు కాని తిట్లు, నిందలు, నినాదాలు, శాపాలు కవితలు కావు.

ఏవో కొన్ని మాటలు ఒకచోట అడ్డంగానో, నిలువుగానో అమర్చినంతమాత్రంచేత - వాటి కనుకట్టులో పడి కొంతమంది కుర్రవాళ్ళు మతులు పోగొట్టుకున్నంతమాత్రంచేత - ఎవడూ కవి కాడు. అతడు వ్రాసిందంతా కవిత్వమూ కాదు.

ఏ డైరక్టరు, ఏ ప్రొడ్యూసరు చేతిలోనో నలిగిపోయే ఒక సినీ వ్యక్తి పల్లెటూరివాళ్ళ దృష్టిలో ఏ సీతో, శ్రీరాముడో - ఏ రంభో, రాధాకృష్ణుడో అయి ఆరాధనీయం కావచ్చు. వాస్తవ జీవితంలో ఆ వ్యక్తి పాత్ర ఎందుకూ పనికిరానిదై ఉండవచ్చు. మాటల గారడీ మాత్రమే మహాకవిత్వంగా చెలామణి అవుతున్న ఈ రోజుల్లో ఎవడు కవో, ఎవడు అకవో ఎలా చెప్పడం?

కావ్య సృష్టి చేయవలసినవాడు కవి. దానికి పీఠిక సమకూర్చవలసినవాడు పండితుడు. కవి బ్రహ్మ, పండితుడు విష్ణువు. కవికి ప్రతిభ చాలు. పండితుడికి వ్యుత్పత్తి కూడ అవసరం. నేను కేవలం కవిని - పండితుణ్ణి కాదు. అయినా - పండితుడు మాత్రమే చేయవలసిన పనికి ఇప్పుడు నేను పూనుకొన్నాను. ఎంతటి సాహసం!

"కింకరుడే రాజగు, రాజే కింకరుడగు...." అని, ఏదో నాటకంలో ఒక పద్యం ఉన్నట్టుంది, కవే పండితుడు., పండితుడే కవి అవుతున్న ఈ నాటి తెలుగు సాహిత్య పరిస్థితికి ఆ పద్యం దర్పణం. కవి సమ్మేళనలలో ప్రాపుకోసం పండితుడు పద్యాలు వ్రాస్తున్నాడు. విద్యార్థుల సంస్కృతీ సంఘ సమావేశాలలో ఉపన్యసించడంకోసం కవి పాండిత్యం వెలగబెడుతున్నాడు. నేటి సాహిత్య క్షేత్రం వట్టి తాటాకు మంట. నిలిచే వెలుగూ లేదు, వేడీ లేదు.

నేడే కాదు. ఏనాడు మాత్రం తెలుగులో సాహిత్య సృష్టి జరిగింది? ఉభయ భాషా పండితులే తప్ప, మనకు కావ్య నిర్మాణ దక్షులైన ఋషు లెవ రున్నారు? నన్నయ్య మొదలు నేటివరకూ మనం మహాకావ్యాలని చెప్పుకొంటున్న శ్రీ మదాంధ్రగ్రంథాలన్నీ సంస్కృతానికో, మరే భాషకో అనువాదాలో, అను సరణలో కావా?

వేమన పద్యాలో, ఎంకి పాటలో తప్ప తెలుగులో మూల సాహిత్యం ఏది?

వాల్మీకిని, మనువును ఒక వర్గం పట్టుకొని వ్రేళ్ళాడుతూ ఉంటే - మార్క్సునూ, మావోనూ పట్టుకొని మరొకవర్గం దేవులాడుతున్నది. ఏవో నీతులు, నిబంధనలు, ఉసికొల్పులు, ఉద్రేకవాక్కులు తప్ప - మానవజీవితానికి సుఖాన్నీ, సంతోషాన్నీ, హాయినీ, హ్లాదాన్నీ సమకూర్చడానికి ప్రయత్నిస్తున్న కవులు ఆధునికులలో ఎంత మంది ఉన్నారు?

కవి, కవిత, కావ్యం అనే మాటలకు అర్థం ఏమిటి?

"కవయతీతికవి:" వర్ణించువాడు కవి. "కవ నీయం కావ్యం" - వర్ణింపదగినది కావ్యం. వర్ణన అంటే ఎటువంటి వర్ణన? లోకోత్తర వర్ణన. లోకోత్తర వర్ణనా నిపుణుడే కవి. రస భావ సమ్యక్స్రష్టే కవి. అందుకే "కవయః క్రాంతదర్శినః" అనీ, "నానృషిః కురుతే కావ్యం" అనీ, "కవిర్మనీషీ పరిభూఃస్వయంభూ" అనీ చెపుతూ - కవికి ఆదినుంచీకూడ ఉన్నతోన్నతమూ, లోకోత్తరమూ అయిన స్థానాన్ని ఇవ్వడం జరిగింది.

"వాక్యం రసాత్మకం కావ్యం"
"రమణీయార్థ ప్రాతిపదిక శబ్దః కావ్యం"
"ఇష్టార్థ వ్యవచ్ఛిన్నా పదావళి కావ్యం"
"కవనీయం - కావ్యం"
"లోకోత్తర వర్ణనా నిపుణ కవి కర్మకావ్యం"
"నిర్దోషం గుణాలంకార రీతి వృత్తిమత్ వాక్యం కావ్యం"
"రసేన ఏవ సర్వం జీవతి కావ్యం"
"రస ఏవ వస్తుతః ఆత్మా"
"ఔచిత్యం రస సిద్ధస్య స్థిరం కావ్యస్య జీవితం"
"రసాలంకార సంయుక్తం సుఖ విశేష సాధనం కావ్యం"

ఈవిధంగా మన పూర్వ లాక్షణికులు నిర్దుష్టతకు, ఔచితికి, రసపుష్టికి, భావ రమ్యతకు ప్రాధాన్యం ఇస్తే -

"Poetry is the language of imagination"
"Poetry is the rhythmic creation of beauty"
"Poetry is emotion recollected in transquility"
"A great book grows directly out of life"
"Poetry is the expression of life"
"Poetry turns all things to loveliness"
"Poetry exhalts the beauty of that which is already beautiful and adds beauty to that which is deformed"

అంటూ పాశ్చాత్య పండితులు కూడా అదే రసభావ సౌందర్యానందానికి పట్టాభిషేకం చేశారు.

ఈ నిర్వచనాలలో ఏ ఒక్కదాని దృష్టితో చూచినా - ఈనాడు అత్యాధునికంగా ప్రచారం చేసుకొంటూ వస్తున్న ఏ రచన కూడా కవిత్వ మనిపించుకోదు కదా?

అందుకే - నేటి తెలుగు సాహిత్యం వేస్తున్న వెర్రి తలలను గురించి ఈ మధ్య ఒక కవి సమ్మేళనలో నేనిలా చెప్పాను:

"విశ్వనాథ వర్గంవాళ్లు
వేద సంస్కృతి గ్రేవ్ డిగ్గర్లు

*కృష్ణశాస్త్రి సొసైటీవాళ్ళు*
*మడిబట్ట వదలని ప్రియురాళ్ళు*
*శ్రీశ్రీ ముఠావాళ్ళు*
*బొందితో కైలాసాని కనుకొంటూ*
*ఉష్ణ రక్త కాసారాల్లో*
*ఉరికి చస్తున్న అమాయకులు*
*ఇక - దిగంబరులు*
*ఎక్కడా భిక్ష దొరక్క*
*కవితా కాష్ఠానికి నిప్పుపెట్టి*
*విభూతికోసం కూర్చున్న జంగాలు.*
*మరి - మనలాంటి రసాద్వైతులు*
*ఈ నానా గోత్రాల లోకం పల్లకీని మోయలేక*
*తడబడుతున్న జడభరతులు."*

మనలాంటి రసాద్వైతులు అన్నప్పుడు - నా అంటే నాతోపాటు నీవూ, కొద్దిమంది మిత్రులూ, బహుశా నూటికి నూరుపాళ్ళు కవిత్వం చెపుతున్నవాళ్ళం కొద్దిమందిమి. తక్కినవాళ్ళలో కొందరు కుర్రవాళ్ళు అటు సంప్రదాయమూ అబ్బక, ఇటు కొత్త సృష్టీ చేతగాక రేవడ లవుతూ ఉంటే - పాతవాళ్ళు కత్తికీ, కలానికీ, సిద్ధాంత ప్రచారానికీ, సాహిత్య సృష్టికీ తేడా తెలియని చీకటిలో - రాజకీయ పార్టీలుగా విడిపోయి బండబూతులు తిట్టుకొంటున్నారు.

కలాన్ని కత్తిలా వాడమన్నా డొక అభ్యుదయ సాహిత్య గురువు. కత్తీ నరకడానికే, కలమూ నరకడానికే అయితే-గోగు కూరా పచ్చడికే. గులాబీ పువ్వూ పచ్చడికే అయితే - ఇక, మానవుడిలో ఇప్పటికే మినుకు మినుకు మంటున్న మానవతా జ్యోతి, సౌందర్య భావన, ఆనంద విభూతి నశించిపోక ఇంకెంతకాలం బ్రతుకుతుంది? ఆ తర్వాత మిగిలేదేమిటి? కేవలం ఆహార నిద్రాప్రవృత్తి కల మానవరూప జంతువే కదా? నేటి విరసాలూ, అరసాలూ దారి తీస్తున్న దక్కడికే కదా?

ఎడారిలో కాళ్లు తెగిపడి ఉన్న ఒంటరి ఒంటెను జాబిల్లితో పోల్చడం కవిత. ఆకాశంలోని జాబిల్లిని కాళ్లు తెగిన ఒంటెతో పోల్చడం అకవిత, సౌందర్యోపాసకుడు కాని వాడు కవి కాలేడు. కవి అయినవాడు కురూపిలో కూడా అందాన్ని చూడాలి. బీభత్సాన్ని కూడా రసస్థాయికి ఎత్తాలి. మృత్యువుకు కూడా జీవం పోయాలి. అందాలను నరికి పోగులు పెట్టేవాడు వడ్రంగి కాగలడేమో కాని, తోటమాలి కాలేడు.

తీపి, కారం, చేదు, వగరు, వెన్న, జొన్న, చారు, నీరు - ఏదైనా సరేజీర్ణమై జీవరసంగా మారినప్పుడే అది శరీర పోషకమవుతుంది. మానవుని ముంచెత్తే భావాలు, అనుభవాలు, సమస్యలు-అవి ఎలాంటివైనా సరేవాటికి స్వాదుత్వమిచ్చి, స్పష్టపరచి, రస స్థాయికి మలిచినప్పుడే అవి ఆనందానుభూతిని కలిగిస్తై. కవి కర్తవ్య మిది. కవి చేయవలసిన పని మానవుణ్ణి సేద దీర్చడం. అభయ మివ్వడం. ఆనందపరచడం. తద్విరుద్ధమైన రచన ఎంతటి కారంకలదైనా కవిత కాబోదు.

శ్రీశ్రీ పుట్టి సాహిత్యాన్నీ, ఘంటసాల పుట్టి సంగీతాన్నీ నాశనం చేశారని నా ఉద్దేశం. యువతరాల కళారాధకుల పాలిటికి వారిద్దరూ పైడ్ పైపర్లు (Pide Pipers) అయినారు. వారి వ్యామోహంలోపడి కుర్రవాళ్ళంతా ఫోటో నమూనాలుగా తయారైనారు, సంగీత సాహిత్యాలు వట్టి రైలుపట్టాలై ఊరుకొన్నై. సంగీతంజోలి మనకక్కరలేదు. కాని, సాహిత్యం మాత్రం శ్రీశ్రీ చేతుల్లో చావుదెబ్బతిన్నది. అభ్యుదయ భంజకమైన ఇలాంటి హీరో వర్షిప్ (Hero worship) ఇంతవరకు ఎక్కడా ఉండిలేదు. ఇదంతా నా పీఠికకు ఉప పీఠిక! ఇది గద్యకావ్యాల పరామర్శ కనుక. ఇది గద్య రచయితల, వారి గురువుల ధోరణులు కవిత్వ తత్వానికి ఎంత దూరంగా, ఎంత విరోధంగా ఉంటున్నాయో చూపడానికే ఇదంతా వ్రాశాను.

ఫ్రీవెర్స్ (Free verse) అనే ఇంగ్లీషు మాటకు

వచన కవిత్వం అని వాడడం చాలామందికి అలవాటయింది. యతి, గణ, ప్రాసలు లేకుండా, ఏ విధమైన ఛందో నియమమూ లేకుండా, భావప్రధానంగా, ఒక విధమైన శబ్దలయకు లోబడి వ్రాసేదే ఫ్రీవెర్స్ అంటే, ఇది కేవలం విదేశాల నుంచి దిగుమతి అయిన ప్రక్రియ అనుకొని దీనిని తెలుగులోకి వచన కవితగా అనువదించుకొన్నారు. అయితే ఈ ప్రక్రియ పూర్వం నుంచి ఉంది మనకు. అదే గద్యం. ఒక్క ఛందోబద్ధత తప్ప తక్కిన కావ్యలక్షణాలన్నీ కలిగింది గద్య కావ్యం. గద్యకావ్యాలను పూర్వులు అడ్డంగా వ్రాసేవారు. ఇప్పుడు మనం నిలువుగా వ్రాస్తున్నాం. అదే తేడా. ఈ కావ్యాలను నీవు సాంప్రదాయికమైన పేరుతో పిలవడం ఎంతో ఉచితంగా ఉంది.

ఇక్కడొక చిన్న విశేషం చెప్పాలి. గద్య కవిత ఛందోబద్ధం కాదనడం కూడా సరికాదు. ఇరవై ఆరు ఛందస్సుల క్రింద ఉత్పత్తి అయే కోటానుకోట్ల వృత్తాలలో, గద్య కవితలోని ప్రతి పంక్తి ఏదో ఒక ఛందస్సుకు లోబడి, ఏదో ఒక వృత్తం క్రిందికి వస్తూనే ఉంటుంది. తరచు యతి మైత్రినీ, ప్రాసానుగతినీ కూడా నీవు పాటించి తెలుగుకు స్వభావ సిద్ధమైన శ్రావ్యతనూ, సంగీత లయనూ ఇతోధికంగా పోషించావు. కవిగా పుట్టినవాడు మాత్రమే చేయగలిగిన పని ఇది.

"Render to Caesar the things that are Caesar's, and to God the things tht are God's" అంటూ ఆనాడు మత విషయంలో మహాప్రవక్త ఏసుక్రీస్తు చేసిన ఉద్బోధనే ఇక్కడ నేను కవిత విషయంలో చేస్తున్నాను. "Render to politics the things that are political, and to poetry the things that are poetic."

లెక్కలు, సైన్సు, చరిత్ర, రాజనీతి, అర్థశాస్త్రం మొదలైనవన్నీ మంచి భాషలోనే వ్రాయబడతై. రకరకాల సిద్ధాంతాలతో, నిర్వచనాలతో, ఆర్థిక జిగిబిగితో, పాండిత్య ప్రకర్షతో, అద్భుత విషయ వివరణలతో నిండి ఉంటై. అంతమాత్రంచేత అవన్నీ కవిత్వం కాబోవు.

ఇక ఒంట్లోనే అన్న సైన్సు, తమ్ముడు చరిత్ర చదువవచ్చు. తండ్రి కాంగ్రెసుగా, కొడుకు కమ్యూనిస్టుగా ఉండవచ్చు. అక్క టీచరైతే, చెల్లెలు డాక్టరు కావచ్చు. ఇవన్నీ వారి వారి వైయక్తిక లౌకిక జీవికలకు చెందిన విషయాలు. బైటి విషయాలు. ఇంట్లోమాత్రం వారందరూ తినేదిమాత్రం ఒకే తల్లి చేతి వంట. తల్లి చేతి వంటవంటిదే కవి. ఆర్థిక, సాంఘిక, మత, రాజకీయ తరతమాలను మినహాయించిన వెనుక, మిగిలే సహజ మానవులందరికీ సమానమైన ఉత్తేజాన్నీ, ఆనందాన్ని ఇవ్వగలిగిందే కవిత. వంటగదిని మేకపాలతో నింపుతానని తండ్రీ, వోడ్కాతో ముంచుతానని కొడుకూ పట్టుపడితే ఆ ఇల్లు ఎలా ఇల్లుగా నిలవదో - భావనలో రాజకీయ ప్రచారాన్ని ప్రవేశపెడితే ఆ రచన అలా కవితగా నిలవదు.

ఇలాంటి పరిస్థితిలో -

కేవలం సర్కస్ ఫీట్లు చేస్తూ, అవే వీరకృత్యాలుగా యువకుల్ని భ్రమింపజేస్తూ, మహారచయితలు సాహిత్య పురవీథులలో ఊరేగుతున్న ఈ రోజులలో -

"Poetry turns all things to loveliness" – "వాక్యం రసాత్మకం కావ్యం" అనే కావ్య లక్షణాలకు లక్ష్యా లనదగిన ఉత్తమకావ్యాలను సృష్టిస్తున్న నీవు ఎంత ధన్యుడవు! నీ కంటె ఈ ఆధునిక సారస్వత రంగంలో ఎవరు?

విశాఖ లేఖ మొదలు విదేశ యాత్రవరకు ఈ మధ్యలో ఉన్న కుక్కా కావ్య వస్తువూ, ఒక పుట, ఆధునికాసురుడు, ఏకాంతంలో వేదాంతం, రసజ్ఞాని విజ్ఞప్తి, నీరవరావాలు, సంతానశాస్త్రం, అంతరిక్ష పర్వం,ఎకనామిక్స్ సుందరి, పిల్లలమర్రితో ఇంటర్వ్యూ, మనోభిరాముడు, తాగిన సత్యం, అభయం, జీజీవిష-

ఈ కావ్యాలన్నీ ఒక్కొక్కటి ఒక్కొక్క విశిష్టరసకాండం కదా!

*"సాయంకాలం బీచి మీద*
*సరదాగా సాగిపోతుంటే*
*కలల అలలపై తేలుతున్నట్టుంటుంది*
*కమ్మని కావ్యం వింటున్నట్టుంటుంది"*

వర్ణన ప్రధానమైన విశాఖ లేఖ ఎంత ధ్వన్యాత్మకమో అంత రసాత్మకమని అందులోని ప్రతి నాలుగు పంక్తులూ ఋజువు చేస్తై. పై నాలుగు పంక్తులనూ కొంచెం మార్చి -

*'సాయంకాలం విశ్రాంతిగా*
*బాపురెడ్డి కావ్యాలు పఠిస్తూ ఉంటే*
*విశాఖ బీచిలో విహరిస్తున్నట్టుంటుంది*
*ఆనంద విశ్వంలోకి యాత్ర కదిలినట్టుంటుంది'*

అని అంటే బాపురెడ్డి కవితా స్వరూపం కళ్లకు కట్టినట్టవుతుంది కదా!

జీవిత మహార్ణవంలోని తృటికాలపు జీవులకు ప్రతిబింబాలైన కడలి అలలు, ఎంతటి మహాత్ముడికైనా లోకంలో శాంతి లేదని అనిపించే కల్లోల పొగరుడు, బ్రతుకులోని పరిమితుల్ని జ్ఞాపకం చేసే తీరాటంకిత తరంగాలు, బ్రతుకులోని బాధలకూ, మనసులోని మాటలకూ సాక్షిభూతమై స్కాండల్ పాయింటూ, లౌవ్వాలీ, ఈ లోకంలో ఒకణ్ణి మించిన వాడొకడుంటూనే అంటాడనిపించే బళ్లు, లారీలు, ట్రెయిన్లు, ఓడలు, హనుమంతుడు సంజీవినీ పర్వతాన్ని ఎత్తినట్టు ఓడలనుండి టన్నులకొలదీ బరువుల్ని ఎత్తే క్రేన్లు, బ్రతుకు బ్యాటరీని మళ్లీ మళ్లీ చార్జి చేసుకోవడం కోసం ఏర్పడి ఉన్న ...... ఇలా చెప్పుకొంటూ పోతే - నీ "విశాఖ లేఖ " కావ్యం గురించిన కావ్య పరామర్శ ఒక మహాగ్రంథమే అవుతుంది.

జీవితాన్ని ఒక సమగ్రమైన సౌందర్య దృష్టితో, తాత్విక దృష్టితో దర్శిస్తున్న నీ విశాఖ లేఖ ఒక్కటీ ఒక మహాకావ్యం. " No man is ever yet a great poet without being, at the same the time a profound philosopher"అనే కాగ్రిడ్జి మహాశయుని ప్రవచనానికి "Truth naked is philosophy, clothed is poetry" అనే నా నిర్వచనానికి కేవల లక్ష్యప్రాయమనదగి నట్టిది విశాఖ లేఖ. అందులోని ప్రతి ఒక సౌందర్యదర్శనమూ, ప్రతి వచనమూ ఒక జీవిత సత్యం.

అంతేకాక -

"అందమైన చందమామ ముఖంలోని నల్లని మచ్చల" వలె మురికి పేటల్ని, గాలీ వెలుతురూ దర్శనమీయని గుడిసెల్నీ, అందులో నివసించే చేపలవాళ్ళనీ, కాపురాలు పెట్టడానికి ఇళ్లు దొరక్క భంగపడే ఉద్యోగుల తీరుల్నీ గురించి నీవు చేసిన వర్ణనలు ఎంతటి వ్యంగ్య సౌందర్య విలసితాలు! మానవతా వికసితాలు!

"పేదలకూ, సాదకులకూ, పెద్దలకూ, పిన్నలకూ. కాలనడచి వెళ్లేవాళ్లకూ, కారుల్లో పోయేవాళ్లకూ అందరికీ అందుబాటులో ఉన్న అప్పన్న" గురించి నీవు వ్రాసింది కవితా తత్వస్వరూపాన్నే వ్యంజిస్తున్నది. "ఓ ప్రక్క సాగర గంభీరత్వాన్ని, మరో పక్క కొండల ఔన్నత్యాన్నీ" సంతరించుకొన్నది.

"కుక్కా-కావ్య వస్తువూ" అద్భుతమైన రచన. దిక్కూ మొక్కూ లేక కూడు గూడూ లేక, కేవలం అనాసక్తంగా గ్రామాన్ని కాస్తూ, జీవిత సేవ చేసే ఊరకుక్కను కావ్యవస్తువుగా తీసుకొని, నిరుపేదకూలీల పరిస్థితిని వ్యంగ్య మర్యాదతో నీవు చేసిన చిత్రణ అపూర్వం. ఆ కుక్కకు పెట్టిన నమస్కారం శ్రమదాన ధర్మానికి చేసిన నమస్కారం.

*"రమ్యం జుగుప్సిత ముదారమథాపి నీచం*
*ఉగ్రం ప్రసాది గహనం వికృతంచ వస్తు*
*యద్వాప్య వస్తుకవి భావక భావ్యమానం*
*తన్నాస్తి యన్న రసభావ ముపైతి లోకే"*

(రయ్యం కానీ, రోత కానీ, ఉత్తమం కానీ, అధమంకానీ, భయంకరం కానీ ప్రసన్నం కానీ, గంభీరం కానీ, వికృతం కానీ, వస్తువు కానీ, అవస్తువుకానీ........ కవి చేత భావ్యమానమై రసభావం కలిగించనిదేదీ లేదు. అని దశ రూపకం చెపుతున్నది. సృష్టిలో ప్రతి లవమూ పరమాత్మ రూపమే. పరమ సుందరమే. సుందర వస్తువులోని సౌందర్యం ప్రతివాడికీ కనిపిస్తుంది. వికృత రూపంలో సౌందర్యాన్ని దర్శించగలవాడు కవి ఒక్కడే. తాత్వికుడికి సమస్త లోకమంతా ఆదమరచి నిద్రపోతున్నప్పుడు తాను మాత్రం జాగ్రత్త వహించి ఉండి, లోకుల వస్తు వాహనాలను దొంగల నుంచి కాపాడే కుక్క వాస్తవానికి కామధేనువుకంటే సుందరం కాదా!

కవి వేదాంతి కాకుండా మహాకవి కాలేడు. "ఒక పుట" కవిత ఒక్కటీచాలు నిన్ను మహాకవిని చేయడానికి. గద్యంలో కూడా రసవత్తరమైన ఆశువు చెప్పవచ్చు ననడానికి ఈ కావ్యోత్పత్తి చరిత్ర ఒక నిదర్శనం. "ఏకాంతంలో వేదాంతం" కూడా అట్టిదే. ఈ కోవ రచనలకు "జిజీవిష" మకుటాయమానం.

*"చావడాని కేమో*
*వీలు కాకుండా ఉంది,*
*బ్రతకటానికేమో*
*బాట కనిపించడం లేదు."*
*చావడం ఎలా అన్న ప్రశ్న*
*బ్రతకరాదా అంటుంది*
*బ్రతకడం ఎలా అన్న ప్రశ్న*
*చావలేవా అంటుంది."*

ఈ చావు బ్రతుకుల సమస్య చస్తే తీరుతుందా అంటే-

*"లంచాలు తినే దేవుళ్ళు*
*ఈ నిరుపేదను*
*స్వర్గానికి పోనిస్తారని*
*నమ్మక మేముంది?"*

నీవు వ్రేలెత్తి చూపుతున్న ఆధునికాసురుడు విశ్వరూపం ధరించి వీధి వీధినా కనిపిస్తాడు.

*"వాడి మాట బెల్లంలా తీపి*
*వాడి బాట నాగుబాముకు కాపి*
*వాడు కులుకుతాడు మిత్రుల నెడబాపి*
*వాడు వేస్తాడు గాంధీజీకి టోపి"*

గాంధీజీకి టోపీ వెయ్యబడడం వల్లనే కదా స్వాతంత్ర్యానంతర భారత పరిస్థితి ఇంత అధఃపతనమైపోయింది? ఈ అసురుడు కొద్దో గొప్పో ప్రతి భారతీయుడిలోనూ ఇల్లు కట్టుకుని, పునాదుల్నే త్రవ్వేసుకొంటున్నవాణ్ణి ఎవరి మట్టుకు వారు వెతికి పట్టుకొని రూపు మాపితే తప్ప ఈ దేశానికి మోక్షం లేదు.

గాడిద మీద మూటలు మోయించినట్టు కవితచే మాటలు మోయించవద్దనీ బాలపల్లవ కోమలవాగ్దేవిచే బస్కీలు తీయించవద్దనీ "రసజ్ఞుని విజ్ఞప్తి" ................ పెద్దలు గుర్తిస్తే ఎంత బాగు!

*'పాడలేని పక్షులు సైతం*
*వీడ నక్కర లేదు ఆమనిని"*

నీవు ఋషివి. ఇది ఋుక్కు. పాడే శక్తి కల కోకిలలు పాడవచ్చు. పాడలేని కాకులు, నెమళ్లు, పావురాలు వంటి పక్షులు వసంతం వచ్చింది కదా అని తాము కూడా పాడటం మొదలు పెడతాయా? పాడలేక పోయినంత మాత్రం చేత వసంతంలో ఆనందంగా జీవించే హక్కు, అర్హత తమకు లేదనుకుంటాయా? సహజంగా కవి అయిన వాడు కవిత చెప్పవచ్చు. తక్కిన అందరూ తమ ప్రవృత్తులకు అనువైనరంగాలలో రాజనాలు పండించుకోవచ్చు. జీవిత వసంతంలో, సుఖానుభవంలో అందరూ సమభాగస్థులే. కేవలం పేరు కీర్తుల కోసం, సమ్మానాల కోసం ఎరువు గొంతుకలతో ఎలుగెత్తి అరిచే మానవుల వెర్రిని ఎంత సరసంగా నిరసించావు!

"మనుష్యులు పుట్టేది
మరణించడానికే కాదు
..............................................
..............................................
ఆనందం వివేక బ్రహ్మదయాదత్తం
యాతనలు అవివేక క్రియా కల్పితం"

అంటున్నది నీ "సంతాన శాస్త్రం."

"కష్టపడ్డా బ్రతుకులేనివాళ్లను
ముష్టి అడుక్కునేవాళ్ళను
కన్నీళ్ళతో కడుపు నింపుకునేవాళ్ళను
కన్న వాళ్లెవరైనా పాపిష్టులే"

"బ్రతికి పేరుకొచ్చేవాళ్ళి ద్దరు చాలు
బ్రతకలేక పడిచ్చేవాళ్ళెందుకు వేనవేలు?"

ఇలా, అత్యంత - రమణీయార్థ ప్రాతిపదికంగా సాగిపోయిన ఈ సంతాన శాస్త్రం ఆధునిక పరిస్థితిలో తదితర శాస్త్రాలన్నింటికీ మకుటం వంటిది.

శతాబ్దాల మానవ మహాభారతంలో నీ "అంతరిక్ష పర్వం" ఉద్యోగ పర్వం. మానవుడు చంద్రగోళం మీద కాలుపెడితే, నీ లేఖినీ సరస్వతి కొత్త హంసపాదం మోపింది. ఏడేళ్ళ క్రితం తాను చంద్ర మాతకు పంపిన రాకెట్టు రాయబారం ఫలించిన ఆనంద మత్తతతో వీరవిహారం చేసింది.

"విజ్ఞాన కవచధారి
విశ్వంభర రాయబారి
సృష్టి రహస్యాల మీద
మరొక్క చీకటి తెర తొలగించాడు
అనంత తారాపథంలో
ఆరని దీపం వెలిగించాడు."

అంటూ ఒక ప్రక్క ఆనందపడుతూనే - విజ్ఞానంతో మానవుడు సాధిస్తున్న ఈ అద్భుత విజాయాలన్నిటికీ ఏమిటి పర్యవసానం అనే ప్రశ్నకు లోనై, మానవుడిలో కాపురముంటున్న దానవుణ్ణి తలచుకొని భయపడి -

"లోకాన్ని తగల బెట్టడానికి అగ్గిపుల్ల కంటే అణుబాంబు గొప్పకాదు. ద్వేషాన్ని ప్రచారం చెయ్యడానికి కాకి అరుపుల కంటె కమ్యూనికేషన్ సాటెలైట్లు మిన్నకాదు. కరువు కాటకాలు చూపడానికి కెమెరాలు అక్కర్లేదు. ఆర్తనాదాలు వినిపించడానికి ఆకాశవాణి కావాలా?" అంటూ కొంత వాపోయి, శక్తిని సంపాదించుకోవడం చెడును నిర్మూలించడానికే కాని, మంచిని మంట గలపడానికి కాదు" అంటూ ఉద్బోధించి చేతులు ప్రజారక్తంతో తడుపుకొని, కాళ్ళు చంద్రలోకం మీద పెడితే ఏం లాభం" అని చెప్పి, "దురుపయోగం చేసి ఆత్మజ్ఞానాన్ని దూరం చేసుకొన్నాం. సదుపయోగ పరిచి పదార్థ విజ్ఞానాన్నైనా దక్కించుకుందాం. నరకలోకమై పోతున్న నరలోకాన్ని నవీన పర్వంగా మలుచుకొందాం" అంటూ కర్తవ్యం నిరూపించి చూపిన బాపురెడ్డీ! నిజంగా నీవు కవితా ప్రవక్తవు కాదా?

"సీతను చెరబట్టిన రావణుని
చదువూ, సాహసమూ ఏమైంది?
శాంతిని చెరబట్టే మానవుని
శాస్త్ర విజ్ఞానము అలానే అవుతుంది."

సకల సౌందర్యాలకూ, సమస్త సుందరీ మణులకు, రాగాలకూ, భోగాలకూ సంగమస్థానం నీ "ఎకనామిక్సు సుందరి." ఉపజ్ఞ, ప్రజ్ఞ, ప్రతిభ పరమ సారమ్యం చేరి వికసించిన నవకవితా స్వామ్యం ఇది.

"వసంతాన్ని
ఎ యూనిట్‌గా తీసుకున్నా -
ప్రేయసీ!
నేను చేస్తున్న
నీ అధర సుధా కన్జంప్షన్
లా ఆఫ్ డిమినిషింగ్ యుటిలిటీకే
ఎ ఎక్సెప్షన్."

మొత్తం ఈ రచన అంతా ఇక్కడ ఉదాహరించాలని ఉంది. ఒక్క ఈ రచనే కాదు - నేను మొదటే చెప్పినట్టు - నీ ప్రతి రచనా, అందులోని ప్రతి పంక్తి ఏదో ఒక అందానికీ, ఒక సందేశానికీ ఒక లక్ష్యంగా ఉదాహరించదగినట్టిదే. స్థలాభావంచేత కేవలం పేజీలు త్రిప్పుతున్నాను. ప్రతీ పంక్తీ తమ తమ రకాల భావాల సౌందర్య విలాసాలతో పట్టి నిలిపి, తమ తమ ఆనందాంతఃపురాలలోకి గుంజుకుపోతూ ఉంటే - ఎలానో వదిలించుకొంటూ ముందుకు సాగుతున్నాను. లేకపోతే - నా ఈ పీఠికా ప్రస్థానం ఎంత కాలానికి ముగుస్తుంది!

"మనోభిరాముడు." "తాగిన సత్యం" రెండూ రెండు విశిష్టకావ్యాలు. నీ "తాగిన సత్యం" మానవ ప్రతి హృదయాల్లోనూ దాగిన ముత్యం. తాగే వాళ్లంతా దైవంగా కొలుస్తారు నిన్ను - ఈ రచన మూలంగా.

" పిల్లి కల్లు తాగితే
పులిలా ఫీలవుతుంది"
"కోతికి బ్రాందీ ఇస్తే
గీతాపారాయణం చేయదు
కొంపలంటిస్తుంది.
కోకిలకు మధువందిస్తే
హేమంతంలో కూడా పాడుతుంది."
" ఉన్న శక్తి చాలనప్పుడు
ఊతగా ఉపయోగిస్తుంది మధువు,
ప్రేరణ గాలిలా వీచినప్పుడు
వీవనలా పని చేస్తుంది మధువు"-

అవును.

" పిల్లలమర్రితో ఇంటర్వ్యూ. "విదేశయాత్ర" దేని కదే అతీతింద్రియమైన కావ్యాలు. పిల్లలమర్రి ఒక లోకోత్తర భావన. రోజా అందరూ చూసే ఒక మర్రి చెట్టు అది. శతాబ్దాలుగా ఉన్నదక్కడ. నీవు ఋషివి. నీది సిద్ధాత్మ. నీ దృష్టి దివ్యదృష్టి. అందుకే ఆ చెట్టు నీతో మాట్లాడింది. నీవు దాని అమరగాథను విన్నావు.. లోకానికి వినిపించావు. వైదిక ఋషులు చేసింది కూడా ఇదే. ఇదే అపౌరుషేయం అంటే.

"పాడుతున్నాయనుకొన్నాను కలకంఠాలు
రాలుతున్నాయనుకొన్నాను పండుటాకులు
ఇవన్నీ నీ గొంతుక లనుకోలేదు.
నీ కొమ్మలలో దాగివున్న కోరిక లనుకోలేదు"

ఎంత బాగుంది!

" నిన్ను అభిమానించే వాళ్ళు, స్తుతించేవాళ్ళు
నీకు ఏమైనా చేస్తున్నారా?"

ఇది నీవు మర్రిచెట్టును అడిగిన ప్రశ్న కాదు- ప్రతి కవినీ, కళాస్రష్టనూ, ప్రతి సాధువునూ, శ్రమ జీవిని అడుగుతున్న ప్రశ్న.

" రంభోర్వశుల విలాసాలు స్ఫురించే
రసజగత్తులు కళ్ళముందు నర్తించే
లంబాడీ జవ్వనుల లాస్యాలు"

నడుస్తున్న నీ గద్య కవితల చరణాలకు ఇవే నీరాజనాలు.

"కలలు, కళలూ పూచిన
కాశ్మీర దేశమా,
ఇలారమణి పెదవిమీద
వెలిగే దరహాసమా!"

దేశానికి నీ "అభయం " నవసాహితీ సరస్వతి ప్రగతికే ఆశయం.

ఇక- నీ 'విదేశీయాత్ర' ఆంధ్రసాహితీచరిత్రలో ఒక అపూర్వ కవితా నవశకోదయానికి నాంది. గద్య కవితా ప్రబంధం అనవచ్చు.

ఏథెన్స్ అరుణోదయం, పూల బాల హాలెండ్, స్కాండినేవియా, లండన్, పారిస్, బెలిజియం, జర్మనీ, జెకోస్లొవేకియా, స్విట్జర్లాండు, ఇటలీ, ఏథెన్స్ అనే

ఉపశీర్షికల క్రింద - ఆ యాదేశాలలోని అనుభవాలకు దర్పణంగా నడిచిన కవిత ఇంతవరకు తెలుగువాళ్లు కనీ వినీ ఎరుగనిది.

విదేశాలకు వెళ్లేవాళ్లందరు మొత్తంమీద ఏదో ఒకటి పోగొట్టుకుని వస్తారు. నీవు మాత్రం అక్కడక్కడి అపూర్వ సౌందర్యాలన్నింటినీ మూట గట్టుక తెచ్చి, తెలుగు సరస్వతికి అమూల్యాభరణాలుగా కూర్చి తీర్చిదిద్దావు.

ఈ కావ్య సౌగంధికంలోని సుధనూ, సౌరభాన్నీ సహృదయులు ఎవరిమటుకు వారు ఆస్వాదించ వలసిందేకాని చెప్పితే తెలిసేది కాదు.

*"ఎగసిపోయింది మా విమానం*
*జలద జలజ చుంబనాసక్తబంభరంలా*
*ఉదితారుణ కిరణపుంజంలోనుంచి*
*నిదురలేచి పోయే కపోత పోతంలా"*

కావ్యంలో తన్మయమై, భావనారూపంలో నీతో పాటు లీనమై నీ అనుభవాలన్నిటా పాలు పంచుకోవడం తప్ప ఇప్పుడు నేను చెయ్యగలిగిం దేమీ లేదు.

నీ వర్ణనల పాలకడలిలో చంద్రుణ్ణయి మునిగి తేలుతున్నాను నేను.

*"కొండల్లాంటి*
*రాకాసి గుండెల్లాంటి*
*బకాసురుని కండల్లాంటి*
*సౌధాలతో నిండిన*
*లండన్ మహానగరం"లో*

నిలబడి - అస్తమించడనుకొన్న సూర్యుడు ఉదయించడమే లేదని నవ్వుకొన్నావు కదూ - క్రిస్టమస్ పండుగనాడు!

"మార్క్సు మహాశయుడు
మహాసామ్రాజ్యాలకు
చరమగీతం వ్రాసిన
సంధ్యాచల శిఖరం -
*చరిత్రను వడపోసి తీసిన సారం -*
*రాలిపోయిన పద్మాలు*
*తేలుతన్న కాసారం బ్రిటిష్ మ్యూజియం."*

ఓహో, అహా అనిపించే సాహో శృంగార వీథుల్లో, నైట్ క్లబ్బుల్లో కామ కలాపాలు, కామినీ నగ్న నాట్యాలు చూడకుంటే చూడాలనిపిస్తుంది. చూస్తే చూడగూడ దనిపిస్తుంది. మానవమనః ప్రవృత్తి! అవును "కామినులు నగ్నంగా ఆడడం మిధ్య, మనం కళ్లార చూడడం మిధ్య" అనుకొని మనం బయటికి వచ్చేస్తే ఏ ఇబ్బందీ లేదు. అలానే వచ్చేశాం కూడా నీవు వాస్తవంగా, నేను ఊహామాత్రంగా.

బాపురే, బాపురెడ్డీ! ఆధునిక భారత యువకవితా పరిషత్తులో నీది గురుపీఠం కాదటయ్యా?

*" ఎవడో బైటివాడు మెచ్చుకొంటే తప్ప*
*ఎందుకూ కొరగాని వాళ్ళం మనం,*
*ఇటలీవారికి తెలుగంటే*
*ఏమిటో తెలియదంటే మనం వినం"*

అంటూ మన భాషను "ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్ " అని చెప్పుకొని మనం పడే గర్వాన్ని గురించి నీవు చేసిన హేళన కేవలం వాచ్యమేనా? దానిలో మొత్తం నేటి తెలుగు సాహిత్య పరిస్థితే వ్యజించబడడం లేదా? ఈనాడు తెలుగు సాహిత్యం పరిస్థితి ఎలా ఉంది?

మొన్న మొన్నటి వరకు - నన్నయ్య, తిక్కన, శ్రీనాథుడు, పెద్దన మొదలైనవారిని సాహిత్యానికి యుగకర్తలుగా నిర్ణయించి, వారి వారి అడుగుజాడలలో పద్యాలు వ్రాయాలని ఆదేశించారు పండితులు. "పెద్దన వలె కవిత చెప్పిన పెద్దనవలె, లేకపోతే ఎద్దనవలె, మొద్దనవలె, గద్దనవలె" అంటారు. సొంత గొంతు వినిపించే నిజమైన కవుల్ని తిట్టిపోసి, నిరుత్సాహ పరిచారు. "కందం వ్రాసినవాడే కవి" అని నినాదమిచ్చి,

తోటమాలి స్థానంలో వడ్రంగిని నిల్పి పూజించారు. తెలుగు సాహిత్య మహారణ్యాన్ని ఉద్యానంగా దిద్దడానికి బదులు ఎడారిగా మార్చిపారేసారు.

మహాకవులు, సాహిత్య సార్వభౌములు వందల కొలదీ ఉన్నారు. సమ్మానాలు/బిరుదులూ, అవార్డులూ పొందుతున్నారు. మూల సాహిత్యాన్ని పోషిస్తున్న కవి మాత్రం లేడు.

ఇంజనీర్లు, డాక్టర్లు, వివిధ విజ్ఞాన శాస్త్రాలలో అనుభవజ్ఞులైనవాళ్ళు, రాజనీతిజ్ఞులు, ఆఫీసర్లు, ప్రజా సంక్షేమ కార్యకర్తలు, జీవితాన్ని అన్ని విధాల అనుభవించిన రసజ్ఞులు - రచనా వ్యాసాంగానికి పూనుకొన్ననాడే తెలుగులో మహాకావ్యాలు, గొప్ప నవలలు, ఉత్తమ నాటకాలు వెలువడతై, అందుకు, నీవూ, నీ కావ్యాలూ నిదర్శనం.

కవిత భూమినుండి వచ్చే సస్యం వంటిది. శరీరానికి అన్నరసంపలె హృదయానికి పుష్టినీ, తుష్టినీ ఇచ్చే ఆనంద రసం అది. ఈనాడు కవిత పేరిట మార్కెట్లోకి వస్తున్న సరుకు కార్ఖానాల నుంచీ, ఫేక్టరీల నుంచీ దిగుమతి అవుతున్నట్టిది.

ఇదంతా ఎందుకు చెపుతున్నానంటావా? ఒక ప్రక్క ప్రజాసౌఖ్యాన్నీ మానవ ప్రగతినీ పెంచడానికి వివిధ రంగాలలో జరుగుతున్న కార్యక్రమాలను వృత్తాలుగా తీసుకొని, అభివృద్ధి కృషి సాహితీకరిస్తున్న నీ వంటి కవులను ఉపేక్షిస్తూ - మరో ప్రక్క అందమూ, ఆనందమూ ఎరగని కేవల భౌతికపరులైన, మార్కెట్లో మాటల గారడీలు చేస్తున్న ఆ కవులను అనుకరిస్తూ - యువకులు మోసపోతున్నందువల్ల ఇప్పు డిదంతా చెప్పవలసి వచ్చింది.

అలాంటి పరిస్థితిలో దేశకాలపాత్రానుకూలమైన నిర్మాణాత్మకత వైపుకు యువతరాన్ని మలచడానికి నీవు కలం పట్టావు. అందుకు నీకు జోహార్లు........... "creative artist represents the most conscious point of generation" అంటాడు ఇలియట్. ఇలియట్ ప్రవచనాన్ని నీ ప్రతి రచనా నిరూపిస్తున్నది

ఏ వస్తువు స్వీకరించినాసరే - ఆ వస్తువు భావనను సౌందరీకరించడం కవిత. హృదయమూ, మెదడూ ఉన్న మానవ జాతి బీజ ప్రకృతి బ్రతికి ఉన్నంత కాలం రసమే జీవం. రసమే ఆనందం. రసాత్మకమైనదే కవిత.

# బాపురెడ్డి భావ భౌతికవాదం

- డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం

సాహిత్యం ఎప్పుడూ క్రొత్తదనాన్నీ, క్రొత్త దర్శనాన్నీ కోరుతుంటుంది. క్రొత్తదనాన్ని ఇంగ్లీషులో నావెల్టీ అంటారు. దానివల్ల సాహిత్యానికి చమత్కారం కలగవచ్చు. అభినవసాహిత్య స్ఫూర్తి విడంబించవచ్చు. అందులో మొదటిదానికంటె రెండవది ఆదరణీయం, ఉపాదేయం. సాహిత్యంలో ఈ క్రొత్త దనాన్ని పాశ్చాత్య విమర్శకు లోక కావ్యలక్షణంగా భావించారు. దానిని పరిశీలించే విధానాన్ని నిర్దేశిస్తూ టి.యస్. ఎలియట్ ఇలా వివేచించాడు. "Whether the impression of novelty has been created to surprise or shock as an end in itself, or whether it is the product of true originality, of the genuinely new or of the expression in fresh and arresting ways of permanent and universal truths." పఠితలకు అబ్బురపాటు కలిగించటం, తబ్బిబ్బులు పెట్టించటం చమత్కార మార్గాన్ని అనుసరించే నవ్యత లక్షణం. ఇది ఉత్తమం కాదు. పదాల గారడీ గాని, అంత్య ప్రాసల లీలావిలాసం కానీ, వక్రతావిన్యాసం కానీ, శ్లేష చమత్కృతి కానీ, ఉక్తుల పారడీ కానీ క్రొత్తగా అనిపించవచ్చునుగాని కలకాలం నిలచే సత్తువ వాటికి ఉండదు. క్రొత్తదనం సత్తువతో నిలవాలంటే సరిక్రొత్త దర్శనం కవితకు కావాలి. దాన్ని మౌలికమయిన ప్రతిభతో ఆవిష్కరించే కవిశక్తి కావాలి. భావనలో, అభివ్యక్తిలో ఒక నవ్యస్ఫూర్తి భాసించాలి. ఇంత జరిగినా దర్శనం పాక్షికంగా, నైమిత్తికంగా ఉండకూడదు. శాశ్వతాలూ, విశ్వజనీనాలూ అయిన సత్యాలను అన్వేషించే అనంత మార్గాలకు ఆకర్షకంగా ఉండాలి. నవ్యత సాహిత్యానికి జీవనాడియైతే, దర్శనం సాహిత్యానికి జీవశక్తి.

విప్లవ కవిత్వం దాకా వచ్చిన ఆధునికాంధ్ర సాహిత్యం సరిక్రొత్త నవ్యతను అందించే దర్శనం కోసం ఆరాటపడుతోంది. ఆ దర్శనం మార్క్సిస్టు దృక్పథంకంటె విలక్షణంగానూ, విశ్వజనీనంగానూ, సామాజిక స్పృహతో కూడుకొన్న సౌందర్యదర్శనం గానూ ఉండాలని సాహిత్యలోకం ప్రతీక్షిస్తున్నది. బాపురెడ్డి గారు 'అనంత సత్యాలు' కావ్యం ద్వారా అందించిన 'భావ భౌతికవాదం' ఆధునికాంధ్ర సాహిత్యానికొక వెలుగు బాటలా ఉన్మీలిస్తుందనటంలో అనుమానం లేదు.

నేడు ప్రచురంగా సాహిత్యాన్ని శాసిస్తున్నది గతి తార్కిక భౌతిక వాదమూలమైన మార్క్సిస్టు దృక్పథం. 'Marxist dialectical materialism is the form of materialism which explains social institutions and histoical changes in terms of material forces that is, the mode of production which characterizes the economic system of a society'. (D.W.L.T.) ఈ దృక్పథంలో వెలువడే సాహిత్యానికి సామాజికస్పృహ ఆయుస్సూత్రం. సామాజిక స్పృహ అంటే రాజకీయ వేత్తల్లో, సాహితీ వేత్తల్లో భిన్నమయిన అవగాహన కనబడుతుంది. దీన్ని వివరిస్తూ శ్రీ ఆర్.ఎస్. సుదర్శనంగా రిలా వివేచించారు: 'రచన చెయ్యడం ద్వారా రచయిత సామాజికుడుగానే ఒక పాత్ర నిర్వహిస్తున్నాడు. సమాజం నుంచి పొందిన జీవితానుభూతిని రచనలో పునస్సృష్టిస్తున్నాడు. సాహిత్యం అనుకరణ కాదు. సృష్టి అనుభూతి రచయితలో మధింపబడుతున్నంత వరకు

ఆత్మాశ్రయమే. భాషలో విశిష్టమయిన రూపాన్ని పొందగానే అది ప్రత్యేకమయిన వస్తువుగా, సజీవ శిల్పంగా అస్తిత్వం పొందుతుంది. సృజనాత్మకరచన వస్త్వాశ్రయం కాదు. ఒక ప్రత్యేకమైన వస్తువు. సజీవంగా సామాజికులకు అందుబాటులో ఉండే వస్తువు. ఎంతమందికని ప్రశ్న కాదు. సమాజమే దాన్నిగూర్చి తీర్పు యిస్తుంది. రాజకీయ వాదికి ఒక్కనికే ఆ అధికారం దత్తం కాలేదు. మార్క్సు అలా దత్తం చెయ్యలేదు. ..... కరుడుకట్టిపోయే చారిత్రక బంధాల నుంచి మనిషికి విముక్తి కలిగించే చైతన్య స్ఫురణ, ప్రేరణ, స్పృహ సృజనాత్మక రచనలో వ్యంగ్యంగా అభివ్యక్తమయితే, దాన్ని 'సాహిత్యంలో సామాజిక స్పృహ' గా గుర్తించడమవుతుంది. యిది రాజకీయవాది ఊహకన్న అభిప్రాయంకన్న విస్తృత మయినదీ, సున్నితమయినదీ, బహురూప సమన్విత మయినదీ, బంధవిముక్తి, సామాజిక పురోగతి, రాజకీయ చర్య ద్వారానే జరుగునని అనేవాడు రాజకీయ వాది. అతనికి రచయిత తత్వమూ సాహిత్యతత్వమూ అగాహనకు రావు" (సమాలోచనం - పు. 4.5). సమకాలీనాంధ్ర కవులలో చాలా మంది సామాజిక స్పృహను మన్నిస్తున్నారు. కాని, దానికి రాజకీయవాదం నుండి విముక్తి కలిగించాలని కొందరు యత్నిస్తున్నారు. సామాజిక స్పృహతో కవియే నాయకుడుగా సాహిత్య రంగాన్ని రూపొందించాలనే సాహిత్య స్పృహ కవిత్వంలో రావాలని ప్రయోగాలు చేస్తున్నారు. రాజకీయమే జీవిత సర్వస్వం కాదనీ, మానవుని సర్వజీవ ప్రవృత్తులను, సామాజిక చైతన్యాన్ని తీర్చి దిద్దే శక్తులు మరెన్నో ఉన్నాయనీ, వాటి నన్నింటిని జాగృతం చేసి, ప్రగతి పథంలో పయనింపచేసే అభ్యుదయాన్ని సాహిత్యం దర్శించి ప్రపంచించాలని గాఢంగా భావిస్తున్నారు. ఈ చైతన్యం నవ్యత కొక నవీన మార్గం.

ఈ నవీన మార్గం ఇప్పుడు ఉషఃకాంతులను ప్రసరిస్తున్నది. ఇందులో రాజకీయనాయకత్వం నుండి సామాజిక స్పృహకు విముక్తి కలిగించి, దానికి విశ్వజనీనమైన కళాస్వభావాన్ని అలవరచాలన్న ఉద్యమోత్సాహం కనపడుతున్నదేకాని, భావి సాహిత్యాన్ని ఒక నిర్దిష్టమార్గంలో నడిపింపగలిగే నిర్దుష్ట దర్శనం ఇంకా అరుణోదయస్ఫూర్తితో ఉదయించవలసి ఉంది. దీనికి కొందరు కవులు తెలుగులో కృషి చేస్తున్నారు. కవిసేనలాంటివారు దీనికి ఉదాహరణం. ఈ ప్రయత్నం వారితోనే ఆగలేదు. వ్యక్తిత్వం ఉన్న కవులు వైయక్తికంగా వేరు వేరు దర్శనాలతో ఆ విముక్తి మార్గాన్ని ఆవిష్కరిస్తున్నారు. అలా ముందుకు వస్తున్న అభ్యుదయ కవుల్లో శ్రీ బాపురెడ్డిగారొకరు. వారి 'భావభౌతికవాదం' సరిక్రొత్త స్వేచ్ఛావాదం.

శ్రీ బాపురెడ్డి సహజంగా అనుభూతివాదియైన భావుకుడు. ఆలోచనను అనుభవంగా వ్యక్తీకరించటమే కవిత్వమనే తత్వాన్ని కవితగా రూపొందించటమే ఆయన ప్రయోగం. ఆధునికాంధ్రకవితలో అనుభూతి సన్నగిల్లుతూ ఆలోచన అనుకరణరూపంగా పరిణమిస్తున్న పరిస్థితి నాయన గుర్తించి పరితపిస్తారు. ఆలోచనకు అనుభవం పునాది, అనుభవం నుండి ఆలోచన ఉదయిస్తే అది విత్తు నుండి మొక్క పుట్టినట్లుగా సహజ పరిణామసుందరంగా ఉంటుంది. ఆలోచనతో అనుభవాన్ని అన్వేషిస్తే అనుకున్నది కనపడుతుంది. కాని అసలు తత్త్వం అవగాహన కాదు. అనుభవం ఆత్మీయమైంది. ఆలోచన అనుభవోద్భవమైతే స్వీయానుభవస్ఫూర్తితో వస్తుదర్శనం లభిస్తుంది. స్వీయానుభవం విశ్వజనీనంగా మార్చుకొనగలిగే సంస్కారం సాహిత్యోపాసకుని కుండాలి. సౌందర్యోపాసనం లలితసంస్కారాన్ని కలిగిస్తుంది. దాన్ని కాలానికీ, పరిసరానికీ మించిన విశ్వవాతావరణంలోకి ప్రసరింపజేసేది తత్త్వం.

సౌందర్యానికి తత్త్వం పరిమళంగా ప్రసరించాలి. సౌందర్యానికి ప్రతీకమైన పుష్పం భౌతికం; అది అందించే సౌగంధ్యం భావనామయం. ఒకటి సుగుణం, మరొకటి నిర్గుణం. భౌతిక వాస్తవం పుష్పమైతే, అందులోని సౌందర్యం భౌతికసత్యం. ఇది ఇంద్రియాల ద్వారా మనస్సుకు అనుభవాన్నిచ్చే సత్యం. ఆ సత్యంలో భావనామయమైన అనుభూతి నిచ్చే సౌగంధ్యం కవితాతత్త్వ దర్శనం. ఇదే కవితలో వస్తు తత్త్వంగా వ్యంగ్యమౌతుంది. కవిత పుష్పం; సౌందర్యం అనుభవం; ఆలోచన తత్త్వం. ఈ మూడు కవితా సత్యాలే. విడదీయలేని త్రివేణి సంగమం ; విశ్లేషించలేని త్రిపుటి. ఈ మూడింటిని ఈ క్రమంలో ఆవిష్కరించటమే కవితాభివ్యక్తిగా బాపురెడ్డిగారి దర్శనం.

సమకాలీన సాహిత్య జగత్తులో ఈ ప్రస్థానం వ్యత్యస్తంగా కనబడుతోంది. కొందరి దృష్టిలో ముందు సిద్ధాంతం, అది చూచినదే సత్యం. ఆ సత్యంలో సౌందర్యం కాదు ముఖ్యం. సిద్ధాంత తత్త్వం, అంటే నీ వనుకున్న సుగంధాన్నిచ్చేదే పుష్పం. ఆ పుష్పం ఆ సుగంధాన్నివ్వటమే వాస్తవం. ఇలా దర్శించటమే తత్త్వం. అదే సత్యం. ఈ విపరీత ప్రస్థానానికి విరుగుడు మార్గమే బాపురెడ్డి కవితాప్రస్థానం.

ఆధునిక మానవుడు పదార్థ విజ్ఞానం వల్ల భౌతిక వస్తు విశ్లేషణాన్ని చేసి వివేకాన్ని సాధిస్తున్నాడు. దాన్ని శాస్త్ర దృష్టితో తర్కబద్ధం చేస్తున్నాడు. ప్రయోగ ముఖంగా సాగే పదార్థవిజ్ఞానం అతనికి వస్తువు యొక్క యథార్థస్థితిని వివరిస్తున్నదే కాని దాని పరమార్థాన్ని పట్టి చూపటం లేదు. ఈ దృష్టితో మనిషి మానవజీవితాన్ని కూడా విశ్లేషిస్తున్నాడు; వివేచన కందించే వాస్తవ మంటున్నాడు; ఆ వాస్తవం ప్రయోగ మూలం, అందువల్ల తెలిసిన వాస్తవం ప్రతిదీ ప్రయోగపరిజ్ఞానంతో పరిష్కరించే అవకాశం ఉండటం చేత దాన్ని శాశ్వతంగా గ్రహించలేకపోతున్నాడు. అయితే, సత్యాన్వేషణ దృష్టికి శాస్త్రదృష్టి ప్రధానమని ప్రామాణికంగా భావిస్తున్నాడు. శాస్త్రదృష్టివల్ల పొందే విజ్ఞానం వివేచనకు పనికివచ్చి నంతగా వ్యక్తి వికాసానికి తోడ్పడటం లేదు. చంద్రమండలాన్ని చుంబించినా మనిషిలోని జంతు భావం చావటం లేదు. జంతువు మనిషి కావటం జరిగితే మనీషిగా మారిన ఒక సార్థక్యం ఉంటుంది. మనీషిగా మనిషిని మలుస్తున్న పదార్థ విజ్ఞానం మౌలికంగా మనిషిని మనిషిగా మార్చటం లేదు. అందువల్ల మానవ జాతిలో మానవత్వ లక్షణాలను పునరుద్ధరించవలసిన అవసరం ఏర్పడుతోంది. పదార్థ విజ్ఞానం, అర్థబలం, అంగబలం ఎంత ఉన్నా హృదయబలం, ఆత్మబలం నేటి సమాజానికి కరువైపోతున్నాయి. సాహిత్యం కొరవడుతున్న ఈ మానవశక్తుల్ని మేల్కొల్పాలి. పోషించాలి. ప్రబోధించాలి. అనుభవింపచేయాలి.

*"ఆత్మజ్ఞానానికి*
*ఆవలిగట్టు దేవుడు*
*పదార్థ జ్ఞానానికి*
*ఆఖరిమెట్టు అనంతత్వం*
*అంతర్ముఖంగా*
*యోగమార్గం*
*అన్వేషిస్తున్నది దైవత్వాన్ని*
*బహిర్ముఖంగా*
*ప్రయోగమార్గం*
*శోధిస్తున్నది అనంతత్వాన్ని ।*
*రెండు మార్గాల సంగమం*
*నా మనోమండలం"*

(అనంత సత్యాలు)

అన్న బాపురెడ్డి ప్రతిపాదన వ్యక్తిగతం మాత్రమే కాదు, సమకాలీన సమాజం అంతర్ముఖంగాపడుతున్న ఆవేదన. ఆత్మజ్ఞానం + పదార్థజ్ఞానం = సాహిత్య దర్శనం; దైవత్వం + అనంతతత్త్వం = సాహితీతత్త్వం

అన్నది బాపురెడ్డి భావ భౌతిక వాదానికి మూల సూత్రం. ఇందులోని భావం మానవుడు జీవితతత్త్వాన్ని గురించి సాగించే ప్రస్థావానికి ప్రతినిధి. అనంతత్వం హేతు వాద శాస్త్ర దృష్టితో సృష్టిని సమీక్షించే ప్రయోగ మార్గానికి ప్రతీక. ఈ రెండింటి యొక్క మిశ్రరూపం మానవ జీవితానికి సాహిత్య మందించే సరస సందర్శనం. దీని వలన కలిగేది ఆనంద బ్రహ్మానుభూతి.

"భావవాద
భౌతిక వాద
సరస సమ్మేళనంలో
ఆనంద బ్రహ్మను దర్శిద్దాం!"

అంటాడు శ్రీ బాపురెడ్డి. దైవత్వం మానవుడు అందుకొనదలిచిన పరిపూర్ణత్వానికి ప్రతీక! అనంతత్వం ప్రకృతిలో పదార్థ సత్యాన్ని అన్వేషించాలన్న ప్రయోగ దర్శనానికి ఫలత్వం. భౌతికం పరిపూర్ణత్వ భావనతో సంవదించినపుడు అనుభూత మయ్యేది ఆనంద మనే అనంత సత్యం. ఇది సాహిత్య మార్గాన్ని అనుసరించి అనుశీలించి అనుభవించే ప్రవృత్తి కవితాసృష్టి.

బాపురెడ్డి గారు 'ఆనంద బహ్మను దర్శిద్దా' మన్నప్పుడు పరమ ఛాందసుడా అనిపించవచ్చు. నిజాని కాయన కాదు. భౌతిక దృష్టిని భావదర్శనంగా మార్చి సాహిత్య ప్రస్థానంగా సమున్మీలింప చేసే సౌందర్య శాస్త్ర దృష్టి ఆయనది. ఆయన ప్రతిపాదిస్తున్న భావ భౌతిక వాదం విశ్వజనీన సౌందర్య దర్శనం (Universal Easthetic vision) గా కనిపిస్తుంది. సౌందర్య దర్శనంలో సత్యం ప్రాతిభాసికమనీ, అలౌకిక మనీ ప్రాచ్యలాక్షణికులు పారిభాషికంగా ప్రతిపాదించారు. దాన్ని లౌకిక సత్యం కంటె భిన్నమయిన సాహిత్య సత్యంగా, కళాసత్యంగా పాశ్చాత్య విమర్శకులు వివేచించారు. సర్వానుభవాలకూ ఇంద్రియాలెంత ప్రమాణమో, అంతరంగం కూడా అంత ముఖ్యం. తర్కాన్ని ఆశ్రయించి బుద్ధి నడిచినా, ప్రయోగ విజ్ఞానాన్ని నమ్మి ఇంద్రియాలు వర్తించినా అవన్నీ అనుభవ బిందువులో అర్థమయి అనుభవస్ఫూర్తిని పొందాలంటే ఆనందమనే అగ్ని కావాలి. కరడుకట్టిన విజ్ఞానం ఆనందాగ్నితో కరిగి అనుభవాకృతి తాల్చినప్పుడే మనిషి సహృదయుడుగా మారేది. అలా మారిన సహృదయునిలో ప్రవృత్తిత్రయం ప్రదర్శితమవుతుంది. వాటిని నివేదిస్తే - " దార్శనిక ప్రవృత్తి ; వాస్తవిక ప్రవృత్తి; అనుభవ ప్రవృత్తి" - అని చెప్పుకోవచ్చు. ఈ మూడింటి సమగ్ర వికాసమే మానవ పరిపూర్ణ వ్యక్తిత్వ వికాసం. ఈ మూడింటిలో ఏ ఒక్కదానివో సత్యమని నమ్మి, మిగిలిన వాటిని త్రోసిరాజంటే అది సమగ్ర దర్శనం కాదు. బాపురెడ్డి గారి భావభౌతికవాదం సహృదయ దృక్పథంతో సత్యాన్వేషణం. సత్య నిరూపణం, సత్యాను భవం సాధించే సమన్వయ మార్గాన్ని ప్రతిపాదించింది.

"మనకు కనిపించేది
సత్యం కాదని
మాయావాది వాదం;
మరి మనకు కనిపించనిది
సత్యం ఎలా అవుతుందని
హేతువాది ప్రశ్న.
సమయసత్యాలే కాని
శాశ్వత సత్యాలు లేవు
మనం ఒక సత్యం
మాయకూడా ఒక సత్యం
ఏదీ సత్యం కానప్పుడు
అన్నీ సత్యాలే అవుతాయి"

అన్నవాదం బాపురెడ్డి ప్రతిపాదన ప్రజ్ఞను ప్రకటిస్తున్నది. ఈ వాదం 'ఏకం సత్' అని చెప్పే వేదాంతం కాదు; ప్రత్యక్షప్రమాణాన్ని కోరే హేతువాదం కాదు; భావ సత్యాలుగా భావించి అనుభవించే సాహిత్య సహృదయ వాదం. పై రెండు వాదాలూ సాహిత్య

క్షేత్రంలో సత్యాన్వేషణకు పనికిరావనీ, సాహిత్య దృక్పథంలో పదార్థమొకటయినా, అందులో ప్రతిభాచక్షువునకు కనపడే సత్యాలనంతాలనీ, సౌందర్య దర్శనానికందే పరమార్థం కవితాత్మయైన రసబ్రహ్మమనీ బాపురెడ్డి గారి వాద తాత్పర్యం.

కల్పితం శాశ్వతం కావటం భౌతిక ధర్మం కాదు. కాని, సాహిత్యంలో అపూర్వ నిర్మాణక్షమమైన ప్రతిభా శక్తితో కవి తన కావ్యంలో దర్శించి, ఆనంద స్పర్శనందించేటట్లు ఆవిష్కరించి అందించిన సౌందర్య సత్య సృష్టి అంతా కల్పితమైనా శాశ్వతంగా, విశ్వజనీనంగా భాసిస్తున్నది.

"కళ్ళు కల్పిస్తాయి సత్యాన్ని
బుద్ధి కల్పిస్తుంది సత్యాన్ని
అవసరం కల్పిస్తుంది సత్యాన్ని
అందుకే
ఒకే వస్తువులో
రకరకాల సత్యాలు
సత్యాలన్నీ కల్పితాలే
సత్యాలన్నీ శాశ్వతాలే"

అన్న బాపురెడ్డి వాక్యాలు వారి సిద్ధాంతానికి వ్యాఖ్యానాలు. కల్పిత సత్యం శాశ్వతం అన్నది భౌతికంగా విరోధాభాసం. అలాగే అనిపిస్తుంది భావ భౌతిక వాదం. కాని, సాహిత్య దర్శనంలో అది సార్థకం; సమన్వయ సుందరం.

"మనిషి జీవితం
ఒక మహాకావ్యం
జీవితం ఒక నిత్య సత్యం
అయినా అది మహాస్వప్నం"

జీవితాన్ని చీల్చి చూసేది శాస్త్రం; జీవితాన్ని మిధ్యగా భావించి త్రోసివేసేది వేదాంతం. నిత్యసత్యాన్ని భౌతికంగా చూచి, భావలోకంలో మహాస్వప్నంగా అనుభూతి నిచ్చేది సాహిత్యం. శాస్త్రం భౌతికానంద మిచ్చినా మానసికవేదనను సృష్టించింది; వేదాంతం జీవితాన్ని గూర్చి రాద్ధాంతం చేసి నిర్వేదాన్ని కలిగించింది; నేటి సమాజంలో నాగరకతకు ఆనందం లక్షణమైతే, నిర్వేదం జీవితానికి ఫలమివ్వలేని నిరర్థక ప్రస్థానమయి పోయింది. ఈ రెంటికీ ఉజ్జీవనం కలిగే ఉజ్జ్వలమార్గం సాహిత్యం చూపిస్తే మానవుని సహజానందాన్వేషణం సఫలమవుతుంది.

"దేహం ఆనందాన్వేషి
మనస్సు ఆనందపిపాసి
బుద్ధి ఆనందోపాసి
త్రివిధానంద సమాధి
జీవిత పరమావధి "

గతి తార్కిక భౌతికవాదం మానవుని ఆర్థికాభ్యుదయాన్ని అందించే ఆనందాన్ని కల్పించాలని యత్నిస్తోంది. ఆర్థికంగా సమానత్వాన్ని సాధించిన మానవలోకం హార్దికంగా విశ్వమానవసమానత్వం సాధించే సంస్కారాన్ని భావయోగం ద్వారా సంపాదించాలి. మనిషిని మనిషిగా భావించే సహృదయత జనంలో సమున్మీలించాలి. అయినా అహంకార స్వార్థాభిమానాలు మనిషిని మనిషితో ఐక్యం చేయలేకపోతున్నాయి. వాటిని చంపుకున్నప్పుడే మనిషిలో మమత ఉదయిస్తుంది. ప్రేమ పెల్లుబుకుతుంది. ప్రేమతో మనిషి లోకాన్ని చూస్తే ప్రతివ్యక్తిలో దైవత్వం స్ఫురిస్తుంది. ఆ దైవత్వాన్ని ఆధ్యాత్మికంగా అందుకుంటే ఆత్మజ్ఞాని అవుతాడు. సాహిత్యం ద్వారా సాధిస్తే రసయోగి. సామాజికస్పృహకు రసయోగం వల్ల సార్వజనీనత లభిస్తుంది. రాజకీయం నుండి విముక్తి సిద్ధిస్తుంది. తాత్త్విక చింతనకు రసయోగం వల్ల సహృదయత సమకూరుతుంది. మిధ్యావాదం నుండి సౌందర్యదర్శనం పాటమరిపిస్తుంది. భౌతికంగా సాధింపదలచుకొన్న సర్వమానవసమానత్వానికి భావ

లోకంలో భద్రతను కల్పించేదీ, భావలోకంలో భద్రంగా నిలిచే విశ్వజనీన దృక్పథానికీ శాశ్వతత్వాన్ని సమకూర్చేదీ బాపు రెడ్డి గారి భావ భౌతిక వాదం. అందుకే తన ప్రస్థానాన్ని మనిషినుంచి ప్రారంభించారు బాపురెడ్డి గారు. జీవితాన్ని ఒక మహాకావ్యంగా దర్శించారు.

*" జీవితం*
*జనన మరణాల మధ్య*
*కాలం వ్రేలాడగట్టిన*
*కాంతి రేఖ"*

అని జీవనగీత వినిపించారు. "మా వూరి నుండి బయలుదేరి, మానవ లోకమంతా స్పర్శిద్దాం" అని విశ్వజనీనతను ప్రకటించారు; " మా వూరును మీ ఊరిలో దర్శిద్దామని" అద్వైతాన్ని ప్రదర్శించారు. వీరి కవితా ప్రస్థానానికి కరదీపిక "అనంతసత్యాలు" కావ్యం.

మార్క్సిస్టు దృక్పథంలోనే చూచింది భౌతిక సత్యం; సౌందర్యతత్వ దృక్పథంతో ఆలోచించింది భావసత్యం ; సృష్టించింది కవితా సత్యం అన్న ఏకైక సత్యాన్ని దర్శించే ఆధునికాంధ్ర కవిత్వ ప్రస్థానానికి, రాజకీయ శృంఖలాలను త్రెంచివేసి, అఖండ సంస్కారధారగా కవిలో పొంగే స్వేచ్ఛా దర్శన స్వాతంత్ర్యాన్ని దర్శించి, కవితాత్మయైన రసానుభవాన్ని హృదయభాండాల్లో నిండించి, సాహిత్య ప్రస్థానం అనంత సత్యాన్వేషణ ప్రవృత్తితో సౌందర్య దృక్పథంతో సాగించే సహృదయ నిత్యసత్య సృజనాసరస్వతీ ప్రవాహమని ఎలుగెత్తి చాటుతున్నారు శ్రీ బాపురెడ్డి. వారు కోరేది కవితకు భారమైన రాజకీయ ప్రభావ శృంఖలాల విముక్తితోపాటు భావ భౌతికవాద ప్రసక్తి.

*" పరిణామానికి పాట నేను*
*భవిష్యత్తుకు బాట నేను*
*జననానికి మరణానికి మధ్య*
*జీవితాన్ని నేను*
*కాల ప్రవాహ ప్లవాన్ని నేను*
*క్రమ వికాస విప్లవాన్ని నేను*
*రండి నాతో రండి"*

మరో మహాప్రస్థానాన్ని సాగించే మహాకవిలా పిలుస్తున్నాడు శ్రీ బాపురెడ్డి. తన భావభౌతికవాదం సాహిత్య సామ్యవాదమంటున్నాడు. వినండి ఈ కొత్త పాలికేక:

*"సామ్యవాదిని*
*అందరిలో అన్నిటిలోని సామ్యాలను కలిపే*
*సాహిత్య సామ్యవాదిని*
*సాహిత్య స్వామ్యవేదిని."*

# ఒకనాటి మాట

- ఆచార్య పేర్వారం జగన్నాథం

డా. జె. బాపురెడ్డి నాకు చిరకాల మిత్రుడు. సహృదయుడు, స్నేహశీలి, ఆర్ద్రత ఉన్నవాడు. అనురాగం కలవాడు. అన్నింటికన్నమించి, సాహితీవేత్త, కవి వరేణ్యుడు, రసజ్ఞశేఖరుడు. అటు పాలనాదక్షుడూ, ప్రజారంజకుడున్ను.

నలభై సంవత్సరాల క్రింది మాట. 1955లో వరంగల్లులో ఇంటర్మీడియట్ చదువుతున్న విద్యార్థులం కొంత మంది కలసి "సాహితీబంధు బృందం" అనే సంస్థను స్థాపించి ఉంటిమి. దాని తరపున అప్పుడప్పుడు కలం పట్టి కవితలు రాస్తుండిన యువకవుల కవితల్ని సమీకరించి 'తొలికారు' పేరుతో ఒక కవితా సంకలనాన్ని ప్రచురించినాము. అందులో బాపురెడ్డి కవితలు కూడా అచ్చైనవి. అంటే, అప్పటికే అంతటి చిన్న వయసులోనే కవితా వ్యాసంగం ప్రారంభించి, పత్రికల్లో ప్రకటిస్తూ బాపురెడ్డి పాఠకుల మన్ననలకు పాత్రుడైనాడు.

1956లో జరిగిన తెలంగాణా రచయితల సంఘం వార్షికోత్సవాలలో ఆయన్ని మొట్టమొదటిసారిగా కలుసుకున్నాను. చూడగానే ఆయనలో విలక్షణమైన వ్యక్తిత్వం కనిపించింది. ప్రసన్నవదనమూ, సంభాషణా చాతుర్యమూ, కల్పుగోలుతనమూ-ఇవన్నీ ఆయనలో కనిపించినాయి. ఆ సంవత్సరం నేను ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆర్ట్స్ కళాశాలలో బి.ఏ. చదువుతున్నాను. అప్పటినుంచి ఎప్పుడు కలిసినా ఆయన నన్నెంతో ఆప్యాయంగా పలుకరిస్తూ అనురాగాన్ని చిలుకరిస్తూ ఉండేవాడు. సమయం లభించినపుడల్లా తకన కవితల్ని వినిపిస్తూ ఉండేవాడు. ఎంతో సోదరభావాన్ని ప్రకటించేవాడు. క్రమంగా మా స్నేహం గాఢమైంది. మరి కొన్నాళ్ళకు ఆయన ఉస్మానియా ఆర్ట్స్కళాశాలలో ఎం.ఏ., ఎకనామిక్స్ చదువుతున్నప్పుడు 'ఏ' హాస్టల్లో చేరినాడు. నేనంతకు ముందే 'ఏ' హాస్టల్లో చేరి వరుసగా నాల్గు సంవత్సరాలు అందులో ఉన్నాను. అదే సమయంలో నా మరొక చిరకాల మిత్రుడు, ప్రొఫెసర్ ఎన్. యాదగిరిరెడ్డి కూడా అదే హాస్టల్లో ఉండేవాడు. మేమంతా తరచుగా కల్సుకొని, సాహిత్య విషయాలూ, విద్యార్థుల సమస్యలూ చర్చించుకుంటూ ఉండేవాళ్లం. డా. బాపురెడ్డిలో కలుపు గోలుతనము ఎక్కువ కనుక అతనికి హైదరాబాదులో చాలా మంది మిత్రులుండేవారు. ప్రొఫెసర్ యాదగిరి రెడ్డిలో నాయకత్వ లక్షణాలు ఎక్కువగా ఉండేవి. తరచుగా మేము కల్సుకొని గంటల కొద్దీ హాస్టల్ సమస్యలతో సహా, అనేక అంశాలగూర్చి చర్చించుకుంటూ ఉండేవాళ్లం. విద్యార్థుల ఉద్యమాలన్నింటికీ 'ఏ' హాస్టలు కేంద్ర బిందువుగా ఉండెడిది.

1959వ సంవత్సరంలో విద్యార్థి సంఘానికి జరిగిన ఎన్నికల్లో ప్రొఫెసర్ యాదగిరిరెడ్డిని మేమంతా కల్సి తెలుగుభాషా సంఘానికి అధ్యక్షునిగా ఎన్నుకొన్నాం. అదే సంవత్సరం జరిగిన వ్యాసరచన పోటీల్లో ఆర్ట్స్ కళాశాల తెలుగు మ్యాగజైన్ "శోభ"కు నేను సంపాదకునిగా ఎన్నికైనాను. ఇట్లు మేము ఒక సంవత్సర మంతా కలసి సాహిత్య సాంస్కృతిక కార్యక్రమాన్ని అత్యంతవైభవోపేతంగా, విజయవంతంగా నిర్వహింప గల్గినాము. ఇక్కడే ఒక విషయాన్ని ప్రస్తావిస్తాను. నేను సంపాదకునిగా వున్న విశ్వవిద్యాలయం తెలుగు మ్యాగజైన్ 'శోభ'లో ప్రచురింపబడిన కవితల్లో ఉత్తమమైన

దానికి బహుమతులు ప్రకటించి ఉంటిని. అందులో ప్రచురింపబడిన బాపురెడ్డి 'ఎకనామిక్స్ సుందరి' అనే కవితకు ఉత్తమ అవార్డు లభించింది. ఇది అంత చిన్న నాడే ఆయనలో మొగ్గతొడిగిన కవితాశక్తికి నిదర్శనం. బాపురెడ్డి ఎకనామిక్స్ విద్యార్థి కనుక దానిలోని మౌలిక సూత్రాలను, సైద్ధాంతిక నిర్వచనాలను, తన ఊహాసుందరికి అన్వయిస్తూ, శాస్త్రవిషయాల్ని కవితగా మలచి అత్యంత రమణీయంగా ఆ గేయాన్ని రచించినాడు. ఈ తొలికారు కవితా సంకలనం ఆచార్య చేకూరి రామారావు ఆనాడు రచించిన 'శ్రీయుత నామముతోనే చిరతర సంపద లబ్బవు, శ్వేత వస్త్రధారణతో చెడుతలపులు దాచలేవు' అనే గేయంతో ప్రారంభమయింది.

ఇక్కడ మరో విషయాన్ని గుర్తుచేస్తాను. విస్నూర్ రామచంద్రారెడ్డి వద్ద హెడ్‌గుమస్తాగా వుండిన మిస్కినలీ కుమారుడు తస్నినలీ ఆర్ట్స్ కళాశాలలో ఎం.ఏ., లో మాకు సమకాలికుడు. అతడా సంవత్సరం ఆర్ట్స్‌కళాశాల విద్యార్థి సంఘానికి అధ్యక్షునిగా కూడా ఎన్నికైనాడు. ఆయన అనుసరించిన అనేక అక్రమ పద్ధతుల వలన ఆయనతో పోటీచేసిన బాపురెడ్డి అనుకోని విధంగా కొద్ది ఓట్లతేడాతో ఓడిపోయాడు. హాస్టల్లోనే ఉండే మరొక మా సన్నిహిత మిత్రుడు ప్రొఫెసర్ జె.వి. రాఘవేంద్రరావును తస్కినలీ ఒక సందర్భంలో అవమానపరిచినాడు. అప్పుడు మేమంతా ప్రొఫెసర్ యాదగిరిరెడ్డి రూములో సమావేశమై, తస్కినలీకి వ్యతిరేకంగా ఉద్యమాన్ని ప్రారంభించినాము. అంతేకాక ఆర్ట్స్ కళాశాల ప్రవేశాంగణంలో సమావేశమై విద్యార్థి లోకాన్నంతా కదలించి, తస్కినలీ రాజీనామా చేసేదాకా పోరాడినాము. చివరికి ఆ విద్యార్థి సంఘకార్యనిర్వాహక వర్గం అంతా రాజీనామా చేయక తప్పలేదు. ఈ ఉద్యమానికి వెనుక చక్కని సలహాలిచ్చి ఉద్యమాన్ని తీవ్రతరం చేసినవాడు బాపురెడ్డి. యాదగిరిరెడ్డి దానికి నాయకత్వం వహించి ఉద్యమాన్ని నడిపించినాడు. మేమంతా మాకు తోచినట్లుగా ఉద్యమానికి సహకరించినాము.

ఇక్కడ నా స్వంత విషయానికి సంబంధించిన దానిని ప్రస్తావిస్తాను. ఎం.ఏ. పూర్తికాగానే బాపురెడ్డి తన కవితలన్నింటిని కలిపి "చైతన్య రేఖలు" అనే పేరుతో ఒక కవితా సంకలనం ప్రచురించి, ఆంధ్రసారస్వత పరిషత్తులో ఆవిష్కరింపజేసినాడు. దాన్ని చూసివిద్యార్థిగా ఉన్న కాలంలో రచించి పత్రికల్లో ప్రచురించిన నా కవితలన్నింటిని కలిపి నేను కూడ "సాగర సంగీతం" పేరుతో ప్రచురించినాను.. మిత్రుడు బాపురెడ్డి తానే ముందుపడి నా 'సాగర సంగీతం' గ్రంథావిష్కరణ మహోత్సవాన్ని నవ్యసాహిత్య సమితి పక్షాన శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయంలో ఏర్పాటు చేయించినాడు. ఇది ఆయనలోని సహృదయతను చాటుతుంది.

నవ్యసాహితీ సమితి అధ్యక్ష కార్యదర్శులుగా ఉండిన పద్మశ్రీ డా. బోయి భీమన్న, కళాప్రపూర్ణ పోతుకూచి సాంబశివరావు ఈ కార్యక్రమాన్ని తమ భుజస్కంధాలపై వేసుకొని దిగ్విజయంగా జర్పించినారు. నా పుస్తకానికి ముందుమాటలు వ్రాసి నన్నెంతో ప్రోత్సాహపరిచినారు. మహాకవి, జ్ఞానపీఠ అవార్డుగ్రహీత, పద్మభూషణ్ డా. సి. నారాయణరెడ్డి నా కవితాత్మను విశ్లేషిస్తూ చక్కని పీఠిక వ్రాసి నన్ను ప్రోత్సహించినారు. ఆ సభకు ప్రముఖ సాహితీవేత్తలు కవులు, పండితులు, నా గురువర్యులు అందరూ హాజరై నన్ను దీవించినారు. ఆ సభను అంతటి వైభవంగా జర్పించిన ఘనత డా. బాపురెడ్డిది.

హైదరాబాదు నగరంలోని మిత్రులను కలువడానికి తరచూ నేను బాపురెడ్డితో కలసి వెళుతూ ఉండేవాన్ని. ఆయనకు హైదరాబాదునగరంలో ఉన్న

మిత్రులకు కొదవలేదు. ఆయన ఎవరినీ ద్వేషించేవాడు కాదు. ఒకరిని నొప్పించడం ఆయనకు చేతకాని పని. సహాయం చేస్తాడు తప్ప అపకారం చేయడం ఆయన స్వభావం కాదు.

బాపురెడ్డిలో మానవ సంబంధాలు అధికంగా ఉండేవి. ఆంధ్రాభ్యుదయ ఉత్సవాలలో ఆయనది అందెవేసిన చేయి. ఆయన తన ప్రతిభాపాండిత్యాలను ప్రదర్శించి, ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీస్ కమీషన్ వారి మొదటి తరగతి ఉద్యోగాలకు జరిగిన పోటీ పరీక్షల్లో నెగ్గినాడు. అతని ప్రోబేషన్ కాలంలో డిప్యూటి కలెక్టరుగా విశాఖపట్టణానికి పంపడం జరిగింది. అప్పుడు నేను సికిందరాబాదు స్టేషను దాకా వెళ్ళి ఆయనకు వీడ్కోలు చెప్పివచ్చినాను. అప్పటినుండి మా ఉద్యోగరంగాలు మారినవి. నేను తెలుగు లెక్చరర్‌గా నియమింపబడి, వరంగల్‌లోని ఆర్ట్స్, సైన్స్ కళాశాలకు వెళ్లిపోయినాను. అది మొదలు ఎవరిదారులు వారివైనా కవితాక్షేత్రం మేము కల్సుకునే ఉమ్మడి కేంద్రంగా ఉంటూ వచ్చింది.

ఆ పిదప చిరకాలానికి ఆయన సీనియర్ వరంగల్ జిల్లా కలెక్టరుగా వచ్చినాడు. అదివరకే ఆయన ఐ.ఎ.ఎస్ అధికారిగా పేరు గడించినాడు. అప్పుడాయన స్థానిక కవుల్ని ఎంతో ప్రోత్సహించినాడు. సాహిత్య సాంస్కృతిక సంస్థలను ముందుకు నడిపించినాడు. యువ కళాకారుల్ని ఆదరించి ఆశీర్వదించినాడు. అన్నిటికన్నా మించి ఆయన కాలంలోనే వరంగల్లులో పోతన పంచశతి ఉత్సవాలు ఘనంగా నిర్వహింపబడినాయి. ఇప్పటి ప్రధానమంత్రి శ్రీ పి.వి. నరసింహారావు గారు ఆ సభలను ప్రారంభించినారు. ఈ ఉత్సవ నిర్వహణలో డా. బాపురెడ్డి కీలకమైన పాత్ర వహించినాడు. డా. బాపురెడ్డితో కల సన్నిహిత మైత్రి కారణంగా నాకాయనతో వున్న చొరవను పురస్కరించుకొని ఆయన వ్యక్తిత్వాన్ని వర్ణించే ప్రయత్నం చేసినాను. ఆయన మాట మాట్లాడినా కవిత రచించినా ఆ మాట, ఆ పాట మధురం. ఆయన గుండె దండిది. అది చాలా మెత్తనిది. అదొక బృందావనం. అక్కడ ముండ్లులేని గులాబీలు పూస్తాయి. పరిమళాలు వెదజల్లే వెన్నెలలు కాస్తాయి.

ఆయనకూ, ఆయన కుటుంబ సభ్యులందరికీ భగవంతుడు సదా శుభములు ప్రసాదించుగాక! ఆయన సాహిత్య వ్యాసంగం ఇంకా మహోజ్జ్వలంగా వికసించుగాక! ఆయనకు నా హార్దికాభినందనలు.

# అనంత సత్యాలు

- ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావు

"సుకవితా యద్యస్తి రాజ్యేనకిమ్" అన్నారు మన పెద్దలు. సప్తసంతానాలలో ఖిలం కానిది కృతి గనుక, కవితామయమైన ఆకృతికి - సప్తసంతానాల్ని ప్రతిష్ఠించే శక్తి ఉన్న రాచరికానికి మించిన స్థానం ఇచ్చారు. ప్రపంచం కలరూపు తెలిసిన మనవారు, నశ్వరమైన జగత్తులో సుస్థిరమైనది కృతి గనుక, దానికి కృతి భర్తలు కావాలని మన రాజులు జమిందారులు, చక్రవర్తులు పూర్వంలో తహతహలాడారు. వారిలో చాలా మందిని నేడు మనం స్మరించడానికి కారణం వారు కృతి భర్తలు కావడమే! కృతి భర్తలకే ఈ శాశ్వతత్వం లభించినప్పుడు కృతి కర్తల విషయం వేరే చెప్పాలా?

గుణ సమగ్రతను ప్రసాదించే విషయంలో పరాజ్ముఖిత సహజలక్షణమైన "విశ్వసృజః ప్రవృత్తి" - ఒక్కొక్క కవి పురాకృత పుణ్య విశేషం చేత - సమగ్రతను ప్రసాదిస్తే, సువర్ణానికి సుగంధం అబ్బినట్లే గదా!

"అనంతసత్యాలు" వ్రాసిన మన బాపురెడ్డి గారి విషయంలో ఈ పని జరిగింది. ఆయనలో కావ్య నిర్మాణ చతురత, రాజకార్యనిర్వహణ దక్షత ఏకత్రితమయ్యాయి. పై నానుడిలో, "రాజ్య" శబ్దం అధికారానికి ఉపలక్షణం. మన సాహిత్య చరిత్రలో ఇద్దరు, ముగ్గురు ఈ పూర్వపుణ్యం ఉన్న వారు కనబడుతున్నారు. ఈ ప్రజాయుగంలో ఈ పుణ్యం సామాన్య ప్రజలలో నుండి వచ్చిన కవికి దక్కడం సహజం! ఇక్కడ అదే జరిగింది!

ఈ ప్రజాయుగంలో రోజు రోజు మారుతూ వస్తూ ఉన్న "ఇజా"ల నిజానిజాలు గుర్తించి; మనుష్యులలోలాగే కవిత్వంలో కూడా 'మంచి చెడ్డలు' రెండే భేదాలు అని గ్రహించి; కవిత్వం అనుభూతి విషయంలో హృదయదఘ్నంగా ఉండవలసినా, సృజనవేళ బుద్ధి దీపం దానికి దారి చూపింపవలసిన ఆవశ్యకత ఉన్నదనే విషయం ఆకళింపునకు తెచ్చుకొని రచన సాగించే కొద్దిమంది కవులలో బాపు రెడ్డి గారి స్థానం ఉన్నతమైనది. వివిధ సాహిత్య రీతులలో పరవళ్ళు తొక్కిన వీరి కవితా స్రవంతి క్రమక్రమంగా గంభీరతను గాంభీర్యాన్ని సంతరించు జీవనదిగా సాగిపోతూంది.

సృష్టిలోని సమస్త పదార్థం కవితా వస్తువుగా - కవి రచనా పాటవాన్ని బట్టి, తాత్త్విక దృష్టిని బట్టి సత్యం, శివం, సుందరంగా భాసిస్తుందని అనుభవపూర్వకంగా గ్రహించిన ఈ కవి, తన కవిత్వానికి సమన్వయం ప్రాణంగా చేసుకోగలిగాడు. ఇందువల్లనే ఈయన కవిత్వంలో దేహానికి, మనస్సునకు, బుద్ధికి సముచిత స్థానాలు లభించడమే కాకుండా - చాలా మంది ఆధునిక కవులలో కనబడని అతీంద్రియమైన ఆత్మ వస్తువుతో వీటికి సమన్వయం చేసే ప్రయత్నం కనబడుతుంది.

మహాకవికి మామూలు కవికి తేడా ఎక్కడ ఉంది అని పరిశీలిస్తే ఆయా కవుల తత్త్వ దృష్టిలో ఉంది అనాలి. ఈ విషయాన్ని ఒక ఇంగ్లీషు విమర్శకుడు "Great poets are judged by the frame of mind they induce in us" అని చెప్పాడు.

మహాకవు లెవ్వరూ సమన్వయం చెయ్యని సందేశం లేని కావ్యాలు వ్రాయలేదు. "తీర్థానికి తీర్థం, ప్రసాదానికి ప్రసాదం"గా ఉన్న రచనలు, ఎంత

రమణీయంగా ఉన్నా ఏకసూత్ర బద్ధం కాని మణులవలె, విడిగా పొడిగా ఉంటాయి. కవి చేసే సమన్వయమే ఇచ్చే సందేశమే ప్రాణరూపమైన అంతర్నిహితమైన కావ్యాన్ని అర్థవంతం చేసే ఈ సూత్రం. విశ్వజనీనమైన రచనలు చేసే కవులలో ఈ సందేశం, సర్వకాలాలకు సర్వులకు పనికి వచ్చేలా ఉంటుంది. బాపురెడ్డిగారి కవిత్వంలో కనబడేది - అంటే ఉన్నానని సూచించేది, వాచ్యం కాని ఈ సందేశ సూత్రం వీరి పూర్వపు రచనలలో దృశ్యాదృశ్యంగా మబ్బుచాటు వెన్నెల వెలుగుగా దర్శనమిస్తూ వచ్చిన ఈ సందేశాత్మక తత్త్వ దృష్టి "అనంత సత్యాలు" కావ్యంలో - కవి అనంత సత్యాన్ని దర్శించి ప్రదర్శించే నాటికి అన్నమాట - పంచేంద్రియపరిధి దాటి ఆనందాంబర వీధిలో విహరించే స్థితికి వచ్చింది. దీనితో కవి మహాకవి అయ్యాడు. ఈ కావ్య పఠనం వల్ల మనకు కలిగే అనుభూతికి, ఇతర కావ్యాలు చదవడం వల్ల కలిగే అనుభూతికి ఉన్న తారతమ్యం, సంతోషానికి ఆనందానికి ఉన్నంత ఉంది!

చిన్నప్పుడే వలచి వచ్చిన కవితాలతాంగిని ఏకపత్నిగా ఏలుకొంటూ ఉన్న బాపురెడ్డి గారి లోని దాక్షిణ్యం, భంగ్యంతరాలలో ఆ కవితాలతాంగినే సంతరించు కోవడంలో కనబడుతుంది. ఆనంద తుందిలమైన అంతరంగంతో అఱ్ఱులు సాచి ఆకాశాన్ని అందుకోవాలని చేసే ప్రయత్నాలలో ఆయన ఎగిరినంత ఎత్తూ ఆమె కూడా అలవోకగా వెంటపోతుంది. హిమాలయోత్తుంగమైన కవిత మహిమాలయం అయింది ఇందువల్లనే! శ్రావ్యమైన శబ్దం, రమ్యమైన అర్థంతో హృద్యమైన అనుభూతి నిస్తుంది. ఇందువల్లనే హృదయం, మేధ సరిసమంగా పనిచేసే మహాకవికే ఈ వాగర్థ ప్రణయం సాధ్య పడుతుంది. అన్ని వస్తువులలో, అన్ని పరిస్థితులలో అందాన్ని చూచి దాన్ని ఇతరులకు అందించే నైపుణ్యం మహాకవి సొత్తు. సర్వేసర్వత్ర ప్రసన్నత ఉట్టిపడే సమ సంఘటన, మాటల కూర్పు ఈ కవి సొమ్ము. సహృదయుల హృదయాలను ఆకట్టుకొనే రుచిరభావాలు, అందమైన మాటల చీరలు కట్టుకొని కులుకుతూ బోటులవలె కనబడతాయి. ఈ మాటల మాటున దాగిన "భావం" స్వస్వరూప జ్ఞానం ఉన్న కవికే ప్రథమ దర్శన మిచ్చి తరువాత సహృదయులను కరుణిస్తుంది. ఇందువల్లనే శబ్దశక్తిని గ్రహించిన కవికి అది ఎలా సాక్షాత్కారిస్తుందో ఎలా వశమవుతుందో వేదకవి ఇలా ప్రవచించాడు-

"ఉతత్వః పశ్యన్న దదర్శవాచ -
ముతత్వః శృణ్వ న్నశృణోత్యేనామ్।
ఉతోత్వస్మై తన్వం విసస్రే
జాయేవ పత్య ఉశతీ సువాసాః ॥"

(ఒకడు వాక్కును చూస్తూ ఉన్నా చూడలేడు గదా! ఇంకొకడు ఈ శబ్దాన్ని వింటూ ఉన్నా వినలేడు! ఈ వాక్కు (సన్నని) శుభ్రమైన బట్టలు ధరించి ఉరకలు వేసే కోరికలున్న భార్య భర్తకు వలె మరి ఒకడికి - శబ్దశాస్త్రం తెలిసిన వాడికి - తన శరీరాన్ని (స్వరూపాన్ని) ప్రకాశింపజేస్తుంది గదా!)

ఇక్కడ మనం వ్యాకరణ శాస్త్రవేత్త స్థానంలో శబ్దసౌందర్యాన్ని ఎరిగిన కవిని గ్రహిద్దాం. మహా కవియైన బాపురెడ్డి గారికి శబ్దం తన అర్థాన్ని సాక్షాత్కరింపజేసింది అనడంలో అతిశయోక్తి లేదు! ఆయన రచనలలో- సహస్రాధిక శీర్షికలతో, పదుల కొలది రచనలున్నాయి. ఏది పరిశీలించినా, పద్యం గాని, గద్యం గాని, గేయం గాని, గేయనాటిక గాని - ఈ సత్యం మనకు ప్రథమ దర్శనమిస్తుంది. "నెదరులాండు"ను గూర్చి వ్రాసినా, బెదరుగుండె బిత్తరిని గూర్చి వ్రాసినా, "విపద్గీతి" వ్రాసినా, "విశాఖలేఖ" గూర్చి వ్రాసినా, "విజయ శంఖం" పూరించినా, "ప్రగతి గీతి" పాడినా ఈ కవి - శబ్దం వెనుక దాగివున్న అర్థాన్ని గుర్తించి ప్రదర్శిస్తారు.

ఇదే విధంగా శబ్దార్థాల రెండింటికీ వెనుక నున్న తత్వాన్ని మెచ్చుకొని వ్రాస్తాడు. అదే సత్యం! హిరణ్మయమై రమ్యమైన ప్రకృతి వెనుక విహితమై ఉన్న సత్యాన్ని దర్శిస్తాడు. చాలా మంది రమ్య ప్రకృతిని చూచి ముగ్ధులై తృప్తి పొందిపోతారు. బాపురెడ్డిగారు ప్రకృతి రమణీయతను మెచ్చుకొంటూనే దాని వెనుక దాగివున్న సత్యాన్ని తాను దర్శించి మనకు చూపిస్తారు. ఇది సామాన్య విషయం కాదు.

ఒకే దైవానికీ అనంతరూపాలున్నట్లు వస్తుత: ఒకటే అయిన సత్యానికున్న అనంతరూపాల ప్రదర్శననే "అనంతసత్యాలు" కావ్యంలోని అంతరార్థం. దైవం లాగే సత్యం కూడా - సత్యం, శివం, సుందరం. పర బ్రహ్మతత్త్వం త్రిమూర్త్యాత్మకం అయినట్లే, పరసత్యం కూడా సత్యశివసుందరాత్మకం. ఈ మూడింటిలో దేనికి ప్రాముఖ్యమిచ్చి చెప్పినా అన్నీ ఉంటాయి. సత్యం-శివం, సుందరం కాక వీలులేదు. శివం-సత్యం, సుందరం కాక వీలు లేదు. సుంధరం-సత్యం శివం కాక వీలులేదు. వీటిలో ఏ ఒకటి మిగిలినవి కూడా కాకపోతే, అది అది కాకుండా పోతుంది. అంటే ఏకత్వంలో భిన్నత్వం, భిన్నత్వంలో ఏకత్వం. ఈ పరమసత్యాన్ని నిష్కర్షగా నిశితంగా "అనంతసత్యాలు" కావ్యంలో కవి ప్రవచించారు. ఈ సత్యదర్శనం దార్శనిక దృష్టి ఉన్న కవికి గాని సాధ్యం కాదు. అలాంటి కవి మాత్రమే రసోపైస:, సోవైరస: అని అనుభూతికి తెచ్చుకోగలుగు తాడు. ఆ కవే ద్రష్ట! ద్రష్ట కానివాడు స్రష్ట కాలేడు! దర్శించే శక్తి, సృజించే శక్తి ఒకే నాణానికున్న రెండు పార్శ్వాలు, పృథగస్తిత్వం ఏ ఒక్క దానికీ లేదు. ఈ రెండూ అత్యున్నత స్థితిలో ఉన్నవాడే ఋషి కల్పుడైన మహాకవి.

స్వర్ణమయజగత్తులో పడి పశ్చిమ దేశవాసులు జన్మత: వారెక్కడివారైనా - సత్య స్వరూపాన్ని విస్మరిస్తూ ఉంటే ఈ విపశ్చిత్‌కవి సందేశాత్మకమైన ఉపాయనంగా "అనంత సత్యాలు" కావ్యాన్ని "ఉత్తర అమెరికాలోని తెలుగు మహాజనులకు" అంకితం చేశారు (1979). ఇక్కడ, "తెలుగు మహాజనులు" పశ్చిమ దేశవాసులకు ప్రతీకలు. బాపురెడ్డి గారి తాత్త్విక దృష్టికి ఈ కావ్యం పరాకాష్ఠ.

చతుర్విధ పురుషార్థాలలో - ధర్మానికి గ్లాని లేకుండా అర్థాన్ని, కామాన్ని అనుభూతిలోనికి తెచ్చుకొని నాల్గవ పురుషార్థాన్ని ఆదర్శంగా పెట్టుకోవడం, సందేశాత్మకంగా వివరించడం బాపురెడ్డి గారి రచనలలో కనబడుతుంది. వారి "నాదవేదాలు" అనే కావ్యంతో ఈ విషయమై ఆయన హృదయావిష్కరణ జరిగింది. ఆయనే అక్కడ ఇలా అన్నారు: "ఈ 'నాద వేదాలు' త్రిముఖాత్మకంగా ఆవిష్కృతమైనవి. ప్రణయనాదం, ప్రగతినాదం, ప్రణవనాదం త్రయీనాద అంతర్వేద సారం ఈ నా కవితా కాసారం." ఇక్కడ కవి ప్రయోగించిన త్రయీనాద, అంతర్వేద సార శబ్దాలు ఆయన ఆలోచనను, దృక్పథాన్ని మనకు వ్యంగ్య ప్రధానంగా చెబుతున్నాయి. ఇదే చతుర్విధ, పురుషార్థ సారం. ఇందువల్లనే ఈ కావ్యాన్ని "తూర్పు దిశలో తేజరిల్లే తెలుగు మహాజనులకు" అంకితం చేశారు (1981).

ఈ రెండు వాక్యాలు-బాపురెడ్డి గారి మేధకు, హృదయానికి పుత్రికలు. ఈ రెండింటిలో కవితా పదార్థం పుష్కలంగా ఉన్నా "అనంతసత్యాలు" వారి మేధాజన్యమైనది. "నాదవేదాలు" వారి హృదయ జన్యమైనది. ఈ రెండింటిలోను సత్యదర్శనమున్నా-ఒకటి తాత్త్వికుని సత్యదర్శనం. ఇంకొకటి కవి సత్య దర్శనం. విమర్శ కోసం ఇలా రెండింటిని వేరు చేసుకొని చూచినా, నిజానికి ప్రతి మహాకవిలోను ఈ రెండూ ఉంటాయి.

బాపురెడ్డిగారు స్వస్వరూపజ్ఞానం ఉన్న దార్శనిక కవి గనుకనే "అనంత సత్యాలు" కావ్యాన్ని గురించి ఆయనే ఉత్తమ విమర్శకునిలా, ఆత్మ పరిశీలన చేసుకొని ఇలా అంటారు: "నా కవితా తత్త్వాన్ని, నా రసానంద దార్శనికత్వాన్ని అవిచ్ఛిన్న ధారావాహికంగా ఆవిష్కరించే భావచిత్రాలు ఈ 'అనంతసత్యాలు' సాహిత్యం, అందులోనూ కవిత్వం ఏ రాజకీయ సిద్ధాంతానికో, ఏ విజ్ఞాన శాస్త్రానికో, ఏ వాదానికో ఊతనిచ్చే చేతికర్ర కాదు. ఊడిగం చేసే దాసి కాదు. కవితకు మానవ జీవితంలో ఒక విశిష్టమైన, వైయక్తిక మయిన, స్వతంత్ర ప్రతిపత్తి ఉందని నా విశ్వాసం." ఇంతకంటే సూటిగా బాపురెడ్డిగారి కవిత్వాన్ని గురించి- ముఖ్యంగా "అనంతసత్యాలు" కావ్యాన్ని గురించి - ఎవరూ ఏమీ ఎక్కువ చెప్పలేరు!

"అనంతసత్యాలు" కావ్య ఖండికలలో ఒక్కొక్క చోట కవివాక్కు, ప్రమత్తులైన అలసులకు భయం కొలిపేదిగా ఉంటుంది.! సర్వజ్ఞత్వం ఆపాదించుకొని విఱ్ఱవీగుతున్న ఆధునిక మానవునకు వెరపుకలిగించి, ఆతన్ని ఆలోచించేలా చేస్తుంది! ప్రథమంలోనే "అజ్ఞాన జ్ఞానం" అనే శీర్షికలో తన పరిమితత్వాన్ని మనిషి ఇలా గుర్తిస్తాడు:

"రెండు మార్గాల సంగమం
నా మనోమండలం
ఉభయజ్ఞానాల 'జ్ఞానం'
నాకు తెలియదు అనే 'అజ్ఞానం'

సత్యాన్ని గురించి చెప్పేటప్పుడు కవిగా చెప్పడమూ ఉంది. మేధావిగా నిర్వచించడమూ ఉంది. ఒకటి బుద్ధితో చెప్పింది. ఇంకొకటి హృదయంతో చెప్పింది.

"సత్యం ఒక స్వప్నం
స్వప్నం ఒక సత్యం
సత్యాలూ స్వప్నాలూ కలిసి
నిత్య జీవితా లౌతున్నవి."

బాపురెడ్డి గారి రచనలలో అడుగడుగున గుండెను గుబగుబలాడించే కవిత్వం ఉంటుంది. సొగసుగా ఊహించడం బాపురెడ్డిగారికి "వెన్నతోబెట్టిన విద్య". మనమందరం రోజూ చుక్కల్ని చూస్తూనే ఉన్నాము. వేయి సంవత్సరాల తెలుగు కవిత్వ చరిత్రలో ఎవరన్నారండీ నక్షత్రాల్ని గురించి ఇలా:

"శూన్యాన్ని శోధిస్తున్న ఆ చుక్కలను చూడండి
కాలవ్యాళ సహస్ర ఫణాలలోని
విజ్ఞానమణుల్లాంటి విశ్వచక్షువుల్ని చూడండి
కోటి కోటి కాంతి సంవత్సరాలకు అందని
కోట్ల కోట్ల చుక్కల్ని చూడండి.
కన్నుల్లో క్రమ్ముకున్న కారు మబ్బుల్ని
కడిగివేసి ఆ కాంతి బింబాలను చూడండి
దైవత్వం అనంతత్వం కలిసి నిర్మలాకాశంలో
కట్టుకున్న
భర్మహర్మ్యాల వజ్రస్తంభాలను
భావోద్దీప్తులై చూడండి."

"ఆనందో బ్రహ్మ" అనే శీర్షికలో "ఆనందం ఒక అనంతసత్యం, అప్పుడది దైవత్వం" అంటారు కవి గారు. అందుకే "ఆనందం అందరిదీ" అని బాపురెడ్డి గారి విశ్వాసం. ఇందువల్లనే ఆయన ఆలోచనా స్రవంతి "మనిషి నుంచి ప్రారంభిద్దాం" అంటుంది. ఈ శీర్షిక క్రింద ఆయన వేసిన "మూడు కాలాలను ముడివేసే, ముచ్చటైన మూడు ప్రశ్నలు, అవి "ప్రశ్నలుగానే ఉండిపోతాయి. "ఎవరీ మనిషి?" అని ప్రశ్నించుకొని కవి సమాధానాలు చెప్పాలని ప్రయత్నిస్తాడు.

తన్ను తాను ప్రశ్నించుకొనేవాడు మనిషి
తన్ను తాను దూషించుకొనేవాడు
తన్ను తాను భూషించుకొనేవాడు మనిషి

భిన్నత్వంలో ఏకత్వం మనిషి
ఏకత్వంలో భిన్నత్వం మనిషి
ఔనన్నది కాదని, కాదన్నది ఔనని
అస్తినాస్తి వాదాలకు దిగి
తన్ను తానే శిక్షించుకుంటాడు.
తన్ను తానే రక్షించుకుంటాడు మనిషి
క్షణికమైన తన జీవితంలో
శాశ్వతానందాల ముడి విప్పుతాడు
శాశ్వతమైన తన జీవితాన్ని
క్షణికానుభూతులతో ముడివేస్తాడు మనిషి."

చివరి నాలుగు పాదాలలో మనిషి జీవితాన్ని కళ్లకు కట్టేటట్లు, సహృదయానికి హత్తుకొనేటట్లు చెప్పలేదా కవిగారు? మనిషిని గురించిన సమ్యగవగాహన ఉంది గనుకనే ఆయన "నానా, నాలలో నానా, నీలలోమనిషిని చూడగలిగాడు." అఖిల వేదాలను సకల వాదాలను వీడి" మనిషిని పఠించడం ప్రారంభించాడు.

ఏ విషయాన్ని ముట్టినా దాన్ని బంగారం చేసే రసవాద విద్య తెలిసిన రసవాద హృదయవేది బాపురెడ్డి అంటే అది స్వభావోక్తి మాత్రమే అవుతుంది. "జీవితం మహాకావ్యం" అనే శీర్షిక క్రింద వ్రాస్తూ "సుందరతర గందరగోళం జీవితం" అంటారు ఈయన. ఈ పద బంధకల్పన ఎంత సులభసుందరం! ఈ శీర్షిక క్రిందే "అరిషడ్వర్గాల పందిరిమీద, క్షణానికో పూవు పూచే, చిత్రగ్రంథి జీవితం, ఎక్కడ పుడుతుందో తెలియని, ప్రాయేటి కెరటం జీవితం" అంటారు. తాత్త్వికమైన పునాది మీద కట్టిన భావసౌధం కాదా ఇది?

"పంచేంద్రియపథం"లో తాత్త్వికుడు, కవి అహమహమికతో పయనిస్తారు. ఈ శీర్షికలో ప్రతి పాదంలోను విశిష్టత చూపి "జ్ఞానేంద్రియ చోదిత, పంచేంద్రియరథంలో 'మనల్ని' జ్ఞానానందం, భావానందం, జీవానందం" అనే త్రివిధానంద శోభిత ప్రాంతంలో త్రిప్పుతారు కవిగారు. ఇంత గంభీరంగా వ్రాసిన కవే "చెలికాడు చందమామ" లో అతి కోమలంగా "మొయిలు ఒడిలో చందమామ, అమ్మ ఒడిలో నేను కూర్చుని, ఒకరినొకరం పిలుచుకున్నాం. ఒకరిలో ఒకరిని చూచుకుంటూ, ఉప్పొంగే అమ్మకళ్లల్లో ముద్దుగా ఇద్దరం కలుసుకున్నాం" అంటారు.

ఇలా చెప్పుకుంటూపోతే పుస్తకమంతా ఉదాహరించవలసి వస్తుంది. నిజంగా, వెన్నెల లాంటి స్వచ్ఛ కవిత్వానికీ వెన్నలాంటి కవి హృదయానికీ నిదర్శనాలైన కావ్య ఖండికలున్నట్లే, సాగర గంభీరతకూ సమగ్ర దర్శనానికీ ఉదాహరణ ప్రాయాలైనవీ ఎన్నో ఖండికలున్నాయి. "ఏకాంతంలో వేదాంతం" శీర్షికలో బాపురెడ్డి గారు దార్శనిక కవిగా సాక్షాత్కరిస్తారు. ఇందులో "కోహం" అని ప్రశ్నించుకొనే జ్ఞానం, "అహం బ్రహ్మాస్మి" అని తెలుసుకొన్న ప్రజ్ఞానం కవిలో మనకు కనబడతాయి.

ఇలా కవి భావాంబరవీథిలో విహరించినా తాత్త్వికాంబుధిలో ఓలలాడినా ఆధునిక యుగధర్మాన్ని అనుసరించి మనిషిని మరచిపోకుండా "మనిషిని మించిన మహాశక్తి లేదని, మనిషినే ఆరాధిస్తున్న" మహా మనీషి బాపురెడ్డి.

ఒక్కముక్కలో చెప్పాలంటే ఈమధ్య కాలంలో నేనింత మంచి కవిత్వం తెలుగులో చదువలేదు అంటే చాలదా?

*(1979లో "అనంతసత్యాలు" పుస్తకానికి కూర్చిన ఆముఖం)*

# తొలిపలుకు

(1979లో "అనంత సత్యాలు" పీఠిక)

డా. బాపురెడ్డి గారి "అనంత సత్యాలు" ఆద్యంతం చదివాను. దర్శనశాస్త్ర విషయాలు కొంత అధ్యయనం చేసి వాటి అర్థాలను అనుసంధానం చేయనివారు; నానాదేశ సంచారం చేసి వాటిలోని ఆచార విచారాలను ఆకలింపు చేసుకోనివారు; లోకజ్ఞానం, విభిన్న వ్యక్తులతో పరిచయం, పరిపాలనానుభవం, ఆంధ్రభాష మీద అధికారం లేనివారు; ఇలాంటి కవితా రచనం చేయలేరు. వీరికీ సాధనసంపత్తి అంతా ఉండటం చేత, వీరి కవితా పఠనం నాకెంతో ఆమోదం కల్గించింది.

ఆధ్యాత్మిక / తాత్త్విక భావాల్ని వీరు సుందరంగాను సున్నితంగాను కొన్ని సందర్భాల్లో వ్యక్తం చేశారు.

ఉదాహరణలు:

అంతర్ముఖంగా యోగమార్గం అన్వేషించి బహిర్ముఖంగా ప్రయోగమార్గాన శోధించేది అనంతత్వాన్నే అన్నారు వీరు (పు.1). స్వప్నాలు సత్యాలూ కలిసి నిత్యజీవితం అవుతుంది (పు.4). అద్వైతం మాయావాదం గాని భావ వాదం గాని కాదు, అది "భావభౌతికవాదం" అట! (పు.8). మానవజీవితతత్త్వం ఆనందోన్ముఖత్వం (పు.9). అంతర్ దృష్టి యోగం, యాగం, తపస్సుల వలన కలుగుతుంది. (పు.69). ఎట్టి ఆశ, కోరిక లేనప్పుడు మనకు కలిగే అనుభవం ఇతరులకు కల్గించలేం. దాని కితరులు సాక్ష్యం ఉండరు. ఆ సాక్ష్యం లేని సత్యం సాధిస్తేనే మోక్షం, (పు.70). "సాగరాలు, మేఘాలు, స్రవంతులు" = "నదులు, నీరదాలు, నీరధులు" - వీటిని గూర్చిన రెడ్డి గారి కల్పనలు (పు.32-7) మనోజ్ఞాలు. ఆకలి, ఆశ్చర్యం, ఆలోచన మానవుల్ని నడిపిస్తున్న మూడు నేత్రాలని వీరి సూక్తి. ఇట్లా చాలా మంది వేత్తల అభిప్రాయాన్ని వీరు రమ్యంగా వక్కాణించారు. భక్తి, జ్ఞాన, కర్మయోగాల ద్వారా సత్యదర్శనం అవుతుందని, కాని తీరిక లేని కోరిక వల్ల ఆ యోగత్రయం ద్వారా సత్యాలను కనుక్కోవటం సాధ్యం కావటం లేదని వీరనటం (పు. 88-9) నాకు బాగా నచ్చింది.

సమకాలికాంధ్ర దార్శనిక వచనకవిత్వంలో డా. బాపురెడ్డి గారి ఈ సంపుటికి ఉచ్చస్థానం లభిస్తుందని తోస్తుంది. రహస్య వాద ధోరణిని (మిస్టికల్ టెన్‌డెన్సి) తత్త్వశాస్త్రంతోను ఆధునిక విజ్ఞానంతోను కల పరిచయాన్ని, విమర్శనాదృష్టిని, కవితా పాటవాన్ని సమ్మిశ్రణం చేయటానికి చేసిన సఫల ప్రయత్నం ఇది.

**ఆచార్య కె. సచ్చిదానందమూర్తి**
Vice Chairman
UNIVERSITY GRANTS COMMISSION

'మాటలతో గీసిన మానవతా చిత్రాలు'

# బాపురెడ్డి గద్య కావ్యాలు

- కర్రా కార్తికేయ శర్మ

కవిత్వం వ్రాయడమంటే ఎంతో తేలిక అనిపిస్తుంది కొందరికి. వారు కవిత్వాన్ని మంచినీళ్ళ ప్రాయంగా భావిస్తారు. ఒక విధంగా నేటి కవిత్వరంగం వారి అభిప్రాయాన్ని స్థిరపరచేదిగా కనిపిస్తోంది. జట్లు జట్లుగా కవులు చేరి 'కవితా సంకలనాలు' ప్రకటించడం, తెలుగు రాయడం చదవడం వచ్చిన ప్రతి బుద్ధిమంతుడు అడ్డంగానో నిలువుగానో కొన్ని పదాలు పేర్చి కవిగా ముద్రవేసుకోవడం, ఆర్థిక స్తోమత ఉంటే - ప్రముఖుల పీఠికలు జతపరుస్తూ వాటిని అచ్చొత్తించడం, ఇట్లా వెలుగులోకి వచ్చిన వందలకొలదీ సంపుటాలు తెలుగు కవిత్వరంగాన్ని కప్పెయ్యడం లాంటి వాస్తవాలను దర్శించిన ప్రతివాడికీ కవిత్వం అంగట్లో దొరికే బెల్లంగా కనుపించవచ్చు - తప్పులేదు.

కాని, అందరికీ లభ్యంకాని భావాలు కొందరిలో మెరుపుల్లా మెరుస్తాయి. వాటిని వారు కవిత్వంలో పదిలపరచి జనతకు అందిస్తారు. వారి కవిత్వం జనతలో పేరుకున్న జడత్వాన్ని పారద్రోలి చైతన్య వికాసానికి తోడ్పడుతుంది. అలా నూతనత్వానికి నాంది పలికేదే కవిత్వం! ఎన్నో రాత్రులు ఆ కవితా ప్రసవానికి నొప్పులు పడ్డవాడే కవి!

శ్రీ బాపురెడ్డి కవి అంటే చాలదు. మంచికవి. కవిత్వం మంచి గంధం వంటిది. నిజాన్ని చూసే అద్దం వంటిది. ఆ పరిమళాన్ని ఆఘ్రాణిస్తూ, ఈ నిజాలను దర్శించడం ఒక అనుభవం!

*'సింహాచలం కొండల' ప్రక్కన*
*చల్లని పిల్లగాడుపులు సేవిస్తూ*
*ప్రక్కనున్న సాగర సంగీతంలో*
*పరవశమై తేలిపోయే*
*నిత్యనూతన సముల్లాసిని*
*విశాఖపట్నం సుహాసిని!'*

ఈ ఆరుపాదాల్లోను విశాఖపట్నం బొమ్మగీసి చూపించారు బాపురెడ్డి. నిజ జీవితంలో రెడ్డి ఔదార్యవంతులైనా కవి జీవితంలో మాత్రం 'పదాల పొదుపరి'! అవసరాన్ని మించిన పదం వీరి కవిత్వంలో మనం ఎక్కడోకాని చూడం. తెలుగు కవితారంగంలో తిక్కన, వేమన, గురజాడ, శ్రీశ్రీ- వీరే పదాలను పొదుపుగా వాడేరు. వారి తరువాత పదాల పొదుపులో బాపురెడ్డిని పేర్కొనవచ్చు.

*'విశాఖపట్నం జీవితం*
*విచిత్రంగా ఉంటుంది.*
*అందమైన పరిసరాలు*
*అవసరమైన సరదాలు*
*అన్నీ ఉన్నాయి గానీ -*
*పచ్చనోట్లు జేబులో ఉంటేనేగాని*
*పచ్చ నోట్లు జేబులో ఉంటేనే గాని*
*పచ్చి మంచినీళ్ళు కూడ పుట్టవు ఇక్కడ!'*

కవి సౌందర్యాన్ని వర్ణిస్తూనే అసౌకర్యాన్ని కూడా వివరించాలి. "లోకంలో బాధలన్నవి లేవు అంతా ఆనందమయమే!' అన్నా, 'లోకంలో ఆనందం లేదు అంతా బాధల నిలయమే' అనినా, ఆ కవి సత్యవాది కాదన్న విషయం స్పష్టమౌతుంది. మరి సత్యాన్ని విస్మరించిన కవి ఉదయించని రవివంటివాడు.

విశాఖపట్నం సౌందర్యానికి తన్మయుడైన బాపురెడ్డి అక్కడ నున్న 'ఇరుకు' తత్వానికి నిట్టూరుస్తున్నారు -

"కూడు సమస్యకంటే ఇక్కడ
గూడు సమస్యే దొడ్డది.
పెరిగిపోతున్న జనాభా తెచ్చిన
పెద్ద సమస్యల్లో కల్లా చెడ్డది' అని.

బాపురెడ్డి కలంలో పడి కవితగా మారి ధన్యమైంది విశాఖపట్నం.

ఇక కుక్కను కావ్య వస్తువుగా తీసుకొని నవ్యతను సాధించారు కవి. ప్రతిరోజూ మనం 'ఛీ' కొడుతున్నా 'జా' కొట్టవలసిన జంతువు కుక్క!

'నమ్మిన వాళ్ళను మోసగించడం
న్యాయం అయిపోయిన ఈ రోజుల్లో
అన్యాయానికి
న్యాయం అర్పిస్తున్నావా?
అవిశ్వాసానికి
విశ్వాసం సమర్పిస్తున్నావా?
క్రూరమృగాలకు
చోరమృగాలకు
శత్రుడవు నీవు,
కృతఘ్నులోకానికి సైతం
కృతజ్ఞత చూపే

మిత్రుడవు నీవు!' అంటూ కుక్క విశ్వాసాన్ని శ్లాఘిస్తున్నారు. "కాదేదీ కవిత కనర్హం" నిజమే: కాని, ఆ "అనర్హత"ను అర్హతగా మార్చడంలో కవి శక్తిమంతుడు కావాలి! ఈ ఖండిక బాపురెడ్డి శక్తికి అద్దంపడుతోంది.

'ఒక పుట' అనే కవిత అప్పటికప్పుడు చెప్పినదే అయినా "త్వర" లేని కవిత.

'జననం ఒక పుట
మరణం ఒక పుట

మానవ జీవిత పత్రాలకు' అంటూ వైరాగ్యాన్ని సవ్యంగా వినిపిస్తున్నారు.

'ఒకే పుట గల పత్రం లేదు
ఒకే తీరు గల నది లేదు
ఒకటే ఒకటి ఏదీ లేదు
సకలం ఆమ్రేడితం
దేవుడు కూడా ఒంటరి కాదు
దేవీ సమేతుడు.'

నిరాడంబరంగా ప్రారంభమై నగ్న సత్య ప్రసవంతో హుందాగా పరిసమాప్తి కావడం ఈ కవిత ప్రత్యేకత!

రసజ్ఞుడిగా విజ్ఞప్తి చేస్తున్నారు కవి -
'గాడిద మీద మూటలు మోయించినట్లు
కవితతో మాటలు మోయించకు
బాల పల్లవ కోమల వాగ్దేవితో
బస్కీలు వేయించకు, కుస్తీలు పట్టించకు!

ఈ నాలుగు పాదాలతో బాపురెడ్డి కవిత్వతత్వం మనకు బోధపడుతుంది. ఈనాటి కవులందరికీ ఆ పాదాలు శిరోధార్యాలు! నల్ల సిరా తెల్లని కాగితాలు పుష్కలంగా ఉన్నాయి. మెదడులో భావాలు, పదాలు సమృద్ధిగా ఉన్నాయి ఏది రాసినా చదివేజనం సాహిత్యరంగంలో దండిగా ఉన్నారని కవిత్వం బళ్ళకెత్తిస్తే ఏం జరుగుతుందో గత కాలపు కవిత్వ రంగాన్ని ప్రశ్నిస్తే అది చెబుతుంది చేదైన సత్యాలను.

వందలకొలదీ కవులు కాలూనిన పూర్వాంధ్ర కవిత్వరంగంలో, నిలిచిన కవులు పదులు మాత్రమే! మిగిలిన వారందరూ కవితా దురంధురులే అయినా 'అనామికలు'గా మిగిలిపోయారు. దానికి కారణం ఏమిటి? అంధానుకరణ, కృత్రిమభాషాభేషజం - వెరసి పాషాణపాక కవిత్వం!

ఆధునిక కవిత్వం కూడా 'చరిత్ర పునరావృతం' అన్నట్లు ఉండి. వందల సంఖ్య నుండి వేల సంఖ్య వరకు కవులు పెరుగుతున్నారు; కావ్యాలు వస్తున్నాయి.

ఎన్ని కవితలు నిలుస్తున్నాయి. మరెన్ని గాలిలో తేలిపోతున్నాయి? పరిశీలించండి. గుండె గోదావరిలా ద్రవించి పోతుంది.

కవులెవరైనా ఈ విషయాన్ని గ్రహిస్తున్నారా? గ్రహిస్తే కవిత్వతత్వం మారట్లేదేం? ఇంకా శ్రీశ్రీ పద చిత్రాలు యువ కవుల కవితల్లో దర్శన మిస్తూనే ఉన్నాయి. సి. నారాయణరెడ్డి గొంతుక వందల యువగళాల్లో ప్రతిధ్వనిగా వినిపిస్తూనే ఉంది. ధాశరధి క్రోధం యువకవుల క్రోధంగా కవితల్లో ప్రాకుతూనే ఉంది. ఆరుద్ర "టెక్నిక్" ఈనాటి కవుల్లో "స్పుత్నిక్"లా ప్రయాణిస్తూనే ఉంది. ఇంకా కుందుర్తి, కాళోజీ, నారాయణబాబు, కొంతవరకు శేషేంద్ర-కవిత్వంలో కొందరిపై పెత్తనం చేస్తూనే ఉన్నారు. కవులు స్వతంత్రంగా, సొంతగొంతుకతో తమదైన 'ముద్రల' తో ఎప్పుడు బయటకొస్తారు? ఎప్పుడు ఈ కవిత్వం జీవనదిలా ప్రవహిస్తుంది? ఈ ప్రశ్నలకు కదిలే కాలమే జవాబు చెప్పాలి. ఒక్కటి మాత్రం నిజం. రాజకీయాలతో మనిషికి సన్నిహిత సంబంధమున్నా- ఆ మనిషి కవి అయితే మాత్రం వాటికి దూరంగా ఉండాలి. నిజ జీవితంలో నినాదాలను ప్రేమించేవాడైనా కవి జీవితంలో వాటిని బహిష్కరించాలి. అప్పుడు నిజమైన కవిత్వం, కొన్ని శతాబ్దాలు చూడగలిగే కవిత్వం తప్పక వస్తుంది. అంతవరకూ బాపురెడ్డి అన్నట్లు-

*'భావం అనే కళ్లెం త్రెంపుకొని*
*పరుగెత్తే మాటల కవిత్వపు గుర్రం*
*కలిగించేది కాదు రసానుభూతి*
*కళ్ళూ ఒళ్ళూ మండించే*
*దూళి ధూసర విభూతి.'*

'అంతరిక్ష పర్వం' ఒక చక్కని కవిత. బాపురెడ్డి హృదయ కేదారంలో పండిన పచ్చని మమత.

"పందొమ్మిది వందల అరవై తొమ్మిది
జూలై ఇరువై ఒక్కటినాడు
ప్రాణికోటి చరిత్రలో
ప్రప్రథమంగా మానవుడు
పాదం మోపినాడు

చంద్రలోకం మీద' - అంటూ మానవ విజయాన్ని అభినందిందిస్తూనే - నరలోకంలోని మూఢాచారాలకు భరతవాక్యం పలకాలని, అలా జరిగిననాడే ఏ విజయానికైనా చరితార్థకత ఏర్పడుతుందని, లేకుంటే-

*'చేతలు జనరక్తంలో తడిపి*
*కాళ్ళు చంద్రలోకం మీద పెడితే*
*అస్పృశ్య గ్రహాలను స్పృశించి*
*అస్పృశ్యులని అనాధలను బహిష్కరిస్తే*
*చర్వితచరణమే అవుతుంది*

మానవ చరిత్ర' అని, ఈ కవితలో తన పదునైన భావనను వ్యక్తపరిచారు. 'ఆర్మ్ స్ట్రాంగ్' కూడా ఈ సత్యానికి తల వంచాలి తప్పదు.

'ఎకనామిక్సు సుందరి' అనే కవిత బాపురెడ్డి మాత్రమే చేయతగ్గ కవిత. ఉస్మానియా యూనివర్సిటిలో యం. ఏ., ఎకనామిక్స్ విద్య నభ్యసించే రోజుల్లోనే రెడ్డి హృదయంలో ఈ సుందరి చోటు చేసుకొని ఉండవచ్చు. శ్రీ బోయి భీమన్న అన్నట్లు 'సకల సౌందర్యాలకు, సమస్త సుందరీమణులకు, రాగాలకూ భోగాలకూ సంగమస్థానం ఈ "ఎకనామిక్సు సుందరి."

"వసంతాన్ని
ఓ యూనిట్‌గా తీసుకున్నా -
ప్రేయసీ -
నేను చేస్తున్న
నీ అధర సుధా కన్‌సంప్షన్
లా ఆఫ్ డిమినిషింగ్ యుటిలిటికే
ఎ ఎక్స్‌ప్షన్."

అంటూ ప్రారంభమై "మార్జినల్ యుటిలిటీ" మరీ దాటి పోతే "మైనస్ యుటిలిటి" మీద పడుతుందని

క్లుప్తంగా కవితను ముగించడం జరిగింది. ఆర్థిక శాస్త్రాన్ని కూడా అందంగా సుందరి రూపంగా భావించి కవిత చెప్పిన ఘనత బాపురెడ్డికే దక్కింది.

బాపురెడ్డి విదేశ యాత్రానుభూతులు చక్కనివి చిక్కనివి, ఆ కవితలు పఠిస్తుంటే - ఆ ప్రాంతాలలో మనం విహరించినట్లుంటుంది. 'ఏథెన్సులో ఆరంభించి, మా ఇంటిలో ముగించాలనుకున్నాను' అంటూ అన్నంతపని చేశారు.

"ఏథెన్సులో అరుణోదయం' -

"అక్షరాల కందని అందంతో
సూర్యబింబం ఉదయించింది"

'పూలబాల హాలండ్' -

"పూలు చూడాలంటే
హాలండ్ చూడాలి
హాలండ్ చూడాలంటే
ఐరోపా చూడాలి"

'చేప కన్నెల స్కాండినేవియా' -

"స్కాండినేవియాను చూచి
స్పందించని వాడుండడు
అక్కడ కవిత్వం రాయలేనివాడు
ఎక్కడా కవి కాలేదు"

'లండన్ దీపం' -

"షేక్స్ పియర్, షెల్లీ, కీట్సు
వర్డ్సువర్తు, గోల్డుస్మిత్, బైరన్,
జాన్సన్, బర్నాడ్ షా వంటి
సాహితీ స్రవంతులు
తత్త్వ చింతనా సాగరులు
వెలసిన ఇంగ్లండు ద్వీపం
చరిత్రలో ఆరని దీపం'

ప్యారిస్ మయూరి' -

'చక్కని చిలకలాగ
చక్కెర బొమ్మలాగ
ఎటు పోయినా హాయిగా
ఏది చూచినా తీయగా
ఉంది అందాల ప్యారిస్ నగరం
డెందం ఉన్నవాళ్ళకు దేవుడిచ్చిన వరం'కన్నీటిలో

వాటర్లూ' -

"బెల్జియంలో చూడదగ్గది
వాటర్లూ ఒక్కటే
ఆ ఒక్కటి చూడడానికైనా
ఆ దేశం పోయిరావాలి."

"భర్మవేణి జర్మనీ" -

"నిర్మూలన పథాన్ని గతాన్ని వదలి
నిర్మాణ పథాల భావిరథాల కదలి
చేతనా కేతనాలు ఎగురవేసే
జీవకళా విలాసిని
జర్మనీ భర్మవేణి నేడు."

"స్వేదం మోదం కలసిన చెకోస్లోవేకియ" -

"పొట్టనిండా తినాలీ అంటే
పుష్కలంగా తాగాలీ అంటే
ఆభరణాలు అలంకారాలు లేని
అచ్చమైన అందాలు చూడాలంటే
నావంటి పేదవాళ్లకు
నాకం చెకొస్లోవేకియా."

"భూలోకసుందరి స్విట్జర్లాండ్" -

"జలకమాడే యేటి కొలనుల
అందాలు ఆరబోసిన
సుందరభూమి స్విట్జర్లాండ్"

"కాలకేళీరంగం రోంనగరం" -

"రోంనగర చరిత్రస్మృతి
రోమాంచం కల్గిస్తుంది
ప్రతి శిధిల శిల్ప సౌందర్య రేఖ
ఏదో మహాకావ్యం విన్పిస్తుంది".

ఈ విధంగా తన విదేశయాత్రానుభవాలను అక్షరాలలో అందంగా, శాశ్వతంగా పొందుపరచారు బాపురెడ్డి. విదేశాలలో పర్యటించే అవకాశం, అదృష్టం అందరికీ కలగదు. కలిగిన ఆ అనుభవాలను అందమైన కవిత్వాలుగా మార్చే శక్తి ఉండడం కద్దు. బాపురెడ్డి అద్భుతమైన కల్పనాశక్తి గల కమ్మని కవి. ఈయన చేసిన విదేశ యాత్ర సుందర కవిత్వపాత్ర.

అన్ని దేశాలు సంచరించినా పల్లెటూరిని, ప్రాణేశ్వరిని మరచి పోలేదు కవి:

"మళ్ళీ మా పల్లెటూరు చేరుకున్నాను.
పల్లెటూరిలో నాకోసం పదినెలలు
పల్లేరుకాయల పరుపుమీద
వలపు మల్లెల దండ లల్లుకొన్న
ప్రాణేశ్వరి పరిష్వంగంలో
వ్రాలిపోయాను" అంటారు. ఈ పాదాల గర్భంలో ఎంత తృప్తి దాగుంది!

అంబేద్కర్ దళితజాతులకు ఆశాజ్యోతి. భారత రాజ్యాంగ నిర్మాత. మేధావి. ఆయన వ్యక్తి కాదు; వ్యష్టి. సమష్టి సామూహిక శక్తి. ఆయన జీవితం దేశ ప్రగతికి అంకితమైనట్టిది. అట్టి మనిషిని "అంబేద్కర్ శరణం గచ్ఛామి" అంటూ స్మరిస్తున్నారు బాపురెడ్డి:

"చైతన్య మహానదివై
భరతఖండం నిండా ఆవరించిన నీవు
శిలవై పోయావా!" అని ఆయన మృతికి పరితపిస్తూనే-

'మళ్ళీ ఒకసారి అవతరించు అంబేద్కర్" అంటూ ఆయనపట్ల తనకున్న భక్తిని ప్రస్ఫుటం చేశారు బాపురెడ్డి. రెడ్డి వంటి మానవతావాది మాత్రమే ఈ మాటలు అనగలరు. ఈ మాటల వెనుక అంబేడ్కర్ కృషి ఈ సమాజానికి మరింత అవసరమన్న ధ్వని వినబడుతోంది.

ఈ మధ్యకాలంలో ఈ కవిత ఎంత ప్రచారాన్ని పొందిందో వివరిస్తున్నాను.

సాధారణంగా తెలుగు కవిత్వంలో ప్రయోగం బయలుదేరిందంటే సినిమా విడుదల రోజున కిక్కిరిసిన జనంలా కవులు పోటీలు పడటం మనం ఎరుగున్న సత్యమే! "మళ్ళీ ఒక్కసారి అవతరించు అంబేద్కర్" ఇవి స్థూల దృష్టికి సామాన్యమైన మాటల్లా కనబడ్డా ఈ మాటల్ని కవులెందరో సొంతం చేసుకున్నారు.

'మళ్ళీ ఒకసారి అవతరించు కందుకూరి!' అని ఒక కవి, 'మళ్ళీ ఒక్కసారి అవతరించ గలవా గురజాడా' అంటూ మరో కవి. 'మళ్ళీ ఒక్కసారి అవతరించు బాపూ!' అంటూ ఇంకొక కవి ప్రతిభను బట్టి, ఇష్టాన్ని బట్టి బాపురెడ్డి వాక్యాన్ని వినియోగించుకోవడం జరిగింది. పదిమంది కవులను తన ప్రయోగాల చుట్టూ త్రిప్పుకునే కవి సామాన్యుడా? అఖండుడు. బాపురెడ్డి కవిత్వం అఖండం.

ఆర్ద్రత ఆవేదన, మమత సమత, మానవత్వం నూతనత్వం, బాపురెడ్డి కవిత్వానికి ఆభరణాలు. ఆ ఆభరణాలను దాల్చిన మానవతా చిత్రాలే ఈ గద్య కావ్యాలు.

*(1980లో వ్రాసిన 'బాపురెడ్డి సాహితీ సమాలోచనం' నుండి)*

# నాదేశం నవ్వుతూంది

- డా॥ జి. చెన్నకేశవరెడ్డి

'నా దేశం నవ్వుతూంది' అన్న శీర్షికే ఎంతో కవితామయం. దేశంలో జరుగుతున్న ప్రగతి కార్యక్రమాల పట్ల ఎంతో సంతృప్తినీ సంతోషాన్ని వ్యక్తం చేస్తూ సమధికోత్సాహంతో సరస మనోహరంగా కూర్చిన గేయసంపుటి 'నా దేశం నవ్వుతూంది.' బాపురెడ్డి గారికి దేశం 'మార్పు రథం తోలుకుంటూ, మధుగీతం పాడుకుంటూ కారు చీకటులను దున్ని కాంతిని పండించుకుంటూ, నందనవనంలా నవ్వుతున్నట్లు'గానే కనిపిస్తుంది. 'ప్రగతినోట మనిషి గెలుపుపాట వినాలని, బడుగు బ్రతుకులందు సిరుల బాట కనాలని' ఆశిస్తారు. ఆ 'ప్రగతికి పునాదిరాళ్ళు' గా శ్రమ జీవులను గుర్తించి, 'శ్రమ శక్తికి నమామి' అని సమతాగీతం పాడతారు. 'ప్రగతి ప్రణాళికలు వేసి, ప్రజలను పాలకులు చేసి, దేశలక్ష్మి ఇంటింటికి దీపంగా వెలిగి'నప్పుడు శ్రీదేవికి ప్రియమవుతుంది పేదవారిలోగిళ్ళు, వాగ్దేవికి నెలవవు తుంది. నోరులేని పల్లెటూళ్ళు' అని, 'భూదేవి పిలిచింది పేదోళ్లను, శ్రీదేవి వలచింది లేనోళ్ళను' అని 'ప్రగతి నౌక గమ్యం దరిచేరిందని', 'ఈ దేశం మనదేశం ఎంత మారిపోయెరా ప్రజలు కన్న కలలెన్నో నిజాలు అయిపోయెరా' అని గానం చేస్తారు.

"కులతత్వ తాటకి కూలిపోతున్నది, మత కలహ మాయావి మాయమౌతున్నద"నిచాటుతారు. మనజాతి మోముపైన మార్పు సుమహాసమై మనదేశ రథముపై మంగళ పతాకమై వచ్చింది, పచ్చ పచ్చని చేల, పైట సవరించుకొని, తరుణ భారత చరిత్ర తలనిండ ముడుచుకొని వచ్చిం"దని "అయిదు అయిదడుగులుగ ముందుకు అదుగో భారతజాతి సాగెను. కాంతి చిమ్మెడి దివ్య సీమలు కానుపించెను కనుల మేరల"

జె. బాపురెడ్డి గారు కవితా జీవనది సతత హరిత మైదానం. నిత్య సృజన శీలి. నిత్య చైతన్యశీలి. నిత్యోత్సాహి. ఆయన కవిత్వం మూడు పాయలుగా (గేయం, పద్యం, వచనం-ప్రణవం, ప్రణయం, ప్రగతి) మూడు పూవులారుకాయలుగా నవనవోన్మేషంగా నందనవనంలా విరాజిల్లుతున్నది. ఆయన కవితా రామానికి వసంతం తప్ప మరో రుతువు లేదు. ప్రతి రోజూ తాజా రోజాలా ఒక కవిత పుట్టుకొని రావాలసిందే ఆయన కలంనుంచి. అవి 'ప్రేమారామాలు'గా 'శ్రీకార శిఖరాలు'గా, 'నాద వేదాలు'గా నిలిచిపోవలసిందే.

బాపురెడ్డి గారు వృత్తిరీత్యా ఒక ఉన్నతాధికారి; ప్రవృత్తి రీత్యా ఒక ఉదాత్త ఊహా విహారి. ప్రజాభ్యుదయ కార్యక్రమాల ప్రణాళికలకు చిత్తశుద్ధితో ఆమోదం తెలుపుతూ చేవ్రాలు చేసి జీవం పోసిన ఆయన కలమే, కలవంటి ప్రణాలిక వాస్తవరూపం ధరిస్తేనో, ధరించాలని ఆశిస్తూనో గానం చేస్తుంది. కమ్మని కవితారూపంలో, కలగనే కలమూ, ఆ కలను నిజం చేసే కలమూ ఒక చేతిలోనే ఉండటమనేది చాలా అరుదైన అపురూపమైన అదృష్టం. ఒక వంక ఫైళ్ళను పరికిస్తూ, మరో వంక మొయిళ్ళలో పరిభ్రమిస్తూ ఏ వంకాలేని విశుద్ధ జీవనం గడిపే అదృష్టశాలి బాపురెడ్డి గారు. ఆశయ సిద్ధికోసం అహరహమూ కృషిచేసే ప్రభుత్వాధికారి కవి అయితే ఆ కవికి దేశం ఎప్పుడూ నవ్వుతున్నట్లుగానే కనిపిస్తుంది. విషాదరేఖలు ఏ మాత్రం పొడగట్టవు. ఏ మాత్రం నిరాశ నీడల పొడగిట్టవు. అంతటా అభ్యుదయ కామనే, అన్నిటా ప్రగతి భావనే అగుపించడం ఎంతటి ఆరోగ్య లక్షణం! అది రాసే కవికీ చదివే పాఠకుడికీ ఏదో స్వప్నలోకంలో విహరించినట్లు ఉండదూ?

అని 'భారతదేశం కలలుపండే కర్మభూమి' అని ఎంతో ఆదర్శవంతంగా భావిస్తారు. ఎల్లెడలా ప్రగతి ప్రభలు దర్శించిన కవి కూడా 'జాతి పక్షి నెమలి సరే' జాతి సుమం పద్మం సరే, జాతి గుణం ఏమిటంటే మోసమని చెప్పాలా!' అని విస్తుపోతారు. 'కీచులాట క్రీడ అయితే మనదే ఒలింపిక్ పతకం, వంచనయే కళ అయితే మించలేరు మననెవ్వరు. ఆవేశమే బలమైతే ఆపలేరు మననెవ్వరు' అనే నిరాశల నిజాన్ని గుర్తించక పోలేదు.

ప్రభుత్వ విధానాలనూ ప్రభుత్వ దమననీతినీ ప్రస్తుత వ్యవస్థలో కొనసాగుతున్న అనేకానేక లోపాలను విభిన్న సైద్ధాంతిక ఆర్థిక - సామాజిక నేపథ్యాలలో, కవులూ రచయితలూ పెన్నునే గన్నుగా ఎక్కుపెట్టి తిట్లను బుల్లెట్లుగా కురిపించే ధోరణిలోనో, అధిక్షేప ధోరణిలోనో కవితా వెల్లువలు ముంచెత్తుతున్న ఈ రోజులలో బాపురెడ్డి గారు విలక్షణమైన గొంతుతో దేశాన్ని ప్రగతిమార్గంలో నడిపించడంకోసం ప్రభుత్వం తలపెట్టిన పథకాలను ప్రశంసిస్తూనో, ప్రబోధిస్తూనో త్రిముఖంగా (పద్యం, గేయం, వచనం) త్రివిక్రమంగా (ప్రణవం,ప్రణయం, ప్రగతి) కవిత్వం రాయడం కొందరికి ఆశ్చర్యంగా అగుపించినా హర్షదాయకమే. ప్రగతి శూన్యం అని శపిస్తూనో, తపిస్తూనో ఉండటం కన్నా జరిగిన కొద్ది ప్రగతిని దర్శించడం మంచిదే కదా! మానవ ప్రగతి పట్ల, దేశాభ్యుదయం పట్ల బాపురెడ్డి గారికున్న ప్రగాఢ విశ్వాసం అచంచలమైనది. అమేయమైనది, అమోఘమైనది.

ఈ గేయ సంపుటిలో వస్తువు ఎంతో వైవిధ్య విలసితమైనది. దేశప్రగతికి సంబంధించిన గేయాలే కాక, శాస్త్ర ప్రగతికి, దేశభక్తికి, తెలుగు భాషకు, తెలుగు దేశానికి సంబంధించిన గేయాలు, ప్రభుత్వ పథకాలైన వయోజన విద్య, కుటుంబ నియంత్రణ, పొదుపు, సహకారం మొదలైన వాటి ఆవశ్యకతను ప్రబోధిస్తూ రాసిన గేయాలు విదేశాలకు వెళ్లినపుడు అక్కడ తెలుగువారిని గురించి, తెలుగు సంస్కృతి ప్రతిబింబించే ప్రదేశాలను గురించి - ఈ విధంగా వైవిధ్యభరితమైన వస్తువులను ఎన్నుకొని గేయాలు రచించారు.

బాపురెడ్డి గారు మాత్రాచ్ఛందోమర్మజ్ఞులు. చిరకాలం నుంచి గేయాలను, గేయ నాటికలను, పుంఖానుపుంఖంగా రచిస్తూ వస్తున్నారు. నిరంతర కవితా సాధన వల్ల ఆయన గేయధార నిగ్గులుదేరి కవితా ప్రాంగణంలో పసిడి ముగ్గులు పెట్టింది. గతులు నాలుగే అయినా వాటిని నానా విధాలుగా నడిపి గమన వైవిధ్యంతోపాటు గమన మాధుర్యం కలిగించారు.

బాపురెడ్డి గారి గేయం నడకలో ప్రధానంగా చెప్పుకోవలసిన గుణం ఏ పాదానికాపాదం స్వయం సంపూర్ణంగా ఉండటం. అంటే ఏ పాదానికి ఆ పాదంలో భావ పరిపూర్తి జరగడమే కాకుండా పదపూర్తి కూడ ఉంటుంది. ఒక పాదం మరో పాదంలోకి చొచ్చుకొని పోదు. పాదం చివర హ్రస్వాక్షరముండి తర్వాతి పాదంలో మొదటి అక్షరం సంయుక్తాక్షరం ఉండదు. 'నా దేశం నవ్వుతూంది' అన్న సంపుటిలోని గేయాలనే కాకుండా బాపురెడ్డి గారి ఇతర గేయ సంపుటులను పరిశీలించి చూస్తే పైన పేర్కొన్న గుణం కొట్టవచ్చినట్లుగా కనిపిస్తుంది. 'నా దేశం నవ్వుతూంది' అనే సంపుటిలో మాత్రం రెండు మూడు చోట్ల మాత్రమే వీటికి భిన్నంగా కనిపిస్తుంది. అంటే పాదాంత్యాక్షరం హ్రస్వం ఉంది. తర్వాతి పాదాక్షరం సంయుక్తాక్షరం ఉన్న ఉదాహరణలు:

(1) *చేతి కర్రతో జగ*
*జ్జేతల నెదిరించి, భరత*

(2) *వేషభాషలు మార్చి, మోసము*
*చేసి బ్రతికే స్వార్థ పరులు*
*న్నంత కాలము మరువగలమా*

ఇలా రెండు మూడు చోట్ల తప్ప ఒక పాదం మరో పాదంలోకి చొచ్చుకొనిపోదు. గేయానికి

పద్యప్రౌఢిని కలిగించే ఉద్దేశంతో భావకవులు సినారె వంటి గేయ కవులు ఒక పాదం మరో పాదంలోకి చొచ్చుకొని పోయేలా గేయఖండాల నెన్నిటినో రచించారు. పద్య రచనలో సిద్ధహస్తుడైన బాపురెడ్డిగారు మాత్రం దీనికి భిన్నంగా ఏ పాదాని కాపాదం తెగేలా గేయ రచన చేయడం ఒక దాని నడక ప్రభావం మరో దాని మీద పడని రీతిలో పద్య, గేయ ఛందస్సుల నిర్వహణ సవ్యసాచిత్వం బాపురెడ్డిగారికే చెల్లింది. నిజానికి గేయ నిర్మాణం సరళమైంది. సంక్లిష్టతను కోరదు. అనవసరమైన అలంకారభారాన్ని ఆశించదు. బాపురెడ్డి గారు సహజ గేయకవి కాబట్టి ఏ మాత్రం అన్వయ క్లిష్టత లేకుండా సరళంగా సుందరంగా సుమనోజ్ఞంగా, సూటిగా తన భావాలను బట్వాడా చేయగలిగినట్లే శ్రవణ సుభగమైన నాద మాదుర్యంతో, ధారాశుద్ధి శోభితంగా లలితగతుల రీతులలో గేయాన్ని నడపగలరు. ఆయన ఛందస్సును భావవాహికగా మాత్రమే ఉపయోగించుకున్నారు కనుకనే వారి గేయ నిర్మాణంలో ప్రయోగ వైచిత్రికంటే ప్రయోజన ఔచితి అధికంగా అగుపిస్తుంది.

బాపురెడ్డి గారు గేయం సాఫీగా నడవడానికి ఎన్నో నిర్మాణ వ్యూహాలను పాటించారు. వాటిలో ప్రధానంగా చెప్పుకోదగినవి రెండేసి పాదాల మొదటి అక్షరాలను యతిని (సామ్యాన్ని) నియతంగా పాటించడం. యతిగాని, ప్రాసగాని పాటించక ఆయన గేయాలను అసలు రచించలేదనే చెప్పాలి. ఉదాహరణకు -

బాటసారి ఎవరో
వేటకాడు ఎవరో
గుర్తించని పక్షులు
గురియయ్యె తుపాకికి

మొదటి రెండు పాదాలలో ప్రాస, చివరి రెండు పాదాలలో యతి ఉన్నాయి. చిన్న చిన్న పాదాలలో యతి ప్రాసలు నియతంగా పాటించడంవల్ల గేయగతి లాలిత్యానికి, సౌందర్యానికి మరింత దోహదం చేస్తుంది..

బాపురెడ్డి గేయంలో అంత్య ప్రాసలను అంత నియతంగా పాటించరు గాని, అవి అలవోకగా కుదురుకొంటాయి. అంత్యప్రాసల్ని ఆయన సాధారణంగా 2,4 పాదాలకు, పాటిస్తారు. మొదటి రెండు పాదాలకు, తర్వాతి రెండు పాదాలకు, బేసి పాదాలకు, సరి పాదాలకు కూడా పాటించని సందర్భాలు ఉన్నాయి. 2,4 పాదాలకు అంత్యప్రాస పాటించిన దానికి ఉదాహరణ:

మాట మాట కలిసి, వెలుగు
బాట మీద సాగె
ఊహలలో వాస్తవాలు
ఉయ్యాలలు ఊగె

మొదటి రెండు పాదాలకు మాత్రమే అంత్య ప్రాస పాటించిన దానికి ఉదాహరణ:

ప్రేమలెన్నో పుష్పించి
నోములెన్నో ఫలించి
పుణ్యదంపతుల కడుపున
పుట్టినట్టి సోముడు

బేసి పాదాలకు (1,3), సరిపాదాలకు (2,4) అంత్య ప్రాస పాటించడం :

జనజీవనముల హసించె
అనుభూతుల ఆమని
నవతాంబరముల రణించె
యువతా సౌదామని

1,4 పాదాలకు అంత్యప్రాస ఘటించడం:

ఇచ్చుకొనుటలోని <u>కలిమి</u>
పుచ్చుకొనుటలో లేదు
పుచ్చుకొన్నదైన తిరిగి
ఇచ్చుకొనుటయే <u>చెలిమి</u>

'అలా అలా గలాగలా!' అనే శీర్షికగల గేయంలో 'నదీ' అనే మాటను నది పరంగా 'ఆడే పాడే' అని క్రియా విశేషణాలతోను పుట్టినది, మెట్టినదీ, చేసినదీ, సల్పినదీ...... ఇలాంటి క్రియలతోను అనుసంధించి మొత్తం 24 పాదాలలో పాదంతంలో అంత్య ప్రాసగా ప్రయోగించడం అపూర్వ శిల్పం.

ఈ విధంగా రకరకాలుగా అంత్య ప్రాసలు నియతంగా కాకపోయినా చాలా తరచుగా పాటించి గేయానికి చక్కని సొగసునుకూర్చారు.

గేయ గతులు నాలుగే (త్రిశ్ర, చతురస్ర, ఖండ, మిశ్ర) అయినా బాపురెడ్డిగారు భిన్నరీతుల్లో నడిపి వైవిధ్యం చూపారు. బాపురెడ్డిగారు ఎక్కువగా త్రిశ్రగతిలో గేయాలు రాస్తారు. 'నా దేశం నవ్వుతూంది' సంపుటిలో సగానికిపైగా (64) త్రిశ్ర గతిలో నడిచేవే. మిగతావి ప్రాధాన్యక్రమంలో చతురస్ర (22), ఖండ (18), మిశ్ర (19) గతుల్లో నడుస్తాయి. పదంలో మాత్రల సంఖ్యను పెంచి, తగ్గించి రకరకాల విరుపుల ద్వారా గతి భేదా లెన్నిటినో కల్పించడం జరిగింది. అంతేకాదు, గేయంలో రకరకాల నిర్మాణ సామ్యాలు (Structural Similarities) పాటించి గేయగతికి సౌందర్యాన్ని శ్రుతికి మాధుర్యాన్ని కలిగించారు. మాత్రా ఛందస్సులో బాపురెడ్డి గారు చూపిన శిల్పాన్ని కొన్ని ఉదాహరణల ద్వారా పరిశీలిద్దాం:

(1) గతిననుసరించి పదాలను కూర్చడం:

నేలబాస *గాలిబాస* తెలుసు మాకు
నేడు
కానరాని వెలుగుజాడ తెలుసు మాకు

త్రిస్ర గతిలో నడిచే పై గేయంలో మూడు మాత్రల పదాలనే ఎన్నుకొని కూర్చడం వల్లా ఏకగణావృత్తి (గల) వల్లా నడక అందంగా ఆవిష్కృతమైంది.

(2) ఒకే గేయంలో భిన్న గతుల్లో నడిచే పాదాలను పదాలను కూర్చడం:

ఈల పాట పాడె - రైలు
జోలపాట పాడె - రైలు
పల్లె - పల్లెను పలక-రిస్తూ
ఢిల్లి-చేరింది-క్రొత్త-ఢిల్లి- చేరింది- రైలు

మొదటి రెండు పాదాలు త్రిశ్రగతిలోను, మూడో పాదం మిశ్రగతిలోను నడిపి, నాలుగో పాదం మూడు మాత్రల పదాల మధ్య 'చేరింది' అని అయిదు మాత్రల పదాన్ని రెండు చోట్ల వేసి గతి భేదాన్ని కలిగించడం జరిగింది. నిజానికి పై గేయాన్ని ఈ కింది విరుపుల లాగా చదివితే గతి భేదం కలగదు కదా- రైలు నడక చక్కగా శ్రుతమవుతుంది.

ఈల-పాట -పాడి-రైలు
జోల-పాట-పాడి-రైలు
పల్లె- పల్లె-నుపల - కరి -స్తూ.
ఢిల్లి-<u>చేరింది.</u> క్రొత్త- ఢిల్లి - <u>చేరింది</u> - రైలు

మూడోపాదంలో దీర్ఘాన్ని ప్లుతంగా (మూడు మాత్రల కాలంపాటు) ఉచ్చరిస్తే రైలుకూత స్ఫురిస్తుంది. క్రియాపదం 'చేరింది'. తర్వాత ఒక మాత్రా కాలం విశ్రాంతి తీసుకొంటే షణ్మాత్రలై (రెండు త్రిమాత్ర గణాలు) గతి భేదం కలగదుకదా -రైలు ఆగిన త్రిమాత్ర గణాలలో ఏకగణావృత్తి (గల) వల్ల లయకు చక్కని సొబగు చేకూరింది. ఈ గేయంలోనే త్ర్యస్ర గతిలో నడిచే పాదాల తర్వాత మిశ్ర గతిలో నడిచే పాదాలను;

ఖండ గతిలో నడిచే పాదాలను కూడా కూర్చడం జరిగింది.

(3) పాదాంతంలో మాత్రల సంఖ్యను నియతంగా పెంచడం:

పాడి-తప్పని-ఆడి-తప్పని-పిల్లలం
పాట-పాడే -ఆట-లాడే -వెల్లులం
దేశభక్తికి- త్యాగ- శక్తికి - రూపులం
మోస -ములను - కూల్చి - వేసే - తూపులం

మిశ్రగతిలో నడిచే పాదం చివర నియతంగా ఐదుమాత్రల పదబంధాన్ని కూర్చడం జరిగింది. పాదాంతంలో మరి రెండు మాత్రల కాలం విశ్రాంతి తీసుకొంటే మిశ్రగతిలో సగపాదం పూర్తి అయి, గతిభేదం కలగదు. అయితే నాలుగో పాదంలో నాలుగు మాత్రల స్థానంలో మూడుమాత్రలు పడటం వల్ల గతిభేదం కలిగింది.

(4) పాదాంతంలో మాత్రల సంఖ్యను అనియతంగా పెంచి గతిభేదం కలిగించడం:

దీను-లందరు-మాకు- కడు-ఆ-త్మీయులే
ప్రాణు - లన్నియు-ఆద-రణీయ- ములే
ఒరుల-బాధలు-తీర్చు- టేమా- మోదము
భువిని-దివిగా- మార్చు- టేవినో - దము

మొదటి పాదం చివర ఐదు మాత్రలు, రెండోపాదం చివర మూడు మాత్రలు, మూడోపాదం చివర నాలుగు మాత్రలు అదనంగా కూర్చడం జరిగింది. నాలుగో పాదం చివర నాలుగు మాత్రలకు పదం విరగక 5+2 మాత్రలుగాను లేదా 3+4 మాత్రలు గాను విరిగి గతిభేదం కలిగింది.

(5) పాదాంతంలో నియతంగా మాత్రల సంఖ్య తగ్గించడం:

బ్రతుకు - బాధస - హించ - లేవు
మరణ - మునుప్రే - మించ - లేవు
నేల - పైకా - లూన - లేవు
నింగి -శిఖరము - చేర -లేవు

ప్రతి పాదం చివరా నాలుగు మాత్రల స్థానంలో మూడు మాత్రల పదాన్ని కూర్చడం జరిగింది.

(6) సరిపాదాలలో మాత్రమే మాత్రాసంఖ్యను తగ్గించడం :

మత కలహం మింగిందొక - 12
మతాతీత మనిషిని - 10
కత్తికాటు వేసిందొక - 12
కలమెత్తిన ఋషిని - 9

(7) మొదటి రెండు పాదాలలో ఒక మాత్రా సమత్వాన్ని చివరి రెండు పాదాలు ఒక మాత్రా సమత్వాన్ని పాటించడం:

మరుభూముల గుండెల్లో - 12
మధుమాసం వెలిగించిన - 12
లే గులాబి హాసమును - 11
ద్వేషతమము మ్రింగెనా - 11

(8) 1,4 పాదాలు మాత్రా సమత్వాన్ని 2,3 పాదాలు మాత్రా సమత్వాన్ని పాటించడం :

నేల మీది మనిసి - 9
విరిసినట్టి యంత్రం -10
నింగి మనిషి కోసం -10
వెదకు విసుగులేక -9

(9) అన్ని పాదాల్లో భిన్న మాత్రాసంఖ్యను, భిన్న గతుల పదాలను కూర్చి గతి స్ఫురించని విధంగా రచించడం:

*మరణ - రోగానికి - 3+6= 9*
*పక్కా - మందే-కనిపెడితే -4+4+6= 14*
*చావడం - అనేది - గడ్డు - 5+4+3= 12*
*సమస్య - అవుతుందేమో - 4+4+4= 12*

ఇది త్రిశ్ర గతిలో నడిచే గేయం. దీన్ని ఇలా విరిచి చదువుకోవాలి.

*మరణ-రోగానికి - 3+6= 9*
*పక్కా మం-దే కనిపెడి - తే 6+6+2= 12*
*చావ-డం-అ-నేది-గడ్డు 3+3+3+3= 12*
*సమ-స్య అవు-తుందేమో - 3+3+6= 12*

రెండో పాదంలో చివరి దీర్ఘాక్షరాన్ని మరో మాత్రాకాలం సాగదీస్తే మొత్తం గేయఖండం త్రిశ్ర గతిలో నడుస్తుంది.

(10) ఏకమాత్రలా సమత్వమున్న పదబంధాలను కూరుస్తూ వ్యాకరణ సామ్యం మొదలైన వాటిని పాటిస్తూ గేయానికి సమభారత (బ్యాలెన్స్)ను సాధించడం::

(అ) కోకిలపాటలు - వినే
కోరిక - లేదు
తారల ఆటలు - కనే
తీరిక - లేదు

1,2 పాదాల వాక్య నిర్మాణం 3,4 పాదాల వాక్య నిర్మాణం ఒకటే. నక్రియావిశేషణతో కూడుకున్న నామబంధం, క్రియ అలాగే మాత్ర గణాల కూర్పు (భ + భ+ లగ+ఢ+గల) కూడా ఒకటే:

(ఆ) ఏవీ! ఈ పూవులన్ని
ఏమైపోతున్నాయి?
పూలా! అమ్మాయిల
జడపూలై పోతున్నాయి

మొదటి రెండు పాదాల్లో ఆశ్చర్యార్థకం, తర్వాత ఒక ప్రశ్నార్థక వాక్యం ఆ తర్వాత రెండు పాదాలు దానికి జవాబుగా (అనుబంధ వాక్యంగా) రచించడం జరిగింది. ఇదే నిర్మాణ శిల్పాన్ని (ఆశ్చర్యార్థక పదం, ప్రశ్నార్థక వాక్యం, సమాధాన వాక్యం) మిగతా ఖండాలలో కూడా పాటించి శ్రుతి సుభగంగా, అర్థచమత్కృతితో సోపాన క్రమంలో రచించడం జరిగింది.

(ఇ) పల్లవి దొరికిందని
పాట వ్రాసితే
పాటతోపాటు తుదకు
పల్లవి పోయే.

ఈ గేయంలో మొదటి రెండు పాదాలలో ఒక నిర్మాణ శిల్పం (చేదర్థక) క్రియతో కూడుకున్న అసంపూర్ణ వాక్యం, తరవాతి రెండు పాదాల్లో దానివల్ల కలిగిన (వ్యతిరేక) పరిణామాన్ని వివరించే సంపూర్ణ వాక్యం ఉంటాయి. ఈ గేయంలో అన్ని ఖండాలలోను ఒకే నిర్మాణ శిల్పాన్ని (ఏదో ఒకటి దొరికిందని ఏదో చేయబోతే దొరికినది పోయిందనే అర్థం వచ్చే పదాల కూర్పును) పాటించి గేయం నడకకు మంచి సొంపును చేకూర్చడం జరిగింది.

(ఈ) హరిజనుడు లేచాడు
గిరిజనుడు లేచాడు
యువజనుడు లేచాడు
నవభారతంలో

కర్త పదాలను సూచిస్తూ ఏకక్రియాపద ఆవృత్తి వల్ల కవి ఉద్దిష్టార్థానికి ఎనలేని ఉద్దీప్తి కలిగింది. ఇది జానపద గేయ నిర్మాణ పద్ధతి.

ఈ విధంగా బాపురెడ్డిగారు రకరకాల నిర్మాణ శిల్పాన్ని పాటిస్తూ గేయాన్ని భిన్న గతుల్లో, భిన్న రీతుల్లో రిచంచి తనదైన మార్గాన్ని సుప్రతిష్ఠితం చేసుకొన్నారు.

(1) బాపురెడ్డి గారికి త్ర్యస్ర గతిలో ఎక్కువగా షణ్మాత్రా పదబంధాలను కూర్చడం ఇష్టం.

ఉదా: ఏదారిని-వస్తావో-ఏదారిని-పోతావో
ఎవరినిప్రే-మిస్తావో-ఎవరినిద్వే-షిస్తావో
ఊహింపగ - నైన లేము
ఓ అదృష్ట - దైవతమా

(2) మిశ్రగతిలో విలోమగణాలు (లగ, జగణం) ఇమడవని విమర్శకుల అభిప్రాయం. అయినా కొందరు కవులు మిశ్రగతిలో విలోమగణాలలో 'లగ'ను ఉపయోగించినా, జగణాన్ని మాత్రం అంతగా ఉపయోగించలేదు. బాపురెడ్డి గారు మిశ్రగతిలో కొన్ని చోట్ల విలోమ గణాలను (లగను, జగణాన్ని కూడా) కూర్చారు.

ఉదా: పౌరుషం కా-శ్మీర - గిరుల
తుషా-రమందు-కృశా-నువయ్యో
చేత - నంక - న్యాకు - మారిని
సింధు - భంగము - లందు - పొంగెను

రెండో పాదంలో లగ జగణాల ఆవృత్తిని ప్రయోగించడం వల్ల 4+3 మాత్రలుగా విరిగి (తుషార-మందు-కృపానువయ్యో) మిశ్రగతి స్ఫురించడం లేదు. అలాగే 1,3 పాదాలలో కూడా ఐదు మాత్రల పద బంధాలను కూర్చడం వల్ల మిశ్రగతి వెంటనే స్ఫురించకపోయిన ప్రయత్నపూర్వకంగా సాధించవచ్చు. నాలుగోపాదంలో మాత్రమే మిశ్రగతి చక్కగా శ్రుతమవుతున్నది.

(3) చతురస్రగతిలో పాదాది జగణాన్ని వాడి నడకకు ఉద్ధతిని కలిగిస్తారు.

ఉదా:- దురాశ - పరునికి
నిరాశ - యేరా
పరాన్న - భుక్కుకు
పరాభ - వంరా

ఈ గేయంలో పాదాదిలో ఎదురునడక నడిచే జగణప్రయోగం వల్ల నడకకు పద్ధతి కలగడమే కాకుండా ధ్వని పూర్వకంగా అర్థావిష్కృతి జరిగింది, అపసవ్య గుణశీలురకు (దురాశపరుడు, పరాన్నబుక్కుకు) కలిగిన భంగపాటు (నిరాశ, పరాభవం) ను విలోమ గణమై జగణ రయోగం ద్వారా సూచించడం జరిగింది.

ఈ విధంగా బాపురెడ్డిగారి గేయ నిర్మాణ శిల్పాన్ని సూక్ష్మంగా విశ్లేషిస్తూ పోతే ఉద్గ్రంథమే అవుతుంది. గేయాన్ని ఎంతో ప్రయోజనవంతంగా ప్రభావవంతంగా నడిపి ప్రపంచదేశాలలో పలుమార్లు పర్యటించి తన మధుర గళంతో వినిపించి, పరవశింప జేసిన ప్రతిభావంతుడు బాపురెడ్డిగారు.

# జై జై బాపురెడ్డి - నీ పేరే బంగారు కడ్డి

- తెన్నేటి హేమలత

ఇట్లాంటి పాటేదో రాయలసీమ జానపదంలో తరచూ వినిపిస్తుంది. అది చిరకాల మిత్రులు శ్రీ బాపురెడ్డికి అన్వయించటం అసమంజసం కాదు. బాపురెడ్డి వ్యక్తిత్వం చాలా ఉదారమైనది. సంగీత నాటక అకాడమీకి ఆయన స్పెషల్ ఆఫీసర్‌గా వేసినపుడు నేను మొట్టమొదటిసారి ఆయనని చూడటం జరిగింది. కొబ్బరి నీటిలాంటి ఆయన స్వాదు స్వభావం నాకెంతో నచ్చింది. సుదీర్ఘమైన ఇన్ని సంవత్సరాలలో శ్రీ రెడ్డిమీద నా గౌరవం పెరుగుతూ వచ్చిందే తప్ప ఎంత మాత్రం తగ్గలేదు. అంతకంటే తగ్గే అవకాశం బాపురెడ్డి ఇవ్వలేదని చెప్పాలి. ఒక రోజున ఒక అత్యంత దీనస్థితిలో ఉన్న బ్రాహ్మడు ఒకాయన తన కూతురికి బి.ఇడి. సీటు కావాలని, ఆ సీటే రాకపోతే ఇంటిల్లిపాది ఆత్మహత్య చేసుకోవడం తప్ప మార్గం లేదని దుఃఖపడ్డాడు. ఏం చేయమంటారు అన్నాను. కలెక్టరుకు ఒక ఉత్తరం వ్రాసివ్వండి అన్నా డాయన. అప్పుడు వరంగల్ కలెక్టర్ బాపురెడ్డి. ఆయనకి అనుమానిస్తూనే ఒక చిన్న ఉత్తరం వ్రాసిచ్చాను. ఆ విషయం మర్చిపోయాను. బాపురెడ్డి ఆ పేద కుటుంబానికి సహాయం చేయటం, వాళ్ళు నిలదొక్కుకోవటం జరిగింది. ఎంత దయగలవాడు ఈ రెడ్డి అన్పించింది. అలాంటిది బాపురెడ్డి వ్యక్తిత్వం. ఏ రచయితయినా ఆపదలో ఉంటే వెంటనే ఆదుకుంటాడు. ఆ సంగతి నాకంటే బోయి భీమన్న గారికి బాగా తెలుసు. ఏమయినా బాపురెడ్డి సుగంధ సువర్ణం. ఇహ ఆయన కవిత్వంలోకి వస్తే, చదువురాని సరస్వతి మా అమ్మ, ధనం లేని మహాలక్ష్మి మా అమ్మ- ఇది ఆయన మాతృభక్తి. మాతృభక్తుడైన మనిషి మనీషి అవుతాడు. ఆయనలో కవిత గంగై, గోదావరై, నైలువలె రైనువలె ఓల్గామాదిరిగా హుయాంగ్‌హోవలే, అమజాన్ వలె అందాలు సంతరించుకున్నది. ఈ నదులన్నీ ఆయనతో మాట్లాడాయి. ఆయన కవిత, ప్రణవ లీలా పరిష్వంగంలో అనంత రహస్య గర్భిణి. ఆనందబ్రహ్మకు ప్రియురాలు' నిరంతర కవితా బాలింతరాలు. ఆమె గర్భకోశం కోటి కోటి ప్రణవ, ప్రణయ భావాలలో కలిసి రమ్మరహోరాసలలీలలో తడిసి తీయని మంటలై, వెచ్చని మంచువలె శివాలకలు కన్నది. మచ్చుకి రెండు వాక్యాలు చెప్పాలంటే "పూల విలువ తెలిసిన పూర్ణస్త్రీ సత్యభామ, పరమాత్మను కాలదన్ని పారిజాతంను వరించింది." నా జమిందారీ పోకుంటే పై వాక్యాలకు అక్షర లక్షలు ఇచ్చేదాన్ని. ఇప్పుడు ప్రత్యక్షరమోక్షప్రదమైన శ్యామ సుందరుని అసంఖ్యాక ప్రణయ ఘట్టాలలో సత్యభామ అనూయ పడని రాధ కావాలని కోరుకుంటాను (ఋషి). ఒక పాటలో ఆయన వ్రాసారు. పాటంతా గుర్తులేదు కాని, పాట మొదటి చరణం ఇలా ఉంది: "సిగ్గవుతున్నది నాకు శ్రీనివాసా! నెరసిన తలనీలాలను నీకీయాలంటే" నెరసిన జుట్టుని శ్రీనివాసునికివ్వటానికి సిగ్గవుతున్నది అన్న భావానికి అప్పుడు నా హృదయం స్పందించి బాపురెడ్డి గారికి పెద్ద ఉత్తరం వ్రాసాను. 'వార్ధక్యానికి సిగ్గెందుకు రెడ్డిగారూ! యవ్వనపు పొగరుతో విష పూరితాలైన నల్లని వెంట్రుకలు ఆ సర్వేశ్వరుడికి ఎందుకు? పొగరు తగ్గిన తరువాత, వొగరు వొగ్గిన తరువాత ధవళమైన కిరీటం లాగా, హిమాలయోత్తుంగ శిఖరం లాగా, వెండి జలతారులాగా వరమై, పరాశక్తి కాలి వెండి మువ్వలై, అరిషడ్వర్గాలు తగ్గిన శాంత మహాసముద్రమై ఉన్న ఇప్పటి జుట్టే ఈశ్వరార్పితం కావటానికి తగి వున్నది,

అని, చావుని గురించి "జిజీమిష" శీర్షికలో అంతగా ఆలోచించారెందుకు? చావనేది ఆలోచించటానికి కాదు, అనుభవించటానికి మాత్రమే. భూగగనాలు తిరుగళి రాళ్లై గుండెలను పిండి చేసినా కవి చావకూడదు. కవి బ్రతకాలి. బ్రతికి తీరాలి. బ్రహ్మాండపు అంచులు బ్రద్దలయ్యేలా కవి కేకలెయ్యాలి. సముద్రపు సిరాబుడ్డిలో కుతూబ్ మినార్ కలం ముంచి కమనీయ కవిత్వం అంచెలు అంచెలుగా ఈ భూమికి సమర్పించాలి. అప్పుడే మనదేశానికి మనం ఋణపడం. మీకు, మీ కవిత్వానికి, మీ సహృదయానికి, మన చిరకాల స్నేహానికి కలిసి ఇస్తున్న ఈ నీరాజనం అందుకోండి!

## నిత్య సన్మానార్హుడు

ఆధునిక తెలుగు కవులలో వాసిలో, రాసిలో కూడా పేరెన్నికగన్న ముఖ్యులలో డాక్టర్ జె. బాపురెడ్డి గారు ఒకరు. కవితా రూపాలన్నింటిలోనూ 'సవ్యసాచి' కావటం బాపురెడ్డి కవిత మొదలైన వాటన్నింటిలోనూ ఆయన సమసామర్థ్యాలతో లేఖిని సాగించి అభిజ్ఞుల మన్ననలు పొందారు. వచన రచనలలో కూడా ఆయన సిద్ధహస్తులు. ఆయన విద్యార్థి దశలోనే కవిగా కీర్తిని గడించారు.

ప్రజాసమ్యలపట్ల సంపూర్ణావగాహన, ప్రజల హృదయవేదన-ఆవేశాల పట్ల సానుభూతి, స్పందన వున్న కవిగా బాపురెడ్డి గారికి సహృదయ సాహితీ సద్విమర్శకులు కితాబిచ్చారు. నిబద్ధత, స్పష్టత, సంక్షిప్తత వున్న నిర్భయస్థుడైన కవిగా ఆయనను కీర్తించారు. శ్రీ బాపురెడ్డి గారు. ప్రభుత్వ ఉన్నతాధికారి కావటం, దేశ దేశాలను దర్శించే అవకాశాలు ఆయనకు లభించటం ఆయన కవితా వ్యవసాయం ఘన ఫలసాయాన్ని పండించటానికి దోహదపడింది. ప్రభుత్వాధికారిగా ప్రజానమన్యలు ఆయనకు కరతలామలకం. విస్తృత విదేశపర్యటనానుభవం ఆయన ప్రతిభా వ్యుత్పత్తులకు, భావుకతకు నిశితంగా పదును పెట్టింది.

మా నాయనగారు ప్రముఖ కవి 'కవిరత్న' దివంగత శ్రీ నీలా జంగయ్య గారి సంస్మరణార్థం మేము నెలకొల్పిన వార్షిక సాహితీ పురస్కారాన్ని కవిశ్రేష్ఠులు డాక్టర్ జె. బాపురెడ్డి గారికి ప్రదానం చేసినందుకు ఎంతో సంతోషిస్తున్నాము. అది వారి జీవితాన్ని మరింత ప్రకాశమానంగా వెలుగొందింప జేయుటానికి భగవంతుని మనఃపూర్వకంగా ప్రార్థిస్తున్నాను.

నీలా శ్రీధర్
వాసవి ఆర్ట్స్ థియేటర్స్
2-1-527/7, నల్లకుంట
హైదరాబాద్ - 500 044.

# బహుముఖ ప్రజ్ఞాశాలి బాపురెడ్డి

- డా॥ బి. జయరాములు

'మనసులోని మాట' వ్యాస సంపుటి చదివిన తర్వాత బాపురెడ్డి గారు బహుముఖ ప్రజ్ఞాశాలిగా మన మనసులో ముద్ర వేస్తారు. లక్షణకర్తగా, సమన్వయ వాదిగా, సద్విమర్శకుడుగా, మానవతావాదిగా, ప్రజ్ఞాభిమానిగా, సాటికవులపై గౌరవాభిమానాలు గల వారుగా, సమకాలీన సమాజ, సాహిత్య స్పృహ కలిగిన వారుగా, వ్యాఖ్యాతగా, సహృదయుడుగా, అధికారిగా, తత్త్వపరిశీలకుడుగా, సమన్వయ సిద్ధాంతకర్తగా, మహోన్నత మూర్తిగా, అత్యద్భుత సాహితీ శక్తిగా దర్శనమిస్తారు. వారి వృత్తి, ప్రవృత్తి, సత్య సాహిత్య దర్శనాసక్తి ఈ గద్యకావ్యంలో ప్రతిబింబిస్తున్నాయి. వారి భౌతిక, మానసిక, ఆధ్యాత్మిక జీవితం దీనిలో ప్రతిఫలిస్తుంది. మహాకవి బాపురెడ్డి గారి బహుముఖ ప్రజ్ఞను చూపే కొన్ని అంశాలను ప్రదర్శించడమే ఈ వ్యాసం యొక్క లక్ష్యం.

**1. లక్షణకర్త - సిద్ధాంత ప్రవక్త :-**

దృక్పథాన్ని బట్టి దర్శనం ఉంటుంది. శాస్త్రవేత్తలు ఒక వస్తువును దర్శిస్తే దానిలో భౌతిక సత్యాలను మాత్రం నిరూపిస్తారు. ఏ కాలం శాస్త్రవేత్తలు చెప్పినా, యుగాలు గడిచినా ఆ సత్యాలు ఒకే విధంగా ఉంటాయి. దేన్ని గ్రహించినా శాస్త్రరీత్యా దాన్ని వర్ణించడం వేరు. అదే కవిత్వంలో అయితే అనేకరకాలుగా దర్శించడానికి వీలుంటుంది. కేవలం భౌతిక దృక్పథం కవికి ఉండదు. కవి యొక్క భావనకు, ఊహకు అంతుండదు. ఆ భావన ద్వారా వస్తు సత్యాన్ని మన జ్ఞాన నేత్రానికి అందిస్తాడు కవి. ఒక వస్తు గుణాన్ని ఒకే శాస్త్రానికి సంబంధించిన నలుగురు శాస్త్రవేత్తలు నాలుగు రకాలుగా చెప్పలేరు. కాని దాన్నే నలుగురు కవులు నాలుగు రకాలుగా చెప్పగలరు. ప్రాచ్య, పాశ్చాత్య విద్వాంసు లెందరో కవిత్వాన్ని నిర్వచించారు. కావ్య ప్రయోజనాల్ని వివరించారు. అర్థశాస్త్రవేత్తగా, మహాకవిగా బాపురెడ్డి గారు తమ సొంత బాణీలో కవిత్వాన్ని నిర్వచించారు. తత్ప్రయోజనాన్ని నిర్దేశించారు. హేతుబద్ధంగా కవిత్వం ఎందుకు? అని ప్రశ్నించుకొని అన్వేషించి, చక్కటి నిర్వచనాన్నిచ్చారు. వస్తుగతమైన భావనే కవిత్వమని వారి వాద సారంశం. చాలా ఉత్కంఠగా సాగిన ఈ వ్యాసంలో బాపురెడ్డి గారు ఒక లాక్షణికుడిగా దర్శనమిస్తారు.

వీరు కేవలం లక్షణం చెప్పి అంతటితో ఆగిపోలేదు. కవిత్వం రచనలో ఒక మార్గాన్ని ఏర్పరచుకొని తద్వారా రచనలు చేయడం సాగించారు. భావ భౌతికవాదం వీరి వినూత్న దర్శనం. 'వాదం' అని అంటున్నా అది ఒక దర్శనం, ఒక సిద్ధాంతం. "సర్వ సమత సత్యవాదం నాది. సాహిత్య సామ్యవాదం నాది. హేతువాద నినాదాలను ఇతరశాస్త్రాలకు వదిలేసి, హృదయవాద నాదాలను కదిలించాలనే సంకల్పం నాది......" (అనంత సత్యాలు) అంటారు. ప్రణవం, ప్రణయం, ప్రగతి తత్వాలను మేళవించి భావవాదాన్ని సిద్ధం చేశారు. అనంత సత్య సంకేతం ప్రణవం అనీ, సృజనానంద రసపాతం ప్రణయం అనీ, ప్రణవతత్వాన్నీ ప్రణయతత్వాన్నీ జీవిత సత్యాలుగా దర్శించడమే అనుభవించడమే ప్రగతి తత్త్వమనీ వివరించారు. తమ కవితతత్త్వాన్ని, జీవతత్త్వాన్నీ, సిద్ధాంత తత్త్వాన్నీ, వారి కావ్యాలకు వ్రాసుకొన్న ముందు మాటలలో వివరించారు.

భౌతికమే ఆధ్యాత్మికం అని వీరి సిద్ధాంతం. ఇది అభినవదర్శనం. అనంతత్వమే సృష్టినీ, ప్రతిసృష్టినీ చేస్తూందనీ, పరమాత్మనుండి వెలువడే జీవాత్మలు శారీరక రూపాలు ధరించి భౌతిక జీవితాన్ని అనుభవించడానికి భూలోకం మీద అవతరిస్తున్నాయనీ, పరలోక సుఖాల కోసం భౌతిక సుఖాల్ని వదలాల్సిన అవసరం లేదనీ, ఇంద్రియానుభవం, పరమాత్మాను భూతి సమకూర్చుకొనేది శరీరంతో కూడిన ఆత్మ అనీ, ఆ రెండూ పరస్పర దోహదాలే కాని విరుద్ధాలు కావనీ వారి సిద్ధాంతసారం. ఆస్తిక, నాస్తిక భావాలను, భౌతిక, ఆధ్యాత్మికాలను సమన్వయపరచి 'భౌతికమే ఆధ్యాత్మికం' అనే సిద్ధాంతాన్ని స్థాపించారు. ఈ విధంగా వీరు లక్షణకర్తగా, సిద్ధాంత ప్రవక్తగా దర్శనమిస్తారు.

**2. మానవతావాది - సత్కవితావేది :-**

తన గ్రంథాన్ని గూర్చి చెబుతూ, "మనిషినీ మనిషినీ దైవత్వసూత్రంలో ముడివేసే నా 'మనసులోని మాట' చెపుతున్నాను. సత్య మంగళ వేణుగాన సుధాస్నాతుడనై సుందర భావ బృందావనంలో ఆత్మానందం అనుభవిస్తున్నాను" అన్నారు. మానవతకు మారు రూపం దైవం అంటారు. బాపురెడ్డిగారు 'శరీరం ఆత్మానందాన్నీ, ఆత్మ ఇంద్రియానందాన్నీ అనుభవిస్తూ తరించాలి' అనే వాక్యాలలో శరీరానికి, ఆత్మకు సంఘర్షణ కూడదని చెప్పినట్లే అహం బ్రహ్మోస్మి, త్వమేవాహం అనే అద్వైత వాదానికీ, మనుషులంతా ఒక్కటే. మనిషి జీవితపు విలువలు, విజయాలు మనిషి చేతిలోనే ఉన్నవి అన్న మార్క్సు వాదానికి అట్టే తేడా లేదు" అన్నారు. ఈ మాటల్లో భౌతిక, ఆధ్యాత్మిక దృక్పథాలకు సంఘర్షణ కూడదనీ రెండూ ఒకటేనని సమన్వయపరచడంలో కూడా వీరి మానవతావాద దృష్టివెల్లడౌతుంది. బాపురెడ్డిగారిది ఉపనిషత్ మానవతా దృక్పథం.

ఏ కవిని గురించి పరిశీలించినా, ఆ కవి యొక్క కవితా తత్త్వాన్ని, జీవనాడిని పట్టుకుంటారు బాపురెడ్డిగారు. "వేమన వేద శాస్త్రం" అనే గ్రంథం చదివి ప్రేరణ పొందారు. సత్యాల్ని చెప్పడం, చెప్పిన వాటిని జనుల చేత విశ్వసింప జేయడం వల్ల వేమన "విశ్వసనీయ" కవి అయినాడని వీరు భావించారు. తద్గ్రంథ రచయితలు శ్రీశ్రీ లాంటి రాజకీయకవులతో పోల్చి వేమనను "అభ్యుదయ యోగి"గా చిత్రించడం రెడ్డి గారికి సమంజసమనిపించలేదు. ఆ గ్రంథంలోని గొప్పదనాన్ని విశ్లేషిస్తూనే దోషాల్ని నిష్కర్షగా చెప్పడం సద్విమర్శక లక్షణం.

సంగీతజ్ఞుడుగా జగ మెరిగిన త్యాగరాజును సత్కవిగా విశ్లేషించడం జరిగింది. త్యాగరాజు జీవిత విశేషాలు, ఆయన కర్ణాటక సంగీతానికి చేసిన సేవ, వైష్ణవ భక్తి, ప్రతిష్ఠాపనకు ఆయన సంగీత సాహిత్యాలు తోడ్పడ్డ తీరు మొదలైన అంశాలను సాకల్యంగా చర్చించారు. 'ముసలమ్మ మరణం' వ్రాసి కవిగా, కవిత్వతత్త్వ విచారకర్తయై విమర్శకునిగా తెలుగు సాహిత్యక్షేత్రంలో స్థానం సంపాదించుకున్న కట్టమంచి వారి జీవిత చిత్రాన్ని సమగ్రంగా చూపడానికి యత్నించారు. చరిత్ర, రాజనీతి, సాహిత్యం, తత్త్వశాస్త్రం లాంటి భావదీప్తులతో కట్టమంచి వారి చైతన్య కల్పనం అనంతాకాశపథాలలో హరివిల్లై విరిసిందని ఋజువు చేశారు.

శ్రీశ్రీలోని సూటిగా ఘాటుగా చెప్పే లక్షణాలతో పాటు రసవత్తరమైన వ్యంగ్య వైభవం, ఆలోచనాత్మకమైన భావుకత బాపురెడ్డిగారిని ఆకర్షించాయి. శ్రీశ్రీని అమితంగా గౌరవిస్తూనే ఆయన గురించి తన మనస్సులో ఉన్న అభిప్రాయాలను నిర్మొహమాటంగా చెప్పారు. కవిగా ఆయన్ని ఆదరిస్తారు కాని మార్క్సిస్టుగా మాత్రం కాదు. అందుకే "శ్రీశ్రీ తన రచనల్లో

సాధించింది ఉపనిషత్ విజ్ఞానంలో వికసించిన మానవతా దృక్పథాన్ని మించిన దృక్పథం కాదు" అంటారు.

కుందుర్తిలోని అభ్యుదయ తత్త్వం, మానవతా వాద కవిత్వం, సంప్రదాయనేపథ్యం బాపురెడ్డిగారికి బాగా నచ్చాయి.

సమకాలీన కవులందరిపై సమాన గౌరవమే ఉన్నా ఆచార్య సి. నారాయణరెడ్డి గారిపై ఒకింత ఎక్కువ అభిమానం ఉన్నట్లుగా మనం గ్రహించవచ్చు. మనం గ్రహించడమేమిటి - ఆయన వ్యాసాలే ఈ విషయాన్ని ఋజువు చేస్తాయి. నారాయణరెడ్డి గారు ఎంత చిన్న స్థాయి నుండి ఉన్నత స్థాయి కెదిగారో, విశ్వంభరావ్యాప్త కీర్తిమంతుడయ్యారో, ఆయన భావుకత, ప్రగతి శీలత ఎలాంటిదో సవిమర్శనాత్మకంగా నిరూపించి, ఆయన మహోన్నత సాహితీ మూర్తిని మన కళ్ళముందు ప్రత్యక్షం చేశారు.

"రాజనందిని" కావ్యాన్ని సమీక్షిస్తూ కూడా దానిలోని సత్కవితానాడిని పట్టుకొని మనకు చూపిస్తారు.

ఈ విధంగా మానవతా వాదిగా, సత్కవితావేదిగా ఈ గ్రంథంలోని వ్యాసాలలో బాపురెడ్డి గారు ప్రత్యక్షమవుతారు.

**3. సమన్వయకర్త - చక్కటి వ్యాఖ్యాత :-**

బాపురెడ్డి గారికి స్థూలంగా సంఘర్షణ అంటే గిట్టదు. ఒక వేళ సంఘర్షణ అనివార్యమైతే అందులోనుండి హాలాహలం పుట్టడాన్ని ఆయన భరించలేరు. అమృతం ఉద్భవిస్తే మాత్రం తానే మొదట ఆనందిస్తారు. సెన్సిటివ్‌నెస్, ఎమోషనల్ ఫీలింగ్స్ బాపురెడ్డి గారిలో జాస్తి. అందుకే ఆయన సర్వదా సమన్వయం వేపు మొగ్గు చూపిస్తారు.

సౌందర్యగుణం ఉన్న ఏకవిత్వాన్నైనా బాపురెడ్డి గారు గొప్పదిగా భావిస్తారు. తిక్కనగారిలో ఈ లక్షణం పుష్కలంగా ఉంది. అంతేగాక, ఆయన కాలంలో శైవం, వైష్ణవం సంఘర్షించుకొంటే వాటికి సమన్వయం కుదర్చడానికి 'హరిహరాద్వైతాన్ని స్థాపించాడు. ఉభయ కవిమిత్రుడయ్యాడు. సంఘర్షణాత్మకమైన ఏ సమాజానికైనా సమన్వయశాంతి సందేశం అవసరం. అలాంటి సర్వకాలీనమైన సందేశాన్నిచ్చిన తిక్కనగారు నిత్యాధునికులని బాపురెడ్డిగారి తీర్పు.

సమన్వయకర్తలను చూసి సంతోషించడం కాదు - వారు స్వయంగా సమన్వయకర్తలు. అద్వైతానికి, మార్క్సిజానికి, నాస్తిక, ఆస్తిక్యాలకు, భౌతిక, ఆధ్యాత్మికాలకు సమన్వయం కుదిరించి సిద్ధాంతాలే చేశారు. వచన కవిత్వాన్ని సమకాలీన పరిస్థితుల కనుగుణంగా సమన్వయించారు. వారి 'భావ భౌతికవాదం' ఈ సమన్వయ దృక్పథం కన్న బిడ్డే.

ఈ గ్రంథంలోని అనేక వ్యాసాలలో వీరి వ్యాఖ్యాతృత్వ ధోరణి సువ్యక్తమవుతుంది. తన గ్రంథానికి పీఠిక వ్రాస్తూ బోయి భీమన్న గారు శ్రీశ్రీ గురించి వ్రాసిన సంఘర్షణాత్మకమైన సిద్ధాంతం లాంటి ఒక వాక్యానికి చక్కటి వ్యాఖ్యానం చేసి సమర్థించారు. వారి వ్యాఖ్యాన పటిమను "పీఠికా పీఠాధిపతి" అనే వ్యాసం ఋజువు చేస్తుంది.

"శ్రీశ్రీ చేతుల్లో సాహిత్యం చావు దెబ్బ తిన్నది" అన్నది భీమన్న గారి వాక్యం. శ్రీశ్రీ మహావటవృక్షం గావడం, దాని కింద మిగతా వృక్షాలు మిగిలిపోవడం, శ్రీశ్రీ కవిత్వాన్ని అనుసరించి మాత్రమే కవిత్వం రావడం అనే అంశాల వల్ల శ్రీశ్రీ చేతుల్లో సాహిత్యం చావు దెబ్బతిన్నది అనే మాట సరియైనదేనని వ్యాఖ్యానించారు.

ఇలా బాపురెడ్డి గారు చక్కటి సమన్వయకర్తగా, వ్యాఖ్యాతగా కనబడతారు.

**4. హృదయావిష్కర్త - పరిణామవేత్త :-**

మనసున్న ప్రతి మనిషికి స్పందన తప్పదు. స్పందించిన ప్రతి హృదయానికి ఆలోచన తప్పదు. బాపురెడ్డి గారు 'హృదయలేఖ' అనే వ్యాసంలో తన హృదయాన్ని తానే ఆవిష్కరించుకొన్నారు. జీవితంలో జరిగే రక రకాల సంఘర్షణలు, ఆలోచించిన కొద్దీ మనసులో చెలరేగే భావతరంగాలు, అనుక్షణం జీవిత గమనంలో ఏర్పడే వింత అనుభవాలు, అంతలోనే పొంగిపోవడం, వెంటనే కుంగిపోవడం, రాగద్వేషాలతో రగిలిపోవడం మనోజ్ఞంగా వివరించారు.

చెడును ద్వేషించడం, మంచిని ప్రేమించడం, ఇతరులను ద్వేషించకుండా ఉండడం, ఇతరుల హృదయాలకు బాధ కలిగించకుండా ఉండడం, ఒక చిరునవ్వు, ఒక నిర్మల హృదయం, ఒక అనురాగ భావం, పవిత్ర మైత్రి కోరదగిని మంచి లక్షణాలు. సత్యానికున్న ప్రాముఖ్యం, సెన్సిటివ్‌నెస్, ఎమోషన్స్, పరులపై జాలి, స్వనింద, మిత్రవృద్ధి, శత్రుక్షయం, విశ్వప్రేమ, విశ్వ భ్రాతృత్వం మొదలైన భావాల్ని వివరించారు. అహింస, దయ, గౌరవం, సౌభాతృత్వం, సహనం- ఇలాంటివి నశించిపోతే సమాజం అరణ్య ప్రాయమౌతుందంటారు. మానవసంబంధాల్నీ స్త్రీపురుష సంబంధాల్నీ చక్కగా విశ్లేషించారు. ఇవ్వాళ ప్రతివ్యక్తి ఒక విధమైన అనిశ్చలత్వానికి, అవిశ్వాసానికి, అస్పష్టతకు లోనై కలవరపడుతున్నాడనీ, వ్యక్తి సంబంధాలు వక్రమార్గాలు పట్టాయనీ, సంబంధాలు ప్రవర్తన ప్రాతిపదికలు కోల్పోయి ఊగులాడుతున్నాయనీ, ప్రతిచోట మోసం, స్వార్థం, పక్షపాతం, అన్యాయం కనబడుతున్నాయని తన ఆవేదనను వ్యక్తపరుస్తారు.

"వయస్సుతో లింగభేదంతో సంబంధం లేకుండా ప్రతి మానవునికీ సమానమైన గౌరవం జరిగే సంఘం, జాతి ఎక్కువ నాగరికమైంది" అని వారి అభిప్రాయం. ఫీలింగ్స్ గురించీ, స్నేహం గురించీ, సౌందర్యం గురించీ తన అభిప్రాయాలను నిర్మొహమాటంగా వివరించారు. "భయం మీద, మోసం మీద ఆధారపడ్డ సాంఘిక న్యాయం స్వేచ్ఛా స్వాతంత్ర్యచ్ఛాయల్లో జరిగే అవినీతికంటే హీన మైంది" అని ఘంటాపథంగా చెప్పారు.

వారి 'హృదయలేఖ' చదువుతూంటే మన జీవితాన్ని మనమే చదువుకుంటున్నట్లుంటుంది. ఈ వ్యాసంలోని ప్రతి వాక్యం మనల్ని పరవశుల్ని చేస్తుంది.. మనమే మాట్లాడుతున్నట్లుంటుంది. మన అనుభవాల్నీ, ఆలోచనల్ని మిత్రులకు చెబుతున్నట్లుంటుంది.

బాపురెడ్డి గారు సాహిత్యంలో జరిగే పరిణామాలను అనుక్షణం గమనిస్తూనే ఉంటారు. కేవల సాహిత్య పరిణామాలకే వారు నిబద్ధులు కారు. గ్రామీణ జీవన పరిణామాన్ని కూడా అంచనా వేయక వారి కలం వదలలేదు. వ్యవసాయం, ఋణసదుపాయం, రోడ్లు, స్కూళ్ళు, వైద్యశాలలు, పేదలకు గృహనిర్మాణం, విద్యుచ్ఛక్తి, స్త్రీ విద్య, మహిళా మండలులు మొ॥ వాటి ద్వారా అభివృద్ధి జరిగి గ్రామణ జీవితం మారుతుందని విశదీకరించారు. పరిణామాన్ని పసికట్టే పరిణామవేత్త బాపురెడ్డి గారు.

**5. అధికారి - లోకోపకారి :-**

ఒక ప్రభుత్వాధికారిగా గ్రామీణ జీవన పరిణామాన్ని చక్కగా చిత్రించారు. వీరు భాషపై చక్కని అధికారం గలవారు. వీరి శబ్దాల వెంట భావం పరిగెడుతూ వస్తుంది. భావం వెంట శబ్దాలు లాస్యం చేస్తాయి. ఈ కింది వాక్యం పరిశీలిస్తే బాపురెడ్డిగారికి శబ్దంపై ఎంత అధికారముందో సువ్యక్తమౌతుంది.

"కర్మయోగియై, భోగత్యాగియై, జ్ఞాన యోగియైన తిక్కన సోమయాజి, కవితావాజిపై విజృంభించి భారత ఆజిలో విజయభావ రసానంద బృందావనాలు ఆర్జించినాడు."

"విజ్ఞానం ప్రజ్ఞానం" లాంటి జంటమాటల్ని అనేకం ప్రయోగించి రసాత్మకంగా రచన సాగిస్తారు. ఈ గ్రంథంలోని ప్రతి వ్యాసంలో ఓ మహాకవి మనకు ప్రత్యక్షమవుతాడు.

వీరు కవితలు వ్రాసినా, గేయనాటికలు వ్రాసినా, గద్య రచనలు చేసినా, ఉపన్యాసాలు చేసినా ప్రతి దాని వెనుక లోకోపకార దృష్టిఉంటుంది. వీరి జీవితతత్త్వంలో, కవితాతత్త్వంలో, సిద్ధాంత నిర్ణాయకత్వంలో "లోకాస్స మస్తాస్సుఖినో భవంతు" అన్న విశాల దృక్పథం ప్రస్ఫుటంగా కనబడుతూ ఉంటుంది.

'వసుధైవకుటుంబకం" అనే భావన వారి కవితల్లో గోచరిస్తూఉంది. "బాపురెడ్డిగారి కవిత సమగ్ర మానవతను దర్శించటానికి ఒక రమ్యాలోకం" అన్న గురువర్యుల వాక్యం అక్షరసత్యం.

బాపురెడ్డి గారు స్వయంగా తన "మనసులోని మాట"ను "సత్యసాహిత్య దర్శన గ్రంథం"గా పేర్కోవడం నూటికి నూరుపాళ్ళు యధార్థం.

ఇలా అనేక దృక్కోణాల నుండి ఈ గ్రంథాన్ని పరిశీలిస్తే బాపురెడ్డి గారు బహుముఖ ప్రజ్ఞాశాలి అన్న విషయం తేటతెల్లమౌతుంది.

**డా. బి. జయరాములు**
1-3-92/6/1/బి
భాగ్యలక్ష్మీనగర్, కవాడిగూడ
హైదరాబాదు - 500 380

# బాపురెడ్డిగారి కవితల హరివిల్లు

- ఆచార్య ఎల్లూరి శివారెడ్డి

కొందరు కేవలం కవులుగానే జీవిస్తారు. కవులుగానే రాణిస్తారు. మరికొందరు పరిపాలన చతురులుగా కీర్తి తెచ్చుకుంటారు. పరిపాలన దక్షులుగానే విలక్షణులవుతారు. ఈ రెండు రంగాలకు సంబంధించినంతవరకు బాపురెడ్డి గారు సవ్యసాచిలా కనిపిస్తారు. నిరంతరం చిరంతన దీక్షతో కవి భావుకతలో లగ్నమనస్కుడు అవుతాడు. పరిపాలన రంగంలో పదిమంది విచిత్ర చిత్తవృత్తుల మధ్య, మొరటుదనాలు, కరకుదనాల మధ్య మెలిగే కవి తన భావుకతను కాపాడుకొని, తన భావాలను తానే పాదుకొని కవిగా నిలవడం కష్టం. అయినా మౌలికంగా కవియైనా బాపురెడ్డిగారు, కవిగా నిలబడ్డారు. సమున్నత స్థానాన్ని అధిష్ఠించారు. అందుకు మొదట వారిని అభినందించాలి. వారి కవితాశయం రమణీయమూ, కమనీయమూ, స్పృహణీయమూ.

బాపురెడ్డిగారికావ్యరాశి పెద్దది. గుణరాశి దొడ్డది. వారి రచనలన్నీ నమీక్షించి అంత:సూత్రాన్ని నిగమించటం ఈ పరిధిలో సాధ్యం కాదు. వారి కవితా రచనల సంపుటాలు "మనచేతుల్లోనే వుంది" "రంగు రంగులచీకట్లు" ఈ రెంటినీ ప్రస్తావించుకొని పది మాటలు చెప్పుకొందాం.

కవి మనసు చేత కావ్యత్వం పొందని వస్తువు ఉండదు. అనునిత్యం చూసే విషయాలే కవి దృష్టిలో సరికొత్తగా భాసిస్తాయి. బాపురెడ్డి గారు కుక్కను గురించి రాసిన ఖండికను గమనిస్తే కవి హృదయంలో ఉదాత్త విషయాలుగా పరిణమించనివి ఉండవేమో అనిపిస్తుంది.

"లోకమంతా నిద్రిస్తున్నది
చీకటి గంభీరంగా చూస్తున్నది
నిర్భయంగా నీ గొంతు మాత్రం
నిశల చీల్చుక వినిపిస్తున్నది " - మన. పు.3.

లోకమంతా నిద్రిస్తుంటే స్థితప్రజ్ఞుడు మేలుకొంటాడని భగవద్గీతలోని వ్యాసవాణి. అలసిన శరీరాలకు, సొలసిన మనస్సులకు - కంటికి అమృతసేచనంగా - నిద్ర ఆవహిస్తుంది. అలాంటప్పుడు ఓంకారనాదం వంటి భౌంకార నినాదంతో శునకం కాపలాకాసి యజమానిని కంటికి రెప్పలా ఆదుకుంటుంది. పై నాలుగు చరణాలలో చీకటి గంభీరంగా చూసిన చూపు కన్నా బాపురెడ్డిగారే నిశితంగా ఊహిస్తారని అనిపిస్తుంది. అందుకనే వెంటనే 'నిద్రమాని నా మనస్సు నిన్ను గూర్చి ఆలోచిస్తుందని' అంటారు. అర్థాల అంచులు, భావాల పొరలు తొలచి చూస్తేనే బాపురెడ్డిగారి కవితలోని అందాలు స్ఫురిస్తాయి. శునకం స్థితప్రజ్ఞుడుగా ధ్వనించింది.. కవి సమవర్తికదా!

ఎందరోకవులు, అందరూ కవితలు చెబుతారు. కవితలు రచించినా నిజమైన కవిత్వమంటే ఏమిటో చాలా మంది కవులకు తెలియదు. సాహితీ రంగంలో కొన్ని చిక్కులున్నాయి. కవులకు విమర్శ రుచించదు. విమర్శకులకు కవిత అన్ని విధాల రుచించదు. కవియైన విమర్శకుని అభిప్రాయాలు సముచితంగా అర్థవంతంగా ఉంటాయి. బాపురెడ్డి గారు అటువంటి కవీ, విమర్శకుడు. 'మనసులోని మాట'లో ఆయన అభిప్రాయాలు స్వచ్ఛందంగా, రుచికరంగా అగుపిస్తాయి. విమర్శకుడైన కవికి ఆ కవిత రుచించదు. అది ఎందుకు రుచించదో 'రసజ్ఞుని విజ్ఞప్తి' అనే ఖండిక ద్వారా ప్రకటించారు ఆయన.

*మాటలు బాగా వస్తే*
*మతిపోయే ప్రమాదం ఉంది'*

*..........................................*

*'నిఘంటు పర్వతాలపై కెక్కి*
*మా పూలగుండెల లోయల్లోకి*
*గెరిల్లా లాగా శబ్ద శిలలను*
*గిర గిర దొర్లించకు కపిరాజకవీ!*

- మన - 19

ఇది ఎవర్నిగురించో తెలియదు గాని సుతారమైన మందలింపు. నిజం చెప్పాలంటే, బాపురెడ్డి గారు ఒకర్ని ఉద్దేశించి రాసి ఉండరు. ఉండకూడని లక్షణాన్ని ఉదాత్తంగా చెప్పి ఉంటారు. బరువైన బాధల్ని, గాథల్ని వెల్లడించటానికి విధిగా భారమైన శబ్దాలు ప్రయోగించవలసిన అవసరం లేదు. ఎండిపోయిన భావాల్ని శబ్దదారువుల ప్రతిమలుగా మలచుకొనే కవులు ఉన్నారు. ప్రాణం ఉన్న శబ్దం జీవం ఉన్న మనిషిలాంటిది. ఉక్తికి ప్రాధాన్యం ఇచ్చి భావశక్తిని గమనించనివాళ్లను గురించే వీరు 'మాటలు మరీ బాగా వస్తే మతిపోయే ప్రమాదం ఉంది' అన్నారు. శబ్దశిలలను పర్వతాగ్రాల మీది నుంచి దొరలించే కపి రాజులు కవి రాజులు కాలేరు. ఈనాడూ అందరికోసం కవిత్వం రాస్తున్నామని చెప్పుకొనే కవులు వాళ్ల కవిత్వానికి వాళ్లే అర్థం చెప్పుకొనే దుస్థితి ఏర్పడింది. ఇరవై అయిదు వసంతాల క్రిందటే బాపురెడ్డి గారన్న ఈ వాక్యాలు నెమరువేసుకొని జీర్ణం చేసుకోదగినవీ, గమనించతగ్గవీ!

బాపురెడ్డి గారు సమైక్యవాదాన్ని సాగించారు. నేటి కవులు సమైక్య వాక్యాలను సమకూర్చిన సమైక్య భావాన్ని వదులుకోరు. తెలుగువారికి ఆవేశం ఎక్కువ. నదులు, ఉపనదులలాగా అప్పుడప్పుడూ చీలిపోయే భావవాహికలను ప్రసరిస్తారు. తెలుగువారే చీలిపోతే జాతి ఆత్మగౌరవం మంట కలిసిపోతుంది. అధవా ఏట్లో కలిసిపోతుంది. అందువల్ల చీలిపోయే వాదాన్ని చూసి వ్రీలిపోయిన హృదయంతో బాపురెడ్డి గారు ఇలా ఘోషించారు :

*"ఉప్పొంగిన గోదావరి*
*ఉవ్వెత్తున శివమెత్తిన కృష్ణానది*
*శ్రుతి తప్పిన గతి తప్పిన మంజీర."*

ఈ కవిగారి మనసులో కలవరం లేపాయి. తెలుగునేల ఆయనకు 'ఆరు రంగుల హరివిల్లులా' గోచరించింది. 'విరిచివేయకండి ఆ హరివిల్లును' అని ఆక్రోశించారు. వీరి దృష్టిలో వ్యష్టికన్నా సమష్టిలోనే అందాలు అలరారు తాయి.

జాషువా గారు శ్మశానాన్ని వర్ణించిన తీరు వేరు. ఈ కవి గారు శ్మశానాన్ని పరికించిన తీరు వేరు. బాపురెడ్డి గారు తన కవితలో శవాలకు ప్రాణం పోస్తారు. 'శవాలు లేస్తున్నవి - సవాలు చేస్తున్నవి' అంటూ హెచ్చరించారు. 'తమ ప్రాణాలను హరించిన తమోగర్భాలను చీలుస్తామని' శవాలు సవాలు చేస్తున్నాయట! ఆ సవాలుతో 'ప్రగతి గీతాలు అపశ్రుతులు పట్టించిన పన్నాగాల నోట మన్ను పడిం' దట! ఆ సవాలులో ఎదిరించటానికి ప్రాణమున్న మనుష్యులే కాదు - ప్రాణంలేని శవాలు కూడా ఉద్యమిస్తాయనడంలో ఎంతో స్ఫూర్తి ఉంది! ఇవి మననం చేయవలసిన మాటలు! మాటలను ఖననం చేస్తే శవాలయిపోతాయి! మననం చేస్తే మనుష్యులుగా మారతాయి! అదీ బాపురెడ్డిగారి విలక్షణమయిన చూపు!

బాపురెడ్డిగారితో మట్టి మాట్లాడుతుంది! చైతన్య త్రిశూలం ముచ్చటిస్తుంది. "మార్పుకు స్వాగతం పట్టి మట్టి మాట్లాడుతున్నది" అని ఈ కవిగారి ఆనందం!

*"నా ఒడిలో తన కష్టాన్ని ఒలకబోసి*
*నన్నానంద స్పందనంలో ఆడించేవాడే*
*నా వరుడు"*

అనటంలో శ్రమకు మట్టి ఎంతగా పులకించిపోతుందో అర్థమవుతుంది. మట్టిని బంగారం చేయగలిగిన వాడే నిజమైన శ్రమజీవి! మట్టిలోని పరిమళాన్ని గుర్తించటానికి మనిషిలో గొప్పతనం ఉండాలి! శ్రమను గుర్తించిన నరుడే నా వరుడని మట్టి మనసులోనిమాట! మట్టి మగువ 'మనసులోని మాట'ను గుర్తింపగలిగిన రసరాజు బాపురెడ్డిగారు. ఆయన దేన్ని గురించి అయినా ప్రకాశమానంగా భావించగలుగుతారు. 'పుణ్యం-నైపుణ్యం మన చేతుల్లోనే ఉంది' అన్న ఆయన విశ్వాసానికి ఏ సరసుడూ అడ్డు చెప్పడు! సౌందార్యాలన్నీ సాధనంగా స్వీకరించి సముజ్జ్వల భావాల్ని వెలయించగలిగిన సరసుడాయన!

బాపురెడ్డిగారికి చీకటి అంతరంగంలో దాగిన రంగులు స్పష్టంగా కనిపిస్తాయి. అలాంటి రంగుల సంపుటులే 'రంగు రంగుల చీకట్లు.' ఇందులోని ఖండికలన్నీ పంచరంగుల చిత్రాలు. ప్రపంచకాంతి రంగ తరంగాలు.

*'శిలలను పూజించే*
*ఏకాంత సేవకుణ్ణి నేను*
*ప్రస్తరాలను పలికించే*
*భావుకుణ్ణి నేను*
*జడానికి చైతన్యానికి*
*ముడివేసే జీవనతరంగాన్ని నేను'*

- రంగు - పు. 3

అని ప్రవచించే కవితాసాధకుడు నిజమైన సహజకవి. శిల్పి చేతిలో రాళ్ళు జవరాళ్లయి పోతాయి. కవి చేతిలో పాషాణాలు భోషాణాలై పోతాయి. భావనైశిత్యం ఉలిలా శబ్ద ప్రస్తరాలను చెక్కి, కవితా శిల్పంగా తీరుస్తుంది అనేదే ఈ వాక్యాల ఆత్మఘోష - ఈ కవి ఘోష.

కవి అన్నిటినీ ప్రేమిస్తాడు. కవులే అన్నారు. "ప్రేమించు ప్రేమకై' అని. ప్రేమ అనేది ఆంతరతపస్సు. అది లేని బ్రదుకు దుర్భరం. ఒకోసారి తీవ్ర క్రమశిక్షణ ప్రేమ భావాన్ని సమాధి చేస్తుంది. ప్రేమ కోసం స్వేచ్ఛా గానం ఆలపించిన కవులకు మనలో కొదువ లేదు. ప్రేమించిన వారే హాయిగా పాడుకుంటారు. అప్పుడే రాగాలు రమణీయంగా పలుకుతాయి. భావాలకు రెక్కలొచ్చి ధ్రువనక్షత్రాల దాకా సాగిపోతాయి. అయితే బాపురెడ్డి గారు 'అహం' 'అహం' అని పాడుకోరు. 'కోహం కోహం' అని మాత్రమే పాడుకొంటారు. కవి తత్త్వశిఖరాలను అధిరోహిస్తే 'కోహం' అనే మీమాంస బయలుదేరుతుంది. అందుకే అంటారు ఈయన-

*"కోహం! కోహం! అంటూ*
*కోకిలమునై పాడుకొంటూ*
*విజ్ఞాన విభవ వసంతాన్ని*
*ప్రజ్ఞాన శిఖరాల మీదికి*
*పట్టుకుపోతున్నాను"* - అని

రంగు - 29

ఈ తత్త్వ జిజ్ఞాస కవిత్వానికి కడపటి అందం కాంతిమత్త్వ విచారం! ఇక చీకట్లను గురించి, చీకట్లకు ఎన్నో నాలుకలు! ఎన్నో ప్రణాళికలు! ఈ అన్నింటినీ సంకలనం చేసిన బాపురెడ్డిగారు సమకూర్చిన ఈ కవితా చరణాలు ఆర్భటిస్తూ ఇలా సాగిపోతాయి:

*"చీకటి వేస్తున్న ప్రణాళికలో*
*ప్రతిభ కాదు కావలసింది - పలుకుబడి*
*గుణం కాదు అర్హత - కులం*
*దేశం కాదు ముఖ్యం - వేషం*
*పెట్టడం కాదు గొప్ప - పడగొట్టడం*
*లక్ష్యం సీటు,సాధనం ఓటు*
*తదితరం చేటు."* - రంగు - పు. 82

ఇది కవిగా బాపురెడ్డి గారి నిర్వేదం. జాతికి చేటు కలిగించేది మనకెందుకులే అనుకుంటే మానవత్వం మట్టిలో కలుస్తుంది. మనుషులు చీలి పోతున్నారు. ఎన్ని రకాలుగా చీలి పోతున్నారో ఈ కవితా సత్యం చెప్పటానికి దౌర్జన్యాలు అడ్డు తగులు తున్నాయి. వీటిలో ఏ మాత్రం లెక్కచేయకుండా బాపురెడ్డిగారు కవిగా, మేధావిగా, దారిచూపే క్రాంతదర్శిగా, మేలుకొలిపే వైతాళికుడుగా, సహృదయులను రంజించే మురళీమూర్తిగా మన ముందు సాగిపోతున్నారు. మార్గమంతా ఆయన చేతిలో ఉంది. ఆయన కవిత "మన చేతుల్లోనే ఉంది". మార్గదర్శకత్వం నేటి కవి చేతుల్లో ఉంది. ఇదంతా భవిష్యత్తు చేతుల్లో ఉంది. భవిష్యత్తులో కూడా బాపురెడ్డి గారు రంగు రంగుల భావాలు ప్రసరించే రస సమ్రాట్టే!

డాక్టర్ ఎల్లూరి శివారెడ్డి
ప్రొఫెసర్, తెలుగు శాఖ
ఉస్మానియా విశ్వవిద్యాలయం.

# శ్రీ జె. బాపురెడ్డిగారి సాహితీరజతోత్సవం

1980 డిసెంబరు 23 వ తేదీ సాయంకాలం 6 గంటలకు ప్రముఖాంధ్రకవి శ్రీ జె. బాపురెడ్డి సాహితీ రజతోత్సవ కార్యక్రమం మంగళ ప్రదంగా ప్రారంభమైంది. దాదాపు 5 గంటల నుండే శ్రీ బాపురెడ్డి గారి మిత్రులు, అభిమానులు తండోపతండాలుగా రవీంద్ర భారతికి రావటం ప్రారంభించారు. శ్రీ విన్నకోట మరళీకృష్ణసంగీత దర్శకత్వంలో బాపురెడ్డిగారి గేయాలను గాయక గాయనీమణులు దాదాపొక గంటసేపు పాడి ప్రేక్షకులకు ఆనందాహ్లాదాలను కలిగించారు.

ఆ తరువాత సభ ప్రారంభమైంది. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి మాన్యశ్రీ టంగుటూరి అంజయ్యగారు ఉత్సవాలలో పాల్గొన్నారు. సభాధ్యక్షులు డా॥ దాశరథి తమ తొలి పలుకుల్లో ఇలా అన్నారు:

సభాసదులారా! ఈనాడు సుదినము. మన ముఖ్యమంత్రిగారు, కవులన్న కళాకారులన్న పండితులన్న విద్వాంసులన్నప్పటికి ఎంతో గౌరవాభిమానములు గల వారలు. కనుకనే క్షణం తీరిక లేని పనులున్నప్పటికీ కూడ మన బాపురెడ్డి యొక్క సంగీత విభావరికి వచ్చి చక్కని పాటలు విని వారిని సన్మానించారు, వారిని ఆశీర్వదించారు. బాపురెడ్డి మాకంటే చాలా చిన్నవాడు, యువకుడు. కాని, విశేషము ఏమిటంటే, మనము ఆంధ్రప్రదేశ్ రజతోత్సవాలు జరుపుకుంటున్నాము. ఆయన యొక్క సాహిత్య జీవితము కూడ 25 సంవత్సరాలు. అనగా సుమారుగా ఆంధ్రప్రదేశ్ ప్రారంభమైన, ఏర్పడిన సమయాలలోనే ఆయన కలం పట్టడము మొదలు పెట్టాడన్నమాట! ఆ విధమైనటువంటి రజతోత్సవము ఆయన జరుపుకుంటున్నాడీనాడు. బాపురెడ్డి యొక్క గొప్పతన మేమిటంటే-అతని కవిత్వమే గాదు మంచిది, అతని హృదయము కూడా మంచిది. అటువంటి యువకుణ్ణి పూజ్యులు అంజయ్యగారు ఆశీర్వదించటం ముదావహమైన విషయం.

చలి కాలంలో చలిని బాపు రెడ్డి, అంటే చలిని పోగొట్టతాడన్న మాట. తన వెచ్చని పాటల చేత ఈ మార్గశీర్ష మాస హేమంత శీతకాలముల నుండి మనను విడగొట్టి చక్కని వెచ్చని గీతా లందించాడు. కనుక చలిని బాపు రెడ్డి. హృదయములో గల వేదన బాపు రెడ్డి. ఈలాగే ఎన్నిటులనో బాపు కుంటాడన్న మాట. అటువంటి రెడ్డి గారి యొక్క సంగీత విభావరి ఈవేళ జరుగుచున్నది. చక్కని పాటలు పాడారు యువతీ యువకులు. మంచి సంగీతాన్నిచ్చారు, వంశీ ఆర్ట్స్ వారి సంస్థ. ఇది సాంస్కృతిక రంగానికి పర్వ దినంగా నేను భావిస్తున్నా నీ వేళ. ఈ నాడు మీరు విన్నవి బాపురెడ్డి గారి గేయాల వాచవి మాత్రమే. ఆయన పద్యము వ్రాయగలడు, గేయము వ్రాయగలడు, వచన గేయము వ్రాయగలడు. ఆయన మన దేశములోనే గాదు-విదేశాల్లో ఎన్నో సభలలో పాల్గొని తన కవితను

వినిపించగా తెలుగువారు, భారతీయులు, తెలుగు వారు కాని వారు విని ఆనందించినటువంటి కొన్ని ఘట్టాలు నేను ఎరుగుదును. ఎందుకంటే బాపురెడ్డిగారూ, మరి నేనూ, విదేశాంగమంత్రి పి. వి. నర్సింహారావు గారు, అక్కినేని నాగేశ్వరరావు గారు, ఆవుల సాంబశివరావు గారు అమెరికాలో ఒకేసారి కలిసి ప్రయాణము చేశాము. అనేక సందర్భాల్లో మా బాపురెడ్డి వినిపించినటువంటి గేయాలు విని తెలుగువారు, తెలుగువారు కాని వారు విదేశీయులు కూడా ఆనందించారు. అటువంటి యువకుడు ఉత్సాహవంతుడై నటువంటి ఒక వ్యక్తిని గురించి ఒక చిత్రమైన సంఘటన జరిగింది. 'అయ్యా! బాపురెడ్డి గారు వచ్చారు మన డెట్రాయిట్ మహాసభకి వీరు కవిత చదువుచున్నారు, బాగానే ఉంది. ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వంలో ఇంకొక్కాయన ఉన్నాడటా బాపురెడ్డి I.A.S., ఆఫీసరు. ఆయన సంగతి ఏమిటి?' అన్నారు. 'ఆయన ఈయన ఒక్కడే నాయనా, వేరు కాదు' అని నేను చెప్పాను, అంటే, ఆవిధంగా బహుముఖ ప్రజ్ఞా ఒక చోట చేరిన వ్యక్తి మంచి పరిపాలనాదక్షుడే కాకుండా, చక్కని కవి, గాయకుడు, అతను పాడుచున్నటువంటి పాటలు, అతను వినిపించునటువంటి గేయాలు విని ఒక్క అక్షరము తెలుగు రానివారు, ఇంగ్లీషు వారు, డచ్చి వారు, ఫ్రెంచి వారు,Italians ఆయన యొక్క కవితను విని హర్షించినటువంటి సంఘటనలున్నాయి. ఐతే బాపురెడ్డి ఎంత నిగర్వి అంటే-'నా వల్ల గాదు వారు హర్షించింది. నా తెలుగు భాషలో ఉన్న సొగసు వల్ల వారు ఆకర్షింపబడ్డారు' అన్నారు. అది అతని నమ్రత అని నేను మనవి చేస్తున్నాను.

యువకుడు ఉత్సాహవంతుడు. పట్టుమని 30,35 సంవత్సరాలైనా లేనటు వంటి యువకుడు అనేక రంగాల్లో ప్రయోగాలు చేసి, గేయాలు వ్రాసి, పద్యాలు వ్రాసి In Quest of Hormany అనేటటువంటి కావ్యాన్ని మన ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరా గాంధీ గారికి అంకితము చేశాడు మా బాపు. ఆవిడ సంతకము చేసినటు వంటి ఒక మహా గ్రంథము ఆయన చేతిలో ఉంది చూపిస్తాను మీకు. ఆమె ఈ యువకుడి యొక్క ప్రతిభను చూచి ఆనందించి ఆ గ్రంధాన్ని అంకితంగా పొందింది. ఇతను ఎన్ని దేశాలో తిరిగాడు అయా దేశాల్లోకి వెళ్లి తన దేశము యొక్క గొప్పతనమును గానము చేశాడు. అందుకే నేను బాపురెడ్డి విదేశయానము స్వదేశగానము అని చెప్పాను. ఏ దేశములోకి వెళ్ళినా తన దేశాన్ని మరచి పోలే దతను. 'నా మాతృభూమి భారత దేశము' అని ధైర్యంగా చెప్పుకున్నటువంటి యువకుడు. ఈ వయస్సులో ఉన్నవారు కేవలము శృంగారగీతాలనే వ్రాస్తారు. కాని, అతను అనంత సత్యాలు చెప్పినటువంటి పండిత హృదయముగల వ్యక్తి. వయస్సుగాదు ముఖ్యము, అతనికి 35 ఏండ్లే ఉండొచ్చు కాని, 70 ఏండ్లవాడికి లేనటువంటి ఒక పరిపక్వత ఉంది.

మా బాపురెడ్డి పుంఖానుపుంఖాలుగా పుస్తకాలు ప్రకటించాడు ఇంగ్లీషులో, తెలుగులో. అనేక భాషల్లో అనేక సభల్లో మాట్లాడాడు. ముఖ్యంగా నాకు జ్ఞాపకమొచ్చే సభ ఒకటుంది. ఉత్తర అమెరికావారు జరుపుకున్నటువంటి మహాసభ డెట్రాయిట్‌లో- డెట్రాయిట్ అంటే అమెరికాకి కెనడాకి మధ్య సరిహద్దు ప్రాంతము. ఆ సభలో అతను తన పుస్తకము "అనంత సత్యాలు" అనేటటువంటి ఒక గ్రంథాన్ని ఒక వ్యక్తికి అంకితం చేయలేదు, విదేశాల్లో ఉన్న తెలుగు వారికి నా హృదయాన్ని ఈ కావ్యంగా అంకితము చేస్తున్నానన్నారు. కరతాళ ధ్వనులు మిన్ను ముట్టాయి. ప్రజలు ఎంతో ఆనందించారు. అటువంటి వ్యక్తి యువకుడు ఉత్సాహి మెదక్ జిల్లాకు కలక్టరుగా ఉండటము మా అందరికి గర్వకారణము అని నేను భావిస్తున్నాను. అందరు కవులు కళాకారులు గర్వించ దగ్గవ్యక్తి బాపురెడ్డి గారు.

శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు ఇలా అన్నారు: 18 సం॥ యువకుడుగా వారి మొట్టమొదటి పరిచయం శ్రీ.సి. నారాయణ రెడ్డిగారు చేసినారు, ఆయన M.A. చదువుతున్నట్టున్నాడు. అర్థశాస్త్రంలో M.A.చదువుతున్నవాడు. కవిత్వం మీద కొంత అభిరుచి ఉన్నవాడు. ఆయన పుస్తకం ఒకటి ఆవిష్కరణ చేయవలసి ఉంది. బహుశా రాకేట్ రాయబారమై ఉంటుంది. అది చైతన్య రేఖలయి యుంటుంది. ఆ సభలో నారాయణరెడ్డి గారు నేనూ ఉభయులమూ మాట్లాడటం జరిగింది. ఆనాటి నుండి బాపురెడ్డి గారు చాలా పెరిగినాడు. అన్ని విధాలా పెరిగినాడు. కవిగా పెరిగినాడు, పరిపాలకుడుగా పెరిగినాడు, విజ్ఞానిగా పెరిగినాడు. మరి ఈ మూడు తీరుల పెరిగినవారు నాకు చాలా తక్కువమంది కనిపించినారు. బాపురెడ్డిగారు పద్యాలు వ్రాసినారు, వచన కవిత్వం వ్రాసినారు, గేయకవిత్వం యిప్పుడు మీరు విన్నారు. మరి నాటికలు వ్రాసినారు. బహుముఖంగా సాహిత్యసేవ జేసినారు. కడమకవులకూ బాపురెడ్డిగారికి ఉన్న విశిష్టత ఏమిటంటే - బాపురెడ్డిగారు సమకాలిక సమాజాన్ని చిత్రించినారు. తర్వాత, సాధారణంగా Scientific Subject గురించి inspire కావడం చాలా తక్కువ. మరి అట్లా inspire అయినవాళ్ళు చాలా తక్కువ మంది. బాపురెడ్డిగారు రాకెట్‌ను గురించి inspire అయినాడు. విజ్ఞానములో ఎప్పుడు ఏది జరిగినప్పటికిని దానిని గురించి ఉత్తమమైన కవిత్వాన్ని వ్రాసినారు. బాపురెడ్డిగారికి మరొక యోగ్యత - సాధారణంగా ఈ రోజుల్లో, మన ముఖ్యమంత్రిగారు, కడమ మంత్రులు ఏమీ అనుకోవద్దు, ఈ రోజుల్లో, ఏమిటంటే, రచయితలయినవారు, కాంగ్రేస్ రచయితలూ, కమ్యూనిస్టు రచయితలు, మరి లోకదళ్ రచయితలూ అని రాజకీయ అభిప్రాయాలకు అనుగుణంగా కవిత్వం సాగిస్తున్నారు. వారంటే ఏమో, నాకు గిట్టదు.

బాపురెడ్డిగారు ఏ ఇజానికి కట్టుబడకుండా సమకాలిక సమస్యల గురించి ఆలోచించి inspire అయి ఉత్తమమైన కవిత్వం వ్రాసినారు. ఇంతింతై వటుడింత యైనట్టుగా పెరిగినాడు బాపురెడ్డి. నేను మొదలే చెప్పినట్టుగా ఇంకా ఆయన పెరగవలెనని శ్రేయోభిలాషులమందరం కోరుతూ ఉన్నాము.

ఆచార్య సి. నారాయణరెడ్డిగారు శ్రీ కార్తికేయ శర్మ బాపురెడ్డి కవిత్వ మహత్వాన్ని గూర్చి వ్రాసిన గ్రంథాన్ని ఆవిష్కరిస్తూ ఇలా అన్నారు:

అధ్యక్షా! మిత్రులరా! కవిగా బాపిరెడ్డి వయస్సు 25 ఏళ్లు. మరి అదే కవిగా నా వయస్సు 30 ఏళ్ళు. అదే కవిగా దాశరథి వయస్సు 35 ఏళ్ళు. అదే కవిగా బోయి భీమన్న వయస్సు 50 ఏళ్ళు. అందుకే అందరిలో బోయి భీమన్నను చూస్తే బాబోయ్ భీమన్న అంటూంటాను. ఈ సభలో ఉన్న ఈ ముగ్గురు నలుగురు కవులకూ మరొక సామ్యం కూడా ఉంది. ఏమిటంటే-అటు భీమన్న మొదలుకొని ఇటు బాపన్నవరకు పద్యంలో గజ్జెకట్టి వచన కవిత్వంలో విహరిస్తున్నవాళ్లు. ఆధునిక కవుల్లో పద్యం రాసినవాళ్ళు చాలా తక్కువ మంది. బోయి భీమన్న గారు దీపసభలాంటి గొప్ప కావ్యాలు పద్యంలో రాశాడు. దాశరధి అగ్నిధార, రుద్రవీణలాంటి కావ్యాల్లో పద్యాలను వజ్రాయుధాల్లా ఉపయోగించాడు. అభ్యుదయ భావాలను పద్యంలో చెప్పిన కవి దాశరథి. ఆ తరువాత నేనూ రాశాను పద్యాలు జలపాతాల్లా. బాపురెడ్డి అందరి తరువాత వచ్చిన వాడైనా పద్యం వదల్లేదు. పద్యంతో ప్రారంభించాడు, గేయంలో విజృంభించాడు, వచన కవితలో అనంత సత్యాల విహాయసాలమీద విహరిస్తూ ఉన్నాడు. అది ఈనాటి విశేషం. అంటే 'ఎందుకు చెప్తున్నానంటే-విశ్వనాథ పద్యం రాయవచ్చు-జాషువా పద్యంరాయవచ్చు, కాని Modern Poetsగా ముద్ర పొందిన ఈ నలుగురూ పద్యంలో పుట్టారు, గేయంలో పెరిగారు, వచన గేయంలో

స్థిరపడుతున్నారు. ఇవి రెండు గుణాలు. బాపురెడ్డి, రామానుజరావుగారు చెప్పినట్టుగా విద్యార్థి దశలో నాకు సన్నిహితుడుగా ఉండేవాడు. నేను లెక్చరర్‌గా తొలి సంతకంపెట్టినసంవత్సరం 54లో M L A Quartersలో ఉండేవాణ్ణి. బాపురెడ్డి మరొక యువకుడు నయాగరాలా దూకుతున్న ప్రొఫెసర్, యాదగిరిరెడ్డి సైకాలాజీలో ప్రొఫెసరు, వీళ్ళిద్దరూ చేకూరి రామారావు (అతనూ నాకు శిష్యుడు) తర్వాత ఈ ముగ్గురు నా గదిలో కొచ్చేవారు. బాపురెడ్డి, యాదగిరిరెడ్డి Punning అంటే శబ్ద చమత్కారాలు ప్రతిమాటకు విసిరేవారు. బాబోయ్ యాదగిరిరెడ్డి, బాపురెడ్డి పన్నుల బరువుతో నన్ను చంపకు అనేవాణ్ణి. పన్నులబరువుతో అలాంటి బాపురెడ్డి అక్కడే ఆగిపోలేదు. చైతన్యరేఖలు గీసిన బాపురెడ్డి అనంత సత్యాల్లో పండిపోయాడు. చమత్కారాన్ని ఆశ్రయించిన సంభాషణా చతురుడు, తత్త్వగ్రంథ బంధురంగా రచనలు ప్రారంభించాడు. ఆ రకంగా తాను ఒక వైపు శబ్దాన్ని, అర్థాన్ని, భావాన్ని త్రిపుటిగా సమ్మేళనం చేసుకుంటూ తత్త్వరేఖలల్లో కూడా అనంత సత్యాలు ప్రదర్శిస్తూ కవిగా ఎదిగిపోయాడు. మొన్ననే ఒక సభలో అన్నాను - బాపురెడ్డి కలెక్టర్‌గా ఉత్తమ పరిపాలకుడు, కవిగా ఉత్తమ పదపాలకుడు. ఈనాడు విన్న కోట సంగీత నేతృత్వంలో విన్న పాటలనుబట్టి వాటి గుణాలనుబట్టి ఆయన పరిపాలకుడు పదపాలకుడే కాదు, స్వరపాలకుడు అన్న సత్యం కూడా ద్యోతకమైంది. బాపురెడ్డిలో ఒకే ఒక ప్రత్యేకత ఉత్తమ కవుల్లో ఉండేది ఉన్నది. ఏమిటంటే, ఏది చెబుతున్నాడో తనకు తెలియడం ఎలా చెప్పాలో కూడా తెలియడం. ఇంతకు మించిన గుణం ఏ గొప్ప కవికి అక్కరలేదని నా భావం ఇంతే. అలంకారాలు మరచిపోయి ఆ బాపురెడ్డి ఎదిగాడు. ఎదుగుతూనే ఉన్నాడు, ఎదుగుతూనే ఉంటాడు. ఆగిపోయే గుణం, ఇంకిపోయే గుణం ఎప్పుడో తెలుస్తుంది. తల ముదిరితే పడిపోయే ప్రమాదం ఉంది. తలకు రెక్కలు మొలిచి ఎగిస్తే ఎప్పుడూ స్థిరంగా ఉండే ప్రమోదం ఉంది. బాపురెడ్డి తల ముదరలేదు. మిత్రుడు, సోదరుడు దాశరథి చెప్పినట్టుగా వయస్సు ముదరొచ్చుగాని తల ముదరకూడదు. ఆ తల ఎప్పుడూ రెక్కలు తొడుక్కొని ఎగుస్తూ ఉండాలి, వినీల విహాయస పథాల్లో. ఆ అనంత సత్యాల బాపురెడ్డి ఇంకా అనంతంగా యెదగాలని ఆశిస్తున్నాను. దాశరథి నాలో తమ్ముణ్ణి చూసుకుంటాడు. నేను బాపురెడ్డిలో నా తమ్ముణ్ణి చూసుకుంటున్నాను.

ముఖ్య అతిథి - మాన్యశ్రీ యమ్. బాగారెడ్డిగారు ఇలా అన్నారు:

బాపురెడ్డిగారి కవిత్వము గురించి నేను ఎక్కువ చెప్పలేను. కాని బాపురెడ్డిగారి కలక్టరీ గురించి చెప్పమంటే నేను ఎంతైనా చెప్పగలను. గత రెండు సంవత్సరాలనుండి మెదక్ జిల్లా కలక్టరుగా వారు చేస్తున్నటువంటి కార్యక్రమాలు ప్రతివారము ప్రతి రోజు నేను చూస్తూనే ఉన్నాను. మెదక్ జిల్లాకు మన రాష్ట్రములో ఒక విధమైనటువంటి ప్రాముఖ్యత వచ్చిందన్నమాట అది అందరికి తెలిసినటువంటిదే. బాపురెడ్డిగారు తన కవిత్వాన్ని శ్రీమతి ఇందిరాగాంధిగారికి అంకితం చేసినారని నా కిప్పుడే తెలిసినది. అంతేకాకుండా వారికి అది ఒక అదృష్టమే అని నేను భావిస్తున్నాను. పుస్తకాన్ని అంకితము చేయడమే కాకుండా ఇందిరాగాంధిగారి యొక్క రాజకీయ జీవితాన్ని, భవిష్యత్తును సరిదిద్దుకునేటువంటి అవకాశమును ఆమె మెదక్ జిల్లాలో పార్లమెంట్ నియోజక వర్గంనుండి కాంటెస్ట్ చేసేటందుకు వచ్చినప్పుడు ఆమె నామినేషనును Recieve చేసే అదృష్టము కూడ బాపురెడ్డిగారికి దొరికినది. అప్పుడు వారు కలక్టరుగా ఉండడము Returning Officer గా ఉండడము కూడా అదృష్టం. తెలుగు కవిత్వము కాని ఏ భాషలో ఉన్నటువంటి కవిత్వము కాని అది

Machanical perfection కాదు Intellectual geniousness కావచ్చు అని తెలియుచున్నది. practice వల్ల గాని మర్దన వల్ల గాని వచ్చే పని కాదది. రూపం నుంచి మరి భగవంతు డిచ్చినటువంటి ఏవైతే గుణగణాల శక్తి ఉంటుందో ఆ శక్తి వల్లనే రావలె కాని ప్రతివాడు పరీక్షల ముందు చదువుకున్నట్లు చదువుకుంటే కవిత్వము వస్తుందంటే అది రాదు. వచ్చినా గూడ అది 2nd Grade 3rd Grade 4th గ్రేడు కవిత్వమో అవుతుంది. మొత్తానికి బాపురెడ్డి గారికి సమయము ఎప్పుడు దొరుకుతుందో నాకొక్కొక్కమాటు అర్థము కాదు. సామాన్యంగా Professors గాని, Lecturers గాని, teachers గాని, All India Radio లో గాని, Information Department లో గాని పనిచేసే వాళ్ళకు కథలు వ్రాయాలంటే కవిత్వము వ్రాయాలంటే అక్కడి వాతావరణము వారి కనుకూలంగా ఉంటుంది. కాని కలక్టరుకు మరి కవిత్వము చేయాలంటే అది చాలా కష్టమైనటువంటి పని. మన రాష్ట్రములో మెదక్ జిల్లా హైద్రాబాద్‌కు దగ్గరగా ఉంది. హైద్రాబాద్ సిటీలో ఉన్నటువంటి Govt., Officers గాని, Ministers గాని, Medak కు తరచుగా వస్తూ ఉంటారు. arrangements యే కాకుండా మెదక్ జిల్లా యొక్క Developmental activitiesను కూడా కేంద్రప్రభుత్వం గాని, రాష్ట్రప్రభుత్వం గాని చూస్తానే ఉంటారు. కాబట్టి వేరే కలక్టర్స్ కంటే ఎక్కువ శ్రద్ధగా పని చేయవలసినటువంటి బాధ్యత బాపురెడ్డిగారిమీద ఉన్నది. ఈ బాధ్యతలన్నిటిని కూడా సరిగ్గా నిర్వర్తించుచు మరిన్ని పుస్తకాలు వ్రాస్తున్నారు, ఇన్ని గేయాలు వ్రాస్తున్నారు మరి ఇన్ని కవిత్వాలు వ్రాస్తున్నారంటే నాకే ఆశ్చర్య మనిపిస్తున్నది. నేను వారిని అభినందిస్తున్నాను.

మాన్యులు ముఖ్యమంత్రి శ్రీ టి. అంజయ్య గారు ఇలా అభిభాషించారు:

బాపురెడ్డిగారిని గురించి వారి సాహిత్యమును ఆయన కవిత్వమును గురించి విన్నాను. ఈ పాటలు బాగున్నాయి. వారు కలక్టరుగా ఉన్నప్పుడు మెదక్ డిస్ట్రిక్‌కు శ్రీమతి ఇందిరాగాంధిగారు వచ్చినపుడు, వారితో నేను మొట్టమొదట కలసినాను. వారు నిన్న కొన్ని Books ఇచ్చినప్పుడు అవన్నీ నేను తీసుకొని దగ్గర పెట్టుకున్నాను. అవన్ని చదువెతందుకు కూడ సమయముండదు. మాకున్న పాటలు మాకు రోజు ఉండనే ఉంటాయి. అయితే, ఎవరికైతే ఈ కవిత్వము మీద గాని సంగీతము మీదకాని హృదయముండదో వారి హృదయాలన్నీ చాల కఠినములని నేను అనుకుంటాను. అందుగురించే ఎప్పుడన్నగాని ఈ రాజకీయములో ఉన్నవాళ్ళు కూడ ముందుకుపోయి కళలకు కవిత్వానికి ప్రోత్సాహము చేయాలని అనుకొంటారో అప్పుడు ఆ ప్రభుత్వము కూడా ముందుకు పోతుంది. బాపురెడ్డి గారు కలక్టరుగా ఉండి కూడా కవిగా రచనలు సాగిస్తూ వారియొక్క Thoughts ప్రజలకు ఉపయోగపడేటట్లు చూచి, వాటిని అమలులో తీసుకొచ్చేందుకు కూడ వారు ప్రయత్నాలు చేస్తారని నేను అనుకొంటున్నాను. నేను ఎక్కువ మాట్లాడకుండా వారికి నా తరపునుంచి అభినందనలు తెల్పుచున్నాను.

బాపురెడ్డి సాహితీ రజతోత్సవ సంచికను ఆవిష్కరించి డా॥ బోయి భీమన్నగారు ఇలా అన్నారు:

నేను ఒకే ఒక నిమిషము మాట్లాడుతాను. ఈ సంచికను ఆవిష్కరించాను కాబట్టి ఆ రెండు మాటలైనా చెబుతాను. నారాయణ రెడ్డిగారు, ముఖ్యమంత్రిగారు బాగారెడ్డిగారు మాట్లాడిన తరువాత అది చాలు ఇంకెవ్వరు మాట్లాడనక్కరలేదు. రామానుజరావుగారు అతి విపులముగా మాట్లాడిన తరువాత ఇంకెవ్వరూ మాట్లాడ నక్కరలేదు. ఐతే ఇది ధర్మం కాబట్టి రెండు మాటలే చెబుతాను.

*"కలనాటి ధనము లక్కర*
*గలనాటికి దాచఁ గమలగర్భుని వశమే?*
*నెలనడిమినాటి వెన్నెల*
*అలవడునే గాదెఁబోయ నవమసనిశికిన్."*

నెలనడిమి నాటి వెన్నెల- ఆ వెన్నెల అమావాస్యరోజుకి పనికి వస్తుందికదా! చీకటి రాత్రులకు పనికొస్తుంది కదా అని పూర్ణిమనాటి వెన్నెలను పట్టుకొని గాదెలో పోసి దాచుకొనటము సాధ్యమా? సాధ్యము కాదు అని ఆనాడు పెద్దనగారు చెప్పారు. ఆ పద్యములో బ్రహ్మకైనా సరే సాధ్యముకాదు అని అన్నారాయన. అయితే అది సాధ్యమే అని ఈనాడు నేను చెబుతున్నాను. ఎలా అంటే ఈ రకమైనటువంటి పున్నమి రాత్రుల లాంటి మహోత్సవాలను చేసుకొంటూ, వాని వెన్నెలలను, పరిమళాలను, కాంతులను అన్నింటిని కూడ భద్రపరిచేటటువంటి ఒక శత సత్య పేటిక ఉన్నది. ఆ పేటిక ఇది. ఈ సంచికను, ఇటువంటి పేటికను ఇటువంటి అందాల గాజును నేను ఆవిష్కరించే అదృష్టము నాకు లభించినందుకు నేను చాలా గర్వపడుతున్నాను.

బాపురెడ్డి-చంద్రుడు
ఆయన కవిత-వెన్నెల
బాపురెడ్డి-పారిజాతము
ఆయన కవిత-పరిమళము
బాపురెడ్డి-పయోనిధి
ఆయన కవిత అమృతము

బాపురెడ్డి కవిత ఈ రకమైనటువంటి వెన్నెల. అమృతం, పరిమళం, కాంతి - ఇవన్నీ బాపురెడ్డి కవితా సాహిత్యము. ఇవన్నిటి సౌరభాన్ని వెన్నెలలను, అందాలను కాంతులను అన్నిటిని కూడ ఇందులో సంతరించి పెట్టారు. అందుకని దీనిని ఆవిష్కరించానని నేను గర్వపడుతున్నాను. బాపురెడ్డిని చూచి గర్వపడుతున్నాను. నేను బొమ్మ కావ్యము ఆయనకు అంకితము ఇచ్చినపుడు నేను చెప్పిన ఆశీర్వచన గేయము-

*సిరికొండ కడుపులో చిరుదివ్వెగా వెలసి*
*గోల్గొండ గుండెలో మేల్ కవితగా విరిసి*
*సకలాంధ్ర కెవరు అక్షరప్రభ*
*ఆ శ్రీ బాపురెడ్డికి*
*అగుత అక్షయ శుభం*
*భాగ్మతీ, ఖులిఖుతుబ్షా యుగలము*
*ఏ ఉషోభూమిలో గళమెత్తి భూపాలపాడిరో*
*సకల కళ్యాణ రాజేశ్వరి మా బాపురెడ్డికి*
*సంతత శుభంకరి అగుగాక!*

ఆ సభలో శ్రీ ఎం. వి. నారాయణరావు గారు, శ్రీమతి మాదిరెడ్డి సులోచన గారు, డా॥ రావూరి వేంకట సత్యనారాయణరావు గారు, శ్రీ కె.వి. భాస్కరరావు గారు, శ్రీ కోకా రాఘవరావు గారు ఉపన్యసించారు. బాపురెడ్డి కవితను ప్రశంసించారు. కవిని అభినందించారు. డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం వంశీవారి పక్షాన సన్మానపత్రం సమర్పించారు. శ్రీ బాపురెడ్డి జీవితానికి కవితా జీవితానికీ గల సామ్యాన్ని పేర్కొని తమ కవితా ధ్యేయాన్నీ భావ భౌతిక వాదాన్నీ సోదాహరణంగా వివరించారు. కార్యక్రమం విజయవంతం చేసిన వారికందరికీ కృతజ్ఞతలు తెలిపారు. వంశీ సంస్థ అధ్యక్షులు వంశీ శ్రీ జె. రాజారావుగారు కృతజ్ఞత లందించారు.

# ఆధ్యాత్మిక భౌతిక సత్యాలు-అనంత సత్యాలు

- డాక్టర్ ఆర్. కమల

కరీంనగర్ జిల్లాలో ఒక సామాన్య రైతు కుటుంబములో పుట్టి ఇంతింతై వటుఁడింతయై అనినట్లు జిల్లాలు, రాష్ట్రాలు, దేశాలు అనే ఎల్లల నతిక్రమించి త్రివిక్రమావతారంగా వెలుగొందిన కవి సినారె, వెలుగొందుతున్న కవి బాపురె అని ఆ ప్రాంతపు వారు పెట్టుకున్న ముద్దు పేర్లు. వీరు అటు పరిపాలన రంగంలో, ఇటు సాహిత్య రంగంలో సవ్య సాచిత్యము నెరపిన వారే. వీరి ప్రతిభ అప్రతిమానమైనది నిత్యనూతనంగా. నిరంతర జలపాతంలా వీరి కవితా వ్యాసంగం జగమెరిగిన సత్యం. వీరిని గూర్చి చెప్పడం సూర్యుని దివిటీతో చూపడమే. అయినా మా ప్రాంతము వారైన శ్రీ బాపురెడ్డి గారిని గూర్చి వ్రాయడం నా అదృష్టంగా భావిస్తున్నాను.

శ్రీ బాపురెడ్డి గారిని ఎప్పుడు కలిసినా, ఎన్ని పనుల ఒత్తిడులలో ఉన్నా చిరునవ్వుతో పలుకరిస్తారు. ఓ క్రొత్త కవితా సంపుటాన్నందిస్తారు. ఊపిరాడని పనులతో సతమతమౌతూ ఇన్ని రచనలెప్పుడు చేస్తారు? ఇంత హుషారుగా ఎలా ఉంటారు? అనే ప్రశ్న నామదిలో గత దశాబ్దంగా ప్రశ్నగానే మిగిలిపోయింది.

బాపురెడ్డిగారి రచనలో ఉత్కంఠతతో పఠితను పరుగెత్తించే గుణముంది. అందంగా ఊహించడం, రచించి పాఠకుల కందించడం వారికి 'వెన్నతో పెట్టిన విద్య', 'నానృషిః కురుతే కావ్యం' అన్న ఆర్యోక్తిని నమ్మిన కవికిశోరులు బాపురెడ్డిగారు. ఈ వాక్కును దృష్టియందుంచుకొని రచించిన వాటిలో నాకు ఎంతో నచ్చిన వారి రచన "అనంత సత్యాలు." సత్యదర్శనం చేయడ మొకయెత్తు. సత్యాన్ని సత్యంగా ఆవిష్కరించడ మొక ఎత్తు. ఇది కత్తి మీద సాములాంటిది. యదార్థవాది లోక విరోధి అంటారు. నేటి పఠితకు యదార్థమే కావాలి. పుక్కిటి పురాణాలు కావు.

శ్రీ రెడ్డి గారీ కావ్యాన్ని 1979లో జూలై 26 నాడు డెట్రాయిట్‌లో జరిగిన రెండవ ఉత్తర అమెరికా తెలుగు మహాసభల్లో ఆవిష్కరింపజేసారు. దాదాపు 59 వచన కవితల నిందులో పొందుపరిచారు. ప్రతి కవితలో విశ్వమానవ సౌభ్రాతృత్వం, విమర్శన లక్షణం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. విశ్వజనీనమైన రచనలు చేసే కవులలో సందేశం సర్వకాలాలకు, సర్వ జనులకు పనికి వచ్చేలా ఉంటుంది. మహాకవులెవ్వరూ సమన్వయం చెయ్యని సందేశం లేని కావ్యాలు వ్రాయలేదు. కవి చేసే సమన్వయమే, ఇచ్చే సందేశమే ప్రాణరూపమై అంతర్నిహితమై కావ్యాన్ని అర్థవంతం చేస్తుంది. సృష్టిలోని సమస్త పదార్థం కవితా వస్తువుగా కవి రచనా పాటవాన్ని బట్టి తాత్త్విక దృష్టిని బట్టి సత్యం-శివం-సుందరంగా భాసిస్తుందని అనుభవపూర్వకంగా గ్రహించిన ఈ కవి తన కవిత్వానికి సమన్వయం ప్రాణం పోశారు. కావ్యంలోని ఖండికలు వేరు వేరు పేర్లతో ఉన్నా సందేశమే ప్రాణమైన, అంతర్నిహితమైన కావ్యాన్ని అర్థవంతం చేసేదీసూత్రం. అజ్ఞాన జ్ఞానం మొదలుకొని ప్రణవ ప్రణయంవరకనేక శీర్షికలున్నాయి. భగవంతుని కనేక రూపాలున్నట్లే వస్తుతః ఒకటే అయినా సత్యాని కున్న అనంత రూపాల దర్శనమే 'అనంత సత్యాలు'.

బాపురెడ్డిగారు దార్శనిక కవి - ఈ కావ్యాని కీయన ఉత్తమ విమర్శకునిలా అడుగడుగునా కవితాతత్త్వాన్ని రసానందాన్ని, దార్శనికత్వాన్ని అవిచ్ఛిన్నంగా ఆవిష్కరించే భావచిత్రాలే ఈ 'అనంత సత్యాలు.'

బాపురెడ్డిగారి కావ్యానికి-కావ్యానికి మధ్య పరిణామమున్నట్లే కవిత-కవితకు మధ్య వికాసమున్నది. సాహిత్యం- కవిత్వం ఏ రాజకీయ సిద్ధాంతానికో, ఏ విజ్ఞాన శాస్త్రానికో, ఏ వాదానికో చేయూత నిచ్చే చేతి కర్ర కాదు అనే భావాన్ని 'మనిషిని చదువుతున్నాను' 'జీవితం మహాకావ్యం' 'మనిషి నుంచి ప్రారంభిద్దాం' మొదలైన ఖండికల్లో పొందుపరచారు. మనిషిలో ఉండే రాగ ద్వేషాలకు రూపకల్పన ఆయన రచించిన "అసూయ అభయమిచ్చింది." ఎంత ఎత్తుకు మనిషి ఎదిగినా బాల్య స్మృతులను నెమరువేసుకోవడం "మట్టిలో పుట్టిన అక్షరాన్ని" అన్న కవితలో ధ్వనిస్తుంది. ఇవేకాక చరాచర స్నేహం, కలలు కనే కన్నీరు 'చేసిన తప్పే చేస్తున్నాం' ఆత్మ విమర్శన నిదర్శనాలు- 'ఎవరు నేను' ఏకాంతంలో వేదాంతం - సత్య సౌరభం వారి తాత్త్విక దృష్టికి పరాకాష్ఠ.

**ఆర్. కమల**

తెలుగు శాఖ

ప్రభుత్వ బి.జె.ఆర్. డిగ్రీ కళాశాల

లకడీకాపూల్, హైదరాబాదు - 500 004.

# సరస్వతీపుత్రుడు జె. బాపురెడ్డి

- ఎ. గురుప్రసాద్

ప్రపంచం నలుమూలల విస్తరించి ఉన్న తెలుగువారిలో శ్రీ జె. బాపురెడ్డి గురించి తెలియని వారు లేరంటే అతిశయోక్తి ఎంతమాత్రం కాదు.

కరీంనగర్ జిల్లాలోని మారుమూలగ్రామమైన సిరికొండలో సాధారణ రైతు కుటుంబంలో జన్మించిన శ్రీ జంకె బాపురెడ్డి ఉస్మానియా యూనివర్సిటీలో ఎం.ఎ. (ఎకనామిక్స్) చేసి అనంతరం ఐ.ఎ.ఎస్ లో చేరారు. విద్యార్థి దశ నుండే కవితలు వ్రాయటంలో శ్రీ బాపురెడ్డిది అందె వేసిన చెయ్యి. రాష్ట్ర ప్రభుత్వంలో కీలకమైన అనేక ఉన్నత పదవులను అలంకరించిన శ్రీ బాపురెడ్డి ఇంగ్లీషు, తెలుగు భాషలలో కలిపి సుమారు 20 పుస్తకాలను రచించారు.

సీనియర్ ఐ.ఎ.ఎస్. అధికారి, గొప్ప కవి కూడా అయిన శ్రీ బాపురెడ్డిలో గర్వం మచ్చుకైనా లేకపోవటం గమనార్హం. తన సహాయం కోరి వచ్చిన సందర్శకులకు ఎల్లవేళలా అందుబాటులో ఉంటూనే ఒక్క క్షణమైనా తీరిక లేకుండా ఉంటారు శ్రీ బాపురెడ్డి.

శ్రీ బాపురెడ్డి సరస్వతీ వరపుత్రుడు. ఆయనకు ఇంగ్లీషు, తెలుగు సాహిత్యంలో ఉన్న అసాధారణమైన పరిపూర్ణత అనితర సాధ్యమైంది. నేటి సాహితీ రంగంలో శ్రీ బాపురెడ్డి అగ్రగణ్యుడు. కవిత్వం గురించి ఓనమాలు కూడా తెలియని అనేకులు సెల్ఫ్ డబ్బా, కాకా రాజకీయాల ద్వారా గొప్ప కవులుగా చెలామణి అవుతున్న ఈ రోజుల్లో బహుముఖ ప్రజ్ఞాశాలి, మహామేధావి, గొప్ప కవి అయిన శ్రీ జె. బాపురెడ్డికి ప్రచార పటాటోపం ఎంతమాత్రం గిట్టకపోవడం విశేషం.

శ్రీ బాపురెడ్డిలోని మేధా సంపత్తి అంతకు మించి ఆయనలో ఉన్న సిన్సియారిటీ ద్వారా ప్రపంచ వ్యాప్తంగా ఆయన అభిమానులకు కొదువలేదు.

57 సంవత్సరాల వయస్సులో ఉన్న శ్రీ బాపురెడ్డి నవ యువకుడిలా ఎంతో ఉత్సాహంగా తన అధికార విధులను నిర్వర్తిస్తూనే తీరిక సమయాల్లో తన రచనా వ్యాసంగాన్ని కొనసాగిస్తున్నారు.

శ్రీ బాపురెడ్డి సాహితీ రంగంలో అనేకమైన రికార్డులు సృష్టించారు. మరోవిశేషమేమంటే-శ్రీ బాపురెడ్డి అవార్డులన్నా, పురస్కారాలన్నా ఎంత మాత్రం ఆసక్తి చూపరు.

అయినప్పటికి ఆయనకు వచ్చిన అవార్డులు, పురస్కారాలు లెక్కలేనివి.

1984లో మొరాకోలో జరిగిన ప్రపంచ కవుల మహాసభ లిటరేచర్‌లో గౌరవ డాక్టరేట్ అవార్డునిచ్చి సత్కరించింది. అలాగే రెడ్‌క్రాస్ సొసైటి 1980లో శ్రీ బాపురెడ్డిని గోల్డ్‌మెడల్‌తో సన్మానించింది.

శ్రీ బాపురెడ్డిలోని అనన్యసామాన్యమైన ప్రతిభ, సాహితీ పిపాసను గుర్తించిన మాస్కోరేడియో శ్రీ రెడ్డిని ప్రత్యేక ఇంటర్వ్యూ చేసింది. ఆయన ఇంగ్లీష్‌రచనయైన 'ఇన్‌క్వెస్ట్ ఆఫ్ హార్‌మనీ', 'లాంగింగ్ ఫర్ లైఫ్', 'ఆర్ట్ ఆఫ్ లవ్', 'లవింగ్ ఈజ్ లివింగ్', తెలుగురచనలైన 'వాడిపోని వసంతాలు', 'ప్రణవ ప్రణయం', 'పంచ బాణాసంచా', 'మన చేతుల్లోనే ఉంది', 'నా దేశం నవ్వుతూంది', 'అనంతసత్యాలు', 'శ్రీకార శిఖరం', 'బాపురెడ్డి గేయనాటికలు' కలం నుంచి జాలు వారిన ఉత్తమ రచనల్లో ముఖ్యమైనవి.

ఉత్తమకవి, సిన్సియర్ ఐ.ఎ.ఎస్. అధికారి అయిన శ్రీ జె. బాపురెడ్డిని 'మయూరి' సకుటుంబ సపరివారపత్రిక ప్రత్యేకంగా ఇంటర్వ్యూ చేసింది.

ప్ర: ఐ.ఎ.ఎస్. చదివి గొప్ప పరిపాలనా దక్షుడిగా పేరు గడించిన మీరు అసాధారణమైన రీతిలో రచనలు సాగిస్తూ గొప్ప కవిగా ఎలా రాణించగలుగు తున్నారు?

జ: కవిత్వం అనేది నాకు పుట్టుకతోనే వచ్చిన విద్య. కాబట్టి నా కవితా వ్యాసంగం అధికార విధుల నిర్వహణకు ఎంత మాత్రం అడ్డురాకపోవటమే కాక మరింత చురుగ్గా పని చేయడానికి తోడ్పడుతుంది. మనిషికి జీవితం అనేక కార్యకలాపాలతో కూడిన ఒక ప్యాకేజి లాంటిది. పని లేకుండా తీరిగ్గా ఉన్న వారికి అనేక తప్పుడు ఆలోచనలు కలిగే అవకాశం ఉంది. కావున మనిషికి తీరికలేకుండా ఎన్ని వ్యాపకాలుంటే అంతమంచిది. పైగా రచనా వ్యాసంగం అనేది మనిషికి అలసట అనేది లేకుండా చేస్తుంది. పనుల ఒత్తిడి వలన ఒనగూడే సత్ఫలితాలే మనిషికి సంతృప్తిని, విశ్రాంతిని చేకూర్చుతాయి. ప్రభుత్వ అధికారిగా చేసిన మంచి రచనా వ్యాసంగం విశ్రాంతిని ప్రసాదిస్తున్నది. కావున ఈ రెండు రంగాలకు నేను పూర్తి న్యాయం చేకూర్చగలుగు తున్నానని భావిస్తున్నాను.

ప్ర: కవిగా అందుకొన్న పురస్కారాలు, అవార్డులు?

జ: అవార్డులు, సన్మానాలు ప్రజలకు మనపట్ల ఉన్న అభిమానానికి తార్కాణాలుగా మాత్రమే భావించాలి. అంతేకాని, అవి మనము సాధించిన విజయాలకు ఘనతకు కొలమానంగా తీసుకో రాదు. అవార్డులు, పురస్కారాలు మనల్ని వినమ్రునిగా చేయాలిగాని అహంకారాన్ని పెంపొందించకూడదు. నా పట్ల అభిమానంతో దేశ విదేశాల్లోని వివిధ సంస్థలు నాకు ఎన్నో సన్మానాలు చేశాయి. అవార్డుల నిచ్చాయి. నాకు లభించిన పురస్కారాలన్నీ సరస్వతీ దేవికి సమర్పణమే. నేను సాధించింది బహుస్వల్పం. సాధించాల్సింది మరెంతో ఉంట. కవులకు ముందు చూపు మాత్రమే ఉండాలి. ఎన్ని సన్మానాలు జరిగాయి, ఎన్ని అవార్డులు వచ్చాయి అని గర్వపడటం కవుల లక్షణం కాదు. అనంతమైన ఈ సృష్టిలో మనం ఎంత సాధించినా తక్కువే. ప్రతి వ్యక్తికి, రచయితకు తనదైన ఒక సృష్టి చేయడానికి ఎప్పుడూ అవకాశం వుంటుంది.

నేను చేయాలనుకున్నది ఎవరో చేసేశారు అనే భావం సృజనశక్తికి, అభ్యుదయశీలతకు ఆటంకం. గతానికన్న వర్తమానం గొప్పది. వర్తమానం కన్నా భవిష్యత్ గొప్పది. ఇది చరిత్ర బోధిస్తున్న పరిణామసత్యం.

ప్ర: మీ కవితల్లో అభ్యుదయ, విప్లవ భావాలు లేవనే విమర్శలకు మీ జవాబు?

జ: విప్లవ, అభ్యుదయ, ప్రణయ భావం అనేది సంకుచిత ఛాందస సృష్టి. కవిత్వం అనేది విశాలమైన జగత్తు. జీవితం ఎంత విశాలమైందో అంతకన్నా అనేక రెట్లు విశాలమైనది సాహిత్యం. అందులో ప్రధానమైనది కవిత్వం.

నేను జీవితాన్ని మూడు ధారలుగా దర్శిస్తాను. (1) మనిషికి-మనిషికి మధ్య ఉండే సంబంధం. (దీన్నే మనం సామాజిక స్పృహ అంటున్నాము). (2) స్త్రీ-పురుషుల మధ్య ఉండే సంబంధం. (దీన్నే మనం ప్రణయం-ప్రేమ అంటున్నాము).(3) మనిషికి-దైవానికి మధ్య ఉండే సంబంధం (ఆధ్యాత్మిక చింతన).

నిజమైన విప్లవ భావం మనిషి యొక్క సంస్కారంలో మార్పును తెచ్చేదై వుండాలి. మొదట మనలో కొన్ని ఆదర్శాలు, వాటికి తగిన విశ్వాసాలు ఉండాలి. అలాగే కొత్త సత్యాలను దర్శించే శక్తి ఉండాలి. నూతన సత్యదర్శనం కొత్త విశ్వాసాలకు తావిస్తుంది. కొత్త విశ్వాసాలు కొత్త విలువలకు దారి తీస్తాయి. విలువలు మారినప్పుడే మానవ జీవిత గతిలో నిజమైన మార్పు వస్తుంది. కవి భావనా శక్తి నూతన సత్యావిష్కరణం చేసి, ఆదర్శాల సాధనకు తోడ్పడుతుంది. జీవితం యొక్క లక్ష్యం నిర్దేశించకుండానే ఏ భావం విప్లవమో-అభ్యుదయమో- ఏది కాదో చెప్పడం అర్థరహితం.

మనం నిర్దేశించుకున్న జీవిత పరమార్థాన్ని సాధించడానికి మనం కొన్ని విశ్వాసాలను, విలువలను పోషించుకొంటున్నాము. అందుచేత మనిషికి ఆశించిన విలువల పట్ల విశ్వాసాన్ని కలిగించేదే నిజమైన భావుకత కవిత.

ఒక మనిషి వేరొక మనిషిని దోచుకోకూడదు. ఇలాంటి విశ్వాసాన్ని కలిగించే భావ ప్రకటన, సత్య ప్రకటన, సత్యావిష్కరణ, సత్యకల్పనమే సాహిత్యం.

ప్రచార పటాటోపానికి కవిత్వం గురించి ఓనమాలు తెలియని కొందరు అభ్యుదయ కవులుగా విప్లవ కవులుగా, దిగంబరకవులుగా తమకు తామే పేర్లు పెట్టుకొని గర్వంగా ఊరేగడం విచారకరం. చిత్తశుద్ధి లేని ఏ కవిత్వమైనా శుద్ధ దండగ.

ఈ దురాచారానికంతటికి ప్రధాన కారణం కులతత్వం, ప్రాంతీయతత్వం, పైగా అజ్ఞాన తత్వం. జీవితావసరాలను తీర్చే సాధనాలు వివిధ విజ్ఞాన శాఖలు.

జీవితం అంటే ఏమిటి, జీవితానికి ఏవి నిజమైన ఆదర్శాలు, అవసరాలు అనేది నిర్దేశించేదే సాహిత్యం.

ప్ర: 'మయూరి' పత్రికకై ఇప్పటికిప్పుడే ఒక ప్రత్యేక కవిత చెప్పండి.

జ: (నవ్వుతూ)

*సారాకే మరోపేరు*
*సర్వనాశనం,*
*త్రాగుడు పై నిషేధమే*
*ప్రగతి శాసనం.*
*సారా త్రాగినవారు సాధించిందేమిటి?*
*ఆస్తిపాస్తులమ్ముకొని -*
*ఆరోగ్యం*
*చెరుపుకొని*
*అలమటించుటేరా,*
*మానాభిమానాలను మంటకలుపుటేరా!*

(మయూరి వీక్లీ 25, జూన్, 1993 సౌజన్యంతో)

# జీవితాన్ని ఛాలెంజ్‌గా తీసుకోవాలి

- వేదగిరి రాంబాబు,

తండ్రి ఆధ్యాత్మిక కీర్తనలు పాడుతుంటే ఆ కుర్రవాడు చాలా ఏకాగ్రతతో వింటుండేవాడు. వినడమే కాదు, వంట పట్టించుకునేవాడు. అలా అతిచిన్న వయసులోనే ఆ కుర్రవాడిలో సాహితీబీజాలు పడ్డాయి.

వయసుతోపాటే ఆ బీజాలు పెరగడం ప్రారంభించాయి. చదువుకునే రోజులనించే చక్కటి కవిత్వం రాయడం ప్రారంభించాడు. తన హాబీకి, చదువుకి ఎక్కడా 'క్లాష్' రాకుండా చాలా కష్టపడి చదువుకున్నాడు. అటు అయ్యేఎస్ ఆఫీసర్‌గా, ఇటు మంచి కవిగా పేరు తెచ్చుకున్నాడు. అందరి మన్ననలూ అందుకుంటున్నాడు. ఆయ నెవరో మీకు ప్రత్యేకంగా చెప్పక్కర్లేదనుకుంటాను.

"చిన్నప్పటినుంచే డెవలప్ చేసుకుంటే ఆ లక్షణాలు వృద్ధి చెంది మంచి వ్యక్తిత్వాన్నిస్తాయి. అంతే గాని, ఏ లక్షణాలు చిన్నప్పుడు లేకపోతే పెద్దయ్యాక రావు" అంటున్నారు జె. బాపురెడ్డి గారు.

"జీవితాన్ని ఒక పెద్ద ఛాలెంజ్‌గా తీసుకొని వృద్ధి చెందాలి" అంటూ యువతరానికి సందేశాన్నిస్తున్నా రాయన.

తండ్రి కృష్ణారెడ్డి వృత్తి వ్యవసాయం కాబట్టి బాపురెడ్డి గారికి చదువు చెప్పించడానికి మొదట్లో అభ్యంతరం పెట్టాడు తండ్రి. కానీ బాపురెడ్డి స్కూల్ కెళ్తానని ఇంట్లో ఏడ్చి పాఠశాలకి వెళ్ళడం ప్రారంభించారు. అందుకనే బాగా చదవాలి, మంచి మార్కులు సంపాదించి పెద్దవాళ్ళని మెప్పించాలని పట్టుదలగా ఉండేది. అలా కృషి చేసి అయిదవ తరగతిలో డబుల్ ప్రమోషన్ పొందారు. తరగతిలో తనకన్నా ఎక్కువ మార్కులు సంపాదించే కుర్రవాణ్ణి చూసి జెలసీ పొందకుండా అతనికన్నా ఎక్కువ మార్కులతో పాసవ్వాలని కృషి చేయడంలో మంచి మార్కులతో పాసవసాగారు.

క్రమంగా ఆత్మ విశ్వాసం పెరగసాగింది. ఒకరితో మాట పడకూడదనే పట్టుదలా పెరిగింది. క్రమంగా అన్ని వక్తృత్వ వ్యాసరచన పోటీల్లో పాల్గొనడం ప్రారంభించారు. వక్తృత్వ పోటీలో పాల్గొనే ముందు ఆరు బయట కూర్చుని మాట్లాడడం ప్రాక్టీస్ చేసేవారు. నాటి ఉపరాష్ట్రపతి డా॥ రాధాకృష్ణన్ చేత నుంచి బహుమతిని అందుకోవడంతో ఉత్సాహం పెరిగింది. పరిశ్రమా పెరిగింది.

"వ్యక్తిత్వాన్ని పెంపొందించుకోవడానికి పాజిటివ్ అప్రోచ్ చక్కటి మార్గం" అంటున్నారు శ్రీ బాపురెడ్డి.

ఎమ్మే తెలుగుతో చేద్దామనుకుంటే శ్రేయోభిలాషులందరూ నిరుత్సాహపరిచారు. తెలుగు కన్నా ఏ ఎకనామిక్స్‌లోనో పోస్ట్ గ్రాడ్యుయేషన్ చేస్తే భవిష్యత్తు బావుంటుందని హెచ్చరించారు. దాంతో ఎమ్మే ఎకనామిక్స్‌లో చేశారు. ఆ రోజుల్లోనే 'ఎకనామిక్స్ సుందరి' కవిత్వాన్ని రాసారు.

నాగార్జున సాగర్ వెళ్లినప్పుడు కృష్ణవేణి మీద కవిత్వం రాశారు. ఇలా కవితా ధోరణి వయసుతోపాటే పెరగసాగింది. హాలెండ్ ప్రభుత్వ స్కాలర్‌షిప్‌తో నేషనల్ డెవలప్‌మెంట్‌లో డిప్లొమా చేశారు.

పబ్లిక్ సర్వీస్ కమీషన్‌లో సెలెక్ట్‌కాగానే 1961లో విశాఖపట్టణం జిల్లాలో డిప్యూటీ కలెక్టర్‌గా చేరారు.

"అంతకుముందు సర్వీసు కమీషన్‌లో

రికమండేషన్‌లు ఉంటాయి. ఎవరెవరికో వస్తాయని అనుకుంటూ వుండేవాళ్లం..... కానీ, నా అనుభవంతో తెలిసింది మెరిట్‌కి పట్టం తప్పదని......" అంటున్నారు బాపురెడ్డి గారు.

విశాఖపట్టణం వెళ్ళి జాయిన్ అయిన తర్వాత ప్రకృత్యారాధనతో కవిత్వం ఊపందుకుంది.

1961-64 మధ్య రాకెట్ రాయబారం రాసారు. 1968లో బాపురెడ్డి గేయాలు రాసి బోయి భీమన్న గారికి అంకిత మిచ్చారు. బాపురెడ్డి గేయ నాటికల్ని సినీనటులు గుమ్మడి గారికి అంకితమిచ్చారు. బాపురెడ్డి గద్య కావ్యాన్ని బెజవాడ గోపాలరెడ్డి గారికి, పద్యకావ్యాలు పి.వి.జి. కృష్ణమాచార్యులు, ఐ.పి.ఎస్. గారికి అంకితమిచ్చారు.

ప్రణయం, ప్రణవం, సమాజ ప్రగతి దర్శకభావపరంగా ఆయన కవితా యాత్ర సాగింది అంటున్నారు.

పరిశ్రమాభివృద్ధి శాఖ జనరల్ మానేజర్‌గా, ముఖ్యమంత్రి స్పెషల్ అసిస్టెంట్‌గా, మెదక్ - రంగారెడ్డి జిల్లాలకు కలెక్టర్‌గా, టుబాకో బోర్డ్ ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్‌గా, ఎండోమెంట్స్ కమీషనర్‌గా పనిచేసిన బాపురెడ్డిగారు ఇప్పుడు చిన్న మొత్తాల పొదుపు సంస్థ కమీషనర్‌గా పని చేస్తున్నారు.

"మానవజీవితంలో ప్రతి ఒక్కరికీ ఆశ వుంటుంది. నిరాశ అక్కర్లేదు. జీవితంలో ఎంత చేసినా ఇంకా చేయాల్సింది ఎంతో వుంటుంది. గతానికి భయపడకూడదు. భవిష్యత్తు మీద విశ్వాసంతో ముందుకు అడుగువేయాలి" అంటున్నారు బాపురెడ్డిగారు.

"ఒక వస్తువులోనే అనేక సత్యాలు చూసే అవకాశం వుంది. చూస్తున్న ఆకాశం, సముద్రంలోనే సత్యాలు అనంతం. ఎన్ని జీవితాలు వచ్చినా ఎన్ని యుగాలు గడిచినా ఈ అనంతాన్ని సాధించలేవు. ఆలోచనా, దర్శనంలోకూడా ఎవల్యూషన్ రావాలి. నాలెడ్జ్ అంటే సృష్టికి ఇంటర్‌ప్రిటేషన్ మాత్రమే! సృష్టించలేని దాన్ని ఊహించుకోవడం భావనాత్మకం. భౌతికం కన్నా భావం గొప్పది. అందుకే సైంటిస్ట్‌కన్నా కవిని గౌరవిస్తున్నాం. జీవితం అనేది పవిత్రమైంది. అది సృష్టిలో ఒక భాగం. అసలు ఆధ్యాత్మికమంటూ లేదు. ఆధ్యాత్మికమనేది భౌతికం మీద మనం కల్పించుకునే భావం. భౌతికానికి మార్పు లేదు. ఆధ్యాత్మిక సత్యకల్పనకు అంతం లేదు. ఆధ్యాత్మిక చింతన అంటే భౌతికానికి దూరం కావడం కాదు." భౌతికాన్ని భావసత్యాలతో ఆధ్యాత్మీకరించడం, శరీరం లేకుండా ఆత్మస్పందనం లేనట్లే. భౌతికస్థితి లేకుండా ఆధ్యాత్మిక శక్తి అభివ్యక్తం కాలేదు అంటున్నారు బాపురెడ్డిగారు.

*(పల్లకి వారపత్రికకు ఎగ్జిక్యూటివ్ ఎడిటర్‌గా పనిచేసినప్పుడు బాపురెడ్డి గారి ఇంటర్‌వ్యూ తీసుకోవడం జరిగింది. ఆ సందర్భంలో సేకరించిన వివరాల్తో ఈ ఆర్టికల్‌ని రూపొందించాను.)*

వేదగిరి రాంబాబు
1-8-481 సెకండ్ ఫ్లోర్
చిక్కడపల్లి, హైదరాబాద్-500 020.
ఫోన్ : (రెసిడెన్స్) 667665

# 'పుడమితల్లికి పురిటినొప్పులు'

- ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం

మాతృభాషలో మధురంగా కవితలు రాస్తూ ఇంగ్లీషులో కూడా ఆత్మీయంగా కవితను ఆవిష్కరించ గలిగిన సవ్యసాచులు ఏ భాషా సాహిత్యంలో నైనా కొద్ది మందే ఉంటారు. తెలుగులో ఇప్పుడు అటువంటి కవులు వేళ్ళమీద లెక్కబెట్టేటట్లున్నారు. వాళ్లలో డాక్టర్ జె. బాపురెడ్డిగారు మొదట లెక్కింపదగినవారు. In Quest of Harmony, Longing for Life, Learn of Love, Loving is Living - అనే ఆంగ్ల కవితా సంపుటాలు నాలుగు బాపురెడ్డి గారికి భారతీయ ఇంగ్లీషు కవుల్లోనూ, ప్రపంచ ఇంగ్లీషు కవుల్లోనూ గుర్తింపు తెచ్చి పెట్టాయి. 'వరల్డ్ కాంగ్రెస్ ఆఫ్ పొయెట్స్'లో బాపురెడ్డి గారి కవితలు ప్రపంచ భాషా కవుల మన్ననల నందుకొన్నాయి. ఆ కాంగ్రెస్‌లోని కవులు ఇంగ్లీషులో బాగా నచ్చిన కవితలను, సంపుటాలను తమ తమ మాతృభాషలలోకి కూడా తర్జుమా చేసి కవుల ప్రపంచ కుటుంబాన్నీ, భావాల ఆదాన ప్రదానాన్నీ పెంచుకొనే ఉద్యమాన్ని నిశ్శబ్దంగా సాగిస్తున్నారు. ఇటువంటి చైతన్యాన్ని పెంచుతున్నవారిలోకూడా డాక్టర్ బాపురెడ్డి గారు తెలుగు వారిలో ముందడుగు వేస్తున్నారు.

ఆర్మేనియన్ కవయిత్రి డాక్టర్ కనారిగ్ బొయాడ్జియాన్ కవితాసంపుటి 'There is no time'ను, డానిష్ కవయిత్రి డాక్టర్ ఎస్థర్‌గ్రెన్ కవితా సంపుటి 'Raise' ను, అమెరికన్ కవయిత్రి డాక్టర్ రోస్‌మేరీ విల్కిన్‌సన్ (U.S.A.) కవితాసంపుటి 'Sacred in Nature'ను డాక్టర్ జె. బాపురెడ్డి గారు వరుసగా 'వ్యవధి లేదు' (1985), 'సైకెత్తాలి' (1988), 'ప్రకృతిలో పవిత్రత' (1993) అనే పేర్లతో అనువదించారు. మూలంతో కలిపి అమవాదాలను ప్రచురించి తులనాత్మక పరిశీలనకు అవకాశాన్ని కలిగించారు.

తెలుగువారు సంతోషింపదగిన మరొక అంశం ఏమిటంటే - డాక్టర్ బాపురెడ్డి గారి ఇంగ్లీషు కవితా సంపుటి 'Beyond the Horizon' స్పానిష్ భాషలోకి అనువాదమయింది. మరికొన్ని కవితలు జర్మనీ మొదలైన భాషల్లోకి వెళుతున్నాయి. విశ్వ కవి సౌభ్రాతృత్వానికీ ఈ అనువాదోద్యమం ఒక బలమైన స్నేహసూత్రంగా పని చేస్తుందనటంలో అనుమానం లేదు.

బాపురెడ్డిగా రెన్నుకున్న మూడు కవితా సంపుటాలను రేఖామాత్రంగా గమనించినా మూడంశాలు స్పష్టంగా గోచరిస్తాయి: 1. మూడూ కవయిత్రుల కవితాభివ్యక్తులే. 2. ముగ్గురూ ఖండ కావ్యాలనూ, మినీ కవితలనూ, హైకూల వంటి మెరుపు రచనలనూ రచించినవారే. 3. ముగ్గురూ శాంతినీ, ప్రేమనూ, ఆధ్యాత్మికతనూ - ఆధునిక ప్రపంచాన్ని సంక్షోభం నుండి ఉద్ధరించగల తరణోపాయాలని భావించేవారే. మరొక విశేష మేమంటే - ఆ ముగ్గురు కవయిత్రులూ భారతీయ భావధారకు సమాంతరంగా ప్రపంచ కవితావీణమీద మ్రోగుతున్న నాదతంత్రుల్లాగా స్ఫురిస్తున్నారు.

విశ్వ కుటుంబ భావనం ఈ కవయిత్రులు ముగ్గురినీ కలిపి ముడివేస్తోంది. దాన్ని రాజకీయంగా, ఆర్థికంగా సాధించబోయి మానవుడు అశాంతినీ, రక్తపాతాన్నీ సృష్టించి ప్రపంచాన్ని సంక్షోభానికి గురి చేస్తున్నాడనీ, ఈ విపత్కర పరిస్థితి నుండి మనల్ని మనం రక్షించుకోవలసిన అవసరం ఉన్నదనీ ఈ

ముగ్గురూ ముక్తకంఠంతో ఎలుగెత్తి చెప్పుతున్నారు. భౌతికవాదం మానవుడికి సమదృష్టిని ప్రసాదించలేక విఫలమయిందనీ, సర్వజీవనసమభావం, సర్వభూతహిత భావం అనే నేత్రద్వయంతో చూడగలిగిన ఆధ్యాత్మిక దృక్పథం ఒక్కటే ప్రపంచానికి శాంతినీ, సౌఖ్యాన్నీ, వసుధైకకుటుంబ భావాన్నీ ప్రసాదింప గలుగుతుందనీ ఈ ముగ్గురూ భావిస్తున్నారు.

శ్రీమతి కనారిగ్ బోయాడ్జియాన్ (Knarig Boyadjian) తమ కవితా సంపుటికి (There is no Time (వ్యవధి లేదు) అనే పేరు పెట్టటంలోనే మానవతకు ఆధ్యాత్మికత యొక్క ఆవశ్యకత ఎంత అవసరమో వ్యక్తం చేసింది. పుడమితల్లి ఆధ్యాత్మికతకు పుట్టుకనిచ్చే పురిటినొప్పులు పడుతున్నదని ఆమె ప్రకటించింది.

*"The land is pregnant*
*It has no time"*

ఆధ్యాత్మికత ఆవిష్కరింపబడితే మానవుల మధ్య రంగులు, జాతులూ, వర్ణాలూ, వర్గాలూ, వయసులూ, లింగాలూ పరిగణింపుకు రావు. అందరిలో ఆవరించి ఉన్న ఆత్మ ఒక్కటే ప్రేమ చైతన్యంగా దర్శనమిస్తుంది.

*"Souls do not have colour*
*But have love"*

అన్న బొయాడ్జియాన్ భారతీయ తత్త్వ దర్శనానికి ప్రతిబింబంగా పలికింది. ఆమె కవితా సంపుటిలో సర్వత్రా వ్యక్తం చేసే ఆధ్యాత్మిక ప్రవృత్తికి ప్రతి కవితనూ ఉదాహరించటానికి వీలున్నా 'Competition' ('స్పర్థ') అనే కావ్య ఖండిక నొక్క దాన్ని గమనిస్తే చాలు - అంతరంగం, అంతరార్థం బయట పడతాయి.

*"I felt the movement of my body*
*Like a professional dancer,*
*Drunk with its own beauty,*
*Neglecting mind and soul.*

*Mind, always ignoring both,*
*Arrogant with knowledge*
*Flying in philosopher's heaven,*
*Left soul and body.*

*Soul, sad for their conceit,*
*Longing for harmony,*
*Cried: 'If I leave now,*
*Neither of you will exist,*
*I am Life, and you*
*Its shelter, Beauty matures*
*By moving together.'*

*Competition was suddenly over*
*When the ego disappeared."*

*(పుట 27)*

ఈ కవిత నేపథ్యంలో భగవద్గీతలోని "ఇంద్రియాణి పరాణ్యాహుః, ఇంద్రియేభ్యః పరం మనః, మనసస్తు పరాబుద్ధిః, యో బుద్ధేః పతతస్తు సః (3.4.2) అనే శ్లోకం కదలాడుతుంది. దేహదృష్టి ఇంద్రియ భోగదృష్టిని పెంచి బుద్ధిని, ఆత్మను విస్మరింపచేస్తుందని మొదటి పద్యం తాత్పర్యం. నర్తకి ఉపమానం, సౌందర్యపానం వలన కలిగే మత్తును సూచించే నిరవయవ రూపకం ఆ భావాన్ని బలంగా పోషిస్తున్నాయి. బుద్ధి పాండిత్యాహంకారంతో వేదాంత సిద్ధాంతాలను తర్కవితర్క పక్షాలతో అనుభవానికి అందని అంబరాల్లో విహరింపజేస్తోందని, అది ఇహానికి పరానికీ పనికిరాకుండా పోతుందని విచారపడింది రచయిత్రి రెండవపద్యంలో. వైజ్ఞానిక యుగంలో ఉన్న నేటి శాస్త్రజ్ఞుని పరిస్థితి కూడా ఇటువంటిదే. ఇంద్రియ మనో బుద్ధ్యహంకారాలకు వెనుక నున్న జీవచైతన్యం ఆత్మ. దాన్ని విస్మరించి తమలో తాము స్పర్థను సాగిస్తున్న

ఆ దుష్టచతుష్టయానికి తన అస్తిత్వం యొక్క విలువను తెలియచేసింది ఆత్మ. నిజానికి జీవించేది 'నేను' అనే ఆత్మ. "I am Life" అది లేకపోతే దేహాదులు లేవు. దేహం దాని ఆశ్రయం మాత్రమే. సౌందర్యం నశించేది దేహానిది కాదు. ఆత్మ జ్ఞానం వలన కలిగే ఆధ్యాత్మిక సమన్వయ దృక్పథమే - అంటే ఆత్మ సౌందర్యమే సౌందర్యం అని మూడో పద్యం ముచ్చటగా చెపుతోంది. ఇంద్రియ మనోబుధ్యహంకారాల మధ్య స్పర్ధ అహంకార త్యాగం వలన సమసిపోతుంది. అహంకార రాహిత్యమే ప్రేమ. అదే అందరిలో ఉన్న ఆత్మను ఆధ్యాత్మికంగా దర్శించటానికి వీలైన ఆధునిక మార్గం. అదే నేటి ప్రపంచానికి తరణోపాయం.

శ్రీమతి బొయాడ్జియాన్ ఆర్మీనియన్ - అస్సీరియన్ సంప్రదాయాన్ని పుణికి పుచ్చుకొన్న కవయిత్రి. ప్రముఖ అస్సీరియన్ కవి అషర్ యూసుఫ్ మనుమరాలు. ఆధ్యాత్మికత కోసం ఆధునిక మానవత పడుతున్న తీవ్రమైన వేదనను ఎటువంటి అస్పష్టత లేకుండా కవితగా అభివ్యక్తీకరించింది. ఆమె కవితలో ఉన్న విశ్వమానవతా స్పృహ భారతీయుత కు ప్రతిబింబంగా ఉండటంచేత డాక్టర్ బాపురెడ్డిగారు ఆత్మీయంగా తెలుగులో ఆవిష్కరించారు.

జీవాత్మకు పరమాత్మకు మధ్య మధురభక్తి సంప్రదాయం భారతీయం. 'వ్యవధిలేదు'లో శ్రీమతి బొయాడ్జియాన్ క్రైస్తవ సంప్రదాయంలో మధురభక్తి మార్గాన్ని మనోజ్ఞంగా ఆవిష్కరించింది. "The wedding of my heart" లో, మూలాన్ని మధురంగా ఆవిష్కరించిన బాపురెడ్డి గారి అనువాదం ఆ అనుభూతిని అందిస్తుంది.

"అది రాత్రివేళ -
వెలుగుతున్నాయి మూడు లాంతర్లు
వ్రేలాడుతున్న కొయ్య శిలువ ముందు.
మోకరిల్లి వల్లించాను నేను
యథార్థ ప్రకటనాత్మక కీర్తన.
నా భావనాత్మక యాత్రలో
తపించే నా మోవిపై
అద్దిన ముద్దెవరిదంటే
నీ పేరే చెపుతా!
నీ ప్రేమానంద సంచలితమైన హృదయం
నీ అక్షరత్రయాన్ని స్వీకరిస్తుంది.
ఆ మూడు లాంతర్ల సమక్షంలో
వాటికీ నా నామధేయానికీ
మూడు ముళ్లు వేస్తుంది.
అదే నా హృదయ కల్యాణం.
గుట్టుగా
ఆ అక్షరత్రయాన్ని వల్లించే
నా పెదవులకు
నా సంకీర్తనమే సాక్షి."

**ముగ్గురు కవయిత్రులు: ఆధ్యాత్మిక స్పృహ**

పుడమి తల్లికి వచ్చిన పురిటినొప్పులను విని తన కవితలో స్పందించారు డాక్టర్ కనారిగ్ బొమాడ్జియాన్. దానిని తెలుగులో అనుభవింపజేశారు డాక్టర్ బాపురెడ్డిగారు. ఆ తల్లికి పుట్టబోయే ఆధ్యాత్మిక శిశువును దర్శించే సంస్కారాన్ని నేర్పారు తన కవితలలో శ్రీమతి ఎస్థర్ గ్రెస్ (Esther Gress). కవితా సంపుటికి పేరు పెట్టిన కవిత ఇది -

He would raise/ The man/ From a lower level.
He would raise / The life/ To a higher level.
He would raise/ The world/ And he lost himself
Now the world/Must raise/Him to higher level."

'అతడు/ క్రింది స్థాయిలో ఉన్న/ మనిషిని పైకెత్తేవాడు
అతడు/ జీవితాన్ని/ పై స్థాయికి లేవనెత్తేవాడు.
అతడు/ లోకాన్నే/ లేవనెత్తి /తానే పడిపోయాడు.

లోకమే ఇప్పుడు/ అతణ్ణి/ పై స్థాయికి/ లేవనెత్తాలి.'

ఆర్థికంగా అభివృద్ధిని సాధించటం ద్వారా జీవితస్థాయిని పెంచాలని మానవుడు ప్రయత్నం చేసి నైతికంగా, ఆధ్యాత్మికంగా తన అస్తిత్వాన్ని తాను కోల్పోయాడు. ఈ స్థితి నుంచి ప్రపంచమే మానవుణ్ణి ఉద్ధరించి ఉన్నతస్థితికి చేర్చవలసిన అవసరం వచ్చిందని కవయిత్రి గుర్తించింది. అందువల్లనే కవితా సంపుటికి 'పైకెత్తాలి' అని పేరు పెట్టి, ఆధునిక మానవస్థితిని గురించి తన ఆవేదనను ఒక కేకగా, పతాకశీర్షికగా ప్రదర్శించింది.

నేటి మానవజీవితాన్ని సీతాకోకచిలుకతో పోల్చి సహజసుందరంగాను, వివేకమధురంగానూ వెలార్చింది డాక్టర్ ఎస్థర్ గ్రెస్.

*'సీతాకోకచిలుక లాగే / తరచు మనం*
*వ్యర్థంగా ఎగురుతుంటాం*
*గాజు కిటికీలకు / తల బాదుకుంటూ.*
*సీతాకోకచిలుక వెలనే / గమనించం మనం*
*అనంతాకాశం వైపు / తెరచి ఉన్న ద్వారాలను.'*

*(బాపురెడ్డి అనువాదం)*

భౌతిక జీవితంలో ప్రమాదభూయిష్టమైన, స్వేచ్ఛకు వీలులేని ఎన్నో సమస్యలతో మనం తల బాదుకోవటానికే సీతాకోకచిలుకలవలె అలవాటు పడ్డాం గాని, విశాలంగా తెరచివున్న ఆధ్యాత్మిక ద్వారాలను పట్టించుకోం: విశాలదృష్టిని అలవరచుకోం: విశ్వ దర్శనాన్ని చేసుకోలేం. అందువల్లనే ఈ మినీ కవితకు "Fly" 'ఎగసిపో' అనే శీర్షిక ఉంచబడింది. ఆధ్యాత్మికతను దర్శించటానికి మానవుడు మొదట విశ్వదర్శనం చేయాలి అని సూచిస్తున్నది కవయిత్రి.

ఆధ్యాత్మికతను దర్శించే మానవుడు ప్రేమను అలవరచుకోవాలి. ప్రేమ సాధన ఎంత కష్టమో చెపుతూ, ఎంత సులభంగా మూడు మెరుపుల్లో మెరిపించింది ముచ్చటైన మినీ కవితలో ఎస్థర్‌గ్రేస్! డాక్టర్ బాపురెడ్డి గారి తేటతెలుగులో -

**కష్టాతికష్టం**

*"నీవు ప్రేమించని వ్యక్తిని*
*సిలువ చేయటం /సులభమే కావచ్చు.*
*కాని, నీవు సిలువ వేయని /వ్యక్తిని ప్రేమించటం*
*కష్టతరం కావచ్చు.*
*నీవు సిలువ వేయాలనుకొనే వ్యక్తినే*
*ప్రేమించటం మాత్రం /కష్టాతి కష్టతరం."*

*(పైకెత్తాలి పు. 9).*

ప్రేమించని వ్యక్తిని సిలువ వేయుటం తమోగుణలక్షణం. సిలువ వేయని వ్యక్తిని ప్రేమించటం సాత్త్విక గుణ లక్షణం. ఆధ్యాత్మికం చివరిగుణంలో చిగురిస్తుంది. దానిని దర్శించి ఆచరించే చిత్త సంస్కారాన్ని అలవరచుకొమ్మని, సమాజాన్ని పైకెత్త లెమ్మని పిలుస్తోంది ఎస్థర్ గ్రేస్.

ఆధ్యాత్మికతను దర్శించటానికి పిలుపునిచ్చే గైడ్‌లాగా పలికింది కవితలో శ్రీమతి ఎస్థర్ గ్రేస్. ఆధ్యాత్మికతను అనుభవిస్తూ మనకు అనుభూతిని పంచుతున్నట్లు కవిత చెప్పింది డాక్టర్ రోస్‌మేరీ విల్కిన్‌సన్ (Dr. Rosemary Wilkinson). ఆధ్యాత్మికత వలన మానవులు అంతర్బహిః ప్రకృతులలో పవిత్రతను అనుభవించే ప్రవృత్తిని కవితలన్నింటిలో కవయిత్రి ప్రసరించింది. పై ముగ్గురిలో ఈమె అన్ని విధాలా మిన్న.

ఆధ్యాత్మికతను ప్రపంచంలో మానవాళి అన్ని స్థాయిల్లో ఎలా అన్వయించుకొని ఆచరణలో పెట్టాలో డాక్టర్ రోజ్‌మేరీకి ఒక నిర్దిష్టమైన అవగాహన ఉన్నది. అందువలన రాజకీయంగా, ఆర్థికంగా, సాంస్కృతికంగా

ఆధ్యాత్మికానుభూతిని ఆమె వ్యక్తీకరించింది; ఆధ్యాత్మికతకు అభివ్యక్తిగా పవిత్రతను సంకేతించింది. "The earth is holy, you are holy, create the holy" అన్నవి రోజ్‌మేరీ శాంతి సూక్తాలు. ఈ త్రిపిటకాల్లో నించే ఆమె కవితా త్రివిక్రమత్వం విస్తరించింది.

ఆమె దృష్టిలో ఈ ధరిత్రి మానవవాళికి ఏకైక మాతృమూర్తి. ఆమెను సహనంతో సేవించటమే కవయిత్రి భావనలో ఆధ్యాత్మికత, పవిత్రత. అందుకే అనుమానం లేకుండా ఇలా అంటుంది ఆమె:

*"Mother Earth is one. How she is*
*SERVED best, is the goal we run!*
*We make it so!"*

ప్రపంచదేశాలన్ని ఆధ్యాత్మికంగా పునర్జన్మ యెత్తినట్లు తలలెత్తాలని ఆమె ఆశిస్తోంది -

*"Round up the 175 nations*
*On the earth into re-birth."*

*"పరస్పరం తోడుపడే సంస్కృతి వర్ధిల్లే*
*రణ రహిత, రక్తపాత రహిత*
*లోకాన్ని ఆవిష్కరించు!*
*ఈ పరమాణుశక్తి పరిణామదశలో*
*పరస్పరం మనం నేర్చుకోవలసింది ఎంతో ఉంది.*
*అలా జరిగేటట్లు మనం చేయవలసి ఉంది."*

*(బాపురెడ్డి అనువాదం)*

పరస్పర సహనభావంతో యుద్ధాలు, రక్తపాతాలు లేకుండా పుడమి తల్లిని ప్రశాంతంగా ఉంచటమే ఆమె దర్శించే పవిత్రత. పరమాణు యుగంలో ప్రపంచాన్ని ప్రళయంనుండి తప్పించి ప్రణవం వైపు పయనింపజేయటమే మానవులు చేయవలసిన నిజమైన సేవ!

ఆధ్యాత్మికతను పెంచవలసిన సంస్థలే దానిని త్రుంచివేస్తున్నాయని నిర్భయంగా ప్రకటించింది డాక్టర్ రోజ్‌మేరీ.

*"ఆధ్యాత్మికత అడుగంటి పోతూంది*
*చర్చి గుడులు మతాన్ని*
*వ్యాపారంగా మార్చేస్తున్నాయి."*

*"Spirituality is dying*
*because churches are making*
*a business of religion."*

జీవితాన్నంతా ఆధ్యాత్మిక దృష్టితో అనుశీలించిన రచయిత్రి అనేకాంశాలను ఆ దృష్టితో నిర్వచించింది; వ్యాఖ్యానించింది; వివేచించింది. స్త్రీల గురించి ఆమె చెప్పిన మాటలు భారతీయ దృక్పథానికి ప్రతిబింబంగా భాసిస్తున్నాయి.

*"Women cannot say:*
*I want not your inspiration, Lord.*
*Women cannot refrain from:*
*I want to give you glory, Lord.*
*Women cannot refuse:*
*The sixth sense given them by God.*
*Women cannot restrian:*
*The poetry of reverence in their heart.*
*Women cannot deny:*
*The magnificence of all the earth.*
*Women cannot live this magnificence:*
*Without respect for man.*
*Women cannot Love:*
*Without respect from man.*
*God made woman, yes,*
*God made woman*
*The complement of man."*

స్త్రీవాదం చిలువలు పలువలుగా విస్తరిస్తున్న ఈ రోజుల్లో ఈ స్త్రీ సూక్తం శాంతి నాదంలా వినపడుతోంది. ఎందుకంటే - డాక్టర్ రోస్‌మేరీ విల్కిన్‌సన్ కవయిత్రిగా తన బాధ్యత తెలిసి పలికింది.

ఆమె దృక్పథంలో - "కవులు దేశపు ఆత్మలు/ సంపూర్ణ నగ్నసత్యదర్శనంతో/ జాతి అంతఃకరణాన్ని ఆవిష్కరిస్తారు / మరి అదే వారి ఏకైక అస్త్రం". ఆమె కవిత్వాన్ని గురించి చెప్పిన ఈ క్రింది మాటలు మన భక్త కవుల మానసిక పరిపాకాన్ని ప్రకటిస్తున్నాయి.

"నిజమైన కవిత్వం మానవాళికి దేవుడిచ్చిన వరం . అది అతని అఖండ వైభవానికి అద్దం పడుతుంది. అది పవిత్రాత్మల పాలిటి పరమపావన అమృతాసవం".

ఈ కవయిత్రులు తూర్పుపడమరల సరిహద్దులు చెరిపేశారు. భారతీయుల్లాగా ప్రపంచమంతా స్పందిస్తున్నదని నిరూపిస్తున్నారు. ఆధ్యాత్మికతకు ప్రపంచమంతా ఒకే కుటుంబమని చాటుతున్నారు. ప్రేమ, పవిత్రత సమస్తప్రాణి ధర్మాలని, అవే ప్రపంచ శాంతికి మూలశక్తులనీ వివరిస్తున్నారు. ప్రపంచ కవులు ఆధ్యాత్మిక చైతన్యమే ఆధునిక కవితా స్పృహగా ప్రదర్శిస్తున్నారని ప్రకటిస్తున్నారు.

డాక్టర్ జె. బాపురెడ్డిగారు ఈ సత్యాన్ని తెలుగులో అనువదించి చెప్పారు. పడమటి కిటికీలు తెరుచుకున్న మనకు ఎప్పటిదో మన గాలి చప్పుడు చేయకుండా తిరిగి చల్లగా వీస్తున్నట్లున్నది. 'బాపురె!' అనిపిస్తున్నది.

*(జీవియస్ కాలమ్ నుంచి)*

# ఆత్మశ్రుతి

- డాక్టర్ సి. నారాయణ రెడ్డి

పసి యెండలో మిసమిసలాడుతూ
పరవళ్లు తొక్కే సెలయేరును చూశారా?
పసిమి వెన్నెల్లో కొసరి కొసరి దృశాంచలాలు
విసిరే కలువ రేకుల్ని చూశారా?
చూస్తే సరి. చూడకుంటే ఇటు చూడండి.
ఆ సెలయేటి రూపు
ఆ కలువపూల చూపు
వెరసి చిరంజీవి బాపు (రెడ్డి).
వ్యక్తిగా బాపురెడ్డి మూర్తి ఇది.
మరి - కవితా శక్తిగా అతని కీర్తి ఎలాంటిది?
అది క్షారక దశను దాటింది.
కోరక దశను మీటింది.
ప్రసూన దశలో పదం మోపింది.
ఇది అతని మూడో కవితా సంపుటి.
మొదటిది 'చైతన్య రేఖలు'
రెండోది 'రాకెట్టు రాయబారం.'
కవి పేరే ఈ కృతి పేరు.

దీంట్లోని పికరుతులు ఒక కొమ్మవి కావు
వేరు వేరు.
అయినా అన్నిటిలో అనుస్యూతంగా ఉన్నది
ఒకే కాకలి.
కవిత్వపుటాకలి.
ఈ సంపుటిలో ఉన్న ఖండికలు భిన్న భిన్నమైనవి.
అలవోకగా వ్రాసినవి
ఆకాశవాణికి శ్రుతి చేసినవి
పత్రికల కోసం చెప్పినవి
మిత్రుల కోసం గుప్పినవి
ఉద్యోగరీత్యా చిలికినవి
ఎన్నెన్నో భావమధుధారలు కలిసి
ఏకమైన కలశి.

2

బాపురెడ్డి అచ్చంగా కవి.
కవీతర పదవుల్ని (సాహిత్యరంగంలో) ఆక్రమించి
తాను గజిబిజిపడి
పాఠకుల్ని గడబిడ పెట్టే
కవి పండితుడూ కాడు
పండిత కవీ కాడు.
చూసిన ప్రతి వస్తువునూ
కల్పనా చక్షువులతో పరికించి చూడగల
భావనా రసనతో చవిచూడగల
గుప్త సత్యాలకు లిప్తలో తెరతీయగల
తెర వెడలిన రసాత్త భావాలకు
శబ్ద శాద్వలాలు పరిచేయగల
మౌలిక ప్రతిభ ఉన్నవాడు.
సమకాలీన కవుల ప్రభావం కుత్తుక బంటిగ
ఉన్నా
గమ్మత్తుగా తప్పించుకుని
ఆ మహా ప్రవాహాన్ని ఉత్తరించి బయటపడే
నేర్పూ, అందుకు తగిన కూర్పూ ఉన్నవాడు.
చల్లకు వచ్చి ముంత దాచడమెందుకు?
చూడండి 'నీవూ - నేనూ.'

3

"నీవూ - నేనూ"
"నీ కన్నుల వెలుతురులో
నే కన్నులు తెరిచాను.

కనులు తెరిచి నేనిది భూ

లోకమనే మరిచాను."

ప్రేయసి కనుల వెలుగులో ప్రియుని కనులు తెరుచుకున్నవి.

తెరచుకున్న కనులు అలాగే ఉండిపోయినవి.

అతడున్నది భువిలో.

అందుకు పర్యవసానం?

నిమిషంలో కళ్ళు మూతపడాలి.

కాని అలా జరగలేదు.

ఆ కళ్లు అలాగే విస్ఫారితంగా ఉండిపోయినవి

అంటే అతడు అనిమిషుడైనా డన్నమాట

'అనిమిష' పదం ఉచ్చరించకుండా ఆ వ్యంగార్థం

భాసించే మాటలకు ఈ చరణం ఆభరణం.

"నీ పెదవులు కరచినాను

నను నేనే మరచినాను

మరచి ఇంద్రలోక సుధా

మాధురిలో నిలచినాను."

'అధరం సుధా మధురం' అని చెప్పలేదు కవి,

కాని చెప్పినంత పని చేశాడు భంగ్యంతరంగా.

(అయితే కరవడం దాకా వ్యవహారం జరగడం

కవి కరకు వయసుకు చెరగని చిహ్నం,

అది విషయాంతర మనుకోండి.)

"నీ నడుమును చుట్టినాను

నింగికొసలు ముట్టినాను

ప్రణయ కళాసీమ లేలి

పంచాస్త్రుని కొట్టినాను."

ఈ పంక్తుల్లో ఉన్న వ్యంగ్య వైభవం

పరిణత కవులతో కేలు కలిపేది.

ఆమె నడుమును చుట్టితే

ఆకాశం ముట్టినట్లయిందట.

ఈ ఊహ ఎంత ఎత్తయిందో అంత లోతయింది.

ఆకాశాన్ని తాకడంలోని యెత్తు

అత్యంత పారవశ్యానికి గుర్తు.

అంతేకాదు -

ఆకాశం శూన్యం.

ఆమె నడుము అంతకంటే శూన్యం.

('నడుమే పసలేదు గాని నారీమణికిన్' అని ఊరికే అన్నాడా ప్రబంధకవి.)

ఆమె నడుమును చుట్టివేయడమంటే

ఆకాశాంచలాల్ని ముట్టివేయడమే కదా!

అందుకే అన్నాను ఈ ఊహ ఎంత ఎత్తయిందో అంత లోతయిందీ అని.

ఈ గీతంలో ఉన్నవి అయిదే అయిదు

ఇవి అయిదు చరణాలు కాదు

అనంగుని అయిదు శరాలు.

తలచిన కొద్దీ పులకలు.

వలపు జంటలకు మెయిమలకల్పు.

ఇంతటితో 'ఆత్మశ్రుతి' ముగుస్తున్నది.

ఇన్ని గేయాల్లో ఈ ఒక్క గీతానికే

శ్రుతి చేసి మిన్నకుంటున్నాను.

ఇందుకు ఒకే ఒక్క హేతువుంది.

బాపురెడ్డికీ నాకూ ఉన్న అనుబంధం......

అతణ్ణి గురించి ఇంక ఏ మాత్రం విస్తరించినా

ఈ ఆత్మశ్రుతి ఆత్మస్తుతిగా పర్యవశిస్తుందేమో!

బాపురెడ్డి మిగతా గేయాల్లోని

తీపిని ఆస్వాదించే మధువ్రతులకు స్వాగతం.

సెలవు.

*(1968లో "బాపురెడ్డి గేయాలు" కావ్య పీఠిక)*

# భావుక విమర్శకుడు బాపురెడ్డి

- ఆచార్య ఎస్వీ రామారావు

ప్రణయ శీలత, ప్రగతి శీలత, ప్రణవ శీలతల లోని సత్యాలను దర్శించి భావనాత్మకంగా ప్రవచించటం బాపురెడ్డి సాహిత్యాదర్శం. రసరమ్యాలైన పద్య గేయాల కృతులతో పాటు వివేచనాత్మకాలైన వచన రచనల్లో కూడా ఈ దృక్పథమే తొణికిసలాడుతుంది. 'మనసులోని మాట' వ్యాస సంపుటి ఇందుకు అక్షర సాక్ష్యం.

తన అభిప్రాయాలను నిర్మొగమాటంగానూ, కళాత్మకంగానూ అభివ్యక్తీకరించే సాహితీ ప్రియం భావుకుడు బాపురెడ్డి. విషయాన్ని జీర్ణించుకొని కన్ఫ్యూజన్ లేకుండా సహృదయులకు అందించటం ఒక ఆర్ట్ అయితే ఆయన ఆ కళలో అందెవేసిన చేయి. ఆయన సాహితీ వ్యాసాలు స్పష్టత, సారళ్యత, నిర్దిష్టతా సుగుణాలను పుణికిపుచ్చుకున్నాయి.

కవిత్వతత్త్వాన్ని వెల్లడించటానికి ఎన్నో నిర్వచనాలు వెలువడ్డాయి. ఇంకా ఎన్నో రావడానికి అవకాశం వుంది. బాపురెడ్డి కూడా ఈ వివేచనలో భాగస్వామి అయి కవితాస్వరూపాన్ని అభినవంగా ఆవిష్కరించారు.

'కవిత్వం అంటే ఒక వస్తువును దర్శించే తీరు.'

"కనిపించే సత్యాల వెనుక దాగిన కనిపించని సత్యాలను, పరస్పర వైరుధ్యంలోని మైత్రిని, ఏకత్వం లోని అనేకత్వాన్ని, అనేకత్వంలోని ఏకత్వాన్ని సాక్షాత్కరింపజేస్తుంది."

వస్తువుకన్నా, ప్రక్రియకన్నా భావం వచన కవితకు ప్రధానమైనదన్నది బాపురెడ్డి సిద్ధాంతం. భావుకత లేనివారు, శబ్దశిల్ప రహస్యం తెలియని వారు ఏ దృక్పథంతో వ్రాసినా అది సజీవమైన, ప్రయోజనాత్మక మైన కవిత కాలేదని ఆయన నిష్కర్ష. గురజాడ అప్పారావు, రాయప్రోలు సుబ్బారావు, శ్రీరంగం శ్రీనివాసరావు రచనా శిల్పపరంగా కవితాభివ్యక్తిలో రావలసిన మార్పును గుర్తించటంవల్లనే వైతాళికులు కాగలిగారని ఆ 'రావుత్రయం' ను ఆధునిక కవితకు కవిత్రయంగా ఉగ్గడించారు.

ఆధునిక భావచేతనను అభివ్యక్తం చేయడానికి సాధనంగా రూపుదిద్దుకొన్న వచన కవితలో కవితాశిల్ప రాహిత్యం చోటు చేసుకోవటంపట్ల బాపురెడ్డి ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. "కవితా వస్తువే కవిత అని భ్రాంతిపడి కొందరు భావుకతను చావు దెబ్బతీస్తుంటే, కవితా ప్రక్రియే కవితా తత్త్వమని భావించి కొందరు కవితా శిల్పాన్ని బండబారకొడుతున్నారని'' ఆయన అభిప్రాయం. భావశక్తికి, రసాభివ్యక్తికి అడ్డు వచ్చేది ప్రతిభా పాండిత్యాల రాహిత్యమే కాని పద్యగేయాది ప్రక్రియలు కాదని ఆయన తాత్పర్యం.

'మనసులోని మాట' లో ప్రాచీనాధునిక కవులు, కవితా ప్రక్రియలపై సమాలోచనం వుంది. బాపురెడ్డి దృష్టిలో మహాభారత వేదాన్ని, మానవతా వాదాన్ని జోడించిన తిక్కన 'నిత్యాధునికుడు' కాగా, తాను చాటిన సత్యాలను సర్వుల చేత విశ్వసింప చేయగలిగిన వేమన 'విశ్వసనీయకవి.' కుందుర్తి కవిత సృజనా త్మకతకు, మౌలికతకు నెలవైతే, నారాయణరెడ్డి జ్వలిత చేతనానుభూతులను ఆవిష్కరించే అక్షర తపస్వి. త్యాగరాజు, కట్టమంచిలపై వ్యాసాల్లో వారి వ్యక్తిత్వ సాహిత్యాల సమన్వయం సమీచీనంగా కొనసాగింది.

'ఆత్మశ్రుతి'లో వినిపించిన బాపురెడ్డి కృతుల తొలిపలుకుల్లోని భావగంధాలు ఆయన కవితా దృక్పథాన్ని గుబాళిస్తాయి. భావ సత్యాల విశ్వసనీయ పరిణామమే భౌతిక జీవితానుభూతులవుతాయన్నది ఆయన ప్రతిపాదించిన భావ భౌతిక వాదం. 'భౌతికమే ఆధ్యాత్మికం' అన్న వ్యాసం కూడా భౌతిక భావలోకాలకు అంతరం లేదన్న అంతర్యాన్ని వెల్లడిస్తుంది.

"ఆధునిక విజ్ఞాన శాస్త్రాన్ని, ఆధ్యాత్మిక భావసత్యాన్ని సమన్వయపరచలేని ఏ సిద్ధాంతమైనా వట్టి రాద్ధాంతమే అవుతుంది. ఉన్న సత్యం ఒక్కటే అయినపుడు దాన్ని వెతుకుతున్న దారులు, తీరులు ఎన్ని అయినా అసలు సత్యం మారదు. అందుకే అంతర్ముఖియై, యోగమార్గంగా, అంతరప్రకృతిని పరిశీలించి సాధించే ఆత్మజ్ఞానమైనా లేక బహిర్ముఖియై ప్రయోగ మార్గంగా బహిః ప్రకృతిని పరిశోధించి ఆర్జించే పదార్థ జ్ఞానమైనా నిరూపించే నిర్దేశించే సత్య మొక్కటే."

"ఎంతటి విజ్ఞాన శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానం సముపార్జించినా, జ్ఞానానికీ అజ్ఞానానికీ మధ్య వుండే అంతరం పెరుగుతుందేకాని తరగదు కాబట్టి, భౌతికమే ఆధ్యాత్మికమనే సత్యస్ఫూర్తి కలిగితేనే తప్ప మానవ జీవితానికి జ్ఞానదీప్తి లేదు. ఆనంద ప్రాప్తి లేదు" అని బాపురెడ్డి విశ్వాసం.

బాపురెడ్డి అంతరంగానికి మణిదీపిక 'హృదయ రేఖ' వ్యాసం. ఆయన భావానుభూతులకు, హృదయ స్పందనకు అక్షర రమ్యాకృతి. "విశ్వ ప్రేమ, విశ్వ భ్రాతృత్వం నన్ను ఆవరించినవి. నేను అందుకే అన్ని విషయాలవట్ల విశ్వజనీనమైన దృక్పథం అలవరుచుకోవడానికే ప్రయత్నిస్తూ వచ్చాను." అన్న వాక్కులు ఆయన వ్యక్తిత్వాన్ని చాటుతాయి. "ఆడపిల్లలతో మైత్రి చేయడం కేవలం బయోలాజికల్ రీజన్ అనే అభిప్రాయం తప్పు. కేవలం స్వార్థబుద్ధితో శారీరక వాంఛతోనేకాని స్నేహం చేయకూడదనుకుంటే జీవితం ఎడారి ప్రాయమౌతుందేమో!" అన్న మాటల్లో రాయప్రోలు అమలిన శృంగారతత్వం ద్యోతకమవుతోంది.

సర్వమత సత్యవాదం, సాహిత్య సామ్యవాదం తనవిగా చాటుకొన్న బాపురెడ్డి అంతర్మథనం నుంచి వెలువడిన సాహితీసారం ' మనసులోన మాట.' హేతువాద నినాదాలను ఇతర శాస్త్రాలకు వదిలేసి, హృదయవాద నాదాలను కదిలించాలని ఆయన సంకల్పం. అనంత సత్యగర్భితమైన చరాచర-దృష్ట్యా దృష్ట సృష్టిలో ఏ సత్యాలు ఆవిష్కరిస్తే, ఏ భావాలు కల్పిస్తే సుఖానంద సుందర మానవ జీవితానికి దోహదకారులౌతాయో అట్టి పరిణామ ప్రగతిశీల భావోద్దీపనం చేయాలి సాహిత్య దర్శకులు అనీ ఆయన ఆకాంక్ష.

**Prof. S.V. Rama Rao**
Dept. of Telugu
Osmania University
Hyderabad - 500 007.

# బాపురెడ్డి పద్యకావ్యాల్లో వైజ్ఞానికదృష్టి!

- వెనిగళ్ళ రాంబాబు

సంప్రదాయ క్షేత్రంలో మొలకెత్తినప్పటికీ ఆమూలాగ్రం నవ్యతాజలాలను శోషించుకుని, హేతువాదపు చిగుళ్లతో, తాత్వికభావనాశాఖలతో ఆధునిక యుగమంతటా ఆవరించిన సాహితీ వట వృక్షం శ్రీ బాపురెడ్డిగారి కవిత్వం!

స్వతహాగా భావకవి అయినప్పటికీ, స్వాప్నిక జగత్ సంచారంలో సైతం భౌతిక వాస్తవికతను విస్మరించని నిరంతర కవితాజాగరూకులు శ్రీ బాపురెడ్డి! ఆయన తన సాహితీ ప్రస్థానంలో "గేయాన్ని శ్రవణ పేయంగా, వచన కవితను నిసర్గలయాత్మకంగా" పలికించినప్పటికీ, ఆదిలో అలవోకగా ఆలపించిన తొలిరాగం పద్యమే! అయితే, అది ఏదో ప్రారంభపు కసరత్తులకే పరిమితం కాక, పరిణతి చెంది, పద్య రచనా ప్రక్రియలో పరాకాష్ట నందుకోవడం ప్రశంసనీయం!

సాధారణంగా కవిత్వం శాస్త్రవిజ్ఞానానికి వ్యతిరేకమని, దీని తక్షణ ప్రయోజనం ఆనందాన్ని కలిగించడమేగాని, సత్యాన్ని ప్రకటించడం కాదని "కాల్‌రిడ్జ్" అంటారు. అయినప్పటికీ, రసాలంకార సమన్వితమైన కవిత్వంలో సైతం ఔచిత్యం భంగం లేకుండా, సౌందర్య లోపం లేకుండా వైజ్ఞానిక దృష్టిని ప్రతిబింబించిన కవులు మన సాహిత్యంలో లేకపోలేదు. ఆధునిక యుగంలో ఈ నేపథ్యం కలిగిన అతి కొద్దిమంది కవుల్లో శ్రీబాపురెడ్డిగారు అగ్రగణ్యులు!

ప్రాచీన వాఙ్మయ ప్రియత్వంతో పాటు నిశిత పాశ్చాత్య సాహిత్యాధ్యయనం, పలు ప్రపంచ దేశాల పర్యటనల వల్ల బాపురెడ్డిగారి కవితాదృష్టి మరింత విస్తృతి చెంది వైజ్ఞానిక వెలుగులు సంతరించుకున్నదని భావించవచ్చు. వీరి పద్య రచనా వైభవానికి దర్పణం పట్టే అద్వితీయ రచన "బాపురెడ్డి పద్య కావ్యాలు." ఇందులో - చిన్నారి పొన్నారి చిరుత కూకటి నాడు పలికినవి, నూనూగు మీసాల నూత్నయౌవనంలో రాసినవి, ప్రౌఢవయః పరిపాకంలో ప్రవచించినవి.. ఇలా మొత్తం మూడు దశాబ్దాల కాలవ్యవధిలో విరబూసిన పద్య పుష్పాలు ఈ కావ్యహారంలో గుబాళిస్తున్నాయి.

తమ కవిత్వానికి ఒక గతినీ, శ్రుతినీ నిర్దేశించు కోవడం యుగకర్తల లక్షణం. "విశ్వ శ్రేయమ్ కావ్యమ్' 'అని ప్రాచీనులంటే, విశ్వమే తన కావ్యమని బాపురెడ్డి గారు ప్రకటిస్తున్నారు. యుగ కర్తల లక్షణాన్ని పాటిస్తూ, ఈ కావ్యంలోని తొలి ఖండిక "కవితా ప్రస్థానం" లో ఇలా అంటారు:

*ఆదిత్యాంశువులే గుణమ్ములు; సమస్తామ్నాయముల్, శాస్త్రముల్*
*పాదమ్ముల్; గ్రహముల్, ఉపగ్రహములే ప్రాసల్, యతుల్ మానవ*
*ద్యోదౌత్యాశయ దివ్య దిగ్విజయ సందోహమ్ములే భావముల్;*
*నాదబ్రహ్మయే శైలియై వెలుగు నానక్షత్ర, కావ్యాలకున్!*

తన పద్యాల్లో సూర్యకిరణాలే గణాలని, సర్వశాస్త్రాలే పాదాలని, గ్రహాలే ప్రాసలని, ఉపగ్రహాలే యతులని, నరుని దిగ్విజయ పరంపరలే భావాలని, నక్షత్రాలే తన కావ్యాలని తీర్మానిస్తున్నారు. అంతరిక్ష ప్రస్థానమే తన ఆశయమని తెలియజేస్తున్నారు.

అంతేగాక -

*గాలిని తేలుటే ఘనతగా తలపోసిన రోజులేగె; భూ*
*గోళ ప్రదక్షిణమ్ము ఒక గోవు ప్రదక్షిణ లీల చేయగా*
*జాలెడి కాలమున్ గడిచె; జాబిలి భూతలి మధ్య రాయబా*
*రాలు ఫలించె నేడు; కవిరాజయి దోదసి నేలుకొందునే!*

అంటున్నారు.

రాజు పరిధి కొంత భూభాగం మాత్రమే! కాని శ్రీబాపురెడ్డిగారు తమకాలంలో జరిగిన వైజ్ఞానిక పరిశోధనల వల్ల విస్తరించిన విశ్వపరిమాణాన్ని గుర్తించి కవిరాజుగా భూభాగాన్ని గాక, ఏకంగా రోదసినే ఏలుకుంటానంటున్నారు. యోగ మార్గంలో, ప్రయోగ మార్గంలో బాహ్య అంతశ్చక్షువులతో సత్యకాంతిని వీక్షిస్తానంటున్నారు.

పద్యమంతటా విస్తరించేవి గణాలు. విశ్వమంతటా విస్తరించేవి సూర్యకిరణాలు. పద్యం ప్రధాన లక్షణం పునరావృతి. ఇది ప్రాస, యతి అంశాలచే నిర్వహించబడుతుంది. విశ్వంలో పునరావృతంగా పరిభ్రమించేవి గ్రహాలు, ఉపగ్రహాలు. ఈ విధమైన వైజ్ఞానికాలంకారాలతో శిష్టమైన, సుస్పష్టమైన శాస్త్ర దృష్టికి తమ కవితాహృదయకవాటాలు తెరిచారు శ్రీ బాపురెడ్డి!

వైజ్ఞానిక ఆవిష్కరణలు రెండు రకాలు: 1) యాదృచ్ఛికాలు 2) ఊహా ప్రతిపాదితాలు. ఒకనాటి బీజప్రాయమైన ఊహ పిదప భావనగా వికసించి, శాస్త్రపరిశోధనలచే నిగ్గుదేల్చబడి, తుదకు "వాస్తవం"గా ఆవిష్కరించబడుతుంది. అంటే- ఈనాటి వాస్తవానికి మూలం ఒకనాటి ఊహ లేదా స్వప్నం అనటం తర్కవిరుద్ధం కాదు. కనుకనే -

*గతము కన్నట్టి స్వప్నమ్మె కాద*

వర్తమానము.... అని ప్రశ్నించే బాపురెడ్డి గారు రాతియుగం నుండి అణుయుగం వరకు సాగిన విజ్ఞానవికాసానికి మూలం కూడా స్వప్నాలేనని భావిస్తూ, "స్వప్నజగత్తు"అనే ఖండికలో ఇలా అంటున్నారు-

*శాస్త్ర విజ్ఞాని మస్తిష్క స్వప్రయోగ*
*శాలలో తేలిపోవు స్వప్నాలె, రాతి*
*యుగమును నడిపించెను అణుయుగము*
*వరకు*
*కల్ల యనుకున్న దెల్ల సాక్షాత్కరించె!*

వసంతానికి పులకరించడం, శుకపికాదులను పలకరించడం - కవికి సహజలక్షణాలు. అందునా - దిగిరాము దిగిరాము దివినుండి భువికి అని భీష్మించుకునే భావ కవుల సంగతి వేరే చెప్పేదేముంది? పిల్ల తిమ్మెరల వంటి కల్పనా తరంగాల్లో నిరంతరం కవితా పతంగాలను ఎగరవేస్తుంటారు. కాని, బాపురెడ్డి గారి వంటి భావభౌతిక వాదులు ఆ కవితా పతంగానికి వైజ్ఞానిక దృష్టి అనే దారంతో వాస్తవికతాభూమికి అనుసంధానించడం విస్మరించరు. అందుకే "వసంతోదయం" కవితలో ఇలా అంటారు:

*గడ్డ గట్టిన హిమశిలల్ కరిగి ఝరిగ*
*పారె వాసంతకోష్ణ నిశ్వాస లందు*
*విప్లవోషస్వినీ క్రాంతి వీక్షణాల*
*కరిగి పారెడు దాస్యాంధకార మట్లు!*

మంచు బండలు వేడిగాలికి కరుగుతాయి. ఇక్కడ వసంతుడి వేడి నిశ్వాసలకు కరిగి ప్రవహిస్తున్నా యట. నిశ్వాస శరీరంలోని ఉష్ణాన్ని గ్రహించి వేడిగా ఉంటుంది. వసంత ఋతువులో ఎండలెక్కువగా ఉండటం వల్ల గాలి వేడిగానే ఉంటుంది. అంతేగాక దీనికి చెప్పిన పోలిక - విప్లవం అనే ఉషస్సు ప్రసరించినప్పుడు తొలిగిపోయే దాస్యమనే అంధకారం. ఎంత చక్కటి దృష్టాంతం! ఉపమాన, ఉపమేయాలన్నీ

వైజ్ఞానిక విస్ఫులింగాలై ప్రకాశించడమే గాక ఉపమాలంకారంలో రూపకాన్ని ఇముడ్చుకొని అలంకారవరంగా కూడా ఎంతో విశిష్టత సంతరించుకుందీ పద్యం!

మెరుపులు, ఉరుములు, పిడుగుల గురించి కాకమ్మ కథలెన్నో ప్రచారంలో ఉన్నాయి. విజ్ఞాన శాస్త్ర సత్యాలు మరోలా ఉన్నాయి. కాని బాపురెడ్డి గారు మాత్రం భౌతిక సత్యాన్ని సైతం భావ సౌందర్య చక్షువులద్వారా మాత్రమే సందర్శిస్తున్నారు "మెరుపులు" కవితలో.

*పారిపోయెడి కారుమేఘాల చూచి*
*కాల రాత్రించ రోగ్ర కంఠాలు ఏడ్చె!*
*రాలి పడుచున్న కాంతిపుష్పాలు చూచి*
*మేలుకొనుచున్న సుప్తలోకాలు ఏడ్చె!!*

పిడుగులను రాలిపడే కాంతిపుష్పాలుగా దర్శించగలగటం చూస్తుంటే వివేచనాశీలురైన కవుల కవిత్వం శాస్త్రవిజ్ఞానానికి వ్యతిరేకం కాదనిపిస్తుంది.

సౌందర్య తృష్ణను, శాస్త్ర విజ్ఞానాన్ని సమ్యక్‌దృష్టితో వీక్షించి రూపొందించిన మరో పద్య మౌక్తికం "సరస సాగరుడు.".

పున్నమినాడు చంద్రునికి, భూమికి మధ్య గురుత్వాకర్షణ శక్తుల ఫలితంగా తరంగాలు ఉవ్వెత్తున ఎగసి పడటం శాస్త్ర సత్యం. దీనికి సౌందర్యాన్నిలా జోడించారు బాపురెడ్డిగారు:

*వెన్నెల కన్నె కన్పించిన చాలు*
*మైమరచి నీ యెద పొంగి పొరలు.-*

సముద్రం ఎటు పొర్లినా శరీరం కందకుండా ఉండటానికిగాను అన్నివైపులా ఇసుక పరుపు చుట్టలు పరచుకుందట.

ఒకదానితో ఒకటి సంబంధం లేకుండా అనేక నదులు అనేక ప్రాంతాలనుండి వచ్చి సాగరంలో లీనమవడంలో రసికత్వాన్ని తిలకిస్తున్నారు బాపురెడ్డిగారు.

*ఎంత రసికుడవో నదీ కాంత లంత*
*దూర దూరాల నుండి నిన్ చేర వత్తు*
*రొక్కరికి తెలియకుండ మరొకరు! సుంద*
*రతకు ఆనందములకు శరధివి నీవు!*

అంతటితో ఆగలేదు - సాగరుడి అనంతత్వంలో ఆయన విశ్వసత్యాల్నీ, ఆధ్యాత్మికతనూ దర్శిస్తున్నారు.

*నీ యుచ్ఛ్వాసములే పయోధరములై నింగిన్, ధరావర్షమై*
*ఆయాదేశ నదీనదమ్ములయి నీ యందేవిధిన్ లీనమౌ*
*నో యారీతి సమస్త జీవులును ఏదో జీవనానంద సం*
*శ్రేయోవిర్భవ మొంది అందె తుదకున్ లీనంబవున్, సాగరా!*

సాగరుడి ఉచ్ఛ్వాస నిశ్వాసలే ఆకాశంలో మేఘాలై, నేలపై వర్షమై, వివిధ దేశాల్లో వివిధ నదీ నదాలై చివరకు మళ్లీ ఆ సాగరంలో లీనమవుతాయి. ఇంతవరకూ కాదనలేని సత్యం. అయితే, సమస్తజీవులూ ఇదే విధంగా ఏదో పరమార్థం కోసం చైతన్యం నుండి ఆవిర్భవించి తుదకు అందులోనే లీనమవుతాయంటూ అగమ్య గోచరమైన వేదాంత భావనను సైతం శ్రీ బాపురెడ్డిగారు సులభగ్రాహ్యంగా, వైజ్ఞానిక చట్రంలో ఇమిడ్చారు. ఇంకా సముద్రాన్ని "అనంతకాల జీవామృత సాగరా" అంటున్నారు. ఆదిలో తొలిజీవులు సముద్రంలోనే ఆవిర్భవించాయనే సిద్ధాంతానికి ఇది సమ్మతి ప్రకటించడమే!

ఈ విధంగా సముద్రాన్ని కాల్పనిక పురాణకథలతో కలగాపులగం చేయకుండా "ధరణీ పరిణామ కథావిశేషముల్"లో భాగంగానే సాక్షాత్కరింప జేశారు బాపురెడ్డిగారు.

అల నన్నయకు, తిక్కనకు, ఆమాటకు వస్తే అసలు ప్రాచీన కవులెవ్వరికీ లేని భోగం ఒకటి ఆధునిక కవులకు దక్కింది. అదేచంద్రలోక సందర్శనం. అనాది నుండీ మహాకవుల భావనాజగత్తుకు ప్రేరణగా నిలిచిన చంద్రుడిపై మానవుడు స్వయంగా కాలు మోపడం-నేటి తరాలవారికి కాలం ప్రసాదించిన వరం.

ఘనాఘన పూర్వ విజ్ఞాన కవచధారి
భావనాతీత పృథు రోదసీ విహారి
రాగమసృణ విశ్వంభర రాయబారి
అడుగు పెట్టెను చంద్రలోకాంగణాన-

అంటూ విశ్వంభర రాయబారిగా చంద్రుడిపై కాలిడిన మానవుడికి జయజయధ్వానాలు చేస్తున్నారు బాపురెడ్డిగారు.

ఈ అపూర్వ సంఘటన పర్యవసానంగా కవులు ఇంతకాలంగా చేస్తున్న ఊహాగానాలకు స్వస్తి చెప్పి వాస్తవిక జ్ఞానాన్ని హృదయంలో ఇముడ్చుకోవలసిన అవసరం ఉంది. ఈ చారిత్రక సత్యాన్ని గుర్తించి బాపురెడ్డిగారు ఇక పురాణ కథలకు కాలం చెల్లి భవిష్యత్ క్షేత్రంలో వాస్తవికతా బీజాలు నిద్రలేచా యంటున్నారు "చంద్రవిజయం"ఖండికలో.

*ఇతిహాసస్థ పురాణవేద గతమౌనీంద్ర శ్రుతిక్షిప్త యో*
*గ తపోంతర్గత సృష్టి జీవన రాహోగాథల్ ఎవో భావనా*
*లతలో స్వప్నములో విముగ్ధ మధురాలాపమ్ములోగాక, భా*
*వితమః క్షేత్ర సుషుప్త వాస్తవికతా బీజమ్ములై లేచెడిన్!*

దీనితో పాటుగా -

చెరగతి ఆత్మజ్ఞానము
తరగని మేధాజనిత పదార్థజ్ఞానం

కలగలిసి ప్రకృతి పరిణామ క్రమం వివరించా యంటున్నారు.

మానవుడు ఎన్ని ప్రకృతి రహస్యాలు శోధించినప్పటికీ, ఎన్ని వైజ్ఞానిక ఆవిష్కరణలు సాధించినప్పటికీ - అవన్నీ పర్వతంలో పరమాణువు వంతేనని గుర్తించడంలోనే అతని గొప్పతనం వ్యక్తమవుతుంది. భౌతిక శాస్త్ర పితామహునిగా పరిగణించబడే న్యూటన్ మహాశయుడు లాంటివాడే - "అనంతమైన విజ్ఞాన సాగర తీరంలో తాను గులకరాళ్లేరుకునే పసివాణ్ణే"నని వినయంగా ప్రకటించారు. అది విజ్ఞాన శాస్త్ర అల్పజ్ఞతను చాటడం కాదు - హృదయ సంస్కారం అంతే!

వ్యక్తి ఎంతటి ప్రతిభాసంపన్నుడైనా, ఎంతటి శేముషీవిలసితుడైనా, స్వాతిశయ ప్రదర్శనకు పూనుకోక వినయంతో, వివేకంతో విషయ నివేదన చేయడమే హృదయసంస్కారం. అటువంటి వినయానికి విస్ఫోటన శక్తి ఉంటుంది.

తన వెలుపలి వెలుగును, లోని చీకటిని గుర్తించ గలిగే పరిణతి పొందిన విశ్వనరునికి ప్రతినిధిగా బాపురెడ్డిగారి "వెలుగు - చీకటి" కవితలోని నివేదనలోనూ అదే వినయం కనిపిస్తుంది.

వేద వేదాంత సారము విప్పినట్లె
విప్పి, విప్పిన నా కనుల్ కప్పుచుండు
తెలిసినట్టులె తెలిసి నా తెలివి తెల్ల
వారు చుండును తామస ధారలొచు

✡ ✡ ✡ ✡

కేవలం మనిషి విజ్ఞానాభివృద్ధిని కీర్తించడమే గాక, ఆ విజ్ఞాన దుర్వినియోగ ఫలితాలను సైతం విమర్శించి సాహితీ సమదర్శిగా నిష్పక్షపాతంగా చూపించారు బాపురెడ్డిగారు. మానవ మేధోవికాసాన్ని ప్రశంసిస్తూనే, అతని హృదయ మాలిన్యతకు, నైతిక విలువల పతనానికి ఆవేదన చెందుతున్నారు "కృతఘ్నత" ఖండికలో!

*ద్రోహాన అణుశక్తి దుర్వినియోగాన*
*కాల్చిన ధరణి వక్షమ్ము జూచి*
*కన్నీరు మున్నీరవుతున్నారు.*
*అతి సూక్ష్మపరమాణువైన, అంతము లేని*
*బ్రహ్మాండమైన, చొరబడువాడు*
*కులమత జాతీయతల రాజకీయాల*
*ద్వేష భిత్తికల ఛేదించ లేడ?*

అని ప్రశ్నిస్తున్నారు.

అయినప్పటికీ కవి క్రాంతదర్శి, విశ్వ శ్రేయోభిలాషి. కనుకనే -

*వానరుడు, దానవుడు కాడు మానవుండు*
*అనెడు కీర్తి గడియించు కొనును గాక!*
*నీకు ఆనంద నిధులను నించుగాక*
*ఓ ప్రకృతిమాతా! నీకు జయోస్తు ఎపుడు!*

అని మనసారా ఆకాంక్షిస్తున్నారు!

శాస్త్ర వేత్త కేవలం సత్యాన్ని దర్శించే ద్రష్టమాత్రమే. కాని, కవి సృజనాత్మకత కలిగిన విశ్వజనీనము, రసానంద దాయకమైన కవిత్వంలో సైతం, సందర్భానుగుణంగా వైజ్ఞానిక విషయాలను చెప్పవచ్చని భరతుడు, భామహుడు వంటి ప్రాచీన లాక్షణికులు ఆమోదించారు.

సత్యాన్ని సత్యంగా చెప్పడం శాస్త్రమవుతుందేగాని కవిత్వం కాదు; వాస్తవానికి సౌందర్యాన్ని జోడించేదే కవిత్వం అంటాడు షెల్లీ. బాపురెడ్డి గారి దృక్పథం ఇదే!

భౌతిక వాస్తవికత హృదయ స్పందనను దూరం చేస్తుందని, కవిత్వం భావ ప్రధానంగానే ఉండాలని, సత్యాసత్యాలతో నిమిత్తం లేదని సౌందర్య వాదులంటారు. అయితే ఇది ఒక పార్శ్వం మాత్రమే! సత్యం మేథకు చెందినది కాగా, సౌందర్యం హృదయానికి సంబంధించినది. దేని ప్రయోజనం దానిదే! ఒకదాని కొరకు మరోదానిని అణచివేయవలసిన అవసరం కనిపించదు.

ఇటువంటి మానవ నైజాన్ని ఉద్దేశించే బాపురెడ్డిగారు-

'వాస్తవము కన్న బ్రతుకున భ్రాంతి మిన్న' అంటారు.

ఈ భ్రాంతి అంధవిశ్వాసాలకు ఆలంబనం కాక రసానందదాయకమైనంతవరకు సర్వులకు ఆమోదయోగ్యమే!

సత్య నిబద్ధత సౌందర్యాస్వాదనకు ప్రతిబంధకం కాదు. ఎంతటి శాస్త్ర విజ్ఞాని అయినప్పటికీ సౌందర్య దృష్టి, స్పందన లేకుండా కవిని ఊహించలేం. కనుకనే -

'శాశ్వతము కళాతృష్ణ ఆ జాబిలి వలె' అంటున్న బాపురెడ్డిగారు ఇలా ప్రశ్నిస్తున్నారు:

*రాలును రప్పలున్ పనికి రానివి కొండలు గోతులున్,*
*వినా*
*గాలియు నీరు లేని ఎడా గందరగోళము చంద్రగోళ*
*మం*
*దాలకు ప్రోవు గాదనుచు అద్భుత చిత్రము లెన్ని*
*చూపినన్*
*రేలనభోంతరాల శశిరేఖల చూచి చలింపకుందుమా?*

గతంలో చంద్రుణ్ణి గూర్చి ఏవో ఊహించుకున్నాం. కనిపించే దృశ్యానికి ఊహను జోడించి ఆనందించాం. కాని నేటి పరిస్థితి వేరు. చంద్రుడిలో రాళ్లు, రప్పలు, కొండలు, గోతులు తప్ప కనీసం గాలీ నీరూ కూడ లేవని స్పష్టం చేయడంలో బాపురెడ్డి గారి వైజ్ఞానిక దృష్టి గోచరిస్తుంది. అంతమాత్రాన, ఆకాశవీధుల్లో అందాల చందమామ చిందించే సౌందర్య లీలా విలాసాలను

ఆస్వాదించకుండా, ఆస్వాదించి చలించకుండా ఉండగలమా? అని ప్రశ్నించడంలో శాస్త్రానికి అతీతమైన కావ్యదృష్టి బహిర్గతమవుతుంది.

సత్యం వేరని, సౌందర్యం వేరని, వీటిలో దేనికి ప్రాధాన్యత నివ్వాలనే వాదవివాదాలు సాహితీజగత్తులో అప్రస్తుతం. ఇవి రెండూ ఒకే నాణం విభిన్న పార్శ్వాలుగా భావించవచ్చు. బాపురెడ్డి గారు మరింత వివేచనతో ఈ రెండూ భావనానందమనే ఒకే నదికి చెందిన రెండు తీరాలుగా అభివర్ణిస్తూ, ఈ చర్చకు సర్వదా ఆమోదయోగ్యమైన ముగింపునిచ్చారు. కనుకనే విశ్వనాథ వంటి కవిసమ్రాట్టుల ప్రశంసల నందుకుంది కళాతృష్ణ ఖండికలోని ఈ పద్యం -

*అందము అందమే మనకు*
*అందిన అందక పోయినన్; మన*
*స్పందన వేరు తార్కిక వివాదము*
*వే; రవి రెండు భావనా*
*నంద నదీ తటద్వయము*
*నా విలసిల్లును ఇంద్రియాను భూ*
*తీందిర వేదవోదు పడగెత్తిన*
*ధీ బలశాస్త్రమెంతయున్!*

రాజశేఖరుడు తన "కావ్య మీమాంస"లో కవులు మూడు రకాలుగా వర్గీకరించాడు: 1) శాస్త్రకవి 2) కావ్య కవి 3) ఉభయకవి.

సత్యప్రబోధకాలైన శాస్త్రాంశాలను మాత్రమే వివరించే కవిని "శాస్త్ర కవి"గాను, బీజప్రాయమైన వస్తువును తన నిరుపమానమైన శిల్ప విన్యాసాలతో, ఆలంకారిక వర్ణనలతో సౌందర్యమయం చేసి కావ్య కల్పవృక్షాన్ని సృష్టించే కవి "కావ్యకవి"గాను, ఈ రెండు ప్రక్రియలను సమస్కంధంగా నిర్వహించగలిగిన కవిని "ఉభయకవి" గాను పరిగణిస్తారు.

కనుక -

వైజ్ఞానిక శాస్త్రాంశాలను, సౌందర్య కళాతృష్ణను మేళవించి, అపురూపంగా నిర్వహించబడిన అపూర్వ పద్య కావ్యాల ద్వారా ఆధునికాంధ్ర సాహిత్య చరిత్రలో మరో "ఉభయకవిమిత్రు"నిగా శ్రీ బాపురెడ్డిగారి స్థానం సుస్థిరం.

# బాపురెడ్డి కవితావైభవం

- కర్రా కార్తికేయ శర్మ

"ప్రజల్లో వేల రకాలు ఉన్నారు
కూలీనాలీ చేసుకునే వాళ్ళు
పరిశ్రమల్లో చెమటోడ్చే కార్మికులు
వ్యాపారస్తులు, ఉద్యోగస్తులు
అందులో ఎన్నెన్నో అంతస్తులు -
వస్తులుండేవా ళ్ళుంటారు
మస్తుగా తినే వాళ్లుంటారు
ఎంత కలిగినా తృప్తి లేక
ఏడ్చే వాళ్ళు కొందరు
ఉన్నా లేకున్నా హాయిగా
ఉండే ఆశాజీవులు కొందరు,
అందరి జీవితాల్లోనూ
ఏదో ఒక
అందమూ ఆనందమూ ఉంది;
సాధక బాధకాలు కూడా
సమానంగానే ఉంటాయి అందరికీ;
అసమానత మాసిపోతేనే
అందరికీ నిజమైన ఆనందం"

(గద్యకావ్యాలు : విశాఖలేఖ)

మనపూర్వ కవులు నిర్దేశించిన అష్టాదశ వర్ణనలలో నగర వర్ణన ఒకటి. కాలాన్ని అనుసరించి కవితా దృక్పథంలో మార్పు వచ్చినా, రీతులు మారినా, తీరుతెన్నులు మారినా, నగర వర్ణన మాత్రం ఆధునిక కవితారంగంలో పెద్ద పీట మీదే కూర్చుంది. శ్రీనారాయణ బాబు, ఉత్పల, కుందుర్తి వంటి ప్రయాణ కవులు నగర జీవితాన్ని, నగరాన్ని ఆలంబనగా చేసికొని రచనలు చెయ్యడం జరిగింది. ఆధునిక మానవుని మనఃప్రవృత్తిని బేరీజును వేయడానికి, ఆధునిక విలువలను మదింపు చేయడానికి కవి చేసే ప్రయత్నాలకు ఈ నగరాల చిత్రణ ఓ ప్రముఖ సాధనమని నా అభిప్రాయం.

శ్రీబాపురెడ్డి గద్య కావ్యాలలో నాయకమణి వంటి ఖండిక విశాఖ లేఖ. శ్రీరెడ్డిగారు ఉద్యోగరీత్యా విశాఖజిల్లాలో జీవించడం వల్ల - విశాఖ పట్టణం గుండెలోతుల్ని పరిశీలించడం జరిగింది. ఆ పరిశోధనా ఫలితం - ఈ కవితాప్రసవం!

సింహాచలం కొండల ప్రక్కల చల్లని వాయువులు సేవిస్తూ, సాగర సంగీతాన్ని వింటూ నిత్యనూతనంగా మెరిసే పట్టణం విశాఖ!

సాయంకాలం బీచిలో విహరిస్తుంటే కమ్మని కావ్యం వింటున్న అనుభూతి కలగుతుంది. అయితే పొంగినట్లే పొంగి, మరు నిముషంలో విరిగి పోయే సముద్ర కెరటాన్ని చూస్తుంటే బుడగలవంటి మానవ జీవితాలు కళ్ళకు అగుపిస్తాయి. ఆ సముద్ర ఘోష వింటుంటే 'అంతటి సముద్రునికే వేదన తప్పట్లేదే. మన మెంత?' అనిపిస్తుంది.

ఇంకా అక్కడి పబ్లిక్ పార్కు, యారాడ కొండమీద లైట్‌హౌస్, ఓడరేవు, షిప్‌యార్డు, కాల్‌టెక్సు, నేవల్ యూనిట్, ఆంధ్ర విశ్వవిద్యాలయం, కింగ్ జార్జి హాస్పటల్, ఇవన్నీ విశాఖ యాత్రికులకు దర్శనీయ స్థలాలు!

అయితే బాపురెడ్డి అక్కడి సౌందర్యాన్ని, సాధన సామగ్రిని వర్ణించి చేతులు దులపుకోలేదు. అలా చేసుంటే ఈ విశాఖలేఖ ఓ పాఠంగానే మిగిలిపోయుండేది. కాని యిది గొప్పకవితగా

రూపుకట్టడానికి అక్కడ బ్రతికే బ్రతుకు లోతుల్ని 'ఎక్సురే' తీశారు.

విశాఖ గుండెల్లో బ్రతికే ప్రజల్లో ఎన్నో తరగతులున్నాయి. కూలివాళ్ళు, కార్మికులు, వ్యాపారులు, ఉద్యోగులు. ఆయా పరిధిల్లో ఎన్నో అంతస్తులు! పస్తులుండే వర్గం ఒకటి. మత్తుగా తినేవర్గం ఒకటి. ఎంత ఉన్నా తృప్తి లేని వర్గం ఒకటి. ఉన్నా లేకపోయినా హాయిగా బ్రతికే వర్గం మరొకటి! ఈ పరస్పర వ్యతిరేకతలకు సమన్వయం కుదరాలని కవిగా బాపురెడ్డి ఆకాంక్ష! ఓ విధంగా 'విశాఖలేఖ' లో సామ్యవాద సిద్ధాంత స్థాపన చేశారు శ్రీ రెడ్డి.

2

"ఆశలన్నీ తీరినప్పుడు
ఏదీ చూడ కోరిక లేనప్పుడు
అన్నీ కన్పిస్తాయి.
అన్నీ విన్పిస్తాయి.
అయితే
ఆ కన్పించింది
ఇతరులకు చూపించలేం
అంటే
అలా కనిపించింది వినిపించింది
అక్షరాలా నిరూపించలేం -
ఆత్మకు, పరమాత్మకు
అందుకే సాక్ష్యం లేదు
సాక్ష్యం లేని సత్యాన్ని
సాధిస్తేనే గాని
మోక్షం లేదు
"ఏమిటీ! ఏమిటీ వేదాంతం?"
ఇంతలో ముగిసింది నా ఏకాంతం"
(గద్యకావ్యాలు : ఏకాంతంలో వేదాంతం)

ఆధునిక కవులలో అరుదుగా కనిపించే వేదాంతతత్వం బాపురెడ్డి కవి జీవితానికి ఆభరణం! ఎన్నో ఆధునిక సమస్యలను తీసుకొని పచ్చినవీన కవిత్వం రాసిన శ్రీరెడ్డి ఒక్కోచోట వేదాంత తత్వ నిర్వచనం చేస్తూ గంభీరంగా మారిపోతారు. గిటారుపై వీణావాద్యం వినిపిస్తున్నట్లుంటుంది ఆధోరణి!

లోతుగా ఆలోచిస్తే ప్రతిమానవుడూ ఓ అన్వేషి! అతడు తన అన్వేషణలో ఎన్నో విజయాలు సాధించినా, సాధించవలసినవీ ఎన్నో ఉన్నాయి. మనల్ని నడిపే అతీత శక్తి యొక్క ఉనికి మానవునకు ఏనాటి నుండో గళ్ళు పూరించడానికి సాధ్యంకాని ఓ 'పజిలు' లా మారటం గమనార్హం.

జీవునిలో ఉండేది ఆత్మ. దేవుడులో ఉండేది పరమాత్మ. ఈ ఆత్మ పరమాత్మలో కలియడానికి చేసే ప్రయత్నమే తపస్సు. స్వయంగా పుట్టని జీవునకు చావు ఉంది. స్వయంభువునకు చావు లేదు. ఇలా సాగే వేదాంతం ఎందరికీ అంతుబట్టదు.

ఆశలన్నీ తీరిపోగా, తృప్తి మనస్సునిండా ఆవరించగా అన్నీ కనిపిస్తాయి. అన్నీ వినిపిస్తాయి. అది సహజం. కాని, మన మనస్సులో ఉదయించిన ఆ అనుభవాన్ని ఇతరులకు చూపించమంటే చూపించలేం. వినిపించమంటే వినిపించలేం. అందుకే ఆత్మకు, పరమాత్మకు సాక్ష్యం లేకుండా పోయింది.

తరతరాలుగా మానవజాతి మోక్షసాధనకై చేసే తీవ్ర ప్రయత్నం ఈ కవితలో ఆవిష్కరించడం జరిగింది. ఇటీవలి కాలంలో 'అనంత సత్యాల' ను ప్రవచించే శ్రీబాపురెడ్డి సత్యదర్శనంలో రూపుదిద్దుకున్న మొదటి కవిత ఈ 'ఏకాంతంలో వేదాంతం'.

3

"నిఘంటు పర్వతాలపై కెక్కి
మా పూల గుండెల లోయల్లోకి

*గెరిల్లాలాగ శబ్దశిలలను*
*గిరగిరా దొర్లించకు కపిరాజకవీ!*

నీవు ఇంద్రుడవో చంద్రుడవో మా కక్కరలేదు
నీ ఇంద్రజాల మహేంద్రజాలాలూ
మా కక్కరలేదు.
నిఘంటువుల్ని కావ్యా లనుకొని
నీవు కవివి అనుకోకు
కరంటును కాంతి అనుకొని
నీవు రవివి అనుకోకు.

నవరసాల నందన బృందావనాలకు
మా నవనవోన్మేష శుకపికాలను
చేరుస్తావని వస్తే, చేరుస్తున్నావా
క్షయరోగశాలలకు, శల్యవైద్యశాలలకు!

సమాజరజ్జువులతో
చొప్పదంటు కవిత్వం మోపులు గట్టి
సహృదయతాసహనాల వీపులమీద
మోపు మీద మోపు పెట్టబోకు,
చాటుగా సంప్రదాయబద్ధంగా కాక
ఘాటుగా బల్లెపు పోటులా
సత్యం చెప్పినందుకు తిట్టబోకు"
(గద్యకావ్యాలు : రసజ్ఞుని విజ్ఞప్తి)

తెలుగు కవిత్వ రంగంలో కనిపించే, వినిపించే విపరీత ధోరణులకు ఈకవిత ఓచురక! మాటల్ని కోటలు దాటించే ధోరణి ఒకటి. మాటల్ని కోటలా దృఢంగా ప్రయోగించి, ఎవరికీ అర్థంకాని పద్ధతిలో విజృంభించే ధోరణి మరొకటి. ఈ రెండు రకాల ధోరణులు సరస కవిత్వ పాకానికి అడ్డుతగిలే పుడకల వంటివి.

సామ్యవాది, సౌమ్యవేది అయిన శ్రీబాపురెడ్డి రసజ్ఞుడుగా విజ్ఞప్తి చేస్తూ - ఈ ధోరణుల వ్యాప్తికి కృషి చేసేవారికి కొంచెం ఎక్కువ మోతాదులోనో 'షాక్ట్రిట్మెంటు' యిస్తున్నారు.

గాడిదమీద మూటలు మోయించినట్లుగా, కవితపై మాటలు మోయించకు. సుకుమారి అయిన కవితాసుందరి చేత బస్కీలు తీయించి కుస్తీలు పట్టించకు. మార్దవంగా ఉందని భావించి గార్దభ గళాన్ని సవరించడం అమాయిక ప్రాణాలను తీయడమే! భావం అనే కళ్ళెం త్రెంచుకొని మాటల కవిత్వ మనే గుర్రం పరుగెత్తుతే అది మసలినంతమేరా బీడు మిగులుతుంది తప్ప సస్యశ్యామలతకు ఆస్కారం లేదు.

నిఘంటు పర్వతాలపైకి ఎక్కి గండ శిలల మీటి మాటల్ని రసజ్ఞుల గుండెల్లోకి విసరడం ఓ సాహిత్య ఆటవికత! ఇంద్రజాలాలు, మహేంద్ర జాలాలు కాదు నేటి తరానికి కావలసింది. కరెంటు కాంతి వేరు. సూర్యకాంతి వేరు. వెలిగే బల్బు ఉదయించే సూర్యుడు అనుకోవడం ఎవరికి సాధ్యం?

కవిత సుందర బృందావన తీరాలలో విహరింప చేయాలికాని, అంటువ్యాధుల వార్డులకేసి విసిరెయ్యడం క్షమించరాని నేరం. చొప్పదంటు కవిత్వం మోపులుగా కట్టి సహృదయులైన పాఠకుల మూపులపై పెట్టి మోయించడం కవుల లక్ష్యం కాకూడదు.

పదునైన భావనతో కత్తిలా మెరిసిన ఈకవిత శ్రీరెడ్డికి అచ్చమైన కవితపట్ల ఉన్న ఆకాంక్షను వ్యక్తం చేస్తోంది.

4

"తన కుటుంబంకోసం తన ఊరును
తన ఊరుకోసం తన రాష్ట్రాన్ని
తన రాష్ట్రం కోసం తన దేశాన్ని
తన దేశంకోసం తక్కిన దేశాల్ని

దోచుకొనే వాడు
నానా వాదాలతో
నవీన నినాదాలతో
స్వార్థాన్ని సత్యంగా
సమరాన్ని శాంతిగా
నిరూపించ యత్నించే మానవుని
ఆశయాలమీద నమ్మకం
అందరికీ సడలిపోతున్నది
తనలోకం ఘనత కోసం
తక్కిన లోకాల శాంతిని
భగ్నం చేస్తాడేమో అను సందేహం
భావుకులకు కలుగుతున్నది-''

(గద్య కావ్యాలు : అంతరిక్ష పర్వం)

1969వ సంవత్సరం జూలై నెల ఇరువది ఒకటవ తేది మానవ జాతి చరిత్రకు బంగారు రేకు తొడిగిన మరపురాని తేది. ప్రాణి కోటి చరిత్రలో తొలిసారిగా మానవుడు చంద్రలోకం పైన కాలు పెట్టాడు. భూలోకపు రాయబారిగా ఈ మానవుడు చందమామను పలుకరించేందుకు అపోలో వాహనంపై చంద్రలోక యాత్ర చేసి విజయుడైనాడు.

అయితే ఈ మానవుని అద్భుత విజయాలన్నింటికీ ఏమిటి పర్యవసానం? మానవలోకాన్ని ఎక్కడకు చేరుస్తున్నట్లు ఈ అపూర్వ ప్రస్థానం? అని ప్రశ్నిస్తున్నారు శ్రీబాపురెడ్డి.

తన కుంటుంబంకోసం తన ఊరుని, తన ఊరుకోసం తన రాష్ట్రాన్ని, తన రాష్ట్రం కోసం తన దేశాన్ని, తన దేశం కోసం తక్కిన దేశాలను దోచుకోవడానికి ప్రయత్నం చేసే దానవత 'మానవత' ముసుగులో అనంత ముఖాలతో విజృంభించే ఈనాడు- ఈ మానవుడే తన లోకం శాంతికై తక్కిన లోకాల శాంతికి ముప్పు తీసుకు వస్తాడన్న అనుమానం ఎందరికో కలుగుతుంది.

జనరక్తంతో చేతులు కడుక్కొని, కాళ్ళను మాత్రం చంద్రలోకం పై పెట్టడం, అస్పృశ్యగ్రహాలను మెట్టి, అస్పృశ్యులైన అనాధలను నెట్టడం. ఈ పద్ధతి విజయంగా గుర్తించగలమా?

శాస్త్ర విజ్ఞానం శాంతిని పెంచాలి. సౌభాగ్యాన్ని పంచాలి. మానవుడు అన్వేషించి సాధించే అమృతం భూలోకవాసులందరికీ అందాలి. అప్పుడే శాస్త్ర విజ్ఞానానికి చరితార్థత!

'స్వార్థంతో మన కున్న అనుబంధాన్ని దూరం చేసుకొని, సకల గ్రహాలతోను బాంధవ్యాన్ని పెంచుకొని, సృష్టినంతటినీ ఒకే ఆనంద సూత్రంలో సంధిద్దాం! నరకమైపోతున్న నరలోకాన్ని నవీన పర్వంగా మలుద్దాం!' అని విశ్వలోక కుటుంబివలె పిలుపునిచ్చే శ్రీ బాపురెడ్డి- మానవుని గుండెలోతులపై పరిశోధన చేసి 'థీసెస్' సమర్పించిన విశ్వలోక విద్యాలయపు ఉత్తమ పరిశోధకుడు!

5

" చైతన్య మహానదివై
*భరతఖండం నిండా ఆవరించిన నీవు*
*శిలవై పోయావా!*
*దళిత జాతుల హృదయకుహరాలలో*
ఆశాదీపంగా వెలిగిన నీవు
*కలవై పోయావా!*
కాదు కాదు
సంపూర్ణ స్వాతంత్ర్యం కోసం
సర్వస్వం త్యాగం చేసిన నీవు
భారత స్వరాజ్యలక్ష్మికి
పవిత్ర రాజ్యాంగాన్ని ప్రదానం చేసిన నీవు
*శిలవు కాదు*
కలవు కాదు
మానవతావాద శిఖరాల
మంచుమలవు.

ఎలా అర్పించను జోహారులు నీకు
ఈనీ జన్మదినోత్సవం నాడు
వెలుగు చీకట్ల మధ్య పోరాటం
విజృంభిస్తున్న నేడు?"

(గద్యకావ్యాలు : అంబేద్కర్ శరణం గచ్ఛామి)

చరిత్రలో పేరు పొందిన మహనీయులపై కవితలల్లడం ఆధునిక కవితలో ఓ సంప్రదాయ మయింది. గురజాడ, కందుకూరు, టంగుటూరి, జవాహర్, గాంధి, శాస్త్రి, భగత్, తిలక్, నేతాజీ వంటి ప్రముఖులు ఆధునిక కవుల కలాలలో జీవవాహికగా ప్రవహించి, కవితా శరీరాలతో రసజ్ఞుల గుండెలలో కాపుర ముంటున్నారు. ఈ రకం కవిత్వాన్ని ఆంగ్లంలో 'ఎలిజీ' అంటారు. తెలుగులో మాత్రం ఇవి స్మృతి కవితలు.

అంబేద్కర్ దళిత జాతుల ఆశాజ్యోతి. స్వతంత్ర భారతలక్ష్మికి రాజ్యాంగాన్ని ప్రదానం చేసిన మహామేధావి. ఆయనను కవితలో స్మరిస్తూ జోహారులు అర్పిస్తున్నారు శ్రీ బాపురెడ్డి.

చైతన్య మహానదివలె భరతదేశమంతా ఆవరించిన ఆ జీవనది శిలగా మారిపోయింది. దళిత జాతుల గుండె గుహలలో సమతా దీపాలు వెలిగించిన ఆ ఆశాదీపం కలగా మిగిలిపోయింది. కాని ఆయన శిల కాదు కల కాదు. మానవతావాద శిఖరాల మంచు మల అంటూ అంబేద్కర్‌ని స్మరిస్తున్నారు శ్రీ రెడ్డి.

పాతికేళ్ళ స్వరాజ్యం ఎన్నో ఎన్నికల పండుగలు జరుపుకొన్నది. ఎన్నో పథకాలతో సంబరాలు జరుపుకుంటోంది. అయినా అంబేద్కర్ ఆశించిన జాతి స్వాతంత్ర్యం ఇంకా ఈదేశానికి రాలేదు.

అసమానత్వం, అస్పృశ్యత, వంటి పీడకలలు దండిగా ఈరాజ్యంలో రాజ్యం చేస్తున్నాయి. ఈ పీడకలల తలలమీద బాంబులు వేయగల సమర్థుడు అంబేద్కర్ ఒక్కడే! అందుకే ఆయన్ను మళ్ళీ జన్మించమని కోరుతున్నారు బాపురెడ్డి.

6

" స్వేచ్ఛ కావాలన్నావు నీవు స్త్రీకి
ఇచ్చేశాం బోలెడంత స్వేచ్ఛ ఆమెకు
ఏమి టా స్వేచ్ఛ అంటున్నావా
స్వేచ్ఛ లేదు అని చెప్పే స్వేచ్ఛ
స్వేచ్ఛ కావాలని స్వేచ్ఛగా అరిచే స్వేచ్ఛ
ఇచ్చేశాం బోలెడంత స్వేచ్ఛ.

కులనిర్మూలనం చేయాలన్నావు నీవు
మాటకు కొంచెం మార్చి
కులనిర్మాణం చేస్తున్నాం మేం
పునర్నిర్మాణం చేస్తున్నాం మేం.

బాల వితంతువులకు పెళ్ళిళ్ళు చేయమన్నావు
చేసేశాం
అయితే, పెళ్ళే వద్దని కూర్చున్న
" పెద్ద బాలలు" తయారయ్యా రిప్పుడు
సంస్కర్తా! వీళ్ళ సంగతేమిటి?

కన్యాశుల్కం వద్దన్నావు నీవు
వర శుల్కాలు వచ్చి కూర్చున్నా యిప్పుడు
వీటినేమి చేయమంటావు?

(గద్య కావ్యాలు : అందరిలో కందుకూరి)

శ్రీబాపురెడ్డి కలం నుండి వెలువడ్డ మరో స్మృతి కవిత 'కందుకూరి'. తెలుగు సాహిత్యంలో స్మృతి కవితలు విరివిగా వ్రాసిన ప్రముఖులలో బాపురెడ్డి ఒకరు. ఆయన వ్రాసిన స్మృతి కవితలలో ఆయా వ్యక్తుల సేవ, చేవ కళ్ళకు కట్టినట్లు దర్శన మీయడం ఓ ప్రత్యేకత!

ఆయుధాలతో నిమిత్తం లేకుండా కలం పోట్లతో సంఘ సంస్కరణకు నడుం గట్టిన పరమ సాహసికుడు

కందుకూరి వీరేశలింగం. స్త్రీ విద్యకు, స్త్రీ స్వేచ్ఛకు, వితంతు వివాహాలకు, అనాధ రక్షణకు వీరేశలింగం చేసిన కృషి శ్లాఘనీయం! తెలుగు సాహిత్యంలో మొదటి వచన ప్రబంధాన్ని, మొదటి నాటకానువాదాన్ని, మొదటి ప్రహసనాన్ని ఆయనే వ్రాయడం గమనార్హం!

అయితే ఆయన విధానాలను ఈ జాతి ఎంత వరకు ఆచరణలో పెడుతోంది? అని ప్రశ్నించుకొంటే సమాధానం తృప్తిగా లభించట్లేదు.

స్త్రీకి స్వేచ్ఛ కావాలన్నాడు ఆయన. ఓ ఇచ్చేశాం స్వేచ్ఛ. నిజంగానా? అదే ... స్వేచ్ఛ లేదనే స్వేచ్ఛ. స్వేచ్ఛ కావాలని స్వేచ్ఛగా అరిచే స్వేచ్ఛ? కులనిర్మూలన ఆయనంటే - కులనిర్మాణం మన మంటున్నాం. బాల వితంతువులకు పెళ్ళిళ్ళు చెయ్యమన్నాడు ఆయన. చేసేశాం. అయితే పెళ్ళికి నిరాకరించే 'పెద్దబాలలు' తయారయ్యారిప్పుడు. వీళ్ళచే ఏ 'శిక్ష' చదివించాలన్నది ప్రశ్న. కన్యాశుల్కం వద్దన్నాడు ఆయన. వర శుల్కాలు వచ్చి కూర్చున్నా యిప్పుడు.

స్త్రీ విద్య అంటూ ఆడవాళ్ళను చదివిస్తే, ఉద్యోగాలు రావట్లేదు సరికదా పెళ్ళిళ్ళు కూడా కావట్లేదు. వీళ్ళనేం చెయ్యాలి? ఒక్కో పరిష్కారం ఒక్కో సమస్యగా, ఒక్కో సంస్కరణ ఒక్కొక్క స్వార్థంగా కాటేస్తున్న ఈ తరుణంలో ఈదేశం అంతటా కందుకూరి ఆవలిస్తేనే విముక్తి! అంటూ కందుకూరిపై ప్రగాఢ విశ్వాసం ప్రకటిస్తున్నారు శ్రీరెడ్డి.

7

" పద్యానికి గద్యానికి మధ్య
ప్రాచీనులు పెట్టిన గోడలు
నేడే రేపో పూర్తిగ
నేలకు పడి పోవచ్చు.

దేశానికి దేశానికి మధ్య
ద్వేషాలను పెంచేతత్వం
దూరమయే కాల మెంతో
దూరం లేదనవచ్చు.

దేశానికి కాలానికి మధ్య
తేడా తొలగించే జ్ఞానం
త్వరలోనే వశమై పోవుట
తథ్యమనే యనవచ్చు.

పుట్టుకకూ చావుకూ మధ్య
బుడగలవలె వెలిగే బ్రతుకులు
చిరకాలం నిలిచే రీతిగ
పరిణామం రావచ్చు.

నరులకూ అమరులకూ మధ్య
నరవరు లూహించిన భేదం
క్రమముగా తొలగిపోవటము
ఖాయమనే చెప్పవచ్చు -
(గేయాలు : మధ్య - భేదము)

గడుల గడుల ఈ లోకంలో ప్రతిగడికీ కొన్ని కట్టుబాట్లు, సిద్ధాంతాలు! మరి ఆగడి 'గుడి' వంటిదైతే తప్పకుండా గౌరవించాలి! కాని... ఆ గడి మడిగట్టుకు కూర్చుని మనల్ని దూరంగా ఉండమని కఠినంగా శాసిస్తే తిరగబడాలి!

ఆధునిక నాగరికత వేయిరేకుల పద్మంలా వికసిస్తున్న నేటి రోజుల్లో - బూజు పట్టిన పాత విలువలకు 'సెండాఫ్' చెప్పి, చైతన్యంగా నవ్వే క్రొత్త విలువలకు 'వెల్‌కం' పలకాలి! అంతేగాని పాతరాతియుగానికి సలాంచేసేతత్వం అభ్యుదయ నిరోధకం!

పద్యానికి వచనానికి మధ్య ప్రాచీనులు గోడలు కట్టారు. పద్యం వ్రాసే కవి కున్న గౌరవం - వచనకవికి ఆనాడు లేదు. 'పదకవిత' అన్న పదాన్ని చాలా

వ్యంగ్యంగా ఉదాహరిస్తూ హేళన చేసిన మహానుభావులు ఎందరో ఉన్నారు.

కాని ఆ గోడలు నేడు పడిపోతున్నాయి. అట్లాగే దేశానికి దేశానికి మధ్య పెచ్చు పెరిగే ద్వేషతత్వం త్వరలోనే రూపు మాసిపోవచ్చు. దేశానికి కాలానికి మధ్య తేడా తొలగించగల జ్ఞానం మానవ ఋషికి త్వరలోనే వశమైపోవచ్చు. ఇంకా పుట్టుకకూ - చావుకు మధ్య ఉన్న రహస్యం, స్వప్నానికి సత్యానికి మధ్య వారధి నిర్మించడం ఈ విజయాలు త్వరలోనే మానవుణ్ణి ప్రేమిస్తాయి.

మానవుడు ఆశాజీవి. నిరంతర అన్వేషణా శీలి. ఆతడి అన్వేషణ పథంపై బాపురెడ్డికి గల గట్టి నమ్మకం ఈ కవితగా రూపుదిద్దుకొంది.

8

" ఉన్నాడు ఉన్నాడు బాపు
నిన్న, నేడు , రేపు ఉన్నాడు
నీలోన నాలోన
నిఖిలావనిలోన
శాంతికై క్రాంతికై
సాగుయాత్రలలోన

జాతి భేదము లేని
నీతి వర్తనలలో
మత విభేదము లేని
హిత బోధనములలో

స్వార్థాల చెరబడిన
సత్యాల విడిపించ
సమరాల తడబడిన
శాంతిని నడిపించ"

(గేయాలు : బాపు)

జాతిపిత బాపుపై, తెలుగుకవి బాపు వ్రాసిన గీత మిది.

ఈ శతాబ్దపు మానవునకు మహోన్నత పీఠం సమకూర్చిన మహానాయకుడు గాంధి. ఈ శతాబ్దపు మహోన్నత వ్యక్తి బాపూజీ! కొల్లాయి బట్టకు గౌరవాన్ని సంతరించి, నిరాడంబరతతో లోకాన్ని జయించిన మహాశక్తి ఆయన!

ఒక ఉన్మాది ఆయనను తుపాకి గుండుకు బలిచేశాడు. 'హే రాం!' అంటూ అవతారం చాలించాడు జాతిపిత. ఆయన కనుమరుగై చాలాకాలమైనా....

ఉన్నాడు ఉన్నాడు బాపు నిఖిలావనిలోన జీవించి ఉన్నాడు. శాంతికోసం క్రాంతికోసం సాగే యాత్రల ముందు నిలిచి ఉన్నాడు. జాతిభేదం విడిచిపెట్టిన నీతినడకల్లో, మత విభేదము లేక పలికే పసిడి పలుకుల్లో ఆయన చిరునవ్వులు పరిషేచన చేస్తున్నాడు.

స్వార్థపు కౌగిలికారాగారంలో జైలు శిక్ష అనుభవించే నిర్దోషి సత్యాలను విడిపించే తపనలో, యుద్ధాల నడుమ ఒంటరిగా విలపించే శాంతిని రక్షించే కరుణలో బాపు ఉన్నాడు.

" వికసించే మానవతకు ఆరనివెలుగు చూపు అమరదీపము బాపు"

ఇది అక్షర శిల్పి బాపు (రెడ్డి) కట్టిన అక్షయ పద చిత్రం!

9

"ఒకడేమో వికచపుష్ప
ముఖరేఖలు వర్ణిస్తే
వేరొక్కడు దాని గొంతు
పిసికి పరీక్షిస్తాడు.

భిన్న భిన్న తత్వాలు
ఉన్నాయి మనిషి మనిషికి!
ఒకడేమో హిమాలయాల
శిఖరారోహణ చేస్తే
ఒకడేమో భూగర్భా
నికి గోతులు తీస్తాడు.
భిన్న భిన్న ఆశయాలు
ఉన్నాయి మనిషి మనిషికి!

(గేయాలు - భిన్నత్వం)

శ్రీ బాపురెడ్డి ఒకానొక కవితలో అన్నట్లుగా "సుందరతర గందరగోళం ఈ భూగోళం." ఇందు ఎన్నో దేశాలు, భాషలు, ఎన్నో రకాల మనుష్యులు. వారిలో ఎన్నెన్నో మనస్తత్వాలు! మంచిని ప్రేమించి మనీషిని గంధంలా గుండెల కద్దుకునే సహృదయు డొకడు. మంచిని మంట గలిపి మానవుణ్ణి ద్వేషాగ్నిలో సమాధిలా మాడ్చే దుర్మార్గు డొకడు. గాంధీ ఒకాయన. గాడ్సే వేరొకాయన!

ఒకడు వికసించే పుష్పం యొక్క సౌందర్యాన్ని వర్ణిస్తే, వేరొకడు దాని పీకపిసికి పరీక్ష చేస్తాడు. ఒకడు హిమాలయ ఉన్నత శిఖరాల వైపుకు ప్రస్థానం సాగిస్తే, వేరొకడు పాతాళానికి లోతులు తీస్తాడు.

ఈవిధంగా భిన్న భిన్న తత్వాలు, ఆశయాలు, అభిరుచులు, పరిణామాలు, దృక్కోణాలు మానవునకు ఉన్నాయి.

ఆ భిన్నత్వంలో ఏకత్వ సాధనకే అనంత సత్యాల బాపురెడ్డి అన్వేషణ!

10

" ఎదలోన భావాలు
కదలాడుతాయి
కాగితము రమ్మంటె
కనులు మూస్తాయి.
నే నిదురపోగానె
నిదుర లేస్తాయి
లేచినే కలమూన
లేచి పోతాయి

ఎదురేగి పిలువగా
బెదిరి పోతాయి
తీరనప్పుడు వచ్చి
కూరుచుంటాయి"

(గేయాలు : భావాలు)

ఆధునిక కవికి, పెద్దనగారు చెప్పిన "నిరుపహతి స్థలంబు" ఇత్యాదులు అవసరం లేదుకాని - కొంతలో కొంత ఏకాంతం, ఏకాగ్రత, వాతావరణ ప్రశాంతత అవసరమే మరి! రైల్వేస్టేషన్లలో, బస్సు స్టేషన్లలో, సంతలో, జాతరలో కవిత రమ్మంటే రాదు. కవిత కులస్త్రీ వంటిది!

మనస్సు మూకుట్లో దోరగా వేగిన భావం కమ్మగా, చైతన్యంగా కాగితం మీదకు 'కవిత'గా అవతారం దాల్చాలంటే అదో ప్రసవ మంతటి తంతు! కవితా రచనలో తలపండిన కవులకు ఈ విషయం తెలిసిందే! ఈ విషయాన్నే శ్రీబాపురెడ్డి లలితంగా వివరిస్తున్నారు.

మనస్సులో ఉన్న భావాలు కదులుతూ ఉంటాయి. కాని కాగితం ఆహ్వానించే సరికి కళ్ళు మూసుకుంటాయి. కవి నిదురపోయే సమయాన మేలుకుంటాయి. ఆయన నిదురలేచేసరికి పారిపోతాయి. వాటిని పిలిస్తే భయపడతాయి. తీరిక లేని సందడిలో మన ముందగా దగ్గరగా వచ్చి తిష్ఠ వేస్తాయి.

అందుకే ఏకవికైనా ఒక్కటే పరిష్కార మార్గం. "భావాల మాట విని కవితలు వ్రాయడమే!"

## 11

" లేదురా, లేదురా, లేదురా
కులానికి అర్థం లేదురా
లేదురా, లేదురా, లేదురా
మనిషికి మనిషికి తేడా లేదురా

పుట్టిన తీరందరిదీ ఒకటేరా
గిట్టిన వారందరి దారొకటేరా
చాతుర్ వర్ణాలు, కులాలు
స్వార్థపరులు కల్పించినవేరా -

భరతసమాజం ముక్కలు చేశారు
పాల కడలిలో విషం పోశారు
లెక్కలేని కులాల వలపోశారు
దిక్కులేని పక్షులుగా చేశారు -

మన జాతి చేవను చంపిందిరా కులం
మన చరితను మలినం చేసింది కులం
మన సమాజ దురాచార కారణం కులం
తరతరాల దరిద్రాల కారణం కులం - "

(గేయాలు : అతీతగీతం)

ఈ కులాన్ని నిర్మించిన పెద్దలెవరోగాని కాలంపై, దేశంపై, చరిత్రపై చేయని నేరానికి ఎంత కసితీర్చుకున్నారు! " నీదే కులమన్న ప్రశ్న వెలయించి చివుక్కున లేచిపోవుచో" అంటూ కులం పరిధిలో మహాకవులు ఎంత వేదన పడ్డారు! ఎందరు తల్లులు, చెల్లెళ్ళు, తమ్ముళ్ళు కులం పేరుతో జరిగే నరమేధంలో ఆహుతై పోయారు!

ఆ అతీతగీతంలో కులతత్వానికి వ్యతిరేకంగా పిడికెళ్ళు బిగిస్తున్నారు శ్రీబాపురెడ్డి. ప్రేమ, స్నేహం ఇవి కులానికి అతీతంగా ఉండి; కులానికి, మతానికి వ్యతిరేకంగా వివాహాలు జరిగితే ఆ పునాది భావిభారత సమైక్య భవనానికి ఉపకరిస్తుందని బాపురెడ్డి ఈ గేయంలో భావన చేస్తున్నారు.

పెద్దవాళ్ళు నమ్ముకున్న చాదస్త రాజ్యానికి పెద్దవాళ్ళనే మహారాజుల్ని చేసి, కనీసం యువతరమైనా ఆ పరిధి నుండి తప్పుకుంటే, రంగైన ఊహాలకు ప్రతినిధులుగా నిలిస్తే 'కులమతాలు' అగ్ని పర్వతాల్లా ప్రేలి అందులోని లావాతో ప్రపంచానికంతటికీ వెలుగునిచ్చే దీపం వంటి ద్వీపం ఉద్భవించవచ్చు. దానిని 'సామ్యవాద పద్మం' అనండి - శ్రీశ్రీ ఊహించిన మరో ప్రపంచం అనండి! ఏదన్నా నామకరణం తరువాత చేద్దాం. ముందు మాత్రం ఆజగత్తు నిర్మాణానికి ఉద్యమిద్దాం!

## 12

" వంగమె కాదు, ఈ భరత
వర్షమె కాదు, ప్రపంచమెల్ల ఉ
ప్పొంగెను నీ యెడంద విర
బూచిన కావ్యకళాపరీమళో
త్తుంగ తరంగ డోలికల;
దుర్భర దాస్య విశీర్ణ సాహితీ
ప్రాంగణమందు నాటితి వ
యా విలసద్రస పారిజాతముల్!"

(పద్యకావ్యాలు : రవీంద్ర కవీంద్రుడు)

రవీంద్ర నాథ్ ఠాకూర్ భరతజాతికి ఓ వెలుగు వెల్లువ! భారతీయ కవితకు నోబెల్ పురస్కార యోగ్యతను కల్పించిన ఆయన నిజంగా విశ్వకవే! వెండికొండ కదిలి వచ్చినట్లుగా భావింపబడే రూపం, సుకుమార భావన, సుందరమగు సాహిత్య సృష్టి, వినూత్నమగు సాహిత్య దృష్టి ఆయనకు విధి యిచ్చిన వరాలు!

అసలు "వంగదేశంలో పుట్టిన చిగురు కొమ్మైన చేవ!" అని ఒక్క మాటంటే చాలు. రాజా రామమోహన రాయ్ మొదలుకొని ఎందరో ఎందరెందరో మన కన్నులముందు మెదులుతారు.

వంగదేశమే కాదు. భారతదేశమేకాదు. ప్రపంచం సమస్తం కీర్తించే విధంగా ఠాకూర్ సాహిత్య సృష్టి తీగలు సాగింది.

"దుర్భర దాస్య విశీర్ణ సాహితీ ప్రాంగణ మందు నాటితివయా విలసద్రస పారిజాతముల్!" ఎంత బాగా అన్నారు బాపురెడ్డి! ఈ పదాల వెనుక ఠాకూర్ రూపం 'దీపకళిక' లా మెరిసిపోతోంది. 'విలస ద్రస పారిజాతముల్' అన్న ప్రయోగం సువాసనతో పాటు మాధుర్యాన్ని కూడా మోసుకువచ్చి - సుహృద్భావనా శిఖరాల కడ అంచులకు మనల్ని తీసుకు వెడుతోంది!

13

*" ఒకరిని చూడగానె ఏది*
*యో అనురాగము మోసులెత్తు, వే*
*రొకరిని చూచి చూడగనె*
*ఓర్వమి ద్వేషము పొంగులెత్తు, దీ*
*నికి గల కారణమ్ము రమ*
*ణీ! కనరాదు వితర్క హేతువా*
*దికి; మరి జన్మజన్మలకు*
*తీరని వాసన లుండకుండునా!"*
(పద్యకావ్యాలు : స్నేహ సౌరభము)

కాళిదాసు 'శకుంతలా'న్ని పాఠంగా చెప్పిన పూజ్యులైన మా తండ్రిగారు ఈక్రింది శ్లోకానికి మాత్రం సుదీర్ఘ వివరణ యిచ్చారు.

*" రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్యశబ్దాన్*
*పర్యుత్సుకో భవతి యత్సుఖితోపి జంతుః*
*తచ్చేతసా స్మరసి నూన మబోధ పూర్వం*
*భావస్థిరాణి జననాంతర సౌహృదాని"*

ఇది ఎంత మంచి శ్లోకం! అసలు కాళిదాసు వ్రాసిన ప్రతిశ్లోకం బంగారమే! కాని ఈ శ్లోకం మాత్రం పరిమళంతో కూడిన బంగారం!

రమ్యమైన దృశ్యాలు చూసినా, మధురమైన శబ్దాలు వినినా, మానవుడు సుఖవంతుడై ఉన్నను తెలియని ఉత్కంఠ, ను అనుభవిస్తాడు. దానికి కారణం- మన మనస్సులో స్థిరపడ్డ భావములు ఈనాటివి కావు. గత జన్మలకు చెందినవి.

నిజమే! ఎన్నడూ వినని గానాన్ని విని ఇదివర కెన్నడో విన్నామని ఊహించడం, అట్లే అపరిచితమైన దృశ్యాన్ని చూచి ఇదివరకు ఈ దృశ్యాన్ని దర్శించానని భావించడం! ఈ దర్శనానికి ఈ అనుభూతికి పునాది జననాంతర సౌహృదం!

తిరిగి చాలాకాలానికి ఆ శ్లోకంవంటి మంచి పద్యం మా బాపురెడ్డి గారు రచించిన 'పద్యకావ్యాలు' లో మనసారా చదువుకోవడం జరిగింది.

ఒకరిని చూడగానె అనురాగం మోసులెత్తడం, వేరొకరిని చూడగానె ద్వేషం పొంగులెత్తడం - దీనికి కారణం ఏమిటి? వితర్కియైన హేతువాదికైతే సమాధానం లభించదు గాని " జన్మ జన్మలకు తీరని వాసన లుండకుండునా!"

మొత్తం మీద హృద్యమైన పద్య మిది!

14

" మనిషి లోనుంచి పుట్టిన
మనిషిని నేను
మనుష్యుల మధ్య పెరుగుతున్న
మనిషిని నేను
మనిషిని చదువుతున్న
మనిషిని నేను
మనిషిచే చదువబడుతున్న
మనిషిని నేను
మనిషిని మించిన
మహాశక్తి లేదని

మనిషినే ఆరాధిస్తున్న
మనిషిని నేను -
మాపల్లెలో చూశాను మనిషిని
మహానగరాల్లో చూశాను మనిషిని
నా భాషలో
నా రాష్ట్రంలో
నా దేశంలో
చూశాను మనిషిని
నానా, నాలలో
నానా, నీలలో
చూశాను మనిషిని -
విదేశాల్లో, విభిన్న భాషల్లో
వివిధ వేషాల్లో చూశాను మనిషిని
ఎంతకూ అంతుచిక్కని
వింత మనిషిని."

(అనంత సత్యాలు : మనిషిని చదువుతున్నాను.)

శ్రీ బాపురెడ్డి రచించిన గద్యకావ్యాలు, గేయాలు, పద్యకావ్యాలు, గేయనాటికలు కంటె విభిన్నమైన కవితాసృష్టి "అనంత సత్యాలు" ఈ ఆధునిక మహాకావ్యాన్ని 1979 మే నెలలో జరిగిన ఉత్తర అమెరికా తెలుగు మహాసభలలో శ్రీరెడ్డి అక్కడి తెలుగు మిత్రులకు 'స్నేహోపాయనం' గా అంకితం చేయడం జరిగింది. తెలుగుదేశంలోనే కాదు, తెలుగు మారు మ్రోగే ప్రపంచ దేశాలలో కూడా తన కవితను పలికించి, వినిపించి, సమర్పణ చేసిన ఘనత శ్రీబాపురెడ్డికే దక్కింది.

ఆధునిక కవితలో వస్తున్న అత్యాధునిక ధోరణుల వేగానికి కొట్టుకుపోకుండా 'గడుసుపోకడ' తో ఓవారకు ఒదిగి నిలిచి, ఆజాతరలో రసజ్ఞులు చిందులు వేస్తున్న తరుణంలో - సన్నని తన గొంతు నెత్తి మధుర గీతాలు ఆలపించే సొగసరి కవి ఈ 'అనంతసత్యాలు' లో మనకు దర్శనమిస్తాడు.

కాగా శ్రీ రెడ్డి ప్రతిపాదించిన సరిక్రొత్త కవితా సిద్ధాంతం 'భావ భౌతికవాదం' దీన్ని సమీక్షిస్తూ డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం గారు యిట్లా అంటారు.

" ఆత్మజ్ఞానం + పదార్థజ్ఞానం = సాహిత్యదర్శనం.

దైవత్వం + అనంతత్వం = సాహిత్యతత్వం అన్నది బాపురెడ్డి భావభౌతిక వాదానికి మూలసూత్రం"

ఇజాల నుండి కవితను, రాజకీయాలనుండి దర్శనాన్ని ప్రక్కకు మరల్చి, శిల్ప కళాభిరామంగా సాహిత్యాన్ని తీర్చిదిద్ది అందులో మనిషిని మందిర మెరుగని దేవునివలె ప్రతిష్ఠించే ఆధునికమైన, రంగైన ఊహ బాపురెడ్డి ఈ కవితల్లో మనకు ప్రత్యక్షమౌతుంది.

మనిషిలో పుట్టిన మనిషి నేను అంటూ ... పల్లెలో బస్తీలో, స్వరాష్ట్రంలో, స్వదేశంలో, స్వభాషలో అంతేకాదు నానా దేశాలలో, విభిన్న భాషలలో తాను దర్శించిన మనిషిని ఈ గేయంలో ప్రదర్శిస్తున్నారు బాపురెడ్డి.

"దేశమంటే మట్టి కాదు మనుష్యులు" అని తొలిసారిగా విశ్వ ప్రజలకు చాటి చెప్పిన వాడు గురజాడ వాల్మీకి! అప్పటి నుండి మట్టికి అతీతమైన, చైతన్యవంతుడైన మనిషికి మందిరం కల్పించి కొలవడం ఆధునిక సాహిత్యంలో నవీన కవుల కర్తవ్యం అయింది.

ఆ కృషిలో ఓ భాగం ఈ కవిత!

15

" జీవితం
జనన మరణాల మధ్య
కాలం వ్రేలాడగట్టిన

కాంతిరేఖ
జననం ఒక మరణం లేని ప్రశ్న
మరణం ఒక జననం లేని ప్రశ్న
సమాధానం లేని రెండు
సంపూర్ణ ప్రశ్నలకు
సమాధానం చెప్పడానికి
సందేహాల బోనులో నిలబడ్డ
సాక్షిలాంటిది జీవితం
అబద్ధం చెప్పదు
సత్యం తెలియదు
ఎన్ని జీవితాలు!
ఎన్నెన్ని సాక్ష్యాలు!
కళ్ళు లేని కాలం
చెవులు లేని కలంతో
నోరులేని కాగితం మీద
కన్నీటి అక్షరాలతో
అన్నీ వ్రాసుకుంటున్నది
అయినా తీర్పు లేదు
అభియోగంలో మార్పులేదు.
జననానికి మరణం శిక్ష
మరణానికి జననం శిక్ష
ఉభయ శిక్షలను తానే అనుభవించే
న్యాయమూర్తి జీవితం."

(అనంతసత్యాలు : జీవనగీత)

"జీవితం నిర్వచనాల కందదు. జీవించడం కన్న జీవితానికి నిర్వచనం సున్న" అంటారు శ్రీ అరిపిరాల విశ్వం. ఎంత నిజం!

శ్రీ బాపురెడ్డి ఈ 'జీవనగీత'లో జీవితం నడిచి వెళ్ళే గీతను అన్వేషిస్తున్నారు.

"జననానికి మరణం శిక్ష. మరణానికి జననం శిక్ష. ఈ ఉభయ శిక్షలను తానే అనుభవించే న్యాయమూర్తి జీవితం!'' అనడం ఎంతో హుందాగా ఉంది.

జీవితానికి నిర్వచనం లేదు సరే. నిర్వచించడానికి ప్రయత్నించే ఎందరికన్ననో బాపురెడ్డి మిన్న. అందుకే ఆయన జీవితాన్ని దర్శించడానికి ఓ 'క్లోజప్' సృష్టించారు. అది

అనుభూతి శిఖరాల నుంచి
ఆలోచనా అంతరాళాల నుంచి
అనుతత్వ కిరణాలలో.......
దైవత్వ దర్పణాలలో..... జీవితాన్ని
దర్శించడం!
శ్రీ బాపురెడ్డి భావనలో మానవ శంఖారావమే
నవరస భావం!

## సమీక్షలు

*(డాక్టర్ జె. బాపురెడ్డి రచించిన రచనలపై ప్రముఖ రచయితలు, పత్రికలు తమ సమీక్షలను వెలువరించాయి. ఆ సమీక్షలలో కొన్నింటిని ఈ 'సమీక్షలు' విభాగంలో పొందుపరుస్తున్నాం)*

# రాకెట్టు రాయబారం

కవిలో కల్పనవుంటే, కల్పనకు తగిన శబ్ద జాలం వుంటే, కల్పనను శబ్దజాలంలో లయాత్మకంగా ఇమడ్చగల నిర్మాణశిల్పం వుంటే ఇక కవికి అందని విషయవస్తువు అంటూ వుండదు. దుమ్మూ ధూళీ, కొమ్మా రెమ్మా, తట్టా బుట్టా, భూగోళం, ఖగోళం, గందరగోళం అన్నీ కమనీయమైన కవితావస్తువులే అవుతవి. వీటిని రసవంతంగా చిత్రించటంలో మహాకావ్యాలకంటే ఖండకావ్యాలే ఎక్కువ అనుగుణంగా వుంటవి.

బాపురెడ్డిగారి "రాకెట్టు రాయబారం" కొన్ని గేయఖండికల సంకలనం. అందులో పుస్తకం పేరుగలది ప్రథమ ఖండిక. దీనికి పరిచయం వ్రాశారు బోయి భీమన్నగారు. పరిచయం వెడల్పూ, నిడివీ, లోతూ కలిగి ఒక అంతర్వీక్షణగల సమీక్షాఖండిక.

రాకెట్టు రాయభారం ఒక విమాత్న కవితా వస్తువు. పదాలాలిత్యం ముందుగా పాఠక హృదయాన్ని చూరగొంటుంది, అంతకంటే లలితతరమైన భావ మాధుర్యం వెంటనే పాఠకుని చిత్తాన్ని తన్మయ పరుస్తుంది.

*"ఏమి టేమిటీ భూవాసులు నా*
*సీమకు రానున్నారా?*
*నా విశాల నిర్జన భూమికి ప్రా*
*ణమ్ములు తేనున్నారా?*
*పూచేనా నే పెంచిన ఆశలు*
*వీచేనా గంధములు !*
*చైతన్యము నా ఎడారి బ్రతుకున*
*చిందేనా అందములు?"*

సుదూరానవున్న చంద్రమండలం మనుషుల రాకకోసం ఎంతో తహతహ లాడుతుంది. భూగోళపు మనుషుల స్పర్శతోనే కాని చంద్రగోళం తాను ధన్యనైనట్లు భావించదు.

*" ఈ కొండలలో కనకము కలదని*
*ఈ ఇసుకలోన అమృతమున్నదని,*
*ఇచ్చట శీతోష్ణమ్ములు గలవని*
*ఇంపుగొల్పు దృశ్యమ్ములు గలవని*
*ఎరిగింపుము సాహసులౌ నరులకు-"*
*రాకెట్టు చంద్రునితో అంటుంది :*
*"మనుషులకు నీవు అభిమాన దేవతవు;*
*నినుజూడ కవులగుండెలు కరగిపారు;*
*నీరూపు, నీవెల్గు, నీమాట లేక*
*కావ్యమ్ము లేదు చక్కని గాథ లేదు"*

మొత్తం ఇందులో 28 కావ్యఖండిక లున్నవి. ప్రతిదీకూడ ఏదో ప్రత్యేక సౌరభాన్ని కలిగివుంది భావంలోనూ రూపంలోనూ, 'జిజీవిష'అనే ఖండికలో:

*"ఎలా బ్రతకాలన్న చింత*
*ఏనాడో వీడింది నన్ను,*
*ఎలా చావాలన్న బాధ*
*ఇంకా పీడిస్తోంది నన్ను."*

ఈవిధంగా యీ పుస్తకంలో ఏ పేజీ తెరచి చూచినా అత్తరుసీసా మూతతీసినట్లే వుంటుంది. చిత్రాల ఆల్బం తెరచినట్లే వుంటుంది. వీణాతంత్రులు మ్రోగుతూన్నట్లే వుంటుంది. కాయితం, అచ్చూ, అట్టా ఫరవాలేదు.

*(తెలుగు విద్యార్థి, 1965)*

# విదేశాల్లో బాపురెడ్డి



With a group of participants from various countries in the Institute of Social Studies, Holland in 1967.



At the Shakespeare's birthplace in England.



At a meeting of Andhra Association, U.K. in London.





With Annie Bunschoten and Pop in the Hague (Holland)



with Utah at a party in Dr. Meerakhan's House in Holland



Dr. J. Bapu Reddy alongwith Sri. M. Narayana and Sri M.S. Murthy at Keukenhof in Holland.



Dr. J. Bapu Reddy with his wife Smt. Rajeswari at Hyde Park in London in 1982



Dr. J. Bapu Reddy in Italy as a member of the delegation exploring the collaboration for Industrial Development.







Dr.J. Bapu Reddy being felicitated by Vastu Shilpi Sri B.N. Reddy and Sri H.B. Narasa Gowda (Minister).



Sri D. Sreepadarao (Speaker) and Kumari Suhasini Film star felicitating Dr. J. Bapu Reddy at a function organised by Yuvakala Vahini.



Dr. J. Bapu Reddy with Sri Adil Naidu and Dr. G.V. Subrahmanyam in the Rubber Plantations in Malaysia




Addressing 7th North Amrica Telugu Conference in Houston in 1989



*With Sri V. Chandramouli, I.A.S. Prl. Secretary to Govt. and a popular writer.*




As a delegate for the 2nd North America Telugu Conference, Detroit USA in 1979



Smt. Rajeswari Bapu Reddy at Leidon University, Holland in the Genetics Department.



Receiving Micheal Madhusudhan Award alongwith Prof. Ameeruddin in Calcutta in 1987.



Dr.Bapu Reddy dedicating his book "PREMAARAMAM" to Dr.P.Meerakhan, a noted Scientist in Holland.

*: With his son Mr.J.Balaji in the Newyork Institute of Technology.*



With a popular representative of Telugu community Mr.Adil Naidu in Kualalampur.




At the World famous hanging Tower of Pisa, Italy.


At the ancient monuments of Roman Empire.


With Shri D.Subbi Reddy and members of Andhra Association U.K.


With Shri Basaviah Chowdary in Canada.





*Participating as Chief-guest in Andhra Kavi Sammelan in London with Sri J.P.L.Gwyn,IAS(Retd.) and other members of Andhra Sangham U.K. & Sri Medasani Mohan (Sethavadhani).*



With Mrs. Halimah Bt. Ali of National Productivity Corpn., Malaysia in 1992



With Dr. Balakrishna in Malaysia



With the participants at a symposium conducted by Asian Productivity Organisation in Kaulalumpur in 1992



Dr. J. Bapu Reddy relaxing at the World famous Pyramids in Egypt.



With Minister of Culture Mexico
at the World Congress of the Poets Istambul (Tukey) in 1991.

With Sri J.P.L. Gwyn, ICS, Retired in London

*With Sri K.P.S.Menon,IFS, Indian Ambassador in China in Beijing in 1985.*





*With Dr.Jayachandra Reddy at Indian Exhibition in London in 1983.*



*With Ajsa Zahirovic of Yugoslovia at the World Congress of Poets Istambul, Turkey.*





Dr. J. Bapu Reddy at the world famous Flower Gardens, KEUKENHOF (Holland)



Dr. J. Bapu Reddy meeting with Indian Ambassador to U.S.A., Dr. S. Abid Hussain in 1990.



Dr. J. Bapu Reddy at the Vatican (Rome)

Dr. J. Bapu Reddy with Sri S. Abid Hussain, Indian Ambassador USA at NRI Meeting in Newyork (1991)







Dr. J. Bapu Reddy relaxing at the World famous Pyramids in Egypt.



With Minister of Culture Mexico
at the World Congress of the Poets Istambul (Tukey) in 1991.



With Sri J.P.L. Gwyn, ICS, Retired in London

*With Sri K.P.S.Menon,IFS, Indian Ambassador in China in Beijing in 1985.*





*With Dr.Jayachandra Reddy at Indian Exhibition in London in 1983.*



*With Ajsa Zahirovic of Yugoslovia at the World Congress of Poets Istambul, Turkey.*





Dr J. Bapu Reddy at the world famous Flower Gardens, KEUKENHOF (Holland)



Dr. J. Bapu Reddy meeting with Indian Ambassador to U.S.A., Dr. S. Abid Hussain in 1990.



Dr. J. Bapu Reddy at the Vatican (Rome)

Dr. J. Bapu Reddy with Sri S. Abid Hussain, Indian Ambassador USA at NRI Meeting in Newyork (1991)





*J.Bapu Reddy(No.1 from right) participating in Annual N.C.C. Training Camp, as a Nizam College student in 1954 at Shameerpet.*





*With youth at Prague in 1968.*

# శ్రీ బాపురెడ్డి గారికి నూతన సంవత్సర శుభాకాంక్షలు

శ్రీకరమ్ములు సాహిత్యశీకరములు
స్నిగ్ధ సౌజన్యభావ వశీకరములు
అద్భుత మనోజ్ఞ భవ్యగుణాకరములు
క్రొత్త వత్సరమున మీకు కూడుగాక!

భవ్య సుందరమైన నవ్య కవిత్వముల్
  నీ వాక్కులోపల నెగడు గాక!
మధుర మంజులమైన మానసికోన్నతుల్
  నీ గుండెలోపల నిండుగాక!
సరసోజ్జ్వలంబైన సారస్వత ప్రభల్
  నీతపస్సున సదా నిలుచు గాక!
నీతి నిర్మలమైన జ్యోతిః ప్రభావముల్
  నీ వర్తనమ్మునన్ వెలయుగాక!

అశ్రితుల ప్రేమ జూచు దయార్ద్ర దృష్టి
సేవకుల నెందు దయను జూచెడు తలంపు
ఎనయు నీకెప్పుడును శుభమ్మె సాగుకాక!
పరమ సౌజన్య మూర్తి! శ్రీ బాపురెడ్డి!

అత్యంత ప్రతిభా విశేషములతో ఆనంద విస్ఫూర్తితో
సత్య ప్రాభవ సత్యనిష్ఠ కలనా సౌహార్ద సంపత్తితో
స్తుత్యంబైన కళా విలాసములతో శోభావికాసంబుతో
నిత్యంబున్ విభవంబు నీ కెసగుతన్ శ్రీ రెడ్డి వంశాగ్రణీ!

శ్రీ దేవీ కృపా సిద్ధిరస్తు!!! శ్రీ షిర్డీ సాయిబాబానుగ్రహ ప్రాప్తిరస్తు!!!

**పెద్దిరాజు రమణా రావు**

గుంటూరు

**9.1.1986**

# సిరికొండ కొస పువ్వు

పువ్వు పుష్పించింది
పరిమళము వచ్చింది
సిరికొండ కడుపులో పుట్టింది.
కరీంనగరులో పెరిగింది
నిజాం కళాశాలలో ప్రవేశించింది.
విద్యార్థి సంఘపు అధ్యక్షత నలంకరించింది
"ప్రధానమంత్రి" పదవి చేపట్టింది.
నీలం సంజీవరెడ్డిని ఆహ్వానించింది.
ముఖ్యమంత్రి మెప్పు పొందింది.
విశాఖపట్నం చేరింది.
విద్యార్థినులతో ఋతురాగనృత్యము చేయించింది.
జెనివా సరోవరాలను పరిశీలించింది.
హాలండులో సువాసనలు వెదజల్లింది
స్టాక్‌హోంలో మిత్రత్రయంను మురిపించింది
చెకస్లోవికియాలో యువనారీ లోకమును నవ్వించింది.
ప్రపంచ సాంస్కృతిక సంస్థ ప్రతినిధులను మెప్పించింది.
షేక్స్పియర్ మహాకవి జన్మ స్థానము సందర్శించింది.
ఉత్తర అమెరికా తెలుగు సభలను అలరించింది.
ఇంగ్లండు పశ్చిమజర్మని
ఫ్రాన్సు ఇటలీ
గ్రీసు నార్వే స్వీడన్ డెన్మార్కులో పరవశించింది.
నిద్రమత్తులో ఉన్న వారిని మేలుకొలుపుతుంది.
అనంత ఆకాశములో విహరిస్తుంది.
రాజేశ్వరి సిగలో దాగి ఉన్నది.
బాపురే బాపురే ఇది ఏమి పువ్వు
మల్లె పువ్వు కాదు మొగలి పువ్వు కాదు
గులాబి పువ్వు కాదు
సత్యభామ వరించిన పారిజాతము కాదు
వీటి అన్నింటిని మించిన పువ్వు
తెలుగు కవి పువ్వు -
మెదకు మండలకు నేలె
బాపురే - బాపురే
ఇంత చక్కటి పువ్వు ఇలలో లేదంటే నమ్ము-
అదియే మన మధ్యలో ఉన్న బాపురెడ్డి
అన్ని పువ్వుల వాసనలు తన ఆత్మలో
ఇమిడించుకొన్న ఆమని పువ్వు
అనంతకోటి సత్యాలు తెలుపుతూ
మీరు కవితలు వినిపిస్తుంటే
త్రికరణ శుద్ధితో సేవలు చేస్తుంటే
మనుషుల మనసుల్లోని
మలినం తొలగుతూంది
మెదకు మండలంలో ప్రగతి
వెలుగుతూంది.
100 పడకల వైద్యశాల
పట్టభద్రులను తయారుచేసే కళాశాల
ప్రయాణీకుల విశ్రాంతి శాల
అద్దె కొంపలు దొరకక అవస్థపడే ఉద్యో
గులకు గృహముల నిర్మాణ శాఖ
ప్రభుత్వ కార్యాలయాలకు స్వంత భవనాలు
ఉపాధిలేని వారికి ఉద్యోగాలు కలిపించుట
వృత్తి శిక్షణశాల - పరిశ్రమల శిక్షణశాల ఏర్పాటు
సందులు గొందులు రహదారులుగా మార్చుట
ఆర్థిక బలహీనులకు, అనాధులకు,
అండగా నిలిచిన మీకు అందిస్తున్నాం
మా గుండెలనే పూల గుత్తులుగా
ఇదియే మీకు మా
హృదయపూర్వక సన్మానము.

-కె. నరసింగారావు
మెదక్

'రసవత్కవి", "సహృదయ సార్వభౌమ"

డా॥ బాపురెడ్డి గారు ఐ.ఏ.యస్.

హిందూ దేవదాయ దర్మాదాయ శాఖ కమీషనరు,

ఆంధ్రప్రభుత్వం హైదరాబాదు.

శ్రీశారదా నికేతమునకు విచ్చేసిన శుభ తరుణమున సమర్పించు

# స్వాగతాంజలి

సిరుల విభవ తెచ్చెపరమవైభవమును బాపురెడ్డి రాక రూపమునకు
ధర్మ నిధులు త్రవ్వి దాతృత్వమున దీని వెలుగు జేయునింక చెలిమి మీర

జంకె ఇంటి పేరు జంకు లోగానము వంకలేని వాడు బాపురెడ్డి
కవిత జన్మతోడ కలిగిన దగుట మేల్ పదవికీర్తి పదవి కీర్తి నిన్నె పట్టెనిజము.

చదివిన దార్థిక శాస్త్రము, పదవియొ ఉత్తమము ధర్మఫలములు పండున్
వదలక దైవసహాయము మెదలించును నిన్ను ఎల్లయేటియనంగన్

ఆదిన్ కావ్యనిబంధనైక మతివై ఆయాసభా వేదులన్
ప్రాదుర్భూత యశోవిశేష సుషమల్ పందిళ్ళుగా నల్లెనో
వేదాశీః ప్రభవాభిరామ విభవా! విద్యా వివేషజ్ఞ! దై
వాదాయమ్మును దర్మపూర్వకముగా నందించి మెప్పొందుమా.

తెలుగు చైతన్య రేఖలు తీర్చిదిద్దిన బాపురెడ్డికి శుభస్వాగతంబు
ఋతురాగ నిర్మాణ రీతిపెంపెక్కిన బాపురెడ్డికి జయస్వాగతంబు
కల్యాణయాత్ర లోకమున కందించిన బాపురెడ్డికిని సుస్వాగతంబు
ఆంధ్రలోకమెల్ల నౌనని మెచ్చ రాకెట్టు రాయబార మిట్టె పంపి
ఎల్లవారి నుతుల నెడదలో మెచ్చెడి బాపు సుకవిరెడ్డి స్వాగతంబు.

తేది: 27-3-1988

గుంటూరు,

ఇట్లు
అధ్యాపక బృందము
**శ్రీశారదా నికేతనము**

# మాన్యశ్రీ డాక్టర్ - జె. బాపురెడ్డి, ఐ.ఎ.ఎస్.

దేవాదాయ దర్మాదాయశాఖ కమీషనరు వారికి

# సన్మాన సుస్వాగత పత్రం

మాన్యశ్రీ బాపూ!
నీకిదే మా స్వాగతం!
మా యీ -
వాయసపుర (కాకినాడ)
కవన భవన
ప్రాంగంణంలో -
నీ సాహితీ పరు
దమ్మల కిదే
మా సుస్వాగతం !!!
నీ కవన పవనాలు
హిమగిరి హద్దులు దాటి
పారావారపు తీరాలు మీటి
విశ్వ సాహితీ విపంచిలో -
విశ్వ కళ్యాణ రాగాలాపనలో -
'బ్యాంకాకు' కవన వీధిని
నీకలం - గళం -
పాడిన గీతం
మా తెలుగువారల
హృదయ సుప్రభాతం !
మా వాడన్నాం - వాడ వాడలా
వేడుకలు - జరుపుకున్నాం -
నీదొక వరవడి
మందాకినీ సురఝురి సవ్వడి
మానస సరోవర కలహంసల
సున్నితపు రెక్కల సడి
రసవాహిని పరీవాహక జడి
నీ కవనపు పాట -
గురజాడ - ముత్యాలసరాల - బాట
విశ్వకవి రవీంద్రుని విరుల తోట
తేట తెనుగు - పూట

ప్రతినోట - ఇదే మాట
మీకవనపు సేద్యం అనితరసాధ్యం
నీ వాణీబాణి అనుభవైక వేద్యం!
మానవత్వం - నీ సందేశం
మృదుత్వం - నీ సుభాష్యం
మీ రచనల్లో -
ప్రవచనాల్లో -
భౌతికవాదం -
ఆధ్యాత్మిక వేదం -
సమ్మిళితం - సమ్మిశ్రం -
నీ రచనల్లో - ప్రతిఫలించే
ప్రకృతి సౌందర్యారాధన
పరమాత్మ ఐక్యవేదన -
నీ 'లోచన'
సాలోచన -
మాలో లేపును
కార్యోద్దీపన -
నీ వ్యక్తిత్వం -
నీ వక్తృత్వం -
నీ కర్తృత్వం -
వచనాల్లో - ప్రవచనాల్లో
నీగీతికా స్రవంతిలో
అవ్యక్తానందం - అద్వైతాలీనంలో -
అనుభవించి - పలవరించే
మమైక్యంతో - మరోకసారి
సాదర
సోదర
హార్దికాదర
సుస్వాగతం !!!

సమర్పణ
**పి.వి. రమణమూర్తి**, బి.ఎ. ఎల్.ఎల్.బి.

కాకినాడ (వాయసపురం)
*6-1-89 (శుక్రవారం)*

ఉపకమీషనరు మరియు దేవాదాయ, దర్మాదాయ ఉద్యోగులు , కాకినాడ విభాగము

"ఎవ్రిడే" ప్రథమ వార్షికోత్సవ సందర్భంగా ముఖ్య అతిథి

**శ్రీ జె. బాపురెడ్డి I.A.S.,** గారికి సమర్పించిన

# అభినందన పత్రము

గుండె గుండెకు తెలుగు
సాహిత్యపు వెలుగు
నందించే సిరిపుర మూర్తి
చైతన్య స్రవంతి శ్రీ బాపురెడ్డి

దేశ దేశాల మానవుల
మంచికోసం మహోన్నతి కోసం
పరుగు లెత్తిన సాహిత్య కలం
దేవుడు తెలుగుజాతి కిచ్చిన వరం

మానవత్వం సమానత్వం
అనంత సత్యం వెదజల్లే కవి
మనిషిని, మనీషిని, దేవుడ్ని
ఆరాధించే సౌజన్య శీలీ...

మీ ఆవేదన ఆరాటానికి
తెలుగు గుండె పులకించినది
అక్షర గీత మాలికలతో
జాతి పెదవిపై మందహాసం మొలకెత్తింది

రస కవిత్వం కత్తిపట్టి
'కుళ్ళు' భావాల కత్తిరించి
మానవ హృదయాల్లో చైతన్య
బీజాలు నాటిన గౌరవ డాక్టర్జీ ....

బాధ్యతగల ఉద్యోగిగా వుంటూ
భావ సుమ మాలికలల్లుతూ
తెలుగుజాతి కీర్తి బావుటా
విశ్వాంతరాల నెగురవేసే బాపురే...

కష్టాల కడలి ఒడిలోని
జీవన సమరాన్ని చూచాను
సంకుచిత స్వార్థ తత్వం
గుండెల్లో గీతిక గునపాల గుచ్చారు...

స్వీకరించు ఈ చిరుగేయమాల
విందుగా పసందుగా
కార్యానిస్టుగా, సాహిత్య
కళాభిమానిగా నా చిరుకాన్కగా

**"ఎవ్రిడే" యజమాన్యం తరపున**

**- తులసీరాం**

వరంగల్ జిల్లా కలెక్టర్
శ్రీ జె. బాపురెడ్డి ఐ.ఎ.ఎస్. గారికి
సెయింట్ ఆన్స్ ఉన్నత పాఠశాల
క్రీడోత్సవ సందర్భమున విద్యార్థినీ విద్యార్థులు,
ఉపాధ్యాయినులు, మేనేజిమెంట్ వారు
సమర్పించు

# స్వాగతము

స్వాగతమ్ము నీకు ఓ తెలుగు బిడ్డా
స్వాగతమ్ము నీకు జె. బాపురెడ్డీ!
స్వాగతమ్ము నీకు సాహిత్యబంధూ
స్వాగతమ్ము నీకు పాలనాదక్షా!
నూనూగు మీసాల నవయౌవనంలో
కాళిదక పూర్వమే కవితలల్లినట్టి
పిరికొండలో పుట్టి సీమాంతముల కేగి
తెలుగు వెలుగుల నెల్ల వెదజల్లి నట్టి
అర్థశాస్త్రాన్ని ఔపోసనగ బట్టి
ఆంధ్రకవితామతల్లిని ఆదరించినట్టి
ప్రణయ, ప్రగతి, ప్రణవ నాదాలను
"నాద వేదాలలో" నింపిన దిట్ట వైనట్టి
తెలుగు మహాసభలలో నీ ప్రతిభను చాటినట్టి
"దేశభాషలందు తెలుగు లెస్సగ" కొలిచినట్టి
వెస్టుకు గెస్టుగా పోయి, ప్రవాసులకు
"మందార మకరంద మాధుర్య"పు టేస్టును చూపినట్టి
నీకు సెయింట్ ఆన్స్ యిచ్చునట్టి
స్వాగతాంజలి యిదియె గైకొమ్ము అతిథీ!
చేయుమోయి మా క్రీడోత్సవాన్ని
నేత్రపర్వముగా ఓ "అనంత సత్య" కర్తా!

ఇట్లు
**జయశ్రీ ఆలూరి**
సీనియర్ హిందీ పండిట్

# ఆంగ్లనూతన సంవత్సర శుభాకాంక్షలు

మీ సంప్రదాయ మొక యూపస్తంభం
మీ కవిత్వ మొక అగరు స్తంభం.
రెండు కలిసిన మేలుకలయికే
సాహిత్య నగరుకు విజయతోరణం!

మీ జీవిత మొక వెన్నెలవాగు
మీ సుస్నేహ మొక వన్నెల జాబు
రెండు కలసిన మేలు కలయికే
నడిచే సాహిత్యానికి తోడు!

కవిగా కవితలు అల్లెడి బాపు
రవిగా పాటలు కూర్చెడి రెడ్డి!
కవిగా నవతలు కూర్చెడి బాపు
రవిగా మమతలు పంచెడి రెడ్డి!

నూతనవత్సర మహోదయంలో
వినూతన కవిత్వ మహోద్యమానికి
ప్రగతి గీతికలు ఆలపిస్తూ
సాగిపోవాలని ఆశిస్తూ -

-కర్రా కార్తికేయ శర్మ
ముసురుమిల్లి
**30.12.1981**

# శ్రీ జె. బాపురెడ్డి ఐ.ఏ.ఎస్. గారికి సన్మాన సందర్భములో

## చతుశ్శ్లోకి

బాపురెడ్డి రితిఖ్యాతః - కమీష్నరు పదవీస్థితః
దేవాదాయ విభాగేస్మిన్ - ధర్మాదాయ విశేషితే

సత్క్షత్రియకులోత్పన్నః - కార్యదీక్షారతస్సదా
శ్రీ నృసింహప్రసాదేన - వర్ధతాం కవిపుంగవః

సంస్కృతోన్నతి రేవస్యాత్ - దేవస్థానాభివృద్ధయే
ఇతి సమ్యక్విచార్యైవ - విద్యాపీఠస్సుస్థాపితం

విద్యాపీఠమిదం నూనం - ఉత్తమోత్తమ భూషితం
త్వదధీన మభూదద్య - వర్ధతా మభివర్ధతాం

-శ్రీనివాసాచార్య
ప్రధానాచార్యులు - సంస్కృత విద్యాపీఠమ్

---

## ఓమ్

సోదరులు, కవి శేఖరులు
కరుణా హృదయులు పుణ్య బాపూజీకి
పాదాభివందనములతో.....

బాబూ! ఏమని నుతించగలను!
ఏమని స్తుతించగలను!
వ్రాతలలో ధ్వనించిన హృదయం
చేతలలో రుజువు పర్చ
ఏమని కొనియాడగలను.

ఔను నిజం! మీ రన్నది
నిజం! నిజం! మీ
ప్రతి రచనలో ప్రతి వచనం
పరమనిజం! నిజం! నిజం!

చంద్రునికీ మీకూ
చాల సామ్యముండుట
నిజం! నిజం! అది
అనంత సత్యం.

"వాగ్దానమె దానమైతే
వరదులమే మనమంతా!
ఊహాలే ఉయ్యాల లైతే
ఉడుపథాలు మనసొంత!" అంటూ

ఊహాలె ఊపిరిగావించుకొని
ఉర్విని మసలెడు వరదులు-మీరలు
ఉరుతర, ఉత్కృష్ట, ఉదార హృదయులు మీరు
అది నిజం! నిజం! పరమ నిజం!

-సోదరి - పి. శేషమ్మ
ఏలూరు

రాష్ట్ర దేవాలయ ఉద్యోగుల క్రీడా - సాంస్కృతిక మండలి ప్రారంభోత్సవ సందర్భమున

# శ్రీ జె. బాపురెడ్డి I.A.S. గార్కి స్వాగతం - సుస్వాగతం

మానవ మనో వికాసానికి మనుగడకు క్రీడలు, కళలు అనాది నుండి నేటి వరకు వివిధ రూపాలలో మనకు ప్రతి నిత్యం తారస పడుతూనే ఉన్నాయి.

ఆట, పాట అనేవి సంగీత పరమైనవి కావచ్చు లేదా శారీరక, మానసిక వికాసమైనవి కావచ్చు. ఏది ఏమయినా ఆనాటి బిళ్ళ కర్ర ఆటల నుండి నేటి క్రికెట్ క్రీడల వరకు, పల్లెల్లో జానపదుల పాడుకొనే పాటకు లయగా ఆడే ఆట దగ్గర నుండి నేటి వివిధ రసాభినయ నాట్యం వరకు అన్ని క్రీడలూ, కళలే.

అటువంటి మహత్తరమైన మహిమ గల క్రీడలు. కళలు ఆ పరమేశ్వరుని పదాంజలి నుండి ప్రభవించినవే. అందుకనే అనునిత్యం ఆ శ్రీవారి సన్నిధానము నుండి నిర్మల సేవా కైంకర్యాలు చేస్తూ, ఆ దివ్య పురుషుని లీలామానుషిని యొక్క మహిమలు చెప్పాలన్నా, వినాలన్నా క్రీడా, కళా సంబంధమైన సృజనాత్మక శక్తి, యుక్తి కావాలి.

అట్టి సేవా తత్పరులైన అధికారులు అనధికారులు సరస రసాస్వాధులైన పెద్దల ఆశీస్సులతో ఆంధ్ర దేశములోని పేరెన్నికగన్న దేవాలయములు సింహాచలం, అన్నవరం, ద్వారక తిరుమల, కనకదుర్గ, శ్రీశైలం, వేములవాడ, యాదగిరి గుట్ట, భద్రాచలంలో పని చేయుచున్న సిబ్బంది యొక్క సంఘటిత శక్తితో " రాష్ట్ర దేవాలయ ఉద్యోగులు, క్రీడ - సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించాలనే సత్సంకల్పంతో ఈ కార్యక్రమమును తలపెట్టినాము.

ఈ కార్యక్రమములవలన ఒనకూరేది ఏముం దనుకోవచ్చు.

(1) పదవగాహన (2) సహకారం (3) స్నేహం (4) మనో వికాసం (5) సమ సమాజ స్థాపన

పైన పేర్కొన్న అయిదు (సూత్రాలు) విధానాలు యీ సమాజంలో ఎప్పుడూ అవసరమే. తద్వారా సమాజానికి లేదా సాటి మనిషికి కొంత సేపయినా, విజ్ఞానాన్ని గాని వినోదాన్ని గాని అందివ్వగలగాలనే సదాశయముతో ఈ "క్రీడ, సాంస్కృతిక మండలి" ని ఏర్పాటు చేసుకొనుట జరిగింది.

అట్టి మహత్తర ధ్యేయానికి, ఊతకర్ర లేనిదే నడువదు. గోడచేరువు లేనిదే నిలువదు పెదలు లేనిదే వేరు పెట్టరాదు. సరసహృదయునిగా, కార్యదక్షునిగా పేరెన్నిక కన్న శ్రీబాపురెడ్డి, ఐ.ఏ.ఎస్.గారు దేవాలయాల పరిపాలనా శాఖాధిపతులుగా రావడం, వారి అమృత హస్తాల మీదుగా, మృదు వచనాల ద్వారా, కళాహృదయం ద్వారా, పరిపూర్ణ కవితాదేవి కనుసన్నలతో ఈ 'రాష్ట్ర దేవాలయ ఉద్యోగుల క్రీడ, సాంస్కృతిక మండలి" ని ప్రారంభించి ఆశీస్సులు అందివ్వమని అర్థిస్తున్నాము. ప్రార్థిస్తున్నాము.

వేములవాడ, ఇట్లు

తేది : 15-5-1988 రాష్ట్ర దేవాలయ ఉద్యోగుల క్రీడా - సాంస్కృతిక మండలి

# డాక్టరు జె. బాపురెడ్డి గార్కి
# నాగార్జున సాంస్కృతిక కేంద్రం - గుంటూరువారు సమర్పించు
# అక్షరమందారం

డా॥ జె. బాపురెడ్డిగారు 1936లో కరీంనగర్ జిల్లాలోని సిరికొండ గ్రామములో జన్మించినారు. వీరు ఉస్మానియా విశ్వవిద్యాలయములో "ఎకనామిక్స్" పట్టానుపొంది తరువాత I.A.S. ఆఫీసరుగా వివిధ పదవులను నిర్వహించి తన పరిపాలనా దక్షతను నిరూపించుకొన్నారు. ప్రస్తుతము వీరు హిందూ దేవాదాయ ధర్మాదాయ కమీషనరుగా పదవీబాధ్యతలను స్వీకరించినారు.

1967 నుండి 68 వరకు ఉన్నత విద్యాభ్యాసము కొరకు ఐరోపాదేశములోనూ, 1976 మరియు 79లో అమెరికా పర్యటన చేసిన తమ పర్యటనానుభవాలను అపూర్వ కవితాఖండాలుగా మలిచి అందించిన ప్రగతి శిల్పి డా॥ బాపురెడ్డిగారు, 1971లో వీరి ఆధునిక కవితకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి అవార్డు లభించింది. ఈయన స్వీయ కవితలు, గేయాలు, గేయ నాటికలు ఆకాశవాణి మరియు దూరదర్శనుల ద్వారా ప్రజల హృదయాలను చూరగొన్నవి. చైతన్యరేఖలు; రాకెట్టు రాయబారం; బాపురెడ్డి గేయాలు; నాదవేదాలు; అనంత సత్యాలు; వ్యవధిలేదు, In the quest of Hormony మొ॥ వీరి ప్రసిద్ధ రచనలు. వీరి కృషికి మెచ్చి మొరాకో విశ్వవిద్యాలయం వారు గౌరవ డాక్టరేట్ బిరుదును యిచ్చి సత్కరించినారు.

డా॥ బాపురెడ్డి ఆధునికాంధ్ర సాహిత్యాకాశంలో ప్రకాశిస్తున్న ఒక ఉజ్జ్వలతార. పద్యంలోను, గేయంలోను వచన కవితలోను సిద్ధహస్తులు. శ్రవ్య, దృశ్య, కావ్య ప్రక్రియలను నిర్వహించుటలో సవ్యసాచులు. వచన కవిత ఆయన కవితాత్మలోని అంతర్లయను అవలీలగా ధ్వనింపజేసే అక్షరశిల్పం. తన భావనాబలంతో సాహిత్య క్షేత్రంలో వెదజల్లిన ఆణిముత్యాలలోని రంగునూ, రాణింపునూ, పోహళింపునూ, ధ్వనిని ప్రతిధ్వనిని; శిల్పాన్ని, చిత్రణనూ వెలువరించారు.

**డా॥ బాపురెడ్డి మహోదయా!**

మీరు ఇండియన్ ఎడ్మినిస్ట్రేటివ్ సర్వీసులో వుండి అనేక ప్రభుత్వశాఖలలోను మీ అప్యాయత; మీ నైపుణ్యత చూరగొన్న మీక్రింది ఉద్యోగులు; మీకు సమానహోదాలో వున్న స్నేహితులు మిమ్ములను, మీ సహృదయతను ఎన్నటికి మరువలేరు. మీరు ఏసంస్థలో పనిచేసినా మీరాసంస్థకు ఆయువుపట్టు. ఆ సంస్థకే ఒక అలంకరణ. మీ రందించే సహకారమువల్ల అనేక సాంస్కృతిక సంస్థల మనుగడకే ఒకబాట. మీరు గుంటూరులో వున్నప్పుడు అటు టుబాకోబోర్డు ఎగ్జిక్యూటివ్ డైరెక్టరుగా యాక్టింగ్ ఛైర్మన్‌గా వుండి అటు రైతులకు ఇటు పొగాకు ఎగుమతిదారులకు చేసిన సేవ మరువలేనిది.

**కవితాసుందరా! యశోమందిరా!**

గేయ రచయితగా ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడమీ బహుమతి నందుకొన్నందుకు, మొరాకోలోని ప్రపంచ కళా సాంస్కృతిక సంస్థ నుంచి గౌరవ డాక్టరేట్ పట్టాన్ని పొందినందుకు - ఈ అక్షరాంజలి.

చైతన్యరేఖలు, రాకెట్టు రాయబారం, అనంతసత్యాలు, నాదవేదాలు, మరెన్నో పద్యకావ్యాలు, గద్యకావ్యాలు, గేయనాటికలు రచించినందుకు "ఇన్‌క్వెస్ట్ ఆఫ్ హార్మొనీ" అనే కవితాసంపుటిని ఆంగ్లంలో సంతరించినందుకు, వ్యవధి లేని ఉన్నతపదవిలో విధినిర్వహణ చేస్తూనే "వ్యవధి లేదు" అనువదించినందుకు, నిరంతర కవితా వ్యాసంగాన్ని ప్రాణప్రదంగా చైతన్యప్రదంగా స్వీకరించినందుకు, యుగాలు గడచినా జగాన మిగిలిపోయే యశోమందిరాన్ని నిర్మించుకొన్నందుకు - ఈ అక్షరాంజలి.

**మహామనిషీ! కలాతపస్వీ!**

"సొంతలాభం కొంతమానుకు పొరుగువాడికి తోడుపడవోయ్" అన్న గురజాడ మాటలే రాచబాటలుగా, మానవతా వాదమే నవజీవన వేదంగా సాగిపోతూ సారస్వతవల్లికీ, కళామతల్లికీ దేశకాల భాషాభేదాలు లేవని నిరూపిస్తున్న మహామనిషికీ మీకు ఈ సన్మానం. మీలోని కవితా తపస్వికి - ఈ అక్షరాంజలి.

మీరెక్కడున్నా మే మెక్కడున్నా పరస్పరం భావయంత: అన్న ఉపనిషత్సూక్తిని మరచిపోకుండా, మధురానుభూతు లిని విడచిపోకుండా జీవిత పరమార్థాలను చవిచూద్దామనీ, భువన భవనపు బావుటా ఎగరవేద్దామనీ, గళం కలుపుదామనీ, కలం దులుపుదామనీ, హలం నడుపుదామనీ ఆకాంక్షిస్తున్నాము.

సంగీత నృత్య కవితా కళా సాంస్కృతిక కేంద్రాలకు మీ రందించిన చేయూతను మరువబోమని విన్నవించుకుంటూ శివాస్తే పంథానస్సన్తు అన్న కాళిదాస సూక్తిని స్మరించుకుంటూ వీడ్కోలు పలుకుతున్నాము. పునరాగమనాయచ అంటూ స్నేహరసార్ద్ర మనస్కులమై కళాంజలి ఘటిస్తున్నాము.

జయో ఽస్తు ద్విగిజయో ఽస్తు.

గుంటూరు

3-5-1986

ఇట్లు సమర్పణ

**నాగార్జున సాంస్కృతిక కేంద్రం**

**2/14, బ్రాడీపేట, గుంటూరు - 2**

# ప్రసిద్ధకవి శ్రీ జె. బాపురెడ్డి గారికి

సాహితీ వికాస మండలి సిద్దిపేట

సమర్పించు

# సన్మాన పత్రము

**కవితా కళానిధి !**

మచ్చలేని అచ్చమైన తెలుగు తనమును ముచ్చటించుచు, పైరు పచ్చలతో పరిఢవిల్లు పల్లె సీమలో నీతిగల, చక్కని రీతిగల రైతు కుటుంబమున జన్మించి, మోట కాలువ నీటిజాలు గలగలలు, పులుగుల కలకలారవములు గుండెను పులకింప జేయగా, పలుకుల రాణి వాణి వీణావాదము మృదువుగా ఎదను కదలించగా, కమ్మని పాటలతో కలికి పచ్చిక బాటలలో పరుగులు తీయుచు కవిమూర్తికి రుచిరమైన రూపురేకలు దిద్దుకొన్నారు.

**ప్రతిభా సంపన్నా !**

హృద్యములైన పద్యములతో, రకరకముల, రంగు రంగుల పువ్వుల నవ్వులతో నివ్వటిల్లు పుష్ప వాటికల వంటి గేయ నాటికలతో, సుధారస స్రోతములైన గీతములతో ఆంధ్ర సహృదయ లోకమును ఆనంద పులకితము చేసిన చాతురీ ధురీణులు మీరు. మీకృతులు భారతీదేవికి అమూల్యాంకృతులు. సాహిత్య అకాడమిచే స్వీకరించిన బహుమానము మీకు ఎనలేని సన్మానము.

**కవి శిరోమణీ !**

కళా హృదయులైన మీ ప్రత్యేకాధి కారిత్వ ప్రాభవమున సంగీత నాటక అకాడమి సౌభాగ్యమును సంతరించుకొని, నవనవోన్మేషముగా, నాణ్యమైన పరివేషముగా ప్రగతిని సాధించి, జగతిని ప్రబోధించి కళాకారులలో క్రొత్త చైతన్యమును మత్తడి దూకించినది. సత్య శివ సుందరమైన, నరసతా బంధురమైన సాహితీ స్ఫూర్తితో నిత్యముగా, నిరవద్యముగా ప్రచురిత మగుచున్న మీ రచనా కలాపము కలకాలము విలసిల్లగల దనుటలో సందేహము లేదు. ఇట్టి మీకు మా ప్రశంసాప్రసూన మాలికా పాలిక.

ఇట్లు

తేదీ : 9-10-1977.

**సాహితీ వికాస మండలి**

సిద్దిపేట.

# చందనం

సాహితీ మూర్తి - కవితా పరిశ్రమల కమీషనర్

చూపులోను - రూపులోను
స్వచ్ఛమైన మధుర కవి
అభిమాన కవి డా॥ జె. బాపురెడ్డి గారికి
భవదీయుడు భక్తితో నమస్కరిస్తూ......

ఆదివారం ఆంధ్రభూమిమ్మీద
మీ సాహితీ విరాట్ స్వరూపాన్ని దర్శించాను

కవిత్వంలోని రకాలను గురించి అడిగినా
కవిత్వపు రంగులను గురించి అడిగినా
మీరు సమాధానం చెప్పిన తీరు
నన్నెంతో ఆకర్షించింది.

'కవిత్వంకానీ సాహిత్యంకానీ వ్యాపారమైతే
మంచి కవిత్వం మరుగున పడిపోతుంది' అనడం
బాపురెడ్డి భాష్యం!
'యువకవులు చాలా బాగా రాస్తున్నారు
కాకపోతే వాళ్ళకు తగినంత ప్రచారం లేదు' అనడం
బాపురెడ్డి సత్యసాక్ష్యం!

'కల్పనా కవిత్వం కన్న
వాస్తవాన్ని, ఒక సత్యాన్ని కవిత్వం
ఆవిష్కరింపచేయాలి'
అనడం బాపురెడ్డి తీర్పు!
కవికి - మహాకవికీ గల తేడాని విప్పి
విడదీసి చెప్పిన శైలి ఒక్క బాపురెడ్డిగారికే చెల్లు.....
ఇంటర్వ్యూలో కూడా కవితాత్మకంగా
సమాధానపరిచిన
మీకు - ఈ అభిమాని కృతజ్ఞతాభివందనాలు.
మీ ఇంటర్వ్యూని నేను చదివి
సాహితీ మిత్రులచేత కూడా చదివించాను
ఆ మధ్య మీ కవితా గ్రంథాలు కోరుతూ రాశాను!
మీ గేయాలు కవితలు క్యాసెట్ రూపంలో
వెలువడాలని
ఆశ - మీ గొంతు విని చాలా కాలమైంది.

భక్తితో నమస్కరిస్తూ
భవదీయుడు - **వి.పి. చందర్ రావు**
*3-14-31, నల్ల హనుమాన్ స్ట్రీట్,*
*నిజామాబాద్-503 001.*

# గుణగానం

వెండి మబ్బు గుండె మీద
బొండు మల్లె విరిసినట్లు
కొండవాగు కోయిలతో
గొంతుకలిపి పాడినట్లు
కనసొంపుగ వినసొంపుగ
కవితలల్లు "బాపురెడ్డి"
పేరందిన సారస్వత
ప్రియులపాలి "వేల్పు గిడ్డి"

విశ్వకవుల పరిచయమును
విస్తృతముగ పెంచుకొంటు
అనుక్షణం ఎదుగుతున్న
అవధిలేని "రసపిపాసి"
ప్రణయరాగమధురిమలను
ప్రణవనాదమందు పొదిగి
సిరి తరగని రచనలెన్నొ
చేసినట్టి "సవ్యసాచి"

అతని కలమూ - గళమూ రెండూ
అభ్యుదయానికి "కొలమానం"
అతని ప్రతిభకు బహుమానంగా
అందిస్తున్నా ఈ "గుణగానం"

**-సహజకవి మల్లెమాల**

# చైతన్య ఝురి

సిరికొండ పల్లెలో పుట్టి
సెలయేటి నడకల కేరింత లిడి
చిరంజీవి గానే
"చైతన్యరేఖలను" హృదయానికి హత్తుకొని
"నాగేటిచాలులో
నడిచేటి కూలన్న"లకు చెలిమిని పంచి
వేదం ఎదలో
ఒదిగిన కథలను చదువుకొని
ఆలోచన పాదులో
"అనంతసత్యాలను" నాటుకొని
నదీతీరాలలో పులకించిన
"నాదవేదాలను" ఎదలోన అదుముకొని
"శ్రీకారశిఖరం" మెట్లెక్కి
సిరివెన్నెలలను పండించుకొని
ప్రాంతాలు వేరువేరైనా
పక్షుల కిలకిలరావాలు ఒకటేనని
సరిహద్దులు వేరువేరైనా
సరిగమల రుచులన్నీ ఒకటేనని -
సువిశాల ప్రపంచాన్ని చుట్టి
చూపులకు .. చూపులకు పదునుపెట్టి
గీతాన్ని సెలయేటి తరగలా పారించి
జాతి బ్రతుకులో వెన్నెలలు కురిపించి
తెలుగు సాహితిని మురిపిస్తున్న ఝురిని
తల్లిభారతిని వెలగిస్తున్న కవిరవివి.

-అన్నపురెడ్డి విజయభాస్కరరెడ్డి
అనుపాలెం, గుంటూరు

# తిరుపతి

నేను చదివాను బాపురెడ్డి గేయాలు
అనంతాలు ఆ భావాలు - ఆనందపు కేరింతలు
అవి వారికే సొంతాలు
చూపులో చూపు సారించి
నీవు నేను ఒకటని - నిరూపించిన భావం
నీలో దేవుని కలిసి - తెలుసుకొన్న భావం
తెరువు లేనపుడు - తిరుపతి అనే భావం
నిశ్శబ్ద శూన్యారాధన - శ్రీతశ్రీ చక్ర జ్ఞానం
గ్రుడ్డియై చెవిటియై - మూగవోయిన భావం
సత్యభావ విజ్ఞానం - అనంతాలు
ఇంకా
బాపూ - మీ వాక్కులు జాకీలే
లీలా గ్రంథపు పుటల
చవిచూచిన భావాలు
మీ శృంగారం సులలితం
దీపం కనురెప్ప క్రిందున్నా వెలుగును గుర్తించాలా
మీ ఊహించని వివేక భావావేశం
నిజంకూడా నిజాన్ని
ఎరిగిస్తేగాని ఎరుగదా?
బాపూ - మిమ్మెరగటం మీకు
నన్ను నేనెరిగించటం
అవి విమాలిన తటం అద్వైతంలో ఆనందం
తప్పులేవో ఒప్పులేవో తెలుపు సూత్రం
మీకే కరతలామలకం
మీరు తెలియాల్సిందే
తెలిపే ఓర్పు నేర్పు
I Know not
నా కెక్కడ? తిరుపతీ!

-సత్యసుధ
12-63, పి టి కాలనీ,
హైదరాబాద్-500 660

## పరిచయము

కవితకు బాపు నవతకు ప్రాపు
బాపురెడ్డి కలంలో తీపులు
కోవిదుల హాయికి దరిదాపులు
అవే పలుకు వెలది చల్లని చూపులు
గేయసామరస్యం రసానికి భాష్యం
వసంతాల రహస్యం సరసాలకు లాస్యం
ఉద్యోగ పర్వంలో సాహితీ సముల్లాసం
సారస్వతోద్యానంలో జాజి పుష్పోల్లాసం
అదే కదా శ్రీ బాపురెడ్డికి
వాణీ కటాక్షవిలాసం
సుంతలో రామకౌండిన్య లేఖినిలో
ఆశీరభినందన చందన వికాసం

## రామచిలుక

అదే కోవలో చిలక మీ యింటి పైది
భారతి ముంజేతి పలుకుచిలకేమొ?
ఏమేమి పలికించి కులికింపగలదో?
తెలుగు తేనెల వాన చిందింపగలదు.
మరి ఏమి ముచ్చటల్ మాటాడమనునో?
అందాలపై పాట లందింపమనును
ఈ తెలివి ఎవరిదే అని అడిగినారె?
మా పెద్ద దొరనేర్పు మంత్రమే అనును
కలనాదమెట్లు నీ కంఠాన నిలిచె
బాపు నేర్పిన రాగ భావమే అనును
ఏ వంశమే నీది? ఏది గోత్రమ్మా?
బాపు వంశమునాది. రామ గోత్రమ్మ

భవదీయుడు

**-రామకౌండిన్య కవి**
Vidwan C.S.R. Appa Rao
English & Telugu Poet
on his 82nd birthday on 23.10.1988
H.No.19, SRT Ameerpet, Hyderabad - 16

★ ★ ★ ★

## సిరిగిరుల నెరసిన మా చిన్నిరెడ్డి

భావసంపద గలిగిన మా భాగ్యరెడ్డి
విశ్వమంతయు వెలసిన మా వన్నె రెడ్డి

పలుకనేర్పని నన్ను పలికించితీవు
పొగడనెరుగని నన్ను పొగిడించితీవు
వినయమెరుగని నేను వినుతింతునిన్ను
వెన్న మనసున్న నిన్ను కరిగింతు నేను

నాకు నచ్చిన నిన్ను
నేను మెచ్చిన నిన్ను
నిన్న జూచిన నిన్ను
నేడు పాడితి నిన్ను
దాచుకో ఇక నన్ను
దహియింపకికముందు
ఉంటాను...............

***-ఎస్. వెంకట్ రావ్, ఎం.ఏ., ఎల్.ఎల్.బి.***

*అడ్వకేట్, సిద్ధిపేట.*

*1992 అక్టోబర్, 20*

# సన్మాన పత్రము

## శ్రీ పాంచాలరాయ ద్వాదశాక్షరజప విధాన గ్రంథావిష్కరణము

శ్రీకృష్ణదేవాలయము, శాయంపేట హవేలి, తాలుక, జిల్లా వరంగల్

దేవస్థానం ధర్మకర్తలు - పూజారి వర్గములోని

**శ్రీమాన్ కొండపాక సీతారామాచార్యులు గారు సమర్పించు సన్మానపత్రము**

ఆ.వె॥ భక్తజనవరిష్ఠభాగవతోత్తముల్ । సభను దీర్చియున్న సమయమిద్ది ।
నిండు భక్తి తోడ నీద్వాదశాక్షరీ, జపవిధానమిద్ది సరళ కవిత ॥

గ॥ కాకతీయుల 'ఓరుగల్ కలకటేరు । గారు జె. బాపురెడ్డి ఈ గ్రంథ మిచట ।
చక్కనావిష్కరిపంగ సజ్జనాళి । జయజయులు వెట్టిరోయి పాంచాలరాయ ॥

ఉ॥ మాయని దేశభక్తి సనమంబగు రక్తి ననేక సత్కృతుల్
వ్రాయ, ననేక సత్కృతుల ప్రాభవమొంద ననేక సత్కృతుల్
వ్యాయతినంద, కృష్ణభగవానుడు శాయమపేట వాసిదీ
ర్ఘాయువు భోగభాగ్యముల నంతయశంబిడి మిమ్ముఁ బ్రోచుతన్ ॥



కార్యశూరుడైన - కవివరేణ్యుడు - వెల్గు;
పసిడి తెలుగు గడ్డ - బాపురెడ్డి;
గర్భిణీ సవిత్రి గమకమ్ములో నోలె
అతని కవిత - అంతరార్థ మలరు!

**-నండూరి రామకృష్ణమాచార్య**



ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికాభివృద్ధి సంస్థకు ఉపాధ్యక్షపరిపాలక సంచాలకులుగా నియమితులైన

**డా॥ శ్రీ జె. బాపురెడ్డి** ఐ.ఏ.ఎస్. గారికి స్వాగతాంజలి

ఆలోచనాలోచనయుత గంభీర వదనం
భావ బంధుర కవితాహృదయ సదనం
పరిపాలనాదక్షత జగద్విదితం
ప్రాచీన భావ విమోచిత వివేచనా శక్తి భరితం
వారి సాంగత్యం పర్వజనముదావహం
వారి ఆదర్శం 'యోగక్షేమం వహామ్యహం'

**-పువ్వాద బాపిరాజు**
*15-7-92*

# వందనం! అభివందనం!

ఎన్ని నోముల పుణ్య సఫలమో!
ఎన్ని వరాల సఫలమో!
ఎన్నో మధుర భావనలతో!
ఏవో తీయని అనుభూతులతో!
పొంగిపోతూ జాలు వారుతున్న
ఆనందభాష్పాలు
సాహిత్య కళామతల్లి
వడిలో ఓలలాడుతున్న
ముద్దుబిడ్డకు
వందనం! అభివందనం!

అనితరసాధ్యమైన కృషితో
ఆనంద తరంగ పదమాలికలతో
సాహిత్య కళామతల్లి మెడలో
పూలహారాలై వికసిస్తున్న
మీ పదాల కమనీయ రూపానికి
వందనం! అభివందనం!

ఓ బాపురెడ్డి గారు!
మీకు మీరే సాటి!
లే రెవ్వరూ మీకు పోటి!
అందుకే మీకు
మా ఈ అభివందనం!

మీ అభిమానిగా
మా ఈ చిన్ని అభివందనాన్ని
స్వీకరించవలసిందిగా కోరుతూ
మీ అభిమాని

**-ఎ.ఎ. ప్రసాద్**

*28-2-1993*

# పూలతావి సొగసు

పూలతావి, సొగసు, పుప్పొడి, మధువుల
తేట తెనుగులోన తీర్చినావు
తెనుగు తల్లి వడిని తీయని పదముల
పాడి ఆడినావు బాపురెడ్డి!

మాట తీపి మించి మనసు వెన్నెల పంచు
మనసు మించి చేత మమత పెంచు
కలిమి బలిమి విద్య గాంభీర్య మంతయు
నీదు రూపు దాల్చె నిశ్చయముగ

కొండ కొమ్ము పైన కూరుచుంటివి నీవు
నిన్ను జూడ మనసు నిలువదాయె
ఎన్ని మెట్లు గడచి వెదుకగా వలయునో
అన్న! నీదు రూపు అబ్జ భవము

కవులు పుట్టవచ్చు కావ్యముల్ రావచ్చు
కార్య సాధకులను కనగ వచ్చు
తెనుగు గడ్డ గడుసు తెంపరితన మేమి
కలము బలము రెండు కలసి నడచు

నీదు సంచిక చదివితి, నిలచిపోతి
ఇన్ని నాళ్లకు అదృష్ట మిటుల కలిగె
నిన్ను చదువంగ మనసాయె నేటినుండి
వెదుక సాగితి నీ మధు పథము వెంట

గౌరవాభిమానాలను మించి అప్యాయతానందాలతో
దీపావళి ఆకాంక్షల నందుకోండి.
మీ అభిమాని

**-పోలవరపు కోటేశ్వరరావు**

*విజయవాడ*

*5-11-1988*

ప్రఖ్యాత కవి డా॥ జె. బాపురెడ్డి ఐ.ఎ.ఎస్. గారికి

సన్మానోత్సవ సందర్భంగా సమర్పిస్తున్న

# అభినందన చందనం

జాతీయ సంస్కార కేంద్రమైన తెలుగుగడ్డ మీద సిరికొండ విరిసిన జాతి కుసుమం డా॥ బాపురెడ్డి గారికి సహృదయు లందరి తరపున చేతన హృదయపూర్వక నమస్సుమాంజలి సమర్పిస్తున్నది.

చిన్నతనం నుండే నిరంతర పరిశ్రమతో ఎంతో విద్యాగంధాన్ని సంతరించుకొని దేశవిదేశాల్లో సంస్కార పరిమళాలను పంచుతున్న విద్యావేత్త డా॥ బాపురెడ్డి గారికి చేతన స్వాగతం పలుకుతోంది. సాహితీ చైతన్యం శతసహస్ర రేఖలుగా మెరసి సరికొత్త జీవిత చిత్రాలను నిలిపింది. చైతన్యరేఖలు శారదవీణాతంత్రులై ఝుంకార సారంగా, అమూల్య హారంగా భావిస్తున్నాయి. మీకు మా కళాభివందనాలు.

ప్రతి గాయం ఎన్నో గేయాలుగా రూపుదిద్దుకొంటుందని, ఎన్నో దెబ్బలు తింటేనే శిల శిల్పంగా మలచబడు తుందని మీ గేయాలు చాటుతున్నాయి. మానవత్వం, సమానత్వం మీ సాహిత్యానికి రెండు కళ్ళు. మానవుడు సాహిత్య ప్రయోజనానికి కొలబద్ద. అటు ప్రాచీన రస సిద్ధాంతాన్ని, ఇటు ఆధునిక మానవతావాదాన్ని సమన్వయం చేసిన మీ విజ్ఞతకు మా కళాంజలి.

ఈ వేదభూమిపై సరికొత్త నాదం పలికించి మొత్తం విశ్వాన్ని పరికించి నాదవేదంగా, అనంతసత్యంగా దేశ విదేశాల మనఃక్షేత్రాల్లో కాంతిగర్భితమైన చైతన్య బీజాలను నాటిన సాహితీ కృషీవలా! మీ కిదే మా అక్షరమాలిక!

రాకెట్ వేగంతో సాగే సమస్యల నిలయమైన నేటి ప్రపంచంలో దేశాల మధ్య, మానవహృదయాల మధ్య రాయబార కార్యభారాన్ని సమర్థవంతంగా నిర్వహిస్తున్న మీ సాహిత్యం నిజంగా అభినందనీయం!

తెలుగుదనంతో ఇంగ్లీషు గుండెలను పులకింపజేసిన మీ సమరస వాదానికి మా నమోవాకాలు.

విద్యార్థి మొదలు కలెక్టరు వరకు, సాహితీ విద్యార్థి మొదలు కవిపీఠంవరకు ఎన్ని శిఖరాలదాకా ఎదిగినా మదిలోని మంచితనాన్ని, పెదవులపై చిరునవ్వుల్ని భద్రపరచుకో గల్గిన సౌజన్యశీలీ! మీకు మా భావసుమమాలిక!

సమగ్రమైన మీ వ్యక్తిత్వాన్ని దూరం నుండే గ్రహించిన అంతర్జాతీయ కవిమిత్రుల కళాసాంస్కృతిక సంస్థ గౌరవ డాక్టరేట్ పట్టంతో మిమ్మల్ని సత్కరించి, కళామూర్తిని సన్మానించినట్లు సంతృప్తిపడింది. చంద్రుని కొక నూలుపోగులా మా సాహితీ సాంస్కృతిక సంస్థ చేతన అందిస్తున్న ఈ చిన్న సన్మానాన్ని చిరునవ్వుతో స్వీకరిస్తున్న మీకు మా కృతజ్ఞతాభివందనాలు.

**చేతన**

గుంటూరు

14-3-1985

**సాహితీ సాంస్కృతిక సంస్థ**

గుంటూరు

# ఉగాది శుభాకాంక్షల ఉల్లేఖన

శ్రీ భావ వర్ష ప్రగతిని
లాభాలను సేకరించి రక్షణ నిలిపే
ప్రాభవమందియు పొదుపున
శోభిల్లును బాపురెడ్డి సుస్థిరప్రజ్ఞన్॥

పెచ్చగు ధరలతొ పొదుపును
ఇచ్ఛామాత్రంబుగాక యిలవేలుపుగా
నిచ్చలు జనులే ధరలో
మెచ్చుచు మహి నిర్వహింప మెలకువ నిడరే॥

సాగెడి మీ ప్రచారమున సాకెడి సత్వథకాల జీవనన్
యాగ విశిష్టకర్మ జతయాడగమానవకోటి బాధలన్
ప్రీగక సర్దుబాటుగొని విల్వల - నిల్వల నెంచి పెంచగా
భాగమునిల్పు యత్నములు పంపిణి చూపరె
ధర్మ వీరులై॥

అదునున కాదు కొనున్ గద
పదునిడి రెట్టింతలొచు పథకములందున్
విదళిత మౌ పొదుపన్నది
మెదలునుగా మానవత్వ మిచ్చుచు ప్రగతిన్॥

చంద్రుడు రాజై గురుడును
సాంద్రత మంత్రిపదవి సమకూర్చుటచే
మాంధ్రుల బుధుడే శిక్షణ
ఐంద్రీహితచరణ కర్మలందున నిల్పున్॥

గ్రహపుష్టి భావవత్సర
సహనమ్మున సాగ శుక్రు సంస్కారములన్
మహనీయత కల్పించును
అహరహమును రవికుజుండు ననుసరణమ్ములన్॥

శనిర్రాహుకేతుగమనము
సున్నితమౌ కార్యములు శుష్కపరచగా
వినియోగ దారు లెప్పుడు
పనిగా సుఖదుఃఖములతో పోరాడెదరే॥

అయినను బాపూరెడ్డియు
నయముగ మనసార ప్రజలు నష్టముగొనకన్
భయమార్చి సాయసంపద
నియమంబుగ పొదుపునందు నిలువగ జూచున్॥

అధికారిగ సంక్షేమము
సదయత సాగించి పొదుపు సంతరణములో
కదలాడు కర్మయోగిగ
మది మెచ్చెద బాపురెడ్డి మననీయతనే॥

మానవతావాదియైన శ్రీ బాపురెడ్డి, కమీషనర్
చిన్నమొత్తముల పొదుపు సంస్థ
హైదరాబాద్ వారికి
శ్రీ భావనామ సంవత్సర ఉగాది శుభాకాంక్షలతో

విధేయుడు,
**-జిల్లేపల్లి భాస్కరరావు**
*29-9-14, విజయవాడ - 520 010*
*11-4-1994*

# వెన్నెల సరోవరం

ఎదలో ఉప్పొంగే సహజ సంతోషామృతం
వొలికి నేలంతా ప్రాకింది
అనిర్వచనీయమైన అశాంతి ఏదో
అస్పష్టతగా, అంతర్ముఖమై అల్లకల్లోలం రేపింది
వున్నట్లుండి వెలుతురు కన్ను మూసింది
ఏదో, అంతుపట్టని నిరాశ మనసు గది నిండా కమ్ముకుంది.
దాక్కున్న ప్రకృతి ప్రతిరూపం, స్పష్టంగా రూపు దిద్దుకుంది
ఆహ్లాదానికి, ప్రత్యర్థం జవాబుగా నిలిచింది.
నవ్వులు వెదజల్లే గులాబీ కిటికీ దరి చేరి
నునులేత రేకుల్ని, నా చెక్కిలిపై నిమిరి ఉత్తేజపర్చింది
అల్లంత దూరంలో నను పసిగట్టిన యూకలిప్టస్ చెట్లు
చేతులు ఊపుతూ, నను లోకంలో లాక్కున్నాయి
నా నయనాలపై, ముద్దులు కురిపిస్తూ గాలి చలచల్లగా తాకింది
రెక్కలు వూపుకుంటూ "వనితాజ్యోతి" నా గుండెపై వాలింది.
రెపరెపలాడే పేజీల, రెక్కలు విప్పుకుంటూ పింఛము వలె పరిచింది
తన రెక్కల్లో ఆహ్లాదం తెచ్చి పెట్టింది.
బాపురెడ్డి ప్రతిష్ఠ గిరి శిఖరమై నను ఆకర్షించింది.
ఈ లోకమంతా నిర్మలమై కాంతి కిరణాలు పర్చుకుంది
కొన్ని క్షణాల క్రితం అశాంతి క్షణాలు నరకాన్ని చూపాయి
మనిషికి మనసే శిక్ష అన్న కవి ఆత్రేయ రూపం నా ఎదుట నిలిచింది
గతి తప్పిన జీవిత చక్రం మరల మార్గంలో పడింది.
వెలుతురు చీకటికి కన్ను గొడుతూ
చివర్కి అదిరించి బెదరగొట్టి తరిమింది
ఇప్పుడు అంతా వెన్నెల మయం
శ్రీ బాపురెడ్డి ప్రతిభా సరోవరం

-ఎం.డి. ఖాన్

పంచాయతీ కార్యాలయం, కంకిపాడు.

*9-4-1993*

# ఆత్మీయతాంజలి

-వి. శ్రీశైలం
(Post & Mandal) Cherial
(Dist) Warangal
Pin : 506 223

ఎన్నికమ్మని కలల
దింత చక్కని కవిత!
ఎంత వెన్నెల సొగసొ
ఈ భావముల నవత !

సిరికొండలో పుట్టి
సిరిమల్లెలా పెరిగి
పకృతిని నిశితముగా
పరికించితివా నాడు!

కర్షకునిగా గడిపి
కలెక్టరు వైనావు
ఎంత పైకెదిగినా
ఎద పెంచుకున్నావు.

కడగండ్ల బ్రతుకులను
కరుణతో జూశావు
పన్నీరు కురిపించి
కన్నీరు తుడిచావు.

మల్లెవలె మనసంత
తెల్లగా జేశావు
కవితాత్మ ఉప్పొంగ
కవితలను వ్రాశావు.

బంగారు భావాల
భాగ్యశిఖరా లెక్కి
వెన్నెలల దారులను
ఎన్నెన్నొ చూపావు.

ఎన్నెన్ని భావాలు
ఎన్నెన్ని రాగాలు
కవితాత్మ పాడంగ
కరిగిపోయా వెపుడు.

నీకవిత వ్రాసినా
ఎద పొంగి వ్రాశావు
ప్రతికవితలో బ్రతుకు
పావనము జేశావు.

వచన కవితలు ఎన్నో
వలపు కవితలు ఎన్నో
గేయనాటిక లెన్నో
తీయగా వ్రాశావు.

ప్రతికవితలో నీవు
ప్రతి పలుకులో నీవు
అభ్యుదయ భావాలు
అలరింప జేశావు.

పడికెడన్ని పూలు
ప్రేమతో అందిస్తె
కవితాత్మలో కలసి
కరుగు నీ నిజదేవి.

అందాల నీదేవి
మందారమాలను
అందుకొని నీచేత
తొందరగ జడ నల్లి

ఆదరముతో వచ్చి
అధరమ్ము నందించి
ప్రణయతత్వము తెలిసి
ప్రణమిల్లు నీముందు.

ప్రతికవితలో నిన్ను
ప్రాణమై కదలించు
అందాల నీదేవి
అదృష్ట జాతకుడవు.

నిజ జీవితములోన
మజ జూపు నీదేవి
"ప్రేమారామం" నకు
ప్రేరణమె ఆమెనో?

రసరమ్య భావాల
రాగాలలో కవులు
ఊహాసుందరులతో
ఊగిపోతుంటారు.

అందాలతో ప్రేమ
బంధాలు పెంచుకొని
రసరాగిణిగ మారు
రతిరాణు లెందరట?

పతి మధుర కవితలకు
పరవశించని సతికి
గంపెడన్నీ పూలు
కరిగించు నామతిని?

ఎన్ని తేనె తెట్టెల
ఇంతతేనియబోసి
" పంచబాణ సంటా"
"ప్రణవ ప్రణయం" వ్రాసి

" ప్రేమారామం" లో
ప్రేమనే సత్యమని
ముసలిరక్తము గూడ
మసలంగ జేశావు.

భాషలో భావములో
బంగారు రాగాలు
పాడావు ఆడావు
పరుగెత్త జేశావు.

ముసలి తాతలు గూడ
ముసలి భార్యల జేరి
కొంటె చూపుల తోడ
వెంటబడ జేశావు.

అయస్కాంతమా అది?
ఆనందమా అది?
సత్యమా నిత్యమా
సచ్చిదానందమా?

ఎటు తేల్చలేకుండ
ఎడ్డి దైనది మనసు
పరుగెత్త లేకున్న
పరుగెత్తినది వయసు.

నందన వనము జేసి
నాద స్వరములు పాడి
దేశమాతకు వంగి
తేలిపోయితి వీవు.

తెలుగుతల్లి గుండెల
తీయగ విరబూసిన
అనంతపు సత్యాలు
అందాల నృత్యాలు.

ఆంధ్రసత్కవి వయ్యి
ఆంగ్ల భాషలోగూడ
అందాల కవితలను
అలరింప జేశావు.

ఎన్నెన్నొ అందాలు
ఎన్నో ఆనందాలు
దేశ దేశాలెన్నొ
తిరిగి చిత్రించావు.

అందాల భావాల
అనుభవపు సుమమాల
మాకు అందించావు
మధువులను పంచావు.

దేశదేశాలలో
తెలుగువారలు నీదు
మధుర కవితకు పొంగి
మనసార మెచ్చారు.

ప్రపంచ కవుల మహా
సభలో "డాక్టరేటు"
గౌరవ బిరుదు నిచ్చి
గౌరవించిరి నిన్ను.

ఆంధ్ర దేశములోని
అందాల కవులలో
పరిణతపు కవి వంచు
ప్రస్తుతింతురు నిన్ను.

బాపురెడ్డి, కవితా
బంగారు కడ్డి వని
ఆత్మీయతాంజలులు
అర్పించుచున్నాను.

# మాకు తెలియని శ్రీ బాపురెడ్డి

- శ్రీమతి బి. అక్కమాంబికాదేవి

శ్రీ జె. బాపురెడ్డి గారు ఆధునికాంధ్ర సాహిత్యాకాశంలో నిత్య నూతనంగా ప్రకాశిస్తున్న ఉజ్జ్వల తార. వీరు పద్య, గద్య, గేయ రచనలలో సిద్ధహస్తులు. గేయ రూపక రచన ప్రక్రియల ప్రయోగంలో నేర్పరులు. ప్రాచీన ఆధునికాంధ్ర సాహిత్య కవితా రచనల సవ్యసాచి. వీరు 1936 సంవత్సరము ఆంధ్రప్రదేశ్ కరీంనగర్ జిల్లా సిరిసిల్లా తాలూకాలో సిరికొండ గ్రామములో జన్మించినారు. బాల్యమంతయూ ప్రకృతి ఒడిలోనే తియ్యగా గడచినది. పూల నెత్తావుల గుసగుసలు, అతరసి ఫలముల నాట్యములు, సెలయేరుల గలగలలు, వినీలాకాశంలో కన్పడు వింత వింత చిత్ర విచిత్రాల వీక్షణలు, కవిని ఊహల ఉయ్యాల లూగించి కమ్మని కవితలు వ్రాయుటకు ప్రోత్సహించినవి.

1951వ సం॥లో ప్రథమంగా కవితా జీవితం ప్రారంభమైంది. 1953లో మెట్రిక్ ప్యాసయ్యారు. కళాశాలలో విద్యార్థి నాయకుడుగా గణుతి కెక్కినారు. నిజాం కళాశాలలో బి.ఏ. పరీక్ష 1957 సం॥న ఉత్తీర్ణులయ్యారు. 1959 సం॥లో యం.ఏ. ఎకనమిక్సులో ప్రథములుగా కృతార్థులైరి. 1960 సం॥న డిప్యూటీ కలెక్టరుగా సెలక్టు అయినారు. 1961 సం॥ నుండి పలు రంగములలో పలు విధములైన పదవులు నిర్వహిస్తునే యున్నారు. 1967-68 సం॥ము నెదర్లాండ్సు ప్రభుత్వము ఫెలోషిప్ మీద హెగ్ నగరము దర్శించి వచ్చినారు. వారు పలు విదేశములు పర్యటించి వచ్చినారు. 1961 సం॥ హైదరాబాదు వచ్చినప్పటి నుండి కవితాసాహిత్యముపై దృష్టి పెరిగినది. తెలంగాణ రచయితల సంఘ ప్రభావంపై బడినది. శ్రీ దాశరధి, శ్రీ సి. నారాయణరెడ్డి గార్ల రచనలంటే అభిమానము. వీరు రేడియో ప్రోగ్రాములలోను - టి.వి. ప్రోగ్రాములలోను పలుమారు పాల్గొనుటయేగాక వీరి కవితా గీత స్రవంతులచే ప్రజలకు "చైతన్య రేఖలని" పేరిడి డాక్టర్ సి. నారాయణరెడ్డి గారి కంకిత మిచ్చినారు.

ప్రేరణ లేనిదే కవిత్వము రూపుదాల్చదు. బాపురెడ్డిగారి అనుభవములు అనుభూతులకే అందమయిన అక్షర మాలికలచే కూర్చబడిన గేయములను, కవితలను నాలుగు ప్రధాన విభాగములుగా విభజించి నలుగురు ప్రముఖులకు అంకితమిచ్చి యున్నారు.

పద్య కావ్యములను శ్రీ సి.ఎ.జి. కృష్ణమాచార్యులు ఐ.పి.ఎస్. గారికి, గేయ నాటికలను ప్రముఖ చలన చిత్ర నటులైన శ్రీ గుమ్మడి వెంకటేశ్వరరావు గారికి, గేయములను శ్రీ బోయి భీమన్న గారికి, గద్య కావ్యములను డాక్టరు శ్రీ బెజవాడ గోపాలరెడ్డి గారికి అంకితమిచ్చి యున్నారు.

దేశకాలానుగుణంగా భౌతిక ప్రయోజనాను కూలంగా ఒకే వస్తువుగా అనేకానేక సత్యదర్శనం చేయగల మహాశక్తి కవితా సమర్థుడు శ్రీ బాపురెడ్డి. వీరి కవితల్లో ఆర్ద్రత, ఆవేదన, మమత, సమత, మానవత్వం, నూతనత్వం అడుగడుగునా కన్పిస్తాయి. వీరు సన్యాంధ్ర జనతా కవీశ్వరుడు, రసరమ్య కావ్యస్రష్ట, పసిడి భావాల పగడాల గని. వీరి కవితలు వెన్నెల ప్రవాహం పరిమళ గంధం. అమృతభాండం.

మహాకవి శ్రీ. జె. బాపురెడ్డి గారికి రామగిరి లలిత కళాసమితి, పెద్దపల్లి వారు సమర్పించు

# సన్మానపత్రము

**నిత్య సాహిత్య విద్యార్థీ!**

ఉత్తర వాహినీ యనబడు గోదావరి తీరమున దక్షిణకాశి యనబడు త్రిలింగములలో నొక లింగమైన కాళేశ్వరం ప్రాంతములో కరీంనగరం జిల్లా సిరిసిల్లా తాలూకా 'సిరికొండ' లో పుట్టి తెలుగు దేశపు గ్రామీణ జీవితాన్ని అనుభవించి , నిత్యసాహిత్య విద్యార్థివై అవిశ్రాంతముగా విద్యనభ్యసించి ఆధునిక సారస్వతమున శేముషీధురంధరుడవై, గతాన్ని మరచిపోని వ్యక్తిగా, భవిష్యత్తును ఆహ్వానించే మనస్విగా, ఆధునిక సారస్వతమున గేయకృతులు రచించి, అంద రెరిగిన గొప్పవానిగా అంతర్జాతీమ ఖ్యాతి గడించి సిరికొండ ధీకొండవై తెలంగాణ కళామతల్లి ముద్దుబిడ్డవైనావు.

**మహాభాగ్య!**

ప్రతిభ దేవతానుగ్రహ సంపాద్యము. ఉస్మానియా విశ్వవిద్యాలయంనుండి ఎం.ఏ, పట్టభద్రుడవై ఇంకా ఎన్నో అనేక దేశ విదేశ పరీక్షలలో ఉత్తీర్ణుడవై ఐ.ఏ.ఎస్., ప్యాసై అత్యున్నత స్థానాన్ని సంపాదించారు. ప్రతిభతో అనేక ఉన్నత పదవుల నలంకరించారు. అమెరిక, ఇంగ్లాడు, ఫ్రాన్స్, రష్యా, చైనా, ఈజిప్ట్, జింబాబ్వే మొదలుగా ముప్పది విదేశాలలో పర్యటించి అనేక గౌరవ పురస్కారాలు పొందారు. ఔదార్యము, శాంతము, మాధుర్యము, స్పష్టత మొదలుగాగల ఎన్నో ఉత్తమ గుణములు మీలో ఉన్నాయి. ధర్మాభినివేశము, ధార్మికతకు మీరు పట్టుకొమ్మలాంటి వారు. అనేక సాంస్కృతిక సంస్థలకు మార్గదర్శకులై, ఇంకా ఎన్నో వాణిజ్య వ్యాపార సంస్థలకు అధికారులై, డి.లిట్., పట్టాను పొంది, ప్రథమ ప్రపంచ తెలుగు మహాసభలకు కార్యదర్శులై మీకార్యదక్షా దీక్షతలను, ప్రజ్ఞాపాటవాలను ప్రదర్శించి తేజస్విపై గొప్పవ్యక్తిగా ఆధునిక సారస్వత జగత్తులో సరస్వతి పుత్రులై భాసిల్లుచున్నారు.

**మహాకవీ!**

మీకావ్యాలన్ని రసోపనిషత్తులు. ప్రతిభోత్థాపితమైన కారణములతో సత్యమును ఆనందముతో సమ్మేళనము జేసి, సర్వజనానురాగముతో ఆనంద సత్యాలను చెప్పారు. శృంగార, హాస్య, కరుణ, వీర భయానక, బీభత్స, రౌద్ర, అద్భుత, శాంతములను పోషించి కమనీయ గేయనాటికలు రచించారు. 'వాక్యం రసాత్మకం కావ్యం ' మీనాద వేదాలు- మీ గద్య-పద్యకావ్యాలు అన్నియు రసధ్వని కృతులు. మీ వాక్కౌశల్యముతో నాదేశం నవ్వుతోందన్నారు. రాకెట్ రాయభారంతో విశ్వాంతరాళముతో చైతన్యరేఖలు సృష్టించారు.

బాపురే! ఏమని చెప్పను బాపురెడ్డి కవితాపటిమ. సంసారాన్ని సిరాబుడ్డిగాను, అనుభవాలు ఆలోచనలను సిరాగాను, సమాజంనే కలంగాను, ప్రకృతినే కాగితంగా చేసి అక్షర లక్షలను కురిపించారు. రూపానికి తగ్గ గుణం, గుణానికి తగ్గ విద్యను అందుకు తగిన యశస్సును సంపాదించి అష్టైశ్వర సంపన్నులైనారు. ఉత్తమమైన కళ మానవునిలోని ఉత్తమ లక్షణాలను వెలికితీస్తుంది. మానవుణ్ణి దైవత్వం వైపు మరలిస్తుంది మీలో దైవత్వ గుణాలెన్నో ఉన్నాయి. అందుకే దేవాదాయ ధర్మాదాయ శాఖ కమీషనర్ పదవి మిమ్మల్ని వరించింది. 'నా నృషిః కురుతే కావ్యం' ఋషి కాని వాడు కావ్యాలను వ్రాయలేడు. మీరు సాహితీ క్షేత్రంలో రాజులై, కావ్యాల రచించి ఋషులై, రాజఋషులైనారు.

ఇంతింతై, వటు డింతై అన్నట్లుగా మీరు ఇంకా ఇంకా ఎదగాలని, ఆశక్తిని మీకు రామగిరి రాముడు ప్రసాదించాలని కోరుకుంటున్నాం.

స్థలం : శ్రీవేంకటేశ్వర దేవాలయం,<br>
బాలాజీనగర్. పెద్దపల్లి.505172.<br>
తేది : 30-4-89

భగవంతుని సేవలో<br>
**రాయ్ బాల ప్రసాదు**<br>
అధ్యక్షులు, రామగిరి దేవస్థానం,<br>
రామగిరి లలితకళా సమితి, పెద్దపల్లి

పుంభావ సరస్వతులు ప్రాక్ పశ్చిమ దేశాలలో ప్రభలందిన సాహితీ ధృవ తారలు !
సరళ సహృదయులు, భక్తాగ్రగణ్యులు ! ఆంధ్రప్రదేశ్ దేవాదాయశాఖ కమీషనరు

# గౌ॥ డాక్టర్ జె. బాపురెడ్డి, ఐ.ఎ.ఎస్ గారికి సమర్పించిన

# ప్రశంసా పారిజాతము

సౌజన్యహృదయా!

చిన్ననాటి నుండి సాహితీ ప్రియత్వముతో భాషా సరస్వతి కంకితమై అచంచల భక్తి, విశ్వాసముతో కవితా కేదారంలో తమరు గావించిన అవిరళకృషి అద్వితీయము. అహో ! తమ రెంత ధన్యజీవులు! మిమ్ములను గన్న మీ తల్లిదండ్రులెంతటి పుణ్యాత్ములు!

యశోసంపద్విరాజితా !

ఆంధ్రాంగ్ల, భాషలయం దసమాన పాండిత్యముతో సంప్రదాయసిద్ధమైన భారతీయ వేదాంత పరమార్థమును గుబాళించు పరిపుష్టమైన భావ సౌందర్యమును మేళవించి ఆంధ్రాంగ్ల, భాషలయం దపురూప పద్య గేయ భావ కవిత్వ రూపకల్పన గావించిన కళాతపస్వీ! మీ కిదే మా నమస్సుమాంజలి. భాషాశిల్పమందు భావకల్పన యందు భారవు లనిపించుకొన్న మిమ్ముల నేవిధంగా ప్రశంసిస్తే మా ఋణం తీరుతుంది.

సరస్వతీ కంఠాభరణా !

తమ శైలి, ధారాసుసంపన్నమై, సుకుమారమై అబాలగోపాలా న్నలరించి వారి ఆత్మానందాలయాల్లో వేల వేల మందారాల్ని పూయించాయి. మోడు కట్టిన జీవితాల్ని స్పందింప జేసి మాణిక్య దీపాల్ని వెలిగించాయి. సరస్వతీ హృదయంతోబాటు సరస్వతీ సదనాన్ని స్వాధీనం జేసుకొన్న బాపురెడ్డి మహాశయా! మీ కివే మా ధన్యవాదాలు.

భక్తాగ్రగణ్యా !

నిరాడంబరానికి నీరుగులాబీలు మీరు, స్వచ్ఛంద వజ్ర సంకల్పానికి సద్గుణ సుగుణ గుణాభిరాములు. తమ మనోరధ స్వర్ణ కవితా రథంలో తమరు గావించే నిరంతర సర్వేశ్వరోపాసన వర్ణనాతీతము. భక్తి రస భావ బంధురమే విశ్వశాంతి సేవా బంధమని ఎలుగెత్తి చాటిన భక్తాగ్రగణ్యులు. తత్తపఃఫలమే తమ యశోధనానికి ప్రధాన బలము. అదే యీ విజయవాడలో తమకు జరిగే యీ అమూల్య ఘన సత్కార కనకాభిషేకము. అది తమ పరిపాలన దీక్షాదక్షతపూర్వ రూపకల్పన.

సదయ హృదయా!

సత్య అహింసా దయాధర్మ గుణ స్వరూపమే తమ పారమార్థిక ఆధ్యాత్మికోపాసన పావన ప్రతీక. తమ సుందర వదనారవిందమే పరమేశ్వర పాదారవింద సువర్ణారవిందము. తమ పరోపకార భావ సంపదే భారతీ గళ సీమ కళ్యాణ కౌస్తుభం, తమ ధవళ కీర్తి పారిజాతాలే తమ అర్చనా పారిజాత ప్రసూనాలు. మధురమైన తమ పలుకులే పరమేశ్వరార్పణమైన కలకండ పలుకులు. అష్టైశ్వర్యప్రాభవ పరిఢవాలే తమ ఆరాధనాలయంలో

ప్రకాశించే విద్యానందామర పరంజ్యోతులు. తమ సమతామమతలే యీ నిరుపమాన సత్కారంలోని ఘనత. తమ పూర్వ పుణ్య సుకృతమే తమ సుందరాకృతి సమాకృతి.

బాపురెడ్డిగారూ! ఇంతటి మహా సౌభాగ్య మెవరికి దక్కుతుంది. దక్కినా అనుభవయోగ్యమౌతుందా! నభూతోనభవిష్యతి.

కవిజానాశ్రితభోజా! శ్రితజనాశ్రిత కల్పభూజా! బాపురెడ్డిగారూ! మా యీ విరిసిన ప్రశంసా పారిజాతాన్ని స్వీకరించండి. జగతఃపితరులు పార్వతీపరమేశ్వరులు అకల్పాంతం చిరంజీవులుగా మిమ్ములను బ్రోచి రక్షించాలని మా అకాంక్ష.

శుభమ్ భూయాత్

ఇట్లు

**డా॥ కుందుర్తి సత్యనారాయణమూర్తి**

ఎం.ఏ., పిహెచ్.డి.

సర్కారు అర్చకులు

శ్రీదుర్గామల్లేశ్వర స్వామివార్ల దేవస్థానం

విజయవాడ - 1

# సుమాంజలి

నమస్సుమాంజలి........
మీ కంట నావాక్ పుష్ప హారాలు
ఓ బాపు సహృదయత సమత్వం సాధుశీలత మీ స్వంతం
సున్నిత మనస్కులై కర్కశ పట్టుదల వారై
కార్య దీక్షతో సూటిగా జటిల కార్యాలను
జయించు ధీరోదాత్తులు మీరు
విషయ పరిజ్ఞానానికి అన్వేషణా తపనమీది
నిత్యం ఏదో ఏదేదో చేయాలని
నిండు హృదయంతో అన్వేషణ సాగిస్తుంటారు మీరు
పరోక్షంగా ఎదురౌ విషయాలను స్థూలంగా
గ్రహించుటలో మీకు మీరే సాటి
మీ సాహిత్యాల తల్లికి ప్రభుత్వ భాధ్యతలు
ఎప్పుడు మరెప్పుడు మీకు అడ్డు రావుగా
మీ నిత్య జీవిత టయింటేబుల్ రచన అలాంటిది
మీ క్రమశిక్షణ కరుకైనది దీటైనది
మనిషికీ మనిషికీ లోతుల తారతమ్యం
గ్రహింపుకు మీకు మీరే సాటి అందునుంచేగా
జీవితసత్యాల నిజానిజాలు స్ఫూర్తిని గ్రహించారు
మీకు బద్ధశత్రువు లున్నారా అనుమానం నాకు
ఉండరూ ఉండరు ఉండకూడదు అలాంటివారు మీరు
మీ పాలనలో పరిశ్రమలశాఖ అధికారులు ఉద్యోగులు
మనఃశాంతితో తమపనులు నిర్వహిస్తున్నారు
బాపురే బాపురెడ్డి లాంటి ఐఎయస్సులు భావుకులు
మన కెప్పుడూ మరెప్పుడూ కనపడరే........

అంకితం

**డా॥శ్రీ. జె. బాపురెడ్డి గారికి**

హృదయపూర్వకంగా -డి. భాస్కర్‌రావు

*19-8-90*

# సుహృల్లేఖలు

*(డాక్టర్ జె. బాపురెడ్డి గారికి ప్రపంచమంతా వ్యాపించి ఉన్న మిత్రమండలి ఉంది. వివిధ వృత్తులలో వివిధ దేశాలలో, వివిధ ప్రాంతాలలో ప్రఖ్యాతి పొందిన మిత్రులు సాహితీ సూత్రంతో బాపురెడ్డి గారితో స్నేహం చేస్తారు. బాపురెడ్డిగారు అపార స్నేహమధురమూర్తులు. వారి మిత్రులు లేఖ లా అంశాన్ని అనుభవానికి తెస్తాయి. అటువంటి కొన్ని సహృల్లేఖలివి.)*


**ప్రొ. డా॥ మీరాఖాన్**
Human Genetics Inst, RUL
P.B.9503, 2300 RA. Leiden
Netherlands


ఆప్తమిత్రులు శ్రీ బాపురెడ్డి గారికి,

ఈ ఉదయం మీ దూరశ్రవణపు మేలు కొలుపు పిలుపు ప్రియదర్శినియై భారతదేశాన్ని మా కళ్ళ ముందుంచింది. రోజు రోజుకీ దూరమై పోతున్న మమ్మల్ని బిగ్గరగా పిలిచి దగ్గరగా - భారతమాతయే ప్రేమతో కౌగిలించుకున్నట్లయింది. ప్లాస్టిక్ ప్రవాహంలో పడి కొట్టుకుపోతూ, మధ్యలో పాశ్చాత్య పాషాణం మీద జారుకుంటూ, అందరూ అన్యులే అనుకునే అహంకార నగరచర మృగాలమధ్య తిరుగాడుతూ, ఉన్న మాలాంటి మామూలు మనుషులకు మీ పిలుపు కల్పతరువయి శాంతినీ, మైత్రినీ, మమతనూ, ప్రేమనూ, అమృతత్వాన్నీ తెచ్చింది. ధన్యులము.

వచ్చే వారాంతం నుంచి పేరిస్‌లో ఓవారం పాటు జరుగనున్న శాస్త్రసమావేశాలలో పాల్గొనబోయే సన్నాహాలలో ఉన్నాము. Color Cancer కు సంబంధించిన genes మీద పని చేస్తున్నాము. అక్కడికి వెళ్ళే ముందు కొత్త విషయాలను కనిపెట్టగలమనే ఆశతో, ఉత్సాహంగా పరిశోధనలను జరుపుతున్నాము. సెప్టెంబరు రెండవ భాగంలో న్యూయార్కులో ఆపరిశోధనలను గురించి చర్చించనున్నాము. అక్టోబరు మూడవ వారంలో గ్రీస్‌లో మా పరిశోధనా ఫలితాలమీద ప్రసంగించాలి. అక్టోబరు 30న మా డిపార్ట్‌మెంట్ సిల్వర్ జుబిలీ సందర్భంలో ఒక సింపోజియంను ఏర్పాటు చేస్తున్నాము. అంతర్జాతీయ శాస్త్రవేత్తలు కొందరు ఆహ్వానితులయ్యారు. నవంబరు రెండవ వారంలో హూస్టన్‌లో నా ప్రత్యేకతకు సంబంధించిన సమావేశం జరుగుతూంది. అది పూర్తి చేసుకుని మధ్యలో లైడెన్ నా విద్యార్థుల సాధక బాధకాలను పరిశీలించి, నవంబరు 28న ప్రభావత్ సమేతంగా బయలు దేరి మరునాటి ఉదయం 9-20కి బొంబాయి చేరుతాను. అక్కడ డిసెంబరు 6 నుంచి హోటల్ తాజ్‌లో జరుగనున్న అంతర్జాతీయ రక్తరోగ ప్రవీణుల సమావేశంలో ఆహ్వానితునిగా ప్రసంగించాలి. 9న హైదరాబాద్ చేరుతాము. అక్కడ మా బంధువులతోనే ఉండాలని నిశ్చయించుకున్నాము.

ఒక్క కోరిక - హైదరాబాదులో ఉండగా ఒకరోజు మీతో కలిసి తిరుపతి వెళ్ళి రావాలనిమీ, నా వీలు వెంబడి.

అజిత్, అజాద్, కారిన్‌లు కులాసాయే. వాళ్ళు ఆనందయుతంగా ఉన్నారు. మంచి కుర్రవాళ్ళు వాళ్ళు మా పుణ్య ఫలాలు. అజాద్ కారిన్లు యిల్లు కొనుక్కునే ప్రయత్నంలో ఉన్నారు. అజిత్ తన మొరకాకో దేశపు సహాధ్యాయునితో కలిగిన ఏడాదిపాటి పరిచయం ముదురుతూన్నట్లుంది. చక్కని జంట. ప్రభావతి full time మా full time పనిచేస్తూంది. ఆమె ఆరోగ్యం చాలా వరకూ బాగానే ఉంది. ఇది వరకు ఓపిక మా యిద్దరిలోనూ తగ్గిపోతూంది. త్వరగా పెద్దవాళ్ళమై పోతున్నా మనిపిస్తోంది. అంత ఘనంగా

అతిథి సత్కారాలు చేయలేకపోతున్నాము. ప్రతి నిముషాన్ని నా Profession demand చేస్తూంది. పనిరోజులు సెలవు రోజులలోనూ పగళ్లు రాత్రులలోనూ కలిసిపోతున్నాయి. విశ్రాంతికి వ్యవధి సన్నగిల్లిపోతోంది. ఎంతో ప్రత్యేకమైన ఆత్మీయులు తప్ప అన్యులు మా కాలాన్ని, attention నీ తీసుకోలేకపోతున్నారు. We feel a little కష్టమయినా మ్రింగక తప్పడం లేదు. అయినా అత్యంత ఆత్మీయుల రాక కోసం ఎదురు చూడడాన్ని మానలేదు - యీ ప్రాణద్వయం.

మీకు ఉత్తరం వ్రాయలేదనే గుండె కోత యీనాటికి తగ్గే అదృష్టం లభించింది నాకు. మీరు తలపుకు రాని రోజుండదు మాకు. ఎవరో అన్నట్లు "My heart is deeper than my lips". ఉత్తరాతీతాత్మీయుతకు కొదువలేదు. ఎంతకాలమై పోయింది మిమ్మల్ని చూచి, ఆ నిర్వ్యాజ నిష్కామ ప్రేమామృత మిత్రశిఖామణిని గాంచి!

చెల్లాయి శ్రీమతి రాజేశ్వరిగారికి మా ప్రేమాంజలులు. అందరికీ మమ్మల్ని జ్ఞాపకం చేయండి.

## 2

Oegstgeest
19 June, 1988

మీ 11 నాటి ఉత్తరం అందింది. ఆ కానుక అంది అమందానంద మయింది - ముఖ్యంగా మీ ఉన్నతోద్యోగారోహణ విషయం తెలిసి పరమానందపడినాము. దైవకార్య దక్షాదీక్షితులయి ధన్యులవుతూన్న మీ పుణ్యానికి మేము కూడా పావనమవుతూన్నట్లు అనిపిస్తూంది.

ఈ ఏట థాయి దేశాన జరుగకున్న ప్రపంచ కవుల మహాసభకు ఆహ్వానితులయి వెళ్ళనున్నట్లు, అక్కడ మీ మాతవ ఆంగ్ల కవితా గ్రంథావిష్కరణాన్ని తలపెట్టినట్లూ విని ఇక్కడి మీ మిత్రుల మందరమూ మరోసారి గర్వించాము.

మీ రచనకు non Tilly Boseche - Zachorow చేసిన జర్మన్ అనువాదాన్ని (SILLHOUTTE - Literature International నుంచి) ఊతావుల్ఫులకు అందజేస్తాము. మీ శుభాకాంక్షలను మా చిన్నారులకు అందజేస్తాము. వాళ్ళు మీ ఆహ్వానానికి ఆహ్లాదపడక తప్పరు. మీ దర్శనాదృష్టం లభించేవరకూ ఆ ఆనందాన్ని తమ కళ్ళలో దాచుకుంటారు.

మీ లేఖ తెచ్చిన కాంతిరశ్మి గుబాళించింది. ఈ రోజు మీ ఆ శీర్వప్ప భాష్పావళి నూత్నదంపతులపై వర్షించి వికసించి - పరిమళించింది. అజాద్ కార్లిన్ల వివాహం శృతిశుద్ధకర్ణపేయూషగానలహరియై అందంగా, అనన్యంగా, ఆనందకరంగా జరిగింది. బంధు మిత్ర జనసందోహ ధన్యవాదనినాదాలతో ఆమ్స్టర్ డాం గులాబీవన భవన ప్రాంగణంలో reception ఒక 'high-light' అయితే - ఆరాత్రి ఆనగర జలవీధుల అలలపై పయనించే పడవలో ఆ విందు అందుకు 'పై light' అయింది. నడిరేయికి ఓగంట ముందు ఆ కొత్త జంట స్నేహకోటి కంఠ జయ జయ ధ్వానాల మధ్య తమ మధు(వు) చంద్రుని (honey-moon) బండిలో భవిష్యత్తులోకి బయలు దేరారు. అలా అజాద్ - కార్లిననూ, ఆ తరువాత కొత్తగా పొందిన బంధువులనూ, అతిథిగణాలనీ, జూన్ 17-1988నీ, సాగనంపి 'నిన్న" పుట్టిన ఒక గంటకు యిల్లు చేరేము.

మొన్నకూ నిన్నకూ మధ్య ఒక్కరోజులో ఎంతమార్పు? ఏదోకొత్తదనం కుటుంబంలో కొత్త సభ్యురాలు రానున్న ముందు తరాలు. రెండు విభిన్న సంస్కృతుల సంపర్కం వితర్కం కాకుండా పయనించవలసిన భవిష్యత్తును, సాఫీగా అదే

సాగుతుందని వదిలేసి ఎప్పుడూ relax కాలేము ఇది Perpetual exercise, requiring extreme care to maintain a delicate balance. The problem is largely one sided. కొండమీది చిలుకలు గోదావరి మీద వాలినప్పుడు మునిగిపోకుండా, వరదలకు కొట్టుకు పోకుండా కాపాడుకోవలసిన బాధ్యత చిలుకలది కాని, గోదావరిది కాదు. దేనికేది జరిగినా ఇది నా దోషం కాదని సాగిపోతుంది గోదావరి, వాగులోని చేపగట్టుమీద పడి రక్షించుకోలేకపోతే వాగుదే తప్పని వాపోతే మాత్రం చేప బ్రతికి తిరిగి వస్తుందా? However, in my (Mara's) considered opinion the couple is perfectly adopted to one another.

3

Oegstgeest,
5 July, 1988

ఈ రోజు ఈ ఉత్తరాన్ని పోస్టు చేయకపోతే - దీనికి పడుతూన్న కాలదోషాన్ని సప్త సముద్ర జల నిమజ్జనం చేయించి కూడా ప్రక్షాళనం చేయలేను. నానుంచి మీకు ఉత్తరాల పయనింపు పలుచపడి పోవడానికి కారణం - మైత్రి మహీధరము కరిగిపోవడం కాదని ఈ ఆలస్యమే నిర్ధారణ. కారణమేమిటని నిలదీసి అడిగితే సమాధానాలు భిడియ మొయిల చాటున దాచుకుంటాయి. అంత ఎత్తుకు ఎగురగలిగే సహృదయతకూ, సూర్యుడు చేరని లోతులు సూటిగా చూడగల ప్రతిభావంతులకూ ఆ సమాధానాలను ప్రత్యక్ష పరచుకోగలగడం అసాధ్యం కాదు.

మీ కవితా దాతృత్వానికీ సమాధానమెప్పుడో జన్యమవుతుందని ఆవ. నా సోదరి రాజేశ్వరి గారికీ మీకూ గౌరవ పురస్సర ప్రేమాంజలులు. చిరంజీవులకు ఆశీస్సులతో.

4

Oegstgeest
26 December '89

మిమ్మల్ని అన్నిసార్లు చూడగల అవకాశ మిచ్చిన నిన్న. మొన్నటి ప్రయాణాలకు నా కృతజ్ఞతలు.

నా ప్రయాణానికి ముందు అక్టోబరులో నేను పోస్టు చేయలేని ఉత్తరంలో వయసులేని రెండు అంశాలను క్రింద వ్రాస్తాను.

" రంగు రంగుల చీకటి కోటల్లో మహళ్లు కట్టుకుని భద్రంగా బ్రతుకుతున్న వాళ్ల గుండెల్లో వెలుతురు కత్తుల్ని గుచ్చి వాళ్ళకుళ్ళుని లోకపు కళ్లకి కట్టాలని నిర్మించిన మీ కవితాస్త్రానికి నా ధన్యవాదాలు.

"తమో కవచాలు అడ్డకుంటే ప్రకాశాస్త్ర ఘాతాలు తగలవలసిన చోటల్లా తగిలి చీకట్లు వేసుకున్న వెలుగు వేషాలు కరిగి ఒకనాడు ప్రపంచానికో కొత్త వెలుగు కలుగుతుందేమో! అధోగత మానవాళికి అదృష్టయోగం పడుతుందేమో!

"మీ ఆంగ్ల కవితల మీద ప్రేమా నందకుమార్ గారు వ్రాసిన విమర్శ చదివి స్పదించాము. మీరు లండన్‌లో, హ్యూస్టన్‌లో విడుదల చేసిన మీ కవితా మరకతాలను స్వీకరించి ఐశ్వర్యవంతులమయాము."

బాపురెడ్డి గారూ, 1980's ని మన మందరమూ కలిసి హైదరాబాదులో Break చేశాము. ఒక్కసారి ఈగత పది సంవత్సరాలనూ సింహావలోకనం చేశాను. ప్రపంచంలో - ప్రభుత్వాలలో - జన్యు శాస్త్రంతో - ఎన్నెన్ని విప్లవాలు రేకెత్తాయి! ఎన్నెన్ని మార్పులు జరిగాయి! కాని మన మైత్రికి ఏ "మైలా" అంటలేదనిపించింది. కొత్త దశాబ్దంలోకి పయనించనున్న మనం - 2000 లోకి దూరబోయే శుభవేళలో తిరిగి యిలాగే తృప్తిపడగల అదృష్టవంతులం కాగలిగితే ఎంత గొప్ప విషయం!

---

## ఆచార్య పెమ్మరాజు వేణుగోపాలరావు
U.S.A

7/2/1991

శ్రీ, బాపురెడ్డిగారికి నమస్కారములు --

మీరు ఎంతో సుహృద్భావంతో మాకు అంకితం చేసి పట్టుకొచ్చిన "మనసులోని మాట" లోని వ్యాసాలన్నీ చదివాను. "కవిత్వం ఎందుకు?", "వచన కవిత" -- అనే వ్యాసాలలో మీ అభిప్రాయాలని బాగా వివరించారు. ఇటువంటి వివరణలు మరికొన్ని పాఠకలోకానికి అందజేస్తారని ఆశిస్తున్నాను.

కుందుర్తిపై మీ వ్యాసం చదివాక ఆయన రచనలు చదవాలని కుతూహలం కలిగింది. ఆయన్ని గురించి వినటమేగాని, ఇంతవరకు ఆయన రచనలేమి నేను చదవలేదు. "కుందుర్తి కృతులు" పుస్తకరూపంలో ఇప్పుడు దొరుకుతున్నాయా? మీరు వీలు చేసుకుని అవి నాకు సంపాదించి పెడతారని ఆశిస్తున్నాను.

మా ఆవిడ లక్ష్మి, మా అమ్మాయి సలీనా హైదరాబాదు వచ్చారు ఈనెల 18వ తారీఖున. మంచిరాజు శ్యామలరావు యింట్లో ఉంటారు. మీరు వాళ్లని కలుసుకోగలిగితే వాళ్లు చాలా సంతోషిస్తారు. సభలో చెప్పినా, మళ్లీ నా కృతజ్ఞనతని చెప్పుకుంటున్నాను. మీ రచనలకి కృతిభర్తలు కావటం మా కుటుంబానికి ఎంతో అదృష్టం. అటువంటి గౌరవం అందరికీ అబ్బుదుకదా! దీనికి మూలకారణం ఒకవిధంగా మీరాఖాను గారు. ఆయనికి కూడా వ్రాస్తాను వీలుచేసుకొని.

---

## కళాప్రపూర్ణ డా॥ దాశరథి, డి.లిట్.
ఆంధ్రప్రదేశ్ ఆస్థాన కవి
104 (సి-బ్లాక్), మాతృశ్రీ, మందిరం,
హైదర్‌గూడ, హైదరాబాదు-29.

19/3/1982

పోతన పంచశతి కవి సమ్మేళనంలో 18/3/82 ఉదయం మీరు గానం చేసిన హృద్య పద్యాలకు నా అభినందనలు. మీ ధారణా శక్తికి ఆశ్చర్యపోయాను. కాగితం సహాయం లేకుండా కవిత వినిపించి ప్రేక్షకులును అలరించిన గౌరవం మీకే దక్కుతుంది. మీ అశేషశేముషికి నా జోహారులు.

2

31/8/1985

నీ రెండు పుస్తకాలు "శ్రీకారశిఖరం", "వ్యవధి లేదు" అందాయి.

సావధానంగా చదివాను. "శ్రీకార శిఖరం"లో "భావగోపికా నయనాశ్రుయమున" ఎంత బాగా అన్నావయ్యా. "మూర్ఖులు మూడు రకాలు" అన్న కవితలో, "కలడన్నా లేడన్నా, కలడో లేడో అన్నా కలవాడు లేకపోడు, లేనివాడు లేచి రాడు" గొప్పగా చెప్పావు. భేష్ అభినందనలు.

"వ్యవధి లేదు" లో ఇంగ్లీష్ మూలం ఇవ్వడం బాగుంది. అనువాదం-మూలానికి అత్యంత విధేయంగా సాగింది. షి ఈజ్ ఏ గ్రేట్ పొయిట్ నీ అనువాదం రమణీయం.

ఇవన్నీ ఎప్పుడు రాస్తున్నావు? క్షణం తీరికలేని బోర్డ్ బాధ్యతలు, కుటుంబ వ్యవహారాలు - అన్నీ సక్రమంగా నిర్వహిస్తూ 'అద్భుతంగా కవిత రచిస్తున్న నీ శేముషికి జోహారులు.

---

## ఆచార్య పి. నారాయణ రెడ్డి

హైదరాబాదు
28/3/1968

మీరు 9.2.68న వ్రాసిన ఉత్తరం పదేపదే కదలించివేసింది. ఈ మధ్య కార్యక్రమాల ఒత్తిడి

ఎక్కువయింది. ఉపన్యాసాలు, ఉత్సవాలు, పర్యటనలు- మద్రాసు, బెంగుళూరు, హైదరాబాదు, విజయవాడల మధ్య. మీరు పారిస్, లండన్ వగైరాలకు వెళ్లినట్టు.

మీరన్నట్టు ఆ ప్రాంతాలు చవిచూడవలసిన వయసే ఇది. కాని మనస్సు ఇంకా ఉరకలు వేయడంలేదు. తరుణం తనంత తానే రానీయండి.

మీరూ, గ్రిగ్లానీ గారూ కలిపి గడుపుతున్న మధురక్షణాలను తలచుకొని మనసు నింపుకొంటున్నాను. ముఖ్యంగా ఈ పర్యటనవల్ల మీ సహజ ప్రతిభ సహస్రాంచలాలతో జీవిస్తుందని ఆశిస్తున్నాను.

---

## తిరుమల రామచంద్ర

విజయవాడ-6

5/11/90

'అనంతసత్యాలు"
సార్వజనీన
సార్వకాలీన
ముత్యాలు
సత్యలోకపు
దీపాలు

ఈ దీపాలు రంగు రంగుల చీకట్లను తొలగిస్తాయి మానవులందరినీ మహనీయులుగా చేస్తాయి.

"మనిషిని మించిన
మహాశక్తి లేదని
మనిషినే ఆరాధిస్తున్న
మనిషినే ఆరాధిస్తున్న
మనిషిని నేను" అన్నారే

ఆ నాలుగు వాక్యాలు చాలు నాటకి నేటికి ఏనాటికి మహాకవి అను బిరుదు సార్థకం చేసికొనుటకు.

జాతీయోద్యమకాలంలో
నాటి 'బాపు' మనిషిని ఆరాధించారు
మహాత్ముడయ్యాడు-
చీకటిఖండంలో
మనిషిని ఆరాధించారు
నెల్సన్ మండేలా
నల్ల సూర్యుడయ్యాడు
నేటియుగంలో
సామాన్య మానవుడే
అన్నింటికి కేంద్రం అని
వచించారు
భవిష్యత్తుకు
మహాకవిగా మనకవిగా
సుకవిగా వర్ధిల్లుచున్నారు.
మీరు నరోత్తములు
అందుకే మా అందరి నమస్సులు

---

## డాక్టరు నండూరి రామకృష్ణమాచార్య

అధ్యక్షుడు - అధికార భాషా సంఘము
సచివాలయము - హైదరాబాదు-22.

సికింద్రాబాదు

12/5/1988

తిరుపతిలో ఆనాడు మీరు నాపై వర్షించిన అభిమానామృతము నా యావజ్జీవితము మరువరానిది. అందులో దివ్యత్వం తొలుకాడినది.

వేదాంతులు భగవంతుని - "హే, నిర్హేతుక జాయమాన కరుణా పారీణ" - అని సంబోధించారు. మీరు నాపై ప్రసరించినది కేవలం - నిర్హేతుక జాయమాన కరుణ మాత్రమే.

సాహితీ సమరాంగణ సార్వభౌమ బిరుదాంకుడు శ్రీకృష్ణదేవరాయలు. ఆ బిరుదులోని స్వారస్యం తిరుపతి సాహితీ సభాపతిగా మిమ్ము సందర్శించినపుడు అనుభూతిలోకి వచ్చింది.

2

ఒకవైపు ఆంగ్ల మానసపుత్రులు లేదా మార్క్స్ మానసపుత్రులు, వేరొకవైపు సనాతన సాహితీ శ్రోత్రియులు - ప్రాయికముగా గానుగెద్దులు. మహానుభావుడు గురజాడ అప్పరాయకవి ఆశించిన కొత్త పాతల మేలి కలయికకు ప్రతీక అయిన వాడు ఒకడైనా సాహితీ సహవ్రతులలో కన్పిస్తే బావుంటుందని నేను చిరకాలం నుంచి అన్వేషిస్తూనే ఉన్నాను. ప్రాచ్య ప్రతీచీ సభ్యతలు గంగా యమునల వలె హృదయంలో సంగమించిన వ్యక్తి - అటు గానుగ ఎద్దు కాకుండా ఇటు గంతలు కట్టిన గుఱ్ఱం కాకుండా, సాహితీ సహస్రాక్షుడు కనిపిస్తే చూడాలని నేను సుమారు అర్ధ శతాబ్దినుండి అన్వేషిస్తున్నాను. ఎట్టకేలకు - బాపురెడ్డి కవిలో - నాకు నేడు కొత్త పాత మేలికలయిక సాక్షాత్కరించింది సంతోషం.

3

వేదాలు-ఉపనిషత్తులు - అమర భారత రామాయణాలు భారతీయ సంస్కృతికి పునాదులు. సంస్కృతం భారతీయతకు సజీవ నాడి.

*ప్రేమ గౌరవాలు రామాయణము పైన*
*భారతమ్ముపైన భక్తి గలిగి*
*చదువు గలిగి మంచి సంస్కారములు గల్గి*
*శక్తి గలిగి దేశ భక్తి గలిగి*
*బాపురెడ్డు ఇంక పదిమంది యున్నచో*
*భరతదేశమెల్ల బాగుపడును.*

తిరుపతి సభపై నా సమీక్ష ఇది. ఆనాడు వేదికపై కన్నడిగులు, తమిళులు ఉండటం ఎంత బాగుంది.

*అరయ కాళిదాసు వ్యాసుండు వాల్మీకి*
*ముగురు కవుల కేక మూర్తి యౌచు*
*బాపురెడ్డి సుకవి ప్రభవించె పుడమిపై*
*తెలుగుతల్లి కడుపు చలువ వలన*

ఈ సృష్టిలో మానవజన్మ ఉత్కృష్టమైనది అంటారు. అందుకని కావటం మహోత్కృష్టం. ఇక - కవి - వేదాంతి - అనుష్ఠాన వేదాంతి ప్రభువు కావటం అనగా ఐ.ఎ.ఎస్. అధికారి కావటం నిస్సందేహంగా గొప్ప ఆధ్యాత్మిక రాజయోగం. మీ పదవీ కాలంలో మీరు చారిత్రాత్మకమైన ఘనవిజయాలు సాధించగలరని నమ్ముతున్నాను. ప్రగతి దేవాలయానికి అనుచరితంగా ఒక గ్రంథాలయం ఏర్పాటయితే ఎంత బాగుంటుంది. గ్రంథాలయాలు అంటే కవుల జ్యోతిర్మయ రూపాలలో వికసించే పవిత్ర క్షేత్రాలే గద.

మీరు దేవాదాయ కమీషనరు కాగానే చేసిన పని కవి పూజ. ఆదికవి వాల్మీకి మహర్షి పూజ. తిరుపతిలో మీరు సభాపతిగా వేదికపై నిలిచి మాటాడుతుంటే వాల్మీకి రాముని వర్ణించినట్లు "పుంసాం మోహనరూపాయ" గనే పారిషదులు పొడగట్టియున్నారు.

4

ఎన్నోసారులు - ఎన్నో సభలలో మీ ప్రక్కన కూర్చొని మీ కవితలు విన్నాను. సభతోపాటుగా కొన్ని సారులు నేను గూడ కరతాళధ్వనులు చేసి హర్షాతిరేకం వెలిబుచ్చియున్నాను. నాకు సంతోషదాయకమైన అంశం ఒకటి మీ పట్టున ఉంది. మీ రచనల వెల్లిలో ఎప్పుడూ ఎదుగుతూనే ఉన్నాయి!

*కవులలో చాలా మంది పిందెలు గానే*
*రాలిపోతారు. కొందరు ఎండిపోతారు. కొద్ది*
*మంది మాత్రమే పక్వమై*

పండుతూ ఉంటారు. తిరుపతిలో సభావేదికపై మీరు గుండె పండిన గొప్ప వ్యక్తిగా సాక్షాత్కరించారు.

చాలానాళ్ళనుండీ నేను మిమ్మల్ని ఎరుగుదును గదా. మీరు "ఇంతింతై వటుడింతయై.... తోయద మండలాగ్రమున కల్లంతై"

ధ్రువునిపై నంతై....... అన్నట్లు ఎదిగారు. మీది సాహితీ త్రివిక్రమావతారమే.

*నిన్న యెత్తు వేరు! నేటి ఉన్నతి వేరు!*
*బాపురెడ్డి రూపు రేపు చూడు?*
*సాహితీ త్రివిక్ర మాచార్య ధుర్యుండు*
*జాగృతకవితా తథాగతుండు*

ఎదగటం - నిత్య వర్ధిష్ణువుగా ఉండటం జీవలక్షణం అంటారు. విజ్ఞాన శాస్త్రజ్ఞులు. అద్యతన భవిష్యత్తులో మీకు అంతర్జాతీయ విఖ్యాతి - మన్నన లభించగలదని నా నమ్మకం.

అష్టదిగ్గజాలలో ఎవరూ ఆ దేవరాయలకంటే గొప్ప కవి కాడు అయినా రాయలవారు అష్టదిగ్గజ కవులను వినమ్రతతో సత్కరించేవాడు. మీరుగూడ - ఆస్మాదృశులను ఆహ్వానించి మన్నించటం అట్టిదే.

5

ఇది వచన కవితాయుగం. ఎందుకో వచనకవులు పద్యకవులను ద్వేషించటం వరిపాటి అయింది. అట్లాగే పద్యకవులు గూడ గద్య కవులను వెక్కిరిస్తున్నారు. నిజానికి కోల్‌రిడ్జి చెప్పినట్లే Best poetry may exist without metre.

సంస్కృతాలంకారికులు సయితం గద్యం కవీనాం నికషం వదంతి అన్నారు గదా. శ్రీ బాపురెడ్డి కవి ఉభయకవిమిత్రుడైన సమన్వయ సంధాత.

*పద్యమల్లు తరళ విద్యుల్లతలు వేని*
*గద్యమల్లు మేఘ గర్జ కలిపి*
*సవ్యసాచి నవ్య సాహితీ రంగాన*
*బాపురెడ్డి సాటి బాపురెడ్డి*

ఏనాడో - సుమారు ఏభై సంవత్సరాలకు పూర్వమే నా జీవితం తెలుగు తల్లికి అంకితం చేశాను. మాయుగం గతించినట్లే. తెలుగుతల్లికి సేవ చేసే వారందరు నాకు ఆత్మ బంధువులే. ధూర్జటి మహాకవి నిశితంగా విమర్శించినట్లు - "తత్ కృష్ణోదర భాంధవమ్ము నిజమా?' ' - ఆధ్యాత్మిక సౌభ్రాత్రం - సాహిత్య భాంధవమో అసలు సిసలైన నిజాలు. ఆ విధంగా మనం ఏకోదరులమే. "తెలుగు వెలుగు చిమ్ము తేజస్వి - మేధావి" అయిన తమ్ముని చూచి ఏను అపరిమితానంద తన్మయత్వం చెందాను.

6

ఆంధ్ర పద్య కవితా సదస్సులో మీరు నిర్వహించిన పాత్ర - ప్రశంసనీయమే గాక చారిత్రాత్మకము. విజయీభవ - దిగ్విజయీభవ - దిగ్విజయీభవ !

నేనేగాదు - ప్రౌఢ పద్య కవితా శిల్పులు - పలువురు మీ పద్యాలు మెచ్చుకోవటమే గాక మీరు నిర్వహించిన పాత్రను - ప్రసంగములను కూడా హృదయపూర్వకముగా శ్లాఘించియున్నాము. నాకు శ్రవణ నిర్వాణమైనది.

---

**డా॥ ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ**

Kalaprapurna — బాపట్ల
Andhra Saraswathi — 16/12/85

ఎంతో ప్రేమతో నా పిలుపునందుకొని, మా చిన్ని గ్రామానికి ముఖ్యంగా మా చిన్ని సంస్థకు విచ్చేసి మీ అసమాన ప్రతిభావ్యుత్పత్తులకు గీటురాయి అనదగిన ప్రసంగాన్ని మేము అందరము ఆనందించే భాగ్యం ప్రసాదించారు. చాలా సంతోషంతో కృతజ్ఞతావందనాలు.

మళ్లీ ఇంకొక అవకాశం కల్పించుకొని మా కళాభారతి సంస్థలు మీతో గడపాలని మనసార ఆశిస్తూ ఉన్నాం.

*అయిదు పదులైన నిండని అర్భకుండు!*
*ఎన్ని ఉద్యోగముల నిర్వహించె వింత!*
*ఇన్ని కావ్యాల నెటువిరచించె నహోహో*
*ప్రతిభ కలవాడవన నీవె! భళిర, బాపు!*

---

## డా॥ తెన్నేటి హేమలత

Novelist, Writer, Journalist
Achyuta Ramaiah Street,
Vijayawada - 520 003.

బెంగుళూరు
14/2/1983

బాపురెడ్డి కవిత్వం అంటే నాకు జ్ఞాపకం వచ్చేది పూలవిలువ తెలిసిన పూర్ణస్త్రీ సత్యభామ, "పరమాత్ముణ్ణి కాలదన్ని పారిజాతాన్ని వరించింది" అన్న వాక్యం.

"విశ్వపావనమైన వినువాక ఎవ్వాని అడుగుదమ్ముల పుట్టునలరుదేనె......

ఆ భగవంతుడు బాపురెడ్డి కవిత్వంలో నివసిస్తున్నాడు.

---

## దాసరి నారాయణ రావు

44, బజుల్లా రోడ్, టి. నగర్,
మద్రాసు

శ్రీ బాపురెడ్డిగారు నాకు స్నేహితులు, ఇప్పటినుంచి కాదు. నేను సినిమాలలోకి వెళ్ళక ముందు నుంచి మంచి స్నేహితులు. అటువంటి మిత్రుడు, హితుడు అయినటువంటి శ్రీ బాపురెడ్డికి గుంటూరులో మా దాసరి సంగీత నృత్య అకాడమి వారు సన్మానించటం అనేది నేను ప్రత్యక్షముగా చేసినట్లు భావిస్తున్నాను. ఈ సన్మాన ఆనందోత్సవములో నేను పాలు పంచుకోలేకపోతున్నందుకు బాధపడుచున్నాను.

ఇదేవిధముగా శ్రీబాపురెడ్డి గారు కవితా రంగంలో ఉన్నత శిఖరాలలోకి ఎదగాలని ఆకాంక్షిస్తున్నాను. శ్రీ బాపురెడ్డిగారికి ఆయురారోగ్య ఐశ్వర్యములు కలుగ జేయవలసినదిగా భగవంతుని మనసార కోరుచున్నాను.

---

## వల్లమోతు సత్యనారాయణ

Telugu Association of North America, Inc.
A Non Profit Organization of Telugu Associations Established, 1978.
P.O. Box 1827, Troy, Michigan, 48098 USA

ఆధునికాంధ్ర సాహితీరంగంలో భావుకులైన కవిగా, మానవతావాదిగా కమనీయ కవితా శిల్పిగా సుప్రసిద్ధులైన డా॥ జె. బాపురెడ్డి గారి సాహిత్యోత్సవం ప్రముఖ సాంస్కృతిక సంస్థ యువకళావాహిని ఆధ్వర్యంలో మార్చి 1వ తేదీన జరుగబోవడం ఆనందదాయకం.

విశేషమైన సాహిత్యాభినివేశంలో 'చైతన్య రేఖలు' బాపురెడ్డి గేయాలు 'శ్రీకార శిఖరం' , 'వాడిపోని వసంతాలు' వంటి చక్కని సాహిత్య గ్రంథాలూ అనేక ఆంగ్ల కవితా సంపుటాలూ వెలువరించి సర్వత్రా సాహితీ రసజ్ఞుల అభిమానాన్ని చూరగొన్న ఉత్తమ కవి డా॥ బాపురెడ్డి

ప్రపంచమంతా విశేషంగా పర్యటించి తన ఉపన్యాసాలతో, గేయాలతో దేశ, విదేశాల శ్రోతలను తన్మయపరచిన బహుముఖ ప్రజ్ఞాశాలి ఆయన.

సహృదయ మిత్రులు, తెలుగు సాహితిని విశ్వవ్యాపితం చేసిన డా॥ బాపురెడ్డి గారి సాహితీ నందనంలో మరిన్ని పారిజాతాలు పూచి పరిమళించాలని ఆకాంక్షిస్తూ, ఆయనకు జరుగవోయే సాహిత్యోత్సవ సన్మాన సందర్భంగా నా హృదయపూర్వక అభినందలు తెలియజేస్తున్నాను.

---

## ఆచార్య తిరుమల

301, నందిని కాంప్లెక్స్,
మోజంజాహి మార్కెట్,
హైదరాబాదు-15.

హైదరాబాదు
8/11/1994,

సంతోషం పట్టలేక మీకీ ఉత్తరం రాస్తున్నాను. టి.వీలో ఋతుగానం నృత్య రూపకం ప్రథమ భాగం చూశాను. ఎంతో బాగుంది, ముఖ్యంగా మీ రచన. శరత్కాలాన్ని 'వెన్నెల చీర' అనటం అద్భుతం. కాళిదాసు నుండి నేటి వరకు ఋతు వర్ణనలు చేసిన ఏ అగ్రశ్రేణి కవీ అంత అందంగా అంతమాట అనలేదు. మీలో సాహిత్యం పరిపూర్ణతని సంతరించుకుంటూ వుంది. పరిణత ప్రజ్ఞావంతులు ప్రయోగ కౌశల్య మెప్పుడూ ప్రమోదావహం గానే ఉంటుంది.

రామాయంపేటలో మీ ఉపన్యాసం మనోహరంగా వుంది.

2

20/1/1990

ఎంతో ఆదరంగా మీరిచ్చిన ప్రణవ ప్రణయం, పంచ బాణ సంచా తీరికగా హాయిగా చదివి, ఎంతో ఆనందించాను.

మానుషీకృత అమానుష శృంగార వేదం - ప్రణవ ప్రణయ నాదం! సృష్టి తత్త్వ సమీక్షణలోని యథార్థ హృదయ స్పందనా బిందువులు ఆ కవితాత్మ బంధువులు! అది మన్మథ లయామృతం! రతి క్రీడాభినుతం!

*ఇక, పంచబాణ సంచా -*
*పంచ జన పాంచజన్య గంభీర గర్జా*
*ప్రపంచం ! దేశదేశాల నావహించిన*
*మదన కేళీ వినోదాక్షర విన్యాసం!*

అంగాలు ఎవరికైనా ఒక్కటే - కానీ అంగాంగ సౌందర్య సీమా విహార అనంగ లీల మాత్రం బహు వర్ణ సమావిష్టం! మీ మదనాక్షర తాండవానికి, చిత్రించిన పద చిత్రాకి ఆవిష్కరించిన రసానుభూతికి ఏటికోళ్లెత్తుతున్నాను.

ఈ రెండు కవితా సంపుటాలకి ఆత్మ ప్రత్యయ బుద్ధితో చూస్తే, ఒక విశిష్ట స్థానం కనిపిస్తూ వుంది. అందుకే ఈ ఉత్తరం.

---

**ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం**
హైదరాబాదు విశ్వవిద్యాలయం

హైదరాబాదు
15/12/1986

మీరు స్నేహంతో అందించిన 'బాపురెడ్డి గేయనాటికలు' (విస్తృత ముద్రణ) మళ్ళీ చదివాను. శీర్షికలు చూస్తున్నప్పుడే మన కళాశాల జీవితం, ఆంధ్రాభ్యుదయోత్సవాల వేదికపై సి.నా.రె. గారివీ, మీవీ గేయ నృత్య రూపకాలు ప్రదర్శింపబడిన ఆ తియ్యని రోజులు కళ్ళల్లో మెరిశాయి. ఆ ఉత్సవాలలో మీ వ్యాఖ్యాన సౌరభం ఇంకా నా గుండెల్లో గుబాళిస్తూనే ఉంది.

ఒక కవి ఒక ప్రక్రియలో కొన్ని రచనలు చేయవచ్చు. అవి ప్రజాహృదయాలలో శాశ్వతమైన స్థానాన్ని సంపాదించుకున్నప్పుడే సార్థకమయ్యేది. బాపురెడ్డి గారి పేరు వినగానే ఈనాటికీ తెలుగువారు ఋతు రాగాన్నీ, రాకెట్టు రాయబారాన్నీ, సాగరసౌధాన్నీ-మనసుల్లో స్మరించి మురిసిపోతున్నాడు. వచన నాటికల్లో ఒక 'ఎన్జీవో', గేయనాటికల్లో మీ 'ఎన్జీవో' తెలుగువారి మనసుల్లో ఎప్పుడో మసలుతూ ఉంటాయి. ఇలా ఒక ముద్రతో, ఒక కీర్తిని సంపాదించటం మీ విశేషం

గతానుగతికంగా రచన చేసే స్వభావం కాదు మీది. మీ ఆలోచనలో ఒక అభినవ లోచనం ఉంది. మీ పదబంధంలో ఒక ప్రతిభా కిరణం వెలుగొందుతూ ఉంటుంది. మీ పలుకుబడి మీది!

డా॥ దాశరథి గారన్నట్లు - మీ "గేయనాటికలు - కావ్యనాటికలు; రమ్య చేటికలు - రత్న పేటికలు".

---

'సాహిత్యబ్రహ్మ'

**డా॥ వి.వి.యల్. నరసింహారావు**

డైరెక్టర్ - ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయం, ఆబిడ్స్, హైదరాబాద్-500 001.

25/11/1986

ఇటీవల శ్రీశైలంలో మీరు నా కందించిన మీ 'పద్యకావ్యాలు' సావధానంగా చదివాను.

ఒకే ప్రభుత్వంలో పనిచేస్తూ ఇంతకాలం ఒక మంచి కవిని సన్నిహితంగా చూచి, పలకరించి, కవితాస్వాదం చెయ్యకుండా వున్నందుకు సిగ్గుపడ్డాను. మీ వచన కవితలు పత్రికల్లో చూచి వన్నెవాసి ఏనాడో నిర్ణయించుకున్నా పద్యరచనలో కూడా ఇంత ప్రౌఢి నింపుకున్న కవిగా ఇప్పుడే మిమ్మల్ని తెలుసుకోగలిగాను. పెద్ద 'డిస్కవరీ' లాగుంది.

"మీ ప్రత్యేకత నిత్యనూతనత సుమ్మీ బాపురెడ్డ్యగ్రణీ!" అని మీతో గొంతు కలిపి కవితా ప్రస్థాన ప్రస్తుతి చెయ్యాలనిపించింది.

శ్రోతలందరూ శ్వేతలై చూచేట్లు కవితా కృష్ణణ్ణి సృష్టించుకోవటం అందరివల్లా అయ్యేపని కాదు.

భజగోవిందాదుల్లో భావవైశిష్ట్యాన్ని మనం పట్టి తేగలిగినా, ఛందోవైచిత్రిని ఎంత తేటగా ఆవిష్కరించినా - తెలుగు ఛందస్సుల్లో ఆవిష్కరించటం కష్టం.

అయినా మీ ప్రయత్నాన్ని అభినందించకుండా ఉండలేకపోతున్నా.

మీది ప్రతిభ - పాండిత్యం - నవ్యత సురుచిరంగా సంగమించిన సుందర కవితా త్రివేణి.

2

16/1/1992

**27/12/1991**న మీరు నాకు సాదరంగా అందించిన మీ "మనసులోని మాట" వ్యాస సంపుటి సావధానంగా చదివాను. ఈ జాబు వ్రాయకుండా ఉండలేకపోయాను.

వచన కవితలు, పద్య కవితలు, గేయ నాటికలు, ఆంగ్ల కవిసహృదయ హృదయ నైవేద్యంగా వెలయిస్తూ తెలుగు సాహిత్య నందనంలో పారిజాతపరిమళాలు ఎగబోస్తున్న మీ 'విమర్శ వ్యాస సంపుటి' మీ గాఢ పరిశీలనా దృష్టికి, నిష్పాక్షిక విమర్శ పద్ధతికి నిదర్శనంగా ఉంది.

'కవిత్వం ఎందుకు?' అటే - మానవుడు మానవుడుగా ఉండటానికే. అక్షర సాగరడోలలో ఓలలాడడానికే - అనే జవాబు త్రికాలాబాధితం.

తిక్కన, వేమన, కట్టమంచి, శ్రీశ్రీ, కుందుర్తి, సి.నా.రె., భీమన్న, మందరపు వెంకటేశ్వరరావు మొ॥ అందర్నీ అతరంగాల్లోకి ప్రవేశించి ఆత్మతత్త్వాన్ని బైటకు లాగారు.

"ఇహపరాలను మేళవించే సమగ్ర ప్రయోజనాత్మక ఆనందసూత్రంతో మానవజీవితాన్ని ముడి వెయ్యటమే సాహిత్య లక్షణ' మనే మీ అభిప్రాయంతో నూటికి నూరుపాళ్ళు ఏకీభవిస్తున్నాను.

మీది అచ్చమైన రసహృదయం.

స్వచ్ఛమైన రసవద్వాక్కు.

---

**డా॥ ముకురాల రామారెడ్డి**

B-20-F/1,
Vijayanagar cly,
Hyd-city-500 457.

9/11/1984

నేడు 'హిందూ' పత్రికలో మీ ఫోటో చూసి వివరాలు మళ్ళీ చదివిన తరవాత సాహిత్యంలో మీకు గౌరవ డాక్టరేట్ పట్టా ఇచ్చిన వారు ప్రశంసనీయులు.

మొత్తం పై మన వాళ్ళలో బాగా - అనుకొన్నంతగా ఎదిగిన వ్యక్తిత్వం మీదైనందుకు సంతోషం, మన తరం కవుల మధ్య మీరందుకున్న తారాపథం, తెలుగు జాతికి తెచ్చిన ఘనత చూస్తూ మరీ మరీ సంతోషం.

సరికొత్త కవితారీతులు మీ కలం నుంచి ఇంకా ఇంకా వెలవడుతాయని ఆశిస్తూ,

---

**డా॥ ఎన్. గోపి**
1-9-34 1/2
Ramnagar, Hyderabad.

**8/11/1983**

'కళాతృష్ణ' అనుకున్నాను ముందు దీపావళి సంచికలో మీ సీసపద్యం చదివి. ఎప్పుడూ మీ పేరుకి పైనే గేయం అలవాటైన నాకు పద్యం కనపడగానే ఆకర్షించింది. శీర్షం (సీసం) రాసి.కింద పీఠం (తేటగీతో ఆటవెలదో) అనవసరమనుకున్నారా? అక్కడికి భావం ముగిసిందనుకోండి! "శృంగస్రవన్నాట్యగంగ" ఎక్స్‌ప్రెషన్ బాగుంది.

---

**ఊట్ల కొండయ్య**

హైదరాబాదు
**3/11/1993**

Sri Aurobindo's Footprints అనే మీ poem ఇవ్వటి 'Triveni' లో చదివి పరమానందం అనుభవించాను. మరీ ఆ చివరి ఎనిమిది చరణాలు కవితామృతం వర్షించినవి.

నేను దివంగత ముట్నూరి కృష్ణారావుగారి వద్ద శ్రీ అరవిందుల వ్యాఖ్యానంతో ఉపనిషత్తులు అధ్యయనం చేసిన విషయం తమకు తెలిసే ఉంటుందనుకొంటాను.

---

**అనుముల కృష్ణమూర్తి**
**68-అరవిందనగర్, దోమలగూడ,**
**హైదరాబాదు-24.**

**24/7/1993**

నాటి సన్మానానికి మీరు దయచేయటము కార్యాంతం వరకూ సుఖోపవిష్టులై ఉన్నందులకూ పరిపూర్ణ కృతజ్ఞుణ్ణి. మీలో వైదిక వాణి స్ఫురించింది. ఒక మహాకవిద్వారా సన్మానాన్ని పొందినానంటే అదొక భాగ్యంగా పరిగణిస్తున్నాను.

---

**డాక్టర్ మంగళగిరి ప్రమీలాదేవి** M.A., M.Phil
Lecturer in Telugu Dept. - Hindu College
21-552, French Pet,
Machilipatnam.

Machilipatnam
21/2/1974

మీరు పంపించిన 'బాపురెడ్డి గేయ నాటికలు' (విస్తృత ముద్రణ) చేరినది. గ్రంథము బాగున్నది. 'చాచా నెహ్రూ', 'యన్.జి.వో.' నాటికల విమర్శ కూడా నా "తెలుగులో పద్య గేయ నాటికలు" గ్రంథములో చేర్చినాను. మీ పుస్తకము సకాలములో చేరినది. మీ పుస్తకమును అడుగకుండానే సకాలములో పంపించి సహకరించినందులకు నేనెంతో కృతజ్ఞురాలను. 'బాపురెడ్డి గేయనాటికలు' ప్రథమ ముద్రణను శశాంక గారు తమ పర్సనల్ లైబ్రరీ నుండి తీసి నాకు ఇచ్చినారు. ఆ పుస్తకము ఆధారముగానే నేను మొదట అకాడమీకి పంపించిన వ్రాతప్రతిలో బాపురెడ్డి గేయనాటికల మీద సమీక్ష వ్రాయకలిగినా... తెలుగులో పద్య గేయ నాటికలు గ్రంథము యొక్క ముద్రణ పూర్తికానున్నది. ఈ నెలాఖరునకు సాహిత్య అకాడమీ వారికి అప్పచెప్పవలసిన ఐదు ప్రతులు అప్పగించగలనని అనుకొంటున్నాను.

**2**

మీరు పంపించిన "రజతోత్సవ సంచిక", 'బాపురెడ్డి కవితాత్మ', 'అనంత సత్యాలు' గ్రంథాలు అందినాయి. సర్వాంగ సుందరంగా ప్రచురింపబడిన గ్రంథాలు చూడగనే నాకెంతో సంతోషం కలిగింది. ముఖ్యంగా రజతోత్సవ సంచిక పూర్తిగా చూచిన తరువాత మీ బహుముఖ సాహితీ సేవ, సారస్వత జీవిత విశేషాలు తెలిశాయి. 'విద్వాన్ సర్వత్ర పూజ్యతే' అన్న ఆర్యోక్తికి

అనుగుణంగా ఉండి డెట్రాయిట్ రెండవ ఉత్తర అమెరికా తెలుగుమహాసభలో 'అనంతసత్యాలు' కావ్య అంకితోత్సవం, విదేశీయానం, దేశవిదేశాల్లో తెలుగు కవితా సరస్వతిని ఊరేగించిన మీ సాహితీ వ్యక్తిత్వాన్ని అభినందిస్తున్నాను. రెండవ తెలుగు మహాసభలో మీరు కవితా గానం చేసి ప్రశంసలనందుకొన్నట్లు ఆకాశవాణి వార్తల ద్వారా తెలుసుకొన్నాను. సభలు దిగ్విజయంగా జరిగాయని భావిస్తాను.

---

**డా॥ పాలకుర్తి మధుసూదనరావు**

ఆకాశవాణి కేంద్రం, హైదరాబాదు

22/2/1981

అఖిలభారతస్థాయి కవి సమ్మేళనానికి గత ఏడాది మీరు పంపిన తెలుగు కవిత-హిందీ అనువాదం కావాలన్నారు. రవీంద్రభారతిలో మొన్నటి ఆకాశవాణి కవి సమ్మేళనంలో ఆ కాపీ మీకు అందించాలనుకున్నాను. ఆలస్యంగా రావడం వలన మిమ్మల్ని కలువలేకపోయిను. ఈ మధ్య మీ 'భావజీవులు' సంగీత రూపకం రెండు సార్లు ప్రసారం చేశారు. సిద్ధిపేటలో రికార్డు చేయడం వల్ల క్వాలిటీ బాగా లేదు మా స్టూడియోలో "మంచివారి చేత" మళ్ళీ దాన్ని రికార్డు చేయించాలని అనుకుంటున్నాను. మీరు కాపీ ఒకటి పంపిస్తే, సాధ్యమైనంత త్వరలో ప్రసారం చేయించాలని ఉంది.

మీ 'నాదవేదాలు' పూర్తిగా చదివాను. అందులోని కొన్ని కవితలను మళ్ళీ మళ్ళీ చదువుకుంటున్నాను. ప్రణవనాదంలో చేర్చిన "ఎందుకు ప్రేమంటే" అనేగీతం చాలా గొప్పగా ఉంది. కృష్ణశాస్త్రి భావకవిత్వ రథాన్ని ముందుకు నడిపించే సమర్థులైన సారథులని పించుకున్నారు. ఒంటరిగా కూర్చున్నప్పుడు గాలి హోరులో ఈ గళపు ప్రణయనాదం పదే పదే వినిపిస్తుంది. ఆ క్షణంలో అనిర్వచనీయమైన అనుభూతి కలుగుతుంది. ఇటువంటి భావగీతికలు ఇంకా ఎన్నెన్నో మీకలం నుండి వెలువడడానికి కోరుకుంటూ...

నూతన సంవత్సర శుభాకాంక్షలతో

---

**పాలగుమ్మి విశ్వనాథం**

హైదరాబాద్

13/1/1981

ఈ నూతన సంవత్సరం ఈ క్రొత్త సంక్రాంతి మీ చేత అనేక నూతన రచనలను చేయిస్తుందని ఆశిస్తున్నాను. మీ 25వ సంవత్సరాల సాహితీ ఉత్సవంలో (నాపేరు వేసినా) పాల్గొనలేకపోయాను. సాంసారిక సమస్యలలో చిక్కుకొని మీ ఫంక్షన్‌లో పాల్గొనలేక ఆ ఆనందంలో పాలుపంచుకోలేక పోయినందుకు నాకు ఏదో కొరతగానే ఉంది. ఫంక్షన్ చాలా బాగా జరిగిందని మిత్రులు చెప్పారు.

నాకు మీతో మొదటి పరిచయం జ్ఞాపకం వస్తుంది. ఏదో సందర్భంలో కృష్ణశాస్త్రి గారూ, నేనూ ఉస్మానియా యూనివర్సిటీకి వచ్చాం. "ఏమోయ్ నీకు ఒక చురుకైన కుర్రవాణ్ణి చూపిస్తాను" అని మిమ్మల్ని పరిచయం చేశారు. అప్పుడు మీరు విద్యార్థి దశలోనే ఉన్నారనుకొంటా. అప్పుడు మీరు ఏదో పోటీలో మీ గేయానికి బహుమతి వచ్చింది. (సరిగ్గా గుర్తులేదు ఆ గేయం) అప్పుడే శాస్త్రిగారు అన్నారు "ఇతను ప్రామిసింగ్ పొయెట్" అని. ఆకాలం వాళ్ళు ఆ మాత్రం అన్నారంటే దాన్ని ఎన్నో ఇంతలు గుణించుకోవాలి. ఆ ఇన్సిడెంట్ ఆ జ్ఞాపకం వచ్చింది. అప్పుడే మీ సాహితీ జీవితంలో 25 సంవత్సరాలు - నిత్య వినూత్న సృష్టితో గడిచిపోయింది.

అన్నట్లు ఈ సంక్రాంతి (అంటే రేపే) త్యాగరాయ గానసభ వారు సంక్రాంతి సందర్భంగా ఒక కార్యక్రమం ఏర్పాటు చేయమన్నారు. "సంక్రాంతి రథం" అనే నృత్యరూపకమే స్టేజ్ ప్రజంటేషన్ చేస్తున్నాము. అందులో మీ పాట

"మంచుపైట సవరించి ఆడు సీమంతినీ

పొలాలన్నీ పండించిన కాంతినీ - సంక్రాంతినీ'

అన్న గేయం కూడా ఉంది.

---

స్వర్ణకంకణ విభూషిత
కవిసుధాకర - గానకళాధర
**యస్. రాజన్న కవి**

ప్రొద్దుటూరు
16/9/1981

మీ గేయాలు కొన్ని ఇదికరకే చదివాను. తక్కిన కావ్యాలన్నీ పూర్తిగా చదివాను ఇపుడు.

మీ ప్రతి గేయం మానవతా మధుమాసంలో మధురించే చాంపేయం. అందరి ప్రతిభా భావ సాహిత్య నవవసంత వీధుల్లో రవళించే మంజీర రావం.

ముఖ్యంగా మీ పద్యాలు - నందనవనిలా, నారీ నూపుర ధ్వనిలా మధురమైన ఆనందం కల్గించాయి. అక్కడక్కడ వాడిన సమాసాలు శ్రవణరసాయనంగా ఉన్నాయి. పద్యాల్లోని సంగీత ధారావైశారద్యం నన్నెక్కువగా ఆకర్షించింది. ఇది పొగడ్త కాదు. మనసులో మాట!

"ద్వేషాన్నైనా ప్రేమిస్తానే కానీ
ప్రేమను ద్వేషించలేని పిచ్చివాణ్ణి"
*ఈ వాక్యం చాలు మీరు మహాకవి అనడానకి:*
"మలయసమీరమన్న .....గానము సేతు
రసానుభూతులన్"

అను పద్యం హిందోళ రాగంలో మేళవించి పాడితే ఎవ్వడైనా సరే మనస్సు పరవశించి శిరస్సు నూపవలసిందే!

ఒక్క మనవి. మీ పద్యాలు సభల్లో ఉదాహరించి గానం చేయడానికి పర్మిషన్ మంజూరు చేయండి".

మీ కలం నుండి ఓ కథా వస్తువు పద్యకావ్యంగా ఆవిర్భవించాలనీ, అది సకల సాహితీ రసహృదయ పర్వంగా సాగాలనీ - ఆకాంక్షిస్తున్నాను.

ప్రొద్దుటూరు
12/2/1987

ఇక తమ శ్రీకారశిఖరం లోని ప్రతి గేయం నన్నాకర్షించింది.

ఆ గేయాలు దేశికవితా దేవాలయ దీపాలు. ఆనందవాణికి అగరు ధూపాలు. ఆ "క్యాసెట్" కొండంత తమ మధుర భావాన్ని అద్దం పట్టి చూపుతుంది.

అర్ద్రమైనది మీ మనస్సు హార్దికమైంది మీ వచస్సు. అఖిలమైనది మీ కృషి. ఖిలము కానిది మీ కృతి.

---

**డా॥ జి. లక్ష్మారెడ్డి** M.A., Ph.D
Reader
Dyal Singh College
(University of Delhi)
New Delhi - 110003
Phone : 617819

Resi.
B1-93, JANAKPURI,
New Delhi -110058
Phone : 5507899

Date : 5/1/1994

మీ సాన్నిహిత్యంలో గడిపిన మూడు రోజులు మెండుగా గుర్తుకు వస్తున్నాయి. మీ లాంటి సహృదయులను కలుసుకోగలగడం చాలా సంతోషాన్ని కలిగించింది. మున్ముందు కూడా కలుసుకొనే అవకాశాలు తప్పక వస్తాయని నా నమ్మకం. ఇక్కడ మా మిత్రులతో కలుసుకున్నప్పుడు కూడా మీ గురించి చర్చించుకున్నాము.

ఈసారి శ్రీ మధురాంతకం రాజారాం గారికి కేంద్రీయ సాహిత్య అకాడమి బహుమతి వచ్చింది. త్వరలో మీకు కూడా రావాలని నా కోరిక.

మీ సాహిత్యకృషి నిర్విరామంగా సాగాలని కోరుకుంటున్నాను.

---

ఏలేశ్వరపు రామకృష్ణ శాస్త్రి
NEW F/10, HYDERABAD COLONY
BANARAS HINDU UNIVERSITY,
VARANASI - 221 005.

7/4/1990

'చిరంజీవి స్వార్థం' అనే మీ కవిత - చైతన్య కవితలో చాలా బాగుంది. ఎంతో యథార్థ చిత్రణ. అతి విలువైన పదజాలంతో సూటిగా భావాన్ని అందిస్తూ ఉంది. మీకు ఉత్తరం వ్రాద్దామనుకొని అశ్రద్ధ చేసాను. బెంగుళూరు తెలుగుసభల్లో కవిసమ్మేళనానికి ప్రారంభకులుగా మీ రానాడు చదివిన తెలుగువాడు అనే కవిత జనాన్ని ఉత్తేజితలూగించింది. చవులూరించింది. ఆ సభలోని పలువురిలో ఆనందాన్ని అనుభవించినవాణ్ణి వారితో సంతోషాన్ని పంచుకున్నవాన్ని నేనొకణ్ణి. మీకు అభినందనలు చెబుదామని ఈ ఉత్తరం వ్రాస్తున్నాను.

---

తాళ్ళూరి వెంకటస్వామి
Work-Inspector
Mandal Praja Parishad
Ramayampet - 502 101. Medak dist.

29/7/1988

ముఖ్యంగా మీరు ఎప్పుడో వ్రాసిన "ఎగిరిపోయే నాహృదయమా" అన్నగీతం నన్నెంతగానో ఆకర్షించింది.

బ్రతుకుబాధ సహించలేవు
మరణమును ప్రేమించలేవు
నేలపై కాలూన లేవు
*నింగి శిఖరము చేరలేవు!*

నిజంగా హృదయమున్న వాడు అనుభవించే భావన అలాగే " నిన్ను వలచిన దాని నొల్లవు - నీవు కోరిన దేమో దొరకదు. ఈ చరణం కూడా ఎంతో అనుభవాన్ని ఆస్వాదిస్తే తప్ప కలంలోంచి వెలికిరాదు.

"నీవు కలగన్నట్టిలోకం - నిజంగానే చేరగల"మా? చేరలేము. చేరితే ఈ మనిషి మరే లోకంలో వుండే వాడో అర్థంకాదు.

ఈ పై గీతాన్ని నేను కార్యక్రమాల్లో అప్పుడప్పుడు పాడుతుంటాను. మీ అనంతమైన భావాలకి నా జోహారులు.

మీరు సినీ గీతాలు వ్రాయాలని కోరుకుంటున్నాను. మీ అభిప్రాయ మేమిటోగాని -మీరు తప్పకుండా వ్రాయాలి.

---

కొప్పర్తి రామారావు
(రచయిత)
కుక్కలవారి తోట, మసీదు దగ్గర,
ఇంటి. నెం. 20/80
మొగల్తూరు-534281.

15/4/1994

వినూత్న వారపత్రిక 'పల్లకి' (13.4.94)లో 'బాపురెడ్డి భావవీచిక' ద్వారా, పాఠకులకు (మీ రచన) అందించిన "మధుమాసంలో మోసం" చదివే భాగ్యం కలిగినందుకు చాల ఆనందంగా ఉంది. (ఈ మధ్య మీ రచనలు చూడ్డం పడలేదు).

మోసం మధుమాసంలా
వేషం వేస్తుందనుకోలేదు
ఆశల కాశ్మీరానికి
అగ్గిపెడుతుం దనుకోలేదు
రాగాలు విరిసే మంచులకొమ్మ
రక్తాలు పూస్తుందనుకోలేదు.

అడవులారా! కొండలారా!!
అజ్ఞాతపు లోయల గుండెలారా!
ఈ విద్వేష పలాశకుసుమహాసం నమ్మకండి
ఈ మధుమాసపు మోసంలో పడకండి.

పుస్తకాలలో ఉన్నదంతా వాస్తవమేనని విశ్వసించి
మీ మస్తకాలు పాడుచేసుకోవద్దు
వాదాలకు ఉన్మాదాలు బోధించే
వసంతాలు మనకు వద్దు -
సత్యమార్గాలలో సాగిపోయే
మన ఆశల ఆశయాల రథానికి
కట్టండి 'అహింసా హంస' కేతనం
నిలబెట్టండి మన నిత్య నూతన చేతనం

ఈ కవితలోని పదజాలం గాలానికి తగిలిన చేపలా, స్రవంతీ సముదాయంలో పైకెగసే గంధపు మదురిమ, నన్ను చాలా ఉత్తేజపర్చింది. అభినందనలు. మీ రచనలు మరిన్ని కావాలని, పుంఖానుపుంఖలుగా రావాలని మనస్ఫూర్తిగా కాంక్షిస్తున్నాను.

---

**వి. నాగలీల**

C/o. వి. అనంతరామయ్య
బ్రాహ్మణ వీధి,భద్రాచలం,
ఖమ్మం జిల్లా-507 111.

6/5/1993

మీ భావకవిత్వం నేను చదివి మొట్టమొదటసారిగా ఓ చిన్న కవిత రాసి మా కాలేజ్‌లో కొత్తగా ప్రారంభించబడిన పత్రికకు పంపించాను. అది నా అదృష్టమేమో! ఆ పత్రికలో వెలువడినది. మనిషి యొక్క తత్వాన్ని గూర్చి రాసినది. ఇప్పటికీ రాస్తున్నాను- నా జీవిత భావ కవితల్ని, మధ్యతరగతి కుటుంబీకుల గాథల్ని, అధికారుల అహంకారాల్ని, స్టూడెంట్స్‌ని పావులుగా వాడుకొనే నాయకుల గుట్టుల్ని, ఆడపిల్లల జీవితాలతో ఆడుకునే వరకట్నపు పిశాచుల్ని!

మీ పుస్తకాలతో మొదలిడిన నా కవిత్వం ఇంకా పొందాలి వీరత్వం, ఆగకూడదు నాలోని కవిత్వం.

బాపు! మిమ్మల్ని తలిస్తే చాలు బోసినవ్వుల తాతాజీ స్వతంత్రాన్ని రప్పించిన బాపూజీ గుర్తొస్తాడు శాంతీజీ.

మిమ్మల్ని చిన్న రిక్వెస్ట్ చేసన్తా ఒకటడగాలనుకుంటున్నాను. మీ దగ్గర మీ రచనల పుస్తకం ఏదైనా వుంటే మీ సంతకంతో తప్పక పంపమని కోరుకుంటున్నాను. అది మీ దగ్గర నుండి అందుకోవాలనుకుంటున్నాను. మీలాంటి కవులందరినీ దగ్గరనుండి కలుసుకునే భాగ్యం నాకు ఉన్నదో లేదో! అందుకే మీరు సంతకం చేసిన ఆ జ్ఞాపికను అందుకోవాలని నా కోరిక! ఎందుకంటే 'పుస్తకంపై రాసినది మాసి పోవచ్చు, జ్ఞాపకంపై రాసినది ఏనాటికీ మాసిపోదు'.

---

**ఆర్. రంగస్వామి గౌడ్**

అధ్యక్షులు-యువజన సాహితీ సమాఖ్య
జమ్మలమడుగు,
కడపజిల్లా - 516 434.

28/3/1980

మీరు మా యువజన సాహితీ సమాఖ్య వార్షికోత్సవములలో పాల్గొన్నందుకు మా హృదయపూర్వక నమస్కృతులను స్వీకరించండి. ఎంతటి కార్యక్రమములున్నప్పటికి ఎంతో దూరం ప్రయాణం చేసి మమ్ములనందరిని తమ ఉపన్యాసముచే మంత్రముగ్దులను చేసినందుకు మేమెంతోధన్యులము. యీనాటికీ ఆనాటి మీ ఉపన్యాసము శ్రోతల అంతర్యములో మెదలుతూ వుంది. జమ్మలమడుగు

లోని వాడవాడలా మీ ప్రసక్తి, మీ పొగడ్తే. చక్కని ఉపన్యాసముతో సాహిత్యమంటే ఏమిటీ అనే జఠిలసమస్యపై మృదుమధుర భాషణముతో శ్రోతల హృదయాలను ఆకట్టుకున్నారు. మిమ్ములను పిలిపించి, మా సమాఖ్య చరితార్థమయింది. ఎందరికో చైతన్యము కలిగించింది. మా ప్రయత్నము ఫలించింది. మరియొక మారు మీ కవితా గానము వినాలని మా గ్రామమంతా ఎదురు చూస్తుంది. ఇది అతిశయోక్తికాదు. వాస్తవము.

---

**ఘంటసాల విజయ కుమార్**

సంగీత విద్వాన్
151, ఉస్మాన్ రోడ్,
టి. నగర్, మద్రాస్-600 017.

27/10/1986

తమతో నాకు ముఖపరిచయం లేకపోయినా పరోక్షంగా మీ గేయరచన నన్ను మిమ్ములను పరిచయం చేయించుకునే పరిస్థితిని కలుగజేసింది. ఈ 23న దేశభక్తిగేయాలను స్వరపరచే కార్యక్రమం క్రింద మీ గేయమైన నా దేశం భారతదేశం అన్న గేయాన్ని అక్కడి ఎ.ఐ.ఆర్. లో రికార్డు చేశాను. మీ రచనలలోని మాధుర్యం, ఉద్వేగం నన్ను ఆకర్షించినాయి. ఈసారి అంటే జనవరిలోగాని, ఈలోపు వీలుకుదిరితే ఏదైనా పనిమీద అక్కడికి వచ్చినప్పుడు ముఖస్థంగా మిమ్ములను చూచి మీరు వ్రాసిన మొత్తం గేయాలనన్నింటిని సేకరించి నాశక్తిమేరకు వాటిని స్వరపరచి ప్రజలలోకి తీసుకొని వెళ్లాలన్న ఉద్దేశంతో ఈ జాబు మీకు వ్రాస్తున్నాను. మీ ప్రోత్సాహాన్ని ఎదురుచూస్తూ మీ పరిచయభాగ్యం కోసం తపన పడుతూ, తగిన అవకాశంకోసం నిరీక్షిస్తూ, కృతజ్ఞతలతో శలవు తీసుకుంటున్నాను.

---

**మందడి కృష్ణారెడ్డి**

అధ్యక్షులు-ఉజ్వల కళాసమితి
నం. 153, బి.ఎన్.ఆర్. నగర్,
వనస్థలిపురం, హైదరాబాదు-661.

12/6/1996

కవి ప్రవీణా! మీ కరకమలములచే 'ఉజ్వల కళా సమితి' ప్రారంభోత్సవం గావింపబడడం మీ సహృదయ శుభాశీస్సులందుకోవడం, మీ అమూల్య, అమేయ, సలహా సంపత్తిని పొందగలగడం అదృష్టంగా భావిస్తున్నాం.

మీరాక మా సమితి పురోగమన పతాక
మీ ఆశీస్సు మా సమితికి ఉషస్సు
సదా మీ మేధాసంపత్తిని పంచుకోవాలని అభిలషిస్తూ
మీ ఆగమనానికి హార్దిక ధన్యవాదాలర్పిస్తూ

---

**డా॥ బి.వి. రమణమూర్తి** MA.:Ph.D.

తెలుగు లెక్చరర్-ఎస్.కె.బి.ఆర్. కాలేజి,
అమలాపురం.

18/12/1987

ఆరోజు కళాశాల ఉత్సవంలో మీరు చేసిన ప్రసంగం విద్యార్థులకే కాదు పురప్రముఖులకీ అధ్యాపక వర్గానికీ చాలా నచ్చింది. ముఖ్యంగా ప్రెస్‌వారు కూడా నాతో మంచి వ్యక్తిని పరిచయం చేశారని 'సమయోచిత ప్రసంగ'మని అంటూ మిమ్మల్ని అభినందించారు. ముఖ్యంగా ఉన్నత పదవిలో ఉండి, నిరాడంబరంగా అందరికీ ఆత్మీయతని పంచిన మీ ఉత్తమ సంస్కారానికి రెండు చేతులూ జోడించకుండా ఉండలేను. ఏదైనా మీ వంటి సాహితీ సంపన్నులతో 'కవితాకళాతపస్వి' తో పరిచయ భాగ్యం కలగటం నా అదృష్టం!

---

ఎస్. శ్రీపతి రెడ్డి
16-1-414
సైదాబాద్, రెడ్డి స్ట్రీట్,
హైదరాబాద్-500 659.

భాగ్యనగరం
26/5/1981

ఈ మధ్యనే విశ్వనాథ సత్యనారాయణ బాలాంత్రపు రజనీకాంతరావులచే సంకలనం చేయబడిన "తెలుగు కవితా సంపుటి"ని ఆ కవితా సంపుటిలోని మీ "విశాఖ లేఖ"ను చదివిన తర్వాత ఈ ఉత్తరం వ్రాయకుండా ఉండలేకపోయాను.

బాపురెడ్డి గారి పేరు వినడం చదవడం వరకు మాత్రమే జరిగింది. కాని వారి రచనలు చదివే భాగ్యం లభించలేదు. మొదటిసారిగా చదివిన 'విశాఖలేఖ' నాకెంతగానో నచ్చింది. నన్ను ముగ్ధుణ్ణి చేసింది అంతేగాక నేను మీ అభిమానినయ్యాను.

కవితలో ఒక పట్టణాన్ని కళ్ళకు చూపించిన తర్వాత నేను నిజంగా విశాఖను చూడకున్నా విశాఖ-ఎలా వుంటుందో తెలుసుకోగలిగాను. అక్కడి పరిసరాలు ప్రజల గూర్చి మీ వర్ణన నన్నాకర్షించింది.

విశాలమైన విశాఖపట్టణం
సుందరమైన కావ్య వస్తువు
అందీ అందని ఆనందాల
విందుకు ఆట పట్టువు. అన్న

నాలుగు చరణాలలో విశాఖ అందాన్ని విపులంగా చెప్పిన కళాకోవిదులకు నా కలం ముందుగా నమస్కరిస్తోంది. ఆ పిదప బీచిని గురించి వర్ణిస్తూ

సాయంకాలం బీచి మీద
సరదాగా సాగిపోతుంటే
కలల అలలపై తేలినట్లుంటుంది
కమ్మని కావ్యం విన్నట్లుంటుంది.

అని మీరన్నారు. కాని నాకు మాత్రం ఆ చరణాలు చదివితేనే కలల అలలపై తేలినట్లు కమ్మని కావ్యం చదివినట్లు అనిపించింది. అంతేగాక

పొంగినట్లే పొంగి
తక్షణమే కృంగిపోయి
నిస్సహాయంగా పొరలుతూ
నిముషంలో విరిగిపోయే తరంగాలు
జీవిత మహార్ణవంలోని
తృటికాలపు జీవితాలకు ప్రతిబింబాలు

అని కెరటాలను మీరు కవులు కనుక వర్ణించగలిగారు. కాని మీ వర్ణనను వర్ణించాలంటే నాకు మాటలు రావు. నేను కవిని కాను.

మహాశక్తి సంపన్నుడు సాగరుడే
ఇంతగా ఘోషిస్తుంటే
అనిపిస్తుంది ఎంతటి మహాత్మున్నికైనా
శాంతి లేదని మనశ్శాంతి లేదని

మరి సాగరునంతటి వాడికే శాంతి లేని నాడు మామూలు వారికెక్కడిదండి శాంతి! మనశ్శాంతి!

ఎవరో వెంట తరుముతున్నట్లు
పరిగెత్తి వచ్చే కెరటాలు
అడ్డంగా నిల్చిన తీరాల్ని దాటలేక
నురుగులు కక్కుతూ పడిపోయే దృశ్యాలు
గుండెల్ని కరిగించి వేస్తాయి
బ్రతుకులోని పరిమితుల్ని జ్ఞాపకం చేస్తాయి.

కెరటాలను చూడకున్నా పై చరణాలు (చూసి) చదివి గుండెల్ని కరిగించాయి. కవితలెన్నో చదివాను విన్నాను కాని ఎందుకో విశాఖ లేఖ నన్ను అన్నిటి కంటె ఎక్కువగా ఆకర్షించింది. నేను మొదటిసారిగా మహాకవి డా॥ సి. నారాయణ రెడ్డి గార్కి ఇలా ఉత్తరం వ్రాయడం జరిగింది. అంతేగాక నేను వారికి ఏకలవ్య శిష్యుణ్ణి. రెండవసారి నా చేత ఉత్తరం వ్రాయించిన కవి శ్రీ బాపురెడ్డి గారే. అదే వారి 'విశాఖ లేఖ' ద్వారా

బ్రతుకులోని
బాధల్ని తప్పుకోడానికి
మనసులోని మాటల్ని చెప్పుకోడానికి
అనురాగాలు పెంచుకోడానికి
ఆనందాన్ని పంచుకోవడానికి
అనువైన చోటు

అయినటుఎంటి ఆ పబ్లిక్ పార్క్‌ను చూడాలని ఉంది. అయితే నా మనసులోని మాటల్ని చెప్పినా అక్కడ వినడానికి ఒక తోడు కావాలిగా.

అడవిలోని జంతువుల్ని
కడలిలోని చేపల్ని
వేటాడుతాడు మానవుడు
మానవుణ్ణే వేటాడుతుంది మృత్యువు
లోకంలో వేల వేల వేటలు
అన్ని మృత్యు ముఖంలోకి బాటలు
ప్రతి వస్తువులోను కవితా సౌరభం ఉంది
అని మీరన్నట్లు
ప్రతిచరణంలోను కవితానైపుణ్య ముంది.
బాపురే బాపురెడ్డి గారి విశాఖ లేఖ
వ్రాయించింది నా చేత ఈ లేఖ
విశాఖను చూడాలని పుడుతోంది కోరిక
చూపించి మనసుకు విశాఖను మీ కవిత
'విశాఖ లేఖ' పై ఎంత వ్రాసినా
పెరుగుతుంది మనసులో మిమ్ము చూడాలని
ఆతురత
పెరిగింది మీపై ఎందుకో అభిమానత
అసలు కారణం మీ విశాఖ లేఖ
తెలియజేయండి మీ అభిప్రాయం వ్రాసి ఒక
లేఖ

---


**డా॥ డి.వై. సంపత్ కుమార్**
శ్రీ గీత నృత్య కళామందిర్
(ఇంటర్నేషనల్ డాన్స్ పార్టి)
విజయనగరం-531 201.


22-6-88

శ్రీకాంద్రేగుల సూర్యనారాయణ మూర్తి గారి ద్వారా పంపిన మీ గేయనాటికల పుస్తకం యీ దినమే వూరినుండి వచ్చి అందుకున్నాను.

యీ నెల 16వ తేదీన తెనాలిలోను, 18వ తేదీన మంగళగిరిలోను, 19వ తేదీన విజయవాడలో జరిగిన అఖిలాంధ్ర కళాకారుల సదస్సులోను 21వ తేదీని రాజమండ్రిలోను ప్రదర్శనలు ముగించుకొని యీ దినమే వచ్చాము.

రేపు, ఎల్లుండి హైదరాబాదులో ముఖ్యమైన పనులు గురించి రేపు ఉదయం ఫ్లయిట్‌లో బయలు దేరుతున్నాము. వీలుచూచుకొని మిమ్మల్ని కలియటానికి ప్రయత్నిస్తాను.

జులై 18వ తేదీన యిచ్చట జరుగబోవు భారతీ తీర్థ ఇంటర్నేషనల్ అకాడమీ స్నాతకోత్సవంలో మీరు రచించిన "స్వాతంత్ర్య హేల" గేయ నాటికను నృత్య నాటికగా మలచి ప్రదర్శనం యివ్వాలని ప్రయత్నం చేస్తున్నాము. కాని బిజీ ప్రదర్శనల వలన వూరిలో సరిగ్గా వుండక ఏమీ న్యాయం చేయలేకపోతున్నాను. అయినా ప్రయత్నిస్తాను.

జులై 3,4 తేదీలలో మద్రాసులో మా ప్రదర్శనలు వున్నందున బృందంతో జులై1వ తేదీన మద్రాస్ మెయిల్‌లో బయలుదేరుతున్నాము. తిరిగి వచ్చేసరికి 7వ తేదీ అవుతుంది. ఇక 10రోజుల కాలవ్యవధిలో గేయ నృత్య నాటికకు ఎంతవరకు న్యాయం చేయగలమనే భయం వెంటాడుతున్నది. శ్రీయుతులు బోయిభీమన్న, గజ్జల మల్లారెడ్డి వగైరా కవుల గేయాలకు జీవం పోసి మూడు దశాబ్దాలపైగా ఆడుతున్నాము.

కవి హృదయాన్ని విపులంగా వివరించి జన హృదయానికి హత్తుకొనేలా చేసే భాగ్యం ఇన్నాళ్లు భగవంతుడు ప్రసాదించాడు.

మీ గేయాలు చదివాను, 'స్వాతంత్ర్య హేల' అపూర్వంగా వుంది. విమర్శనాత్మకమైన దృష్టితో కూర్పుచేస్తే దశాబ్దాలపైగా ఆడవచ్చు. ఎందుచేతనంటే మీరు రాసిన గేయ రచనలోని ఇతివృత్తం జనజీవనంలో ఎప్పుడూ కదలాడుతుంటాయి. నేటి పరిస్థితులకు అద్దం పట్టేలా వుంది.

దేవుడు మేలుచేస్తే నా ప్రయత్న సఫలీకృతం కాగలదని విశ్వసిస్తున్నాను. ఉన్న బాధ ఒక్కటే విపరీతమైన ప్రయాణాలు వలన స్థిరత్వం సిద్ధించడం లేదు.

మీతో నాకెప్పుడూ పరిచయం లేదు. కొన్ని సంవత్సరాల క్రిందట సంగీత నాటక అకాడమీలో చూచాను. పరోక్షంగా మీరు నాకు అత్యంత అభిమానమైన కవులు - సాహిత్యవేత్తలు.

---

**సి.హెచ్. సీతారామమూర్తి**

జూనియర్ అసిస్టెంట్

**పి. కోదండరామిరెడ్డి**

స్టెనో

దేవాదాయ ధర్మాదాయ శాఖ, గుంటూరు.

10/5/1988

6/5/88వ తేదీ రాత్రి గం. 7.45 ని॥లకు కవి సమ్మేళన కార్యక్రమము టీవిలో చూడడం జరిగింది. అందులో ప్రారంభంలో మీరు చదివిన భాగ్యనగరము కవిత చాల బాగుంది. భాగ్యనగరము వైభవోన్నతులు పైనే కాకుండా నీలి నీడలను, మురికి వాడలను, అలక్ష్యం చేసిన ప్రాంతాలను చాలా చక్కగా చమత్కారంగా కవితా ధోరణిలోనే కాకుండా వాస్తవ దృక్పథంతో కూడా వర్ణించారు. మొత్తంమీద ఆ కార్యక్రమంలో మీ కవిత, శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ గారి చమత్కారికలు మాత్రమే బాగున్నాయి.

2

20/7/88

శ్రీకార శిఖరం మరియు క్యాసెట్టు చదవటం వినటం జరిగింది. "సనాతన అధునాతన కవితా సంప్రదాయ సవ్యసాచులని" అనిపిస్తున్నది. ఈ సందర్భంగా మా పద్యమాలను స్వీకరించవలసిందిగా కోరుతున్నాము. కవితా సౌందర్యము కోసము సమయానుకూలముగా 'వాడు' అనే పదము ఉపయోగించక తప్పలేదు. కవితాహృదయులైన మీరు దీనిని తప్పుగా భావించరని మా విశ్వాసం. అన్యధా భావిస్తే తెలియజేసిన సరిదిద్దుకుంటాము.

ఆ.వె॥ బాపురెడ్డి గారి భావ సంద్రము కన్న
'బాపురే' యనిపించు వాక్కు మిన్న
వాక్కు కన్న వారి వాత్సల్యమదిమిన్న
మిన్నుకన్న క్రొత్త వెన్న కన్న.

తే.గీ॥ పలుకు పలుకున కవితలు పరుగుదీయ
తెలుగు తేనియల్ పంచి విదేశమందు
ప్రముఖ సన్మాన మందిన బాపురెడ్డి!
హృదయపూర్వక పద్యము
లివియెగొనుమ.

సనాతన అభ్యుదయ కవితలను రెండు మహాసముద్రములను కలుపు జలసంధివలె గోచరించు మీ గురించి మేము ఏమనుకుంటున్నామో తెలుసా?

సీ॥ 'శ్రీకార శిఖరాన' చిందులేసినవాడు
ఓంకార మధ్య మందొదుగు వాడు
'సాగర సోధాన' సరసమాడినవాడు
కర్షక కష్టాల కనెడివాడు

బౌద్ధ నాగార్జున పలుకరించిన వాడు
పులకించి పులకించి పలుకువాడు
కమనీయ కావ్యాల కౌగిలించెడి వాడు
రమణీయ కవితల వ్రాయువాడు

తే॥ గీ॥ ఉన్నతోన్నత సచ్ఛీలమున్నవాడు
సరస సాహిత్య సద్గోష్ఠి సభల యందు
పండితోత్తమ సత్కవి బాంధవుండు
'బాపురే' యనిపించు మా బాపురెడ్డి.

ఉ॥ పాలన చేయగా కదలివచ్చెను 'సెక్రటరెట్టు'
నుండి, దే
వాలయ ధర్మ సంస్థలు, 'సెబాసన' హైందవ
సాంప్రదాయకుల్
గాలిని పీల్చి హాయిగ, వికారుల డెందము
దద్దరిల్లగన్
హేలగ బాపురెడ్డి సుకవీంద్రుడు సజ్జనులెల్ల
మెచ్చుగన్

---

**కాళిదాస్**

P.O. Rekonda,
S.O. Tadikal,
Dist. Karimnagar-505 474.

1) 1989 సం॥గాను తెలుగు విశ్వవిద్యాలయము "మన చేతుల్లోనే ఉంది" కావ్యానికి సాహితీ అవార్డును ప్రకటించిన సందర్భంగా మీకు హృదయపూర్వక శుభాకాంక్షలు.

2) మీ నిర్విరామ సాహితీ తపస్సు అమృత హృదయం ఏ అవార్డులతోను వెలకట్టలేనివి.

3) సంఘములో పెద్దలనే వాళ్ళు సంపాదన కోసము ఎంతకైనా దిగజారుతున్న ఈ కాలములో క్షణం విరామము లేని ఉద్యోగంలో ఉండి చల్లని కవితలతో సాహితీ హృదయాలను కదిలించే మీ కవితా హృదయం హిమాలయంకన్నా ఉన్నతమైనది. విశ్వమానవతా సౌరభాలను తనలో దాచుకున్న మధురగ్రంథము.

అందుకుగాను ఇంకా ఇంకా ఉన్నతమైన అవార్డులు గుర్తింపులు రావాలని కోరుకునే....

---

**శ్రీమతి పి. శేషమ్మ**

14-2-13, Pension Lane,
Eluru-524 005.

కరమ్‌చంద్ మోహనదాస్ గాంధీని ఆయన జీవిత మధ్యమున మానవాళి 'మహాత్మ' అని 'బాపూజీ' అని మనసార గౌరవించారు.

*"బాపూ! నీ పుట్టినరోజు*
*ఒక భగవానుడు పుట్టినరోజు" అని*

సి.నా.రె. గారు కీర్తించారు. ఐతే-పుట్టుకతోనే మీరు 'బాపూ'లై పుట్టి పెరిగారు. నాటి బాపూజీ ఒరవడిలో అనుకృతిగా జీవితం వెలయిస్తున్నారు.

*ఏమని కొనియాడాలి? మిమ్మేమని నుతించాలి?*
*బాపురె నీ పుట్టిన రోజు - మా*
*కొక భగవానుడు పుట్టినరోజు - మా*
*కొక భాగ్యదాత పుట్టినరోజు - మా*
*కొక కరుణానిధి పుట్టినరోజు" అని*

మార్చి. మీ ఉదారతను, కరుణా హృదయ విలోలతను మా నిఋపేదలు మనమ్మున మాటిమాటికి ఉగ్గడించుకొంటారు. అలా నుతించగలరు.

అలనా డొక బోయ(వాల్మీకి) అప్రయత్నంగా హాహారవముతో నేలపడిన క్రౌంచపక్షి యుగమును జూచి - ఏవో జాలికరమైన మాటల శ్లోకం శోకంతో చెప్పినట్లు - తమ సన్నిధికి వచ్చినపుడు తమ సౌజన్యత, కరుణార్ద్రతను గాంచి అనుభూతి జెందుచున్నపుడు- నాకును ఏదో మిమ్మును కీర్తించే కవితాఝురి పొంగివస్తుంది.

ఒకసారి పద్మశ్రీ బోయిభీమన్నగారి నుండి మొదలుకొని - మీ చేతి క్రింద చిన్ని భృత్యుని వరకు పరిశీలించి చూస్తే - మీ ఆప్తులు, ప్రాణమిత్రులు, అభిమానులు అందరు హరిజనులే. దీనులే. మీరు నిజముగా నవయుగ 'బాపూ'జీయే. ఈ హరిజనోద్ధరణ, దీనజనోద్ధరణ ఉద్యోగమనే ఆయుధంతో మీకు అక్షరాల ఆత్మోద్ధరణ మౌతున్నది. హరిజనోద్ధరణ మీ కాత్మోద్ధరణ.

నాటి బాపూజీకి సత్యాగ్రహము ఆయుధమైతే - నేటి బాపూజీయైన మీకు సత్యము, స్వచ్ఛము మేళవించి సలిపెడి ఉద్యోగమే మీకు ఆత్మోద్ధరణకు ఆయుధము లేక ఆలంబనమైనది.

బాబూ! మా నిఱుపేదలు మిమ్ముఎలా ఏమని నివాళించగలరు?

*ఊరు పేరును లేక దారిపొంతన పూయు*
*గరిక పూ హృదయాల నిరుపేద హరిజనులు*
*చిరుగాలి రివ్వకే కఱగిపోయెడి వారు*
*అలతి సుమ హృదయాలు బాపూ! మీకేమి*
*అర్పణము సేయగలరూ? హారతుల*
*నీయగలరు?*

తమ దర్శనం నాకొక దైవదర్శనం. కుటుంబ బాధల ఎడారిలో కుంటుపడి చివరకు ఇంకిపోయిన నా జీవన కవితావాహిని తమ అభయ దృక్కులతో, ఆదరణ వాక్కులతో మళ్లీ సెలవారి(సెలలెత్తి) నీరాజనంగా నివ్వటించుచున్నది. అది మా అదృష్టం!

తమ 'శ్రీకార శిఖరం' లో ఎంత భక్తి ప్రస్ఫుటమౌచున్నది! ఎంత భక్తి విలీనమైయున్నది! ఆ 'శిఖరం' భక్తి ముకురమే. ముక్తియై ముక్తిగా వికసిస్తుంది. మూఢభక్తికి వెయ్యి ఆమడల దూరంలో ఉన్న - ఉన్నతమైన సున్నిత భావ 'భక్తి శిఖరం' అది.

బడబాగ్ని లేనట్టి పాథోధి మీయెడద (పాల్కడలి హృదయులు) మీకు మనసా భక్తి ప్రణామములు.

2

26/x/1989

బాపూజీ!

తమ దర్శనం మాకొక దైవదర్శనం! తమ వీక్షణం మాకొక విశ్రుత మధురక్షణం. తమ వాక్కు మా కొక జీవన గమన వేదవాక్కు. తమలోనున్న లోతెఱుగని మంచితనాన్ని మంచి పదజాలముతో మూసబోసి, అక్షరరూపం దాల్చించి, పుస్తక రూపంలో పుంఖానుపుంఖ భావ సంపుటులు మాకందిస్తున్నందుకు తమకు మా ధన్యవాదములు ఎలా చెప్పాలో - ఎలా ఉల్లేఖించాలో నాకు తెలియుటలేదు.

తెనుగులో తమ కవిత మధుసోన లనుకుంటే ఆంగ్లంలో మీ కవిత అంతకంటే మధురాతి మధుర అమృతధారలా జాలువారి జనులను అమృతులను జేస్తుంది. ఇది నిజం, నిజం!

'Urn of Love', 'In Quest of Harmony'దేని కదే సాటి. తమరు గత జన్మలో లండన్, పారిస్, స్టేట్స్, తాయిలాండ్స్‌లో ఎక్కడనో పుట్టియున్న వారేనని అనిపిస్తున్నది. "ఏ మంచి పూవులన్ ప్రేమించినావో జనియించి నాడ వీ (భారత) పుడమి గర్భమున" అని అనుకొంటున్నాను.

పై రెంటిని మించి 'Raise' చాల చిన్న ఖండకృతియైనను అతి సామాన్యమైన భాషలో 'Ample Thought in Simple Words'గా వెలుగొందుచున్నది. 'One God, One Creation' నినాదముకు సామీప్యముగానున్నది. Burn కు 'వెలగాలి' అనుటలో Fly కు 'ఎగసిపో' అని తెనిగించుట పద్య భావమంతయు ముందుగనే ద్యోతకముగుచున్నది. అది తమలో నున్న కవితోజ్జ్వల కమనీయ భావదీప్తి.

నాల్గవ తరగతి విద్యార్థి కూడా ఆ సులభభాషతో బాటు ఆ యర్థాన్ని కూడ అవగతపర్చుకుంటు

చదువగలడు. ఎస్టర్‌గ్రెస్ గారి ఆంగ్ల పదాలకు ముక్తసరిగా ఆమెవలెనే తెనుగులో భావ విస్తరణ కల్పించారు. మిమ్మును - మీ కృషిని, మీ కవితాఝరిని ఎలా అభివర్ణించాలో నాకు చేతగావడము లేదు.

Easter Gressగారి మాటలు సంస్కార హీనుడైన మానవునకు శైశవగీతాల బాణీలో నీతి సూత్రాలను, పరమసత్యాలను నేర్పుతున్నట్లున్నది. అంతకు మించి మీ తెనిగింపు అమోఘము. Easter గారు (మరొక్క ఉదాహరణ) 'We' తో వ్రాసిన 'Us' heading పద్యానికి యిచ్చారు. మీరు 'Us' కు పద్యభావ సముచితంగా 'మనం' అని heading యిచ్చారు. అదియే మీ కవితా ప్రతిభ.

ఈ విశ్వాంతరాళమంతా ఒక మహాశక్తిచే నడుపబడుచున్నదని తెలుసు. ఆ విశ్వవిధాతపై విశ్వాసముంచి జీవించుచున్న మాకు మా పాదములు మీ ప్రాసాదాంతరమునకే నడిపించుకొని వచ్చుచున్నవంటే తమపై మాకున్న దృఢ విశ్వాసమే మీమ్రోల వ్రాలజేయుచున్నది. 'Seven Hills' కు గాదు Jerusalemకు గాను మాకున్న ఆత్మ విశ్వాసముతో దైవానుబంధంగా తమను దర్శించుకుంటుంటాము.

'తల్లి' రాజరాజేశ్వరీదేవి గార్కి, తమకు మా హృదయపూర్వక వేవేల నమస్కృతులు.

---

## నర్సింహమూర్తి

న్యూయార్కు
9/3/1981

కౌలాలంపూర్ వెళ్ళలేకపోయినా మన గవర్నమెంటు పంపలేక పోయిన ఒక కళాకారుడుగా బాధతో మరల SBHవారిని అడిగి అమెరికా ఆహ్వానం పొంది చికాగో తెలుగు సమ్మేళనానికి వచ్చాను.

చికాగో నుండి Detroit, Houston, Toronto, Otawa, London, Neshwill, Atlanta, Newyork వంటి నగరాలలో నా పాటల కంటే లోపాటలు చాలా అయ్యాయి. నేను యిచ్చిన ఈ అన్ని పట్టణాలలో మిమ్మును పొగడడం కాదు ప్రతీ ఒక్కరూ "చెలియ పంపి ఒక పత్రము" పాట పాడకుండా విడువలేదు. ఒక్క డప్పు మీద పాడినా వీణ లేకపోయినా ఎంతో ఆనందించేవారు. అంతకంటే ఒక గాయకునికి ఆనందం ఏముంది సార్.

---

## బి. వీరా స్వామి

2-37-3., పెద్రాజుపేట,
మందావారి స్ట్రీట్, కాకినాడ - 3.

కాకినాడ
12/3/1975

మీ గేయాలతో గేయ నాటికలతో పరిచయమున్న సాహిత్యాభిమానులలో కేవలం నేనొక్కణ్ణి. ఎప్పటినుండో లేఖ వ్రాయాలను కొంటున్నాను. యీ విధంగా మొదటి లేఖతో పరిచయం చేసుకోవాల్సి వస్తుందనుకోలేదు. బలమైన భావనతో చక్కని ఊహాశాలిత్వంతో, లలితమైన పదజాలంతో, స్పష్టత నిండిన సొంపైన మీ గేయాలంటే నాకు మోజెక్కువనటంలో స్తుతి కాని, అతిశయోక్తి కాని లేదని సవినయంగా మనవి చేసుకొంటున్నాను.

---

## కొత్తపల్లి రామారావు

Mandala Praja Parishad Office,
Mogaltur, W.G. Dist.

మొగల్తూరు
14/4/1990

'శిలాక్షరి' కవిత (ఉగాది ఉదయం ప్రత్యేక సంచిక, నవతరం వారపత్రిక మార్చి 1990)

నన్నెంతగానో ఆకర్షించింది. నమస్సుమాంజలులు.

*"శిలలు పూజించు ఏకాంత సేవకుడను*
*ప్రస్తరాలను పలికించు భావుకుడను*
*జడమునకు చేతనమునకు ముడులు వేసి*
*నింగి నేలల కలుపు విహంగ మేను!"*

చక్కని చిక్కటి భావంతో కూడిన పదలాలిత్యం ఈ విధంగా జాలువారాలని కాంక్షించే.....

---

**బి.వి. శివయ్య**
Guntur (Dist.)
Narakodur-522 222

గుంటూరు
7/5/1988

Incidentally I happened to be at my home - last night from 7-30pm. and it was an extremely delightful to hear you reading a master piece in Kavi Sammelan. The language you have woven, with rythm - was well set and understood & appreciated by all rural folk.

అనుసంధానకర్తగారు మిమ్ములను పరిచయం చేస్తూ "కవిహాలికుడు డా॥ జె. బాపురెడ్డి గారు" అనడం- యెవర్రా యీ రైతుబిడ్డ అనిపించింది - వెంటనే మీ భాగ్యనగరు వర్ణన హృదయానికి, కళ్లకు కట్టినట్లుగా - చూసినట్లుగా - హృదయానికి అద్దం పట్టినట్లుందంటే - అతిశయోక్తి గాదు! ముమ్మాటికి!!

*గోల్కొండ దండ*

మెడనిండ *ధరించి* - అన్నటువంటి భావన యెవరికి అర్థం అయి ఆనందమివ్వదూ!!

అలాగే, గోల్కొండ గోరీల నుండి హెచ్చరిస్తున్నారు అనే భావగీతి యెవరి హృదయాలను కదిలింపదూ?

మునీశ్వరుడైన

లోచూపురెడ్డిని - అన్న మాటలు మిమ్మేరిగిన నన్ను యెంతో చలితుడను చేసినవంటే గొప్పగాదు. నిజంగా మీ హృదయాన్ని చాటకనే చాటారు.

స్వయముగా చూసి చాలాకాలమైనా, గత రాత్రి టి.వి. లో మిమ్ములను కావ్యరసంలో చూసి - నేనే గాదు - ప్రక్కన చూసినవారు గూడా చాల ముగ్ధులమయ్యి నేను మిమ్ములను స్వయంగా చూసి చాలకాలమైనదే అనే దూరాన్ని మరపించింది.

---

**వేముగంటి నరసింహాచార్యులు**
Ram Mandir,
Siddipet-502 103.

31/5/1981

దయతో మీరు పంపిన "నాదవేదాలు" అందింది.

నవతావాదం, మానవతావాదం, ప్రకృతిగానం, ప్రగతి ధ్యానం మీ కవితల్లో నిండుగా ఉన్నాయి. మధురమూ, మనోజ్ఞమూ అయిన మీ కవితలు సహృదయులను మిక్కిలిగా అలరిస్తాయనడంలో సందేహం లేదు.

---

**డి.వి. వెంకటరావు**
59-6-23, పోస్టాఫీసు వీధి
మేరీ స్టెల్లా కాలేజి ఎదుట
మిల్క్‌బూత్ గాంధి గారి ఇల్లు
విజయవాడ.

27/10/1990

ఈ రోజు తెలుగు వార్తల అనంతరం టీ.వి.లో మీ 'కవిత' ను వినే అదృష్టం మాకు కలిగింది. 1987 ఏప్రియల్ నుంచి హైద్రాబాద్‌లో లేకపోవడంతో

తమలాంటి పెద్దల ఉపన్యాసాలను గాని, కవిత్వాన్ని గాని ఆస్వాదించే అదృష్టానికి నోచుకోలేదు.

చావు, పుట్టుకల నిర్వచనం నాకెంతో నచ్చింది. ముఖ్యంగా మనిషి తనకు తానుగా సృష్టించుకున్న యీ 'కులం, మతం' అనే మాలిన్యం గురించి ఈ కవితలో నొక్కి వక్కాణించారు. 'సత్యం, శివం, సుందరం' అంటూ ముగింపు మీ కవితకు వన్నె తెచ్చింది.

ఈ మధ్యకాలంలో ఎక్కువగా మీ గురించి వినే అవకాశం ఏర్పడింది. మీరెక్కువగా విజయవాడ వస్తుండడంతో మీ గురించి తెలుసుకొనే భాగ్యం కలిగింది. (ఎపిఎస్ఐడిసి), విజయవాడకు విచ్చేశారు. అప్పుడే ప్రయాణిస్తే, ఎన్నో విషయాలు తెలుస్తాయి. అప్పటికప్పుడు కవితలల్లి వినిపించగల దిట్ట. ఈనాటి ఐఏఎస్. లలో యిలాంటి ఇంటరెస్ట్ వున్న వాళ్ళు చాలా అరుదు. ముఖ్యంగా నిగర్వి అని చెప్పుకోవటం విన్నాను. అప్పుడు మీ కవితను చెవులారా విన్నాను.

ప్రస్తుత విషమ పరిస్థితులలో మీలాంటి సమసమాజస్థాపకుల అవసరం యీ దేశానికి ఎంతో వుంది అనటంలో అతిశయోక్తి లేదనుకుంటాను. మీలోని సమతాభావానికి మీ 'కవిత' అద్దం పట్టింది.

ఎన్నడైన విజయవాడ వస్తే మనసున్న మనిషిగ మా యింటికి రమ్మని కోరుతున్నాను. ఐ.ఏ.ఎస్. ఆఫీసర్‌ని మా యింటికి ఆహ్వానించటం లేదు. సమత, మమత వున్న ఒక కవి పుంగవుని మాత్రమే ఆహ్వానిస్తున్నాను. నన్ను మీ అభిమానిగా స్వీకరించగలరా?

నాకు కవితలు వ్రాయటంవరకే సరదా.... మీ దగ్గర శిష్యరికం చేసి, నన్ను నేను తీర్చిదిద్దుకోవాలనేది నా ఆకాంక్ష.

---

**బి. విఠల్** B.Sc.,
Sub-Inspector of Police
Dharmavaram Tq.
Anantapur Dist. (AP).

తాడిపత్రి
18/4/1982

నేనెవరో మీకు తెలియదు కాని సాహిత్యాభిమానులలో నేనొక రేణువును. 7/4/82 ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికలో కవిత అన్న శీర్షిక క్రింద "బమ్మెర కోకిల"పై మీ యొక్క కవితా మాధుర్యమును చదివి ఆనందించిన వారిలో నేనొకడను. పోతన పంచశతి ఉత్సవాలను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అనర్గళంగా దిగ్విజయము చేయగలిగినదంటే మీ వంటి సాహితీ ప్రియుల సహాయ సహకారాలే ఇందుకు తార్కాణము.

*"పలికినది భాగవతమని*
*పలికిన పలికితివి గాని"*

అని మీరు వ్రాసిన కవిత సహజ పాండిత్యాని సీమకు, మీరు మండలాధిపతిగా నున్నందునేమో మీ యొక్క సహజ పాండిత్యము గోచరిస్తుంది.

"కావ్యకన్నెను"......
కూటికోసం అమ్మరాదోటు".

అన్న మీ యొక్క ప్రజాస్వామ్య సందేశము నేటి ప్రజాస్వామ్య వ్యవస్థలో మార్పు సూచిస్తూ, బమ్మెర పోతనామాత్యుల కావ్య కన్నెను ఏ రీతిగా కూళలకమ్మ రాదని సందేశమిచ్చెనో ఆ యొక్క కవితను పోలుస్తూ మీరిచ్చిన సందేశము నేటి యువతరానికి ప్రబోధ గీతమై నాంది పలుకుతుందంటే అతిశయోక్తి కాదేమో!

మీరు ముందు ముందు ఇలాంటి కవితలే వ్రాస్తూ మా వంటి యువకులకు మార్గదర్శకులై యుంటారని ఆశిస్తూ....

**బుద్ధవరపు అకమాంబికాదేవి**
**(శ్రీమతి బి.జె. రావు)**, డైరెక్టర్
బుద్ధవరపు ఆకల్టు ఆకాడమీ
జ్యోతిష, సంఖ్యా, సాముద్రిక, తంత్ర, యంత్ర,
ఆధ్యాత్మిక పరిశోధకులు
3-28-12, స్వామి వివేకానంద వీధి,
బృందావన్ గార్డెన్స్, గుంటూరు-522 006.

8/7/1984

శ్రీ జె. బాపురెడ్డి గారి సన్మానసభ

"ఎందరో మహానుభావులు... అందరికీ వందనములు" అన్నారు. అలనాడు త్యాగరాజుగారు గాని "అందరు మహానుభావులే... మీకందరికీ వందనాల"నీ ఈనాడు చెప్తూ... సభాధ్యక్షులకు, వేదికనలంకరించిన విజ్ఞులకు, విచ్చేసిన రసజ్ఞులకు, ఆనందానుభవజ్ఞులకు, ప్రత్యేక సన్మానితులైన శ్రీ జె. బాపురెడ్డి గారికి, సహృదయముతో సవినయంగా శతసహస్ర వందనాలర్పిస్తూ, నేటి సన్మానసభ నేర్పరచిన దాసరి సంగీత నృత్య అకాడమీ వారిని శ్లాఘిస్తూ, జగద్విఖ్యాతి గడించిన రచయితను పరిచయం చేయటము నా పూర్వజన్మ సుకృతముగా భావిస్తూ, అట్టి సదవకాశాన్ని నాకు కల్గించిన శ్రీ దాసరి సంగీత నృత్య అకాడమీ వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు అర్పిస్తున్నాను. సభాముఖంగా....

శ్రీ బాపురెడ్డి గారికి ప్రకృతి పరిశీలన వెన్నతో పెట్టిన విద్య. "ఋతురాగం" గేయనాటికలో ఆరు ఋతువులను ఆర్గురు ఋతుకాంతులుగా సృజించి వర్ణించి అందునా స్త్రీ సహజమైన ఈర్ష్య అసూయ ప్రవృత్తులు, జీవితంలోని సహజ సంఘర్షణలను కళ్లకు కట్టినట్లుగా చిత్రించారు. వర్షసుందరి-శరద్బాల, హేమంతకాంత, శిశిరభామిని, వసంతకుమారి, గ్రీష్మరాగిణి పాత్రల చిత్రణ కాలపురుషుని పాత్ర చిత్రణ కవి కవితా చిత్రకౌశలమునకు దర్పణములై నిలిచినవి.

*బాపురెడ్డి గేయాలు "అతీత గతంలో"*
*మనజాతి చేవను చంపిందిరా కులం*
*మన చరిత్రను మలినం చేసిందిరా కులం*
*తరతరాల దరిద్రాల కారణం కులం॥* అంటూ మానవుడు కులమతాల కతీతుడుగా వుంటేనే వసుధైక కుటుంబ మేర్పరుచుకోవచ్చనే అభిప్రాయాన్ని అభివ్యక్తం చేశారు.

"ఏకతా సేతువు"లో ప్రజానవైక్యత దేశానికిఆయువుపట్టని చెప్పినప్పుడు - ఆంధ్రా తెలంగాణా లేకము కావాలని అంటూ....

"ఒక్క జాతిని రెండు ముక్కలు - ఒక్క గుండెను రెండు చెక్కలు చేయదగదని - చేయదగదని చేతులెత్తి వినుతి చేద్దాం" అంటారు.

**J** for Joy **B** for beauty **R** for Reality is **JBR** J. BAPU REDDY.

కవి తన కావ్యంలో ప్రకాశిస్తాడనడానికి తార్కాణము కవి క్రాంతదర్శి.

'చెలికాడు చందమామ' లో - మా ఊరు నేర్పింది నాకు మాటలు, పాటలు, ఆటలు, మా ఊరు నేర్పింది నాకు మమతలు-ఊహలు, ఆశలు అంటూ వారి స్వగ్రామం చూచినపుడు అభిమానం పెల్లుబికి వ్రాసిన గేయం 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' ' అని ఋజువు చేస్తున్నారు.

'చిన్ననాటి జ్ఞాపకాలలో' అమ్మ అంటే అనురాగం -అమ్మ అంటే మమకారం క్షమ అమ్మ శ్రమ లమ్మ త్యాగం అమ్మ తాదాత్మ్యం' అన్నారు.

భాష భావం సమన్వయ పాత్ర ప్రాముఖ్యత వివరిస్తూ వారి విదేశీ పర్యటానుభవాలు తెలుపుతూ "ఆనందం అందరిదీ"లో గాయని ఎవరైనా గాన మాధురి అందరిదీ... ఏది ఏది ఎవరిదైనా అందం, ఆనందం, అందరిదీ అన్నారు. ఎక్కడ పుట్టినా సరే ఒక్కటిగా

కలసిపోయే సమన్వయ సూత్రం ప్రవంతులకే తెల్సు అన్నారు.

వీరి రచనలలో క్లుప్తత, స్పష్టత, నవ్యత, నిరాడంబరత, నిర్మలత, మానవత కన్పడును. వాడుక పదాలకే విచిత్రమయిన అర్థాలను కల్పించి కవితో ప్రత్యేకమైన అందాన్ని సంతరించగల చిత్రకారుడు శ్రీ బాపురెడ్డి.

పొదుపును గురించి వ్రాస్తూ "నిన్న పొదుపు చేసుకుంటే నేడు లేదురా దుఃఖం..... నేడు పొదుపు చేసుకుంటే రేపు కలుగుతుంది సుఖం" పొట్ట మాడ్చుకొని నిన్ను పొదుపు చేయమనలేదు.... కట్టుబట్ట కోసమైన ఖర్చు చేయకనలేదు.... భావి జీవతము కూడా భద్రపరచుకొమ్మంటిని - నీ దేశం కొరకు కొంత నిన్ను సాయపడమంటిని" అన్నారు.

కుటుంబనియంత్రణ గురించి: 'సంతానాన్ని నిరోధించటం అంటే సౌభాగ్యాన్ని పెంచటం' అన్నారు.

రసజ్ఞుడిగా విజ్ఞప్తి చేస్తూ: 'గాడిద మీద మూటలు మోయించినట్లు కవితతో మాటలు మోయించకు, బాలపల్లవ కోమల వాగ్దేవితో బస్కీలు వేయించకు, కుస్తీలు పట్టించకు' అన్నారు.

అల్పాక్షరాల్లో అనల్పార్థరచన గావించగల సమర్థుడు. ఆది కవి సమానులు.

ఎన్.జి.ఓ. అనే గేయనాటికలో : 'పిల్లలు పుట్టిన రీతి పుట్టవు ఉద్యోగాలు పిల్లలు పెరిగిన మాదిరి పెరుగవు జీతాలు" అని జీవిత సత్యం తెల్పినారు. వీరు ప్రజాకవి. పరమ ఋషి. వీరి రచనల్లో అణువునుండి అనంతం దాకా వర్ణించారు. "విదేశాల్లో వున్న తెలుగువారందరికీ తమ కావ్యాలను స్నేహోపాయనంగా అంకితమిచ్చామన్న ఆదర్శమైన విశాల హృదయమున్న ఆణిముత్యమైన కవితాస్రష్ట బాపురెడ్డి.

*బాపురెడ్డి గారి గేయాలు*
*బాపుమ ఎదలో గాయాలు*
*మరపించును కాయాలు*
*మెరపించును భావాలు*
*వీరి కవితలు కదంబం*
*మమతలు మకరందం*
*చిత్రాలు చిదంబరం*

చిందించును వేదాంతం. -అరకు, విశాఖపట్నమును గురించి వ్రాసిన కవితలు కళ్లకు కట్టినట్లుగా చిత్రించిన చిత్రకారులు.

ముచ్చటైన మూడు అక్షరాలలో త్రిమూర్తుల రూపగుణములను పొందుపర్చుకున్న మహాకావ్యతపస్వి.

**J** = Jagannadh - **B** = Brahma - **R** = Rudhra

బ్రహ్మగా అక్షరసృష్టిజగన్నాథునిగా అక్షరమాలను కావ్యమాలగా మలచి అందరికి అందుబాటులో వుండురీతి అర్థమగు శైలిలో రచించి పుస్తకరూపము నిచ్చుట. రుద్రుడు లయకారకుడు. ఇచ్చట లయమనగా లయతాళగతిబద్ధముగా సౌమ్యంగా మృదువుగా నుండే భావాలు, భాషను ఉపయోగించి గేయ కావ్యరచన చేసెనను అర్థం చెప్పుకోవలసియున్నది.

జంకె. బాపురెడ్డి. బాపురే! జంకె అనగదా భయపడెను. బాపురే అనగా ఆశ్చర్యార్థకము. ఏమి భయపడెను. అనగా :- అధర్మము, అన్యాయం, అశ్లీలత, అసూయ, అహంకారము యిత్యాది దుర్గుణములు ఆయన దరికి రావటానికే 'జంకె' భయపడెనని చెప్పితిన.

శ్రీబాపురెడ్డి గారు
జేజేలకు పొంగక,
బాజాలకు లొంగక
రెయింబవళ్ళు యిటు

ప్రభుత్వరంగంలోను, అటు సాహిత్యరంగంలోను సవ్యసాచిలా కీర్తి చంద్రికలు వెలయిస్తూ భళిరే! బాపురే !అని- వేనోళ్ల శ్లాఘింపబడుతున్న ఆధునికాంధ్ర కవిబ్రహ్మకు నేటి సన్మానం... వాగ్దేవికే మణిహారం.

కవితా ప్రపంచంలో మకుటాయమానం వారి కిదే మా అభివాదం.

ఏకేశ్వరపు నాగభూషణాచార్య
1-1-23, పతే నగర్,
మెదక్ - 502 110

26/10/1993

తేది : 25/10/93 సోమవారం నాడు మీరు ఆకాశవాణిలో "కావ్యగానం చేశారు".

అందునా పద్యకవిత్వం, మీ కంఠం ద్వారా చాలా ఏళ్ళ తరువాత విన్నాను. చదివే పద్ధతి మీ ప్రత్యేక బాణి. లయ. నన్నెంతగానో ఆకట్టుకుంది. ఖిల్లారిలో జరిగిన భూకంపాన్ని కన్నులకు కట్టినట్లు చిత్రించడంలో మీకు మీరే సాటి. ఉన్నతోద్యోగంలో మట్టి పరిమళాల్ని మరచిపోలేని మరువలేని వారు కూడా కాకుంటే మీ కవితలో ఈ క్రింది పాదాలు ఎలా దొర్లుతాయి.

ఉదా: 'చిగురించలేని ఆ జీవితాలు'
'మాటరాలేదు.... మట్టి నోట'
'భరతఖండమ్మునకు ప్రాణగండమాయె'
'బ్రతికి బయటపడ్డ ప్రాణి లేదు"
'పాడువడిన వల్లకాడులయ్యె'

ఇట్లాంటి పద్యాలు రాయడం అందరికీ చేతనయ్యేపనికాదు. మీ కలం గళం నుండి రాలిన నక్షత్రమాల ఆకాశవాణిలో విన్నంతసేపు నేను ముగ్ధుడినయ్యాను. ఖిల్లారి భూకంపంలో నేనొక బాధితునిగా ఫీలయ్యాను. ఇంతటి కవిత్వాన్ని వినిపించినందుకు మీకు సర్వదా కృతజ్ఞుడను.

2

మెదక్
20/1/94

మీరు నా పట్ల అమితమైన వాత్సల్యంతో రాసిన "భూగండం" కవిత మరియు నూతనసంవత్సర సంక్రాంతి శుభాకాంక్షల ఉత్తరాన్ని అందుకున్నాను.

మీ ఉత్తరాన్ని చూశాక ఆనందోత్సాహాలతో ఊగిపోయాను. ఇక్కడ మీ "భూగండం" కవిత సాహితీమిత్రులకు చూపించాను. వారందరు ఆనంద సంద్రంలో తేలియాడిపోయారు. అక్కడే భూమి కంపించిందన్నట్లుగా భ్రాంతిమంతు లయ్యారు. మీ రందించిన పద్య కవిత కవితగాదు! అదో "పద్యకవితాకళాఖండం" గా నేను భావించాను. మీ గుండె పొరల్ని త్రెంచుకొని వచ్చే లావాగ్నిలా.....

ఉదా; జాషువాగారన్నట్లు.........

"అల్లగవచ్చు వద్దియుము లల్లినవన్ని కవిత్వమైవిరాజిల్లవు" అని అన్నట్లు మీ ఒక్కొక పద్యం ఒక లావా సంపుటి లా భాసిస్తుంది. ఇంతటి మహోన్నతమైన కవిత్వాన్ని ఆకాశవాణిలో వినిపించినందుకు నా నమస్కారములు. మీ కవితలోనే రెండు రోజులు కరిగిపోయి తిరిగి తేరుకొని ఉత్తరం వ్రాస్తున్నాను. late అయినందుకు క్షమించగలరని ప్రార్థిస్తూ.....

*"భూగండంబు కవిత్వమందినది*
*బాపూరెడ్డి మీగుండెయే*
*ఊగెన్ పూయలవోలె మీకవిత*
*తావుల్ కూర్చినట్లవ్వగన్*
*సాగెన్ ఆ మహారాష్ట్రవీధులలో*
*దుస్వప్నంబె జాల్వారగన్*
*నీ గంటంబును నెక్కుపెట్టగను*
*కన్నీళ్ళేమొ వేడయ్యగా*
*పాగన్జట్టితివయ్య పద్దెములకున్*
*ప్రాచుర్యమొప్పారగన్.*
*మెదకు కలక్టరువై మా*
*అతుకుల బ్రతుకులలో కవిత నాడించియు, స*
*మ్మతమగుమార్గము జూపగ*
*సతతము మీనామ మిచట సార్థకమయ్యెన్."*

యల్లకర ప్రభావతి
C/o. వై. నందకుమార్ A.E.
C 4, P&T క్వార్టర్సు,
టెలిఫోన్ ఎక్స్చేంజి-తార్నాక,
హైదరాబాద్-500 007.

26/11/1993

మీరచనలు "ప్రణవ ప్రణయం" "పంచ బాణసంచా" శ్రీమతి సర్వా శారదగారి ద్వారా ఆ రెండు ప్రతులలోని కవితలు చదివే అదృష్టం నాకు కలిగింది. ఆ కవితలు చదివిన నాకు చాలా ఆనందం కలిగింది. భావుకత, రసజ్ఞత మనసు అంతరాళాలలో పొంగి పొర్లి అచ్చట ఇమడలేక ముత్యాలజల్లులా జాలువారినవే ఈ కవితలు.

తేటతెలుగులో మంచి కవిత ఎవరు రాసినా, ఎక్కడనుండి వచ్చినా, ఆస్వాదించగలుగుట, అభినందించి ప్రోత్సహించగల సహృదయత మీకుందని గ్రహించాను. రసజ్ఞులనిగూడ విదితమైంది. కనుక నేను శ్రీమతి సర్వా శారదగారి (రెడ్డి కాలేజి లెక్చరర్, ప్రస్తుతం సెక్రటరీ కోఆర్డినేషన్ ఆంధ్రమహిళాసభ) ద్వారా మీ గుణ గణాలు వినివున్నాను. వారు దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి అవార్డును గురించి చెప్పారు. ఈ అవార్డు కమిటీకి మీరు చైర్మెన్ అనిగూడ తెలియజేశారు.

మీతో ప్రత్యక్షంగా పరిచయం లేకున్నా మీకవితల ద్వారా శ్రీయుతులు శ్రీ శారదగారు శ్రీ సుగుణమతిగార్ల ద్వారా మీ గురించి వినివున్నాను గనుక వయో వృద్ధురాలినైన నేను ఈ సాహసం చేయగలుగు తున్నాను.

---

ఆర్. వేణుగోపాల్ M.A., B.Sc., B.Ed.
గణిత ఉపాధ్యాయుడు,
ఆం. ప్ర. గురుకుల పాఠశాల (బాలురు),
గ్యారంపల్లి (పోస్టు), కె.వి. పల్లె (మండలం)
చిత్తూరు (జిల్లా)-517213.

గ్యారంపల్లి
2/4/1993

నేను ఆంధ్రభూమి పాఠకుడిని. తేది 1/4/1992 ఆంధ్రభూమి సచిత్రవారపత్రికలో మీరు రచించిన ఆర్టికల్ "మనమతం మానవతం" చూచి, చదివి చాల సంతోషించాను. మీ రచనలో భావము చాల ఉన్నతమైనది. మత మౌఢ్యముతో దేశము కొట్టుమిట్టాడుతున్న ఈ తరుణములో మీ రచన సదా అందరూ చదివి ఆచరించాల్సినది. మతం, మానవత్వంలోనే ఉన్నదని సూక్ష్మంగా మీరు రచించారు. మతం పేరు చెప్పి ప్రజలను రెచ్చగొట్టి దేశ భద్రత, సమగ్రతలకు ముప్పుతెచ్చే స్వార్థపరశక్తులకు మీ రచన ఒక హెచ్చరిక. మానవతావాదులకు, ప్రజాస్వామ్యవాదులకు రక్షకకవచం. మీ రచనలోని ప్రతిపదం నందు ఎంతో విలువైన భావము, అర్థము నిగూఢమైనది 'దేవుడు ఒక్కడే' అని ఎంతో ఉన్నతభావముతో సులభమైన భాషలో రచించారు. మీ రచన చదివి, ముగ్ధుడైనాను. ఒక ప్రజాస్వామ్యవాదిగా, మానవతావాదిగా నేను మిమ్మల్ని మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను. మీలో నిండియున్న మానవతా విలువలకు, ప్రజాస్వామ్య విలువలకు సదా మీరు అభినందనీయులు.

---

ఎ. నాగేంద్ర కుమార్
H/o. S. Koteswara Rao
Sita Nagaram
Jangareddi gudem (P.O.& Mandal),
West Godavari - 534 447.

జంగారెడ్డిగూడెం
29/3/1993

మీరు వ్రాసిన కవిత "మన మతం మానవత్వం" ఆంధ్రజ్యోతి వీక్లీలో చదివాను. కవిత చాలా బాగావుంది. చక్కని శైలి, మంచి భావముతో వున్నది.

అంతేకాక మీ రచనలు చాలా చదివాను. కవితలలో ముఖ్యముగా "బాపురెడ్డి గేయాలు" అను పుస్తకం నన్ను బాగా ఆకట్టుకుంది. దానిలోని కవితలు బావున్నాయి. కవితలు మాత్రమే కాక కవితాసంపుటిలో మొదట మీరు వ్రాసిన లేఖ "హృదయలేఖ" అత్యద్భుతం. ఎవరిని ఉద్దేశించి వ్రాశారో గాని చాలా బాగుంది.

ఆ హృదయ లేఖ యందు మీరు వివరించిన అభిప్రాయాలను నేను గ్రహించాను. కాని ఆశ్చర్యం. మీ అభిప్రాయాలు నా అభిప్రాయాలు సుమారుగా ఒక్కటే. నా మనసు కూడా చాల సున్నితమైనది. మిత్రుల గూర్చి, స్నేహంగూర్చి, ప్రేమ గూర్చి, సౌందర్యం గూర్చి, సుందర దరహాసం గూర్చి బాగా వ్రాసారు.

ఈ పుస్తకం రెండు సంవత్సరాల క్రితము నేను కొని చదివాను. అయినా అప్పటికే నాకు మీ కవితలంటే మరింత యిష్టము. అంతేగాక మీరు వ్రాసిన కవిత (వ్రాయలేని కవిత) తెలుగు విద్యార్థి మాస పత్రికలో చదివాను.

అప్పుడప్పుడూ రేడియోలో మీ పేరు విన్నప్పుడు మీరు చేసిన సేవలు మీగూర్చి, మీ కార్యక్రమాలను గూర్చి వార్తలలో చదువుతున్నప్పుడు నేను ఆనందిస్తాను. మా స్నేహితులకు మీ కవితలు గూర్చి, మీ గొప్పదనం గూర్చి చెప్తుంటాను. మీ పోటో + మీ ఆటోగ్రాఫ్ పంపిస్తారని కోరుతూ...

---

**ఎమ్. సన్యాసిరావు** ఎమ్.ఏ.
తెలుగు పండిట్ - లిటిల్‌ఫ్లవర్ స్కూలు
ముదినేపల్లి-521 325.
కృష్ణా జిల్లా.

23/8/93

"ఏ రుద్రుడో ఈ ఆరుద్రుడు" అనే శీర్షికతో వ్రాసిన గేయము భావాత్మకమైనది. 1986లో ఆరుద్రగార్కి షష్టిపూర్తి ఎ.యు. వైస్ ఛాన్సలర్ డా॥ కోనేరు రామకృష్ణారావు గారు చేశారు. నేను ఫైనల్ యియర్ ఎమ్.ఎ. తెలుగు ఆంధ్ర యూనివర్సిటిలో చదువుచున్నప్పుడు ఆరుద్రగారి షష్టిపూర్తి చూసాను. ఆయన నిత్యనిరంతర సాహితీ అన్వేషణాపరుడు. "సాహితీ తపస్వి" అయిన ఆరుద్ర గారి గురించి మీరు వ్రాసిన గేయాన్ని చూసి ఆనందభరితుడునై మీకు నా ధన్యవాదములు తెలుపుచున్నాను.

"సాహితీ తమస్సులో ఉషస్సులా ఆవిర్భవించిన 'ఆరుద్ర' కి కవితా పుష్పాభిషేకం చేసారు మీరు.

---

**ఇ. సుందరరావు**

చెన్నపురం
4/10/1993

మీ కవితాఝురి... జీవధార.. నన్ను పరవశుడ్ని చేసింది. ముఖ్యంగా 'ఆశావాదం'... మీదైన నిర్మాణాత్మకమయిన పరిష్కారం నన్ను ముగ్ధుణ్ణి చేసింది.

*ఎంత సున్నితంగా చెప్పేరు.*
*ఎంత సుందరంగా చెప్పేరు.*
*ఎంత తాత్వికచింతనతో చెప్పేరు.*
*ఎంత 'మమైక్యం' చెందుతూ చెప్పేరు.*

*పసిమిఛాయ....*
*పాలనవ్వుల గుండెల్లో ఎన్ని అగ్నిగోళాలో...*
*ఎన్నెన్ని డైనమేట్లో...*
*ఎంత ఆదర్శనీయమయిన జీవితం మీది!*

నా పదోయేట నుండీ 'రచనావ్యాసంగం' మీద మోజు. సంగీతం సాహిత్యాలమీద పిచ్చి 'తృష్ణ' వుండేది. ఆ దాహంతోనే రచయితనయ్యాను. కథలూ, నవలలూ రాశాను. ఏదయినా సంఘటన కనిపిస్తే కవితలూ అల్లేవాణ్ణి. చదువుకుంటున్నరోజుల్లో బాగనే రెస్పాన్స్ వచ్చేది.

*అయితే కవుల్లో 'డిప్రెషన్'*
*కవుల్లో నిరాశావాదం*
*కవుల్లో పోరాట సరళి*
*కవి హృదయం గండ్రగొడ్డలిగా మారడం*
*నన్ను డిసెప్పాయింట్ చేసింది.*
*యిది సెంట్‌పర్సెంట్ నెగెటివ్ ఎప్రోచ్*
*అనిపించింది....*

*కవి ఒక జీవితాన్ని మధించాలి*
*ఒక జీవనాన్ని రచించాలి*
*ఒక జడ్జిమెంట్‌ని అందివ్వగలగాలి*
*వినే శ్రోత మనసూ, చదివే పాఠకుడి మనసూ*
*గాయపడకూడదు. ఆలోచింప చేయాలి*
*ఆచరించేలా చేయాలి.*

ఆ 'శక్తి' వంతమయిన మంత్రపుష్పాలు మీ అక్షరసుమాలు. నిజంగా నన్ను కదిలించాయి. నన్ను ప్రభావితుడ్ని చేశాయి. నన్ను పునీతుడ్ని చేశాయి. ధన్యుడ్ని!!

మీ పుస్తకాలు చదివిన తరువాత ఒక సమీక్ష రాయాలనుకున్నాను-

కాని అభిప్రాయం మార్చుకున్నాను. ఒక పుస్తకం రాద్దామనుకుంటున్నాను. రాస్తాను.

*నా 'స్పందన' ఆ పుస్తకం!*
*నా 'గుండెచప్పుడు' ఆ పుస్తకం!*
*నా జీవిత పరమార్థం ఆ పుస్తకం!*
*ఈ బడుగు జీవితానికో అర్థం ఆ పుస్తకం!*
*ఇది నా ఆలోచన!*
మీ అంగీకారం ఆశీస్సులూ తోడయితే
సాహితీ సేద్యం మొదలుపెడతాను.
బట్-
ఒక్క విషయం చెప్పేటందుకు సాహసిస్తున్నాను.

మన్నించండి. మీ రచనల గొప్పదనానికి రావలసినంత 'ఆదరణ' రాలేదు. కావలసినంత 'ప్రచారం' లేదు.

సామాజిక 'స్పృహ' లేకుండా తీవ్రపదజాలంతో... నగ్నంగా, దిగంబరంగా, విప్లవంగా, అభ్యుదయంగా ప్రజల్ని 'పొల్యూట్' చేశారు. మీ 'మెడికేటెడ్ పొయెట్రీ' జనసామాన్యంలోకి ఇంజక్ట్ కావాలి! 'ఆశా' వాదానికి 'శ్వాస' కావాలి!

అలాగే టి.వి., సినిమాలు, ఈరోజు చాలా 'ఎట్రాక్టింగ్ మీడియా'గా మారేయి. మీ 'కవితలు' గేయనాటికలు- ప్రేమారామం, శ్రీకారశిఖరం, పంచబాణసంచా వాడిపోని వసంతాలు-

ఒక్కటేమిటి...
ప్రతిపుస్తకంలో...
ప్రతి పదం.. నన్ను 'మైకంలో' పడేసింది.
నేను ఆరాటపడుతున్న
ఆశపడుతున్న 'రససిద్ధి'... మీ రచనల్లో
ప్రస్ఫుటమయ్యింది.
అజంతా, ఎల్లోరా శిల్పాలకు
చీరకట్టి, సిగపూలు పెట్టి సజీవంగా చూడగలిగితే?
అలాగే

మీ రచనల్లోని పాత్రలకు ప్రాణప్రతిష్ఠ చేయగలిగితే!

దృశ్యీకరించగలిగితే! ఆ 'భాగ్యం' కల్పించవలసిందిగా

ఒక 'భక్తుడి'గా.... మీ 'శిష్యుడిగా... మీ అభిమానిగా

త్రికరణశుద్ధిగా అభ్యర్థిస్తున్నాను.
మరొక్కసారి మీలో కళామతల్లికి.. కవితామతల్లికి
ప్రణమిల్లి, ప్రణవాంజలులు ఘటిస్తున్నాను.

**శ్రీకలం**

Silver Medalist Ganaprapoorna
Winner of Hundred Awards
A.I.R. Artist, Author, Actor, Singer.
Tiruvuru, Krishna Dt. (A.P.)

7/11/84

తనచుట్టూ వున్న చరాచర ప్రపంచం అనుక్షణము వినుపిస్తుండే వేయి నొక్క ధ్వనులకు హృదయ ప్రతిధ్వనించగా పలికేది కవిత అలాంటి కవితలు మీ కలంనుండి వెలువడుతున్నందులకు నా మనస్సునమస్సులు.

మనిషిలో ఆలోచనలు రేకెత్తించి వివేక అవివేకాలు తెలిపి కర్తవ్యాన్ని నిర్దేశించేది కవిత. ప్రపంచ జీవనలో సభ్యతను, సంస్కారాన్ని ప్రబోధించి మానవుని ఉన్నత శిఖరాలను అధిరోహింపజేసేది. దీనివిలువ అంతులేనిది. సమాజంలో సాంఘికమైన మార్పుకు, మీ కలం నుండి వెలువడిన కవితలు ఉపయోగపడతాయని నా ఆశ, నా ఆకాంక్ష.

యువతరంలో నవతను లేపి విశ్వశాంతికి, విశ్వఖ్యాతికై, జాతీయతను మానవుల్లో మానవతను మహనీయతను మీ కలంనుండి వెలువడిన కవితలు చాటుతున్నదని సమాజంలో చిజ్యోతులు వెలిగించి మనిషికి చైతన్యం అందించి జాగృతంచేసేది, ప్రతిఒక్కరు జీవితంలో పన్నీరుకురవాలన్న, నవజీవనానికి, అందరికి ఆనందం అనే అమృతం లభించాలన్న, చీకుచింతలు లేని బ్రతుకు బాటలో చెట్టాపట్టాలేసుకొని ఇలాగే ఇంకెన్నో నాటికలు, విద్య, విజ్ఞానం, భాగ్యం, ఆరోగ్యం, వినోదం అందం, అందుబాటు కావటానికి , భువి స్వర్గధామంగా మారిపోవటానికి, మనమంతా కృషి చెయ్యాలి. మీ కలంనుండి యింకా కవితలు వెలువడాలి.

మానవులకు ఆదర్శమైన విశాలదృక్పథం, ప్రేమ, సహనం, సహకారం, సేవా తత్పరత, విశ్వమానవ కల్యాణకాంతులతో నిండిన జగత్ ఆవిర్భవించాలన్న నిస్వార్థ, సమానత్వ పరిమళాలు వెదజల్లాలంటే, మానవతను నిలిపి తెలుగు బాట, వెలుగు నాటి సమతను సాధించాలన్న, ఈ చీకటి నుండి మహాదివ్య ప్రభాసమన్వితమైన భవిష్యత్‌లో గొప్పగా మేల్కొనాలన్న మీ కలంనుండి చాలా కవితలు వెలువడాలని నా స్వాగతం.

---

**డా॥ కప్పగంతుల ప్రభాకరశాస్త్రి**

M.S. Mch. (Paed. Surgery)
Civil surgeon
Gandhi Hospital Prof. of Surgery
Gandhi Medical College
I J-37, Irramanjil colony,
Hyderabad-500 482.

18/3/78

ఉగాది శుభాకాంక్షలు. మీరు దేవాదాయ శాఖ కమీషనరు పదవిలోకి ప్రవేశించినందుకు నా హార్దిక శుభాకాంక్షలు. మీ పర్యవేక్షణలో మన ఆంధ్రదేశపు దేవాలయాలు తగు అభివృద్ధిని సాధిస్తాయని ఆశిస్తున్నాను.

ఉగాది సందర్భంగా ఆకాశవాణి ప్రసారం చేసిన కవిసమ్మేళన కార్యక్రమం నేను విన్నాను. అందులో మీ కవిత విశేషంగా శ్లాఘనీయంగా ఉంది.

"అగాధమైన జీవితసత్యాన్ని
ఉగాది నాడు చూస్తున్నాను (శోధిస్తున్నాను)"।
జడమునకు చేతనమునకు
ముడి వేసే విహంగము నేను"।

ఈ పై రెండు పంక్తులు మీ కవితలో నన్ను విశేషంగా ఆకట్టుకున్నాయి.

ఈ రోజు ప్రసారమైన కవుల గీతాలన్నింటిలో రాజన్న కవిగారి కవితలు మీ కవితలు భాషా గాంభీర్యము సంతరించుకున్నాయి.

---

**ఎల్లోరా**
సబ్ ఎడిటర్ - ఆంధ్రప్రభ వీక్లీ
63, V.R. Pillai St.,
Triplicane,
Madras-600 005.

24/2/75

మీతో గడిపిన ఆక్షణాలు ఆనందంగా దాచుకున్నాను.

మీరు అభిమానంతో కానుకగా ఇచ్చిన మీ కవితా వచనికలన్నీ చదివాను. ఇంత ఓపిక, ఇంత పరిశీలన చూసి 'బాప్‌రే బాపురెడ్డీ' అనుకొన్నాను.

నిజంగా- మీ రచనలు నాకెంతో సంతృప్తిని కలిగించాయి.

ఇలాగే మీ కలం నుండి పసందైన సాహితీ సుమాలు విరబూసి తెలుగు సాహితీ నందనాన్ని సుగంధభరితం చేయాలని ఆశిస్తూ

---

**బాబు ఆర్. వడ్లమూడి**
19801, Greenfield # 22
Detroit, Mi 48235
U.S.A.

1983

మీరు ఉగాదికి పంపిన గ్రీటింగ్సు అందినవి. సకాలంలో జవాబివ్వలేకపోయాను. ఇండియా ఎబ్రాడ్ న్యూస్‌లో మీరు ప్రస్తుతం మెదక్‌లో వున్నారని చదివాను. మీరు చదివిన గేయాలు వీలైతే ఒక టేపు పంపండి. మా దగ్గర టేపు వుంటే కార్లోపోతూ అయినా వినొచ్చు. మీరు పాడుతున్నప్పుడుండే అందం- మేం చదువుకుంటే రాదు కదా! నరసింహమూర్తి పాడిన మీ పాట

*చెలియపంపె ఒక పత్రం*
*దాని వెంట తన చిత్రం*
*..................శతపత్రం*
*................. చైత్రం*
*పత్రములో ప్రతిమాట*
*చిత్రమైన ఒక పాట*
*చిత్రములో ప్రతి రేఖ*
*చెప్పలేని ఒక లేఖ*
*ఒక్కసారి వింటే మనస్సులో పడిపోయే పాట.*

---

**కె. ఓబయ్య IAS**
Executive Director
Trade Development Authority
Bank of Baroda Building,
16, Sansad Marg,
New Delhi-110 001 (INDIA)

ఈ మధ్యనే Philiphiens, Hongkong, Bangkok ప్రయాణము ముగించిశెలవైనా Officeకి వెళ్ళి భోజనసమయానికింటికి వచ్చాను. ఆలస్యంగా భోజనమయిందనిపించి, విశ్రాంతి తీసుకుందామని, పడకగది చేరాను. అటూ ఇటూ దొర్లుతున్నానే కాని, అలవాటు లేని ప్రక్రియ గాబట్టి, కనులు మూతపడుటలేదు. ఈ మధ్య అప్పుడప్పుడు వెళ్లినప్పుడు తెలుగు పత్రికలే చూశాను. ఏమయినా వున్నాయేమోనని, తిరుగవేశాను, దొరికింది. ఉగాది - ప్రభ - అందులోని చివరి పుటలోని అరనై ఆటలు,

*ఈ యుగాదులు*
*ఈ వసంతాలు - వేదాంతాలు*
*ఈ లతాంతాలు - జీవితాలు*
*ఎంతవరకు - వాటిగమ్యస్థానమేమి?*

మెరసిన మాణిక్యంలాగా - కనిపించాయి. అందులో ఇంకా కొన్ని అపురూప కావ్యశృతులున్నా వాటి తీరు వేరు, యిది వేరు. చెప్పిన విషయము మలచిన రీతులు వేరు. యిది అణిముత్యంలాగా, అంతరాంతరాల్లోకి వెడుతూవుంది.

అందుకే చెప్పాను ఒక కావ్యఖండాన్ని తీసుకురా అని.

---

సువర్ణ

మీ "అనంతసత్యాలు" అనుక్షణం నన్ను వెంటాడుతున్నాయ్. ఊపిరాడనివ్వడంలేదు. గీతా పారాయణం చేస్తున్నట్లు ఆ పుస్తకం నా హస్త ద్వయంనుండి వీడిపోనంటున్నది.

బాపూజీ,

అమృతభాండాన్ని మీ హృదయంలో నింపుకున్న అదృష్టవంతులు. అందుకే నాకు ఆరాధ్యదైవం అయ్యారు. ఆ ఆరాధనలో అనుకోని ఆనందం అలరిస్తోంది నన్ను. అసూయ అనే క్రూరమృగాన్ని జయించగలిగిన మీరు సర్వ ప్రపంచాన్నే జయించగలరు. సర్వప్రపంచాన్నీ ఆరాధించగలిగిన మిమ్మల్ని ఆరాధించి ఆనందిస్తున్నాను. మిమ్మల్ని ఆరాధించడంలో మీకేదైనా అభ్యంతరం వుంటే చెప్పండి. మీకు బాధకలిగితే నాబాధను కూడా జయించి మిమ్మల్ని ఆరాధించడం ఆపివేస్తాను. ఇది నిజం

ద్వేషాన్నైనా ప్రేమిస్తానేగాని
ప్రేమను ద్వేషించలేని
పిచ్చివాణ్ణి నేను

పై మాటలు వ్రాసిన బుజ్జివాణ్ణి ప్రేమించలేని వారుండగలరా?

*ఆనందం అందరిదీ*

అన్నారుకదా మీరు! మఱి మిమ్మల్ని ఆరాధించడంలో నాకు ఆనందంవుంది. ఆ ఆనందాన్ని, అభిమానిస్తారా లేక నన్ను అలుసుగా చూస్తారా చెప్పండి? అలా అయినరోజు నేనేమైపోతానో మీరే నన్ను అలుసుగా చూస్తే?

ఏరూపంలో వున్నా
ఎవరికో ఒకరికి

సాయంచేసే మీరు నాకొక చిన్నసాయం చేయగలరా? అదేమిటో తెలుసా? మీ స్వహస్తాలతో వ్రాసిపంపే మీ క్షేమం తెలిపే లేఖ. నా కోరిక తప్పక తీరుస్తారు కదూ! దేవుడున్నాడో లేడో నాకు తెలియదుకాని నాకు మీరున్నారని నమ్ముతూ ప్రార్థిస్తూ ముగిస్తున్నాను.

2

మంజీరా సాహితీ సమితి వారు మీకు జరిపించిన సన్మానం పేపరులో చదివి చాలా అనందించాను. ఆ ఆనందాన్ని మీతో పంచుకోవాలని ఈ లేఖ వ్రాస్తున్నాను. అంతటి పద్మశ్రీ బోయి భీమన్నగారు మీరు కవితల గురించి ప్రశంసించిన ప్రశంశ చాల నిజం. మరి పద్మశ్రీ బిరుదు మీ కెప్పుడో!!

మీకు కప్పిన దుశ్శాల్వను జాగ్రత్తగా దాచిపెట్టండి. మీకు జరిగే ఈ గౌరవాలన్నింటికి వెనుక ఆనందించే అభిమానులు యెంతమందివున్నారో మీకు తెలుసా?

స్వర్గీయ శ్రీ దామోదరం సంజీవయ్యాగారిని గుర్తుంచుకున్నారా కవిగారూ?

---

డాక్టర్ కరిమద్దెల నరసింహారెడ్డి
తెలుగు రీడర్
లెక్చరర్స్ కాలని,
నెల్లూరు - 524003

సాహిత్య బంధువు బాపురెడ్డి గారికి

మీరు జీనియస్ జీవియస్ షష్టిపూర్తి అభినందన గంధం చందనలో విరచించిన వ్యాసం, మాలకొండనుండి గోలకొండదాక గుణలతలను ప్రాకించిన కవికిరీటి ఉండేల మాలకొండారెడ్డి గారి షష్టిపూర్తి మహోత్సవ విశిష్టసంచికలో రచించిన వ్యాసం చదివి మైమర్చిపోయాను, ఆనంద తాండవమాడినాను. అవి వ్యాసాలు కావు. చదువులమ్మ సురుచిర సుందర హాసాలు. మీరు శబ్ద పంజరాలలో భావకుంజరాలను అందంగా బంధించగలరు. పదాలతో మీరు లాస్యం చేయిస్తారు. అందుకే అవి కృతజ్ఞతతో దాస్యం చేస్తాయి. దాసోహం అంటాయి. పెదాలకు

వలెనే మీ పదాలకు రంగు, హంగు, రుచి, శుచి, వాసన, వాసి ఉంది. మీరు చెక్కిన పదచిత్రాలను నఖశిఖపర్యంతం తిలకించినపుడు నా శరీరమంతా పులకల మొలకలు లేచాయంటే అతిశయోక్తి కాదు, అన్యోక్తి అంతకన్నా కాదు. ఈ రెండు వ్యాసాల్లో మీ కలం హంపిశిల్పాల సొంపులను చూపించింది. మీ బలమైన కలంనుండి దూకిన పదాలు రసాస్పదాలు. మీ కలానికి లోయల లోతులు తెలుసు, శిఖరాల శిఖలు తెలుసు, జలపాతాల దూకుడులు తెలుసు. సముద్ర తరంగాల ఒడిదుడుకులు తెలుసు. మీ వ్యాసాల్లోని "రసానంద కందాయం, పుస్తకాలను మస్తకాలను, పుస్తకం ఆపాదమస్తకం, విభూతి అనుభూతి, మరంద బిందువులు, రసానంద సింధువులు, ధ్యానం, స్నానం, మందార బృందావిహారం, చిరునవ్వు సిరినవ్వు, ఒడిసెల రాళ్ళు మైలురాళ్ళు, ఉండేల గుండెల్లో ఉండేలా; రాళ్ళమీద వ్రాసిన కృష్ణమ్మ నీళ్ళ మీద రాసినా ఉండేలవి శిలాక్షరాలు. పదాలు చదువుతుంటె మందారం విరిసినట్లు, మకరందం కురిసినట్లు ఉండింది. తెలుగు సాహిత్యంలో మీకున్న పాటవాన్ని సర్వే చేసే సాధనాలు నావద్ద లేవు.

సుమారు రెండు దశాబ్దాల క్రిందట "బాపురెడ్డి గేయాలు" చదివినాను. కొన్ని పాదాలను కంఠస్థం చేశాను. నేను చదివింది మీ పుస్తకం ఒక్కటే. అయినా అందులోని గేయాలు గేయపాదాలు నిత్యం నృత్యం చేస్తుంటాయి నా నాలుకమీద.

1. పరిమితంగా పెరుగుతోంది ఆహారోత్పత్తి
అపరిమితంగా పెరుగుతోంది సంతానోత్పత్తి
2. ఎత్తులమీద మీరు చేసిన గమ్మత్తుల గేయం
3. కోకిలకు మధువందిస్తే హేమంతంలో కూడా కూస్తుంది
వసంతంలోనే కాదు గ్రీష్మంలో కూడ కూస్తుంది.
4. రమ్ము రగిలించేది రాళ్ళను కాదు రసాత్ములను
బీరు ఉద్రేక పరిచేది భీరుని కాదు, ధీరుని

ఈ పాదాలను నిత్యం నేను నా విద్యార్థులకు వన్పిస్తుంటాను. తర్వాత ఎందుకోగాని మీ కవితలు నాకెక్కడా కన్పించలేదు. మీ చిరునామా నాకు లభించలేదు. రెండు రోజుల క్రింద పూజ్యులు మాలకొండారెడ్డి గారు పంపిన అభినందన సంచికలో మీ వ్యాసం చదివినాను, చిరునామ దొరికంది. ఒక మిత్రుని వద్ద జీవియస్ మీద మీరు వ్రాసిన వ్యాసం చదివాను. కలెక్టరుగానున్న మీరు తెలుగు సాహిత్య క్షీర సముద్రమును త్రచ్చి వెన్నముద్దలు వెలికితీసే తీరిక ఎక్కడ అని ముక్కుపై వేలువేసుకుంటున్నాను. కాలాతీతమైంది. ఇక ఉండేల పంపిన పుస్తకంలోకి మస్తకం దూర్చుతాను. మీ కవితామతల్లిని దర్శించాలని మనసుపడుచున్నది.

---


డాక్టర్ జి. రామచంద్రారెడ్డి
Lecturer in Telugu
S.R.R. & C.V.R . Govt. College,
Vijayawada (A.P.)


24/3/1996

"శుభాకాంక్షలు"

మంచిగంధంలా పరిమళించే ఓ మానవతా మూర్తీ! మనిషిని మించిన మహాశక్తి లేదని మనిషినే నమ్మి మానవాభ్యుదయాన్నే నిరంతరం కోరుతున్న కవితా మూర్తీ! మీ ప్రతిభ స్వయంప్రకాశం దానికి సిఫారస్సులు అక్కర్లేదని నిరూపించిన నవనవోన్మేష ప్రతిభాశాలీ! ఓ బాపూజీ - మహాత్ముడు, మరొక బాపు - బొమ్మల బ్రహ్మ, మా బాపురెడ్డి గారు మహామనీషి మహాకవి మానవతా మూర్తి అందుకే మీ పరిచయం మా పూర్వ జన్మ సుకృతం. నేటి పదవి సర్వీసు కమీషన్‌కే వెలుగు -

## ముఖాముఖి

# కవిత్వంలో సత్యాన్ని అన్వేషించే కమీషనర్ డా॥ జె. బాపురెడ్డి

- ఆంధ్రభూమి ప్రతినిధి

కవిత్వం మనసుకి సంబంధించిన స్పందనే కానీ, మనిషికి చెందినది కాదనేది సాహితీసూక్తి!

తెల్లని పంచా, లాల్చీ వేసుకుని, కళ్లద్దాలు సవరించుకుంటూ, శూన్యంలోకి చూస్తూ అనుక్షణం కాల్పనిక జగత్తులో విహరించే వాడే కవి! కవికి మరో రకమయిన వ్యాపకం వుండకూడదు. అనుకుంటూ 'కవి'కి నిర్వచనాలు చెప్పుకునే వారికి బాపురెడ్డి గారు ఒక పెద్ద ప్రశ్నార్థకం!

కమీషనర్‌కి కవికి ఎలా పొసుగుతుంది? అలా పొసగడమే కాదు... వాళ్లిద్దరూ కలిసి ఒక వున్నతమయిన వ్యక్తిత్వాన్ని రూపుదిద్ది ... ఆ వ్యక్తి కవిగా, కమీషనర్‌గా ప్రపంచ ఖ్యాతిని ఆర్జించి పెట్టారు.

యాంత్రికమయిన పనులతో నిరంతరం సతమతమవుతూ ఒకవైపు తనలో కలిగే స్పందనకు అక్షర రూపాన్ని యిస్తూ మరోవైపు సవ్యసాచిగా సత్కారాలను అందుకున్నారు డాక్టర్ జె. బాపురెడ్డిగారు.

1936లో కరీంనగర్ జిల్లాలోని సిరికొండలో పుట్టిన బాపురెడ్డిగారు ఇప్పుడు అయ్యేయస్ అధికారిగా, అందాన్ని, అందని తత్వాన్ని అందించే కవిగా ఎదిగి 1989లో ప్రపంచ కవుల మహాసభలో గౌరవ డాక్టరేట్‌ను అందుకున్నారు.

ఎనిమిదో తరగతి చదువుతున్నప్పుడు ఆ స్కూలు ప్రధానోపాధ్యాయుడికి బదిలీ అయిన వెళ్లిపోమంటే బాధపడిన బాపురెడ్డిగారి మదిలో తొలిసారిగా కవి మేల్కొన్నాడు.

నిరుద్యోగ సమస్యను తీర్చే పథకాలను, నిర్వీర్యమై పోతున్న యువతను తట్టి లేపే కవితలను... అవిశ్రాంతంగా రూపొందిస్తున్న డాక్టర్ బాపురెడ్డి గారిని ఆంధ్రభూమి పాఠకులకోసం చేసిన ప్రత్యేక ఇంటర్వ్యూ.

'కవిత్వానికి ప్రయోజనం ఉండాలంటారా?

'ఉంటుంది, ఉండాలి కూడా. అయితే ప్రయోజనం అనేది చూసేవారి దృష్టిని బట్టి ఉంటుంది. భావకవిత్వం యువతను ప్రభావితం చేయొచ్చు. అంత మాత్రం చేత మిగతా వారికి ప్రయోజనం లేదని అనుకుంటే సమంజసం కాదు. నా దృష్టిలో కల్పనా కవిత్వం కన్న, వాస్తవాన్ని, ఒక సత్యాన్ని కవిత్వం ఆవిష్కరింపజేయాలి.

'విప్లవ కవిత్వం, దిగంబర కవిత్వం, భావకవిత్వం... వీటిపై మీ అభిప్రాయం?'

కవిత్వం ఏదైనా ఒకటే, ఇవి వాళ్ళకు వాళ్ళు తగిలించుకున్నవే, ఇవన్ని కంపు కొట్టేవే. కవిత్వమన్నది ఒక్కటే కవిత్వం. ఎప్పుడూ కవిత్వమే దాని ముందు, వెనక పేర్లు అర్థరహితం.

'సాహిత్యం వ్యాపారమవుతుందన్న విమర్శకు మీ సమాధానం'

'సాహిత్యం సమాజానికి ప్రయోజనం కలిగించాలి. కవిత్వం జీవితోపకరణం కావాలి. ఇక వ్యాపారమయిపోతుందంటే అది వ్యాపారంగా మార్చేవాళ్ళు ఆలోచించాలి. కాకపోతే ఒకటి మాత్రం వాస్తవం. కవిత్వం కానీ, సాహిత్యం కానీ వ్యాపారమయమైపోతే మంచి కవిత్వం మరుగున పడిపోతుంది. మనకు మంచి విమర్శకులు తక్కువ. ఈ మీడియంని నియంత్రించే వాళ్ళు లేరు. ఈ

సోకాల్డ్ సొసైటీలో ఎవరు అధికారంలో ఉంటే, వారి వైపు కవిత్వం నడుస్తుంది.

కవికి - మహాకవికి తేడా ఏమిటో చెబుతారా?

కవి అవునో, కాదో అనుమానంగా వున్నవాళ్ళను మహాకవి అంటారు.

ఈ రంగంలోని యువ కవుల గూర్చి మీ అభిప్రాయం?

యువకవుల్లో చాలా మంది, చాలా బాగా కవిత్వం రాస్తున్నారు. కాకపోతే వాళ్ళకు తగినంత ప్రచారం లేదు.

'నేను పరిణామ వాదిని. కవిత్వంలో సత్యాన్ని అన్వేషిస్తాను. శోధిస్తాను' అని కవిగా బాపురెడ్డిగారి అభ్యుదయం కమీషనర్‌గా ఆయన పరిపాలనలో కూడా ప్రతిబింబిస్తుంది.

నిరుద్యోగ సమస్యను తీర్చేది ఉద్యోగ మొకటే కాదు, స్వయం ఉపాధికూడా అని గట్టిగా నమ్మే బాపురెడ్డి గారు దాదాపు ముప్పయి దేశాలు పర్యటించి అక్కడి పారిశ్రామిక విధానాలని సునిశితంగా పరిశీలించారు.

మీ విదేశీ పర్యటనల్లో అక్కడి విధానాల పరిశీలనలో మీరు గమనించినదేమిటి? ఏమైనా కనిపించిందా?

అక్కడి పరిశ్రమ క్వాలిటీ మెయింటేన్ చేస్తుంది. మార్కెట్‌లో కాంపిటేషన్ ఉత్పత్తి పెంచి, క్వాలిటీని పెంచిన వాళ్ళకే అక్కడ అవకాశం ఉంది. కానీ వాళ్ళకు రక్షణ లేదు.

నిరుద్యోగ యువతను మీరు ఏవిధంగా ఎంకరేజ్ చేస్తున్నారు?

మా స్కీమ్స్ అన్నీ వారికే. పరిశ్రమలు స్థాపించాలనుకునే వారికి మేమెప్పుడూ ప్రోత్సాహాన్ని అందజేయడానికి సిద్ధంగా వున్నాం. మొత్తం దాదాపు ఎనభై వేల పరిశ్రమలున్నాయి. గ్రామీణ పరిశ్రమలు మొదలుకొని భారీ పరిశ్రమలవరకు ఏవైనా వారి, వారి అనుభవాన్ని, నైపుణ్యాన్ని బట్టి స్థాపించుకోవచ్చు. దీంట్లో సెల్ఫ్ ఫైనాన్స్‌డ్ స్కీమ్స్ కూడా వున్నాయి. వివరంగా చెప్పాలంటే ప్రతీ సంవత్సరం పదివేల మందికి గ్రామోదయ స్కీమ్ కింద అవకాశం లభిస్తుంది. దానికో జనరల్ మేనేజర్, అసిస్టెంట్ డైరెక్టర్, డిప్యూటీ డైరెక్టర్ ఉంటారు.

ఏయే జిల్లాల వాళ్ళు ఆయా జిల్లా పరిశ్రమ శాఖకు తాము ఏ పరిశ్రమను స్థాపించదల్చుకున్నారో వివరంగా దరఖాస్తు చేయవచ్చు. గ్రామోదయ పథకం కింద చిన్న చిన్న షాపులు పెట్టుకోవచ్చు. అలా కాకుండా పరిశ్రమలు స్థాపించాలనుకుంటే తమకున్న అనుభవాన్ని, నైపుణ్యాన్ని, అర్హతను తెలుపుతూ దరఖాస్తు చేయవచ్చు. ఇప్పుడు డిస్ట్రిక్ట్ సెటప్‌ను కూడా మార్చాలనే ప్రపోజల్ ఉంది.

స్త్రీలకు ప్రత్యేకంగా ఏవైనా పథకాలున్నాయా?

మహిళల కోసం చాలా పరిశ్రమలున్నాయి. వారుముందుకు వస్తే మేము వారికి తగిన ప్రోత్సాహం ఇస్తాం. వారికే పరిశ్రమల్లో ఇంట్రెస్ట్, ఎక్స్‌పీరియన్స్ ఉందో, ఆ పరిశ్రమను స్థాపించుకోవడానికి పూర్తి సహకారం మా శాఖ నుండి ఉంటుంది. అంతటే కాకుండా నిరుద్యోగ విద్యావంతులకు 1983-84లో సెంట్రల్ స్కీమ్ 'నిరుద్యోగ యువతకు స్వయం ఉపాధి పథకాన్ని' ప్రవేశపెట్టింది. నిరుద్యోగ యువతకు స్వయం ఉపాధి చూపించడం, వాళ్ళ ప్రతిభని వెలికితీయడం మా బాధ్యత. ఈ పథకం కింద పరిశ్రమలు, వ్యాపారం నిర్వహించుకోవచ్చు. పదిహేను వేల నుండి 35 వేల వరకు ఆయా పథకాలను బట్టి బ్యాంకుల ఆర్థిక సాయంతో అందచేస్తాం. అని వివరించాను.

'బాపురెడ్డిగారి కవిత్వంతో సత్యాన్ని, పథకాలతో భత్యాన్ని ఆవిష్కరిస్తున్నారు' అన్నది పొగడ్తలా కనిపించే వాస్తవం.

# అక్షరాల్లో జీవితాన్ని చూడగల'బాపురే'

**- జె. బాపురెడ్డితో ప్రత్యేక ఇంటర్వ్యూ ...**

**-దోర్బల**

ప్ర. మొట్టమొదటి కవిత్వం ఎప్పుడు రాశారు? ఎందుకు?

**జ.** 1950లో నేను కరీంనగరం ప్రభుత్వోన్నత పాఠశాలలో 8వ తరగతి చదువుతున్నప్పుడు, ప్రధానోపాధ్యాయుడు శ్రీముద్దు రామకృష్ణయ్య స్థాన చలనం పొందినప్పుడు రాశాను. ఆయనంటే నాకు అమితమైన భక్తి ఉండేది. విద్యార్థులను ఆయన స్వంత బిడ్డలవలె ప్రేమించేవాడు.

ప్ర. మీకు వస్తువు ఎలా స్ఫురిస్తుంది?

**జ.** ఒక సంఘటన జరిగినప్పుడు ఒక సన్నివేశాన్ని చూచినప్పుడు మనస్సుకు అసామాన్యమైన బాధకానీ ఆనందంకానీ ఆవేశం కానీ కలుగుతుంది. ఆ స్థితిలో పొందిన భావానుభూతిలో కవితా వస్తువు స్ఫురిస్తుంది.

ప్ర. కవిగా మీ ఆశయం ఏమిటో?

**జ.** కొత్త సత్యాలను దర్శించి, వాంఛనీయమైన సామాజిక విలువలకు అనుగుణంగా వాటిని అన్వయించి మనిషిని అభ్యుదయోన్ముఖుణ్ణి, ఆనందోన్ముఖుణ్ణి చేయడం. భావసత్యాలను భౌతిక సత్యాలుగా మార్చగలిగే విశ్వాసాన్ని కలిగించడం.

ప్ర. మీ అభిమాన కవి ఎవరు? ఏ రకమైన కవిత్వం అంటే మీరు ఇష్టపడతారు?

**జ.** రసాత్మకము, ప్రయోజనాత్మకమైన భావుకత గల ప్రతి కవీ నా అభిమాన కవే. తాత్విక చింతన గల కవులంటే నాకు ఎక్కువగా ఇష్టం. ఠాగూర్ ఖలీల్ సిబ్రాన్, అరవిందుడు వంటి Intuitive and interpre tative కవులు నాడు ఆదరణీయులు. జీవిత ప్రయోజనాన్ని లక్ష్యాన్ని నిర్దేశించగల సత్యదర్శనం కలిగించే కవితను నేను కాంక్షిస్తాను.

ప్ర. కవితలు రాసేలా మీకు మంచి స్ఫూర్తిని ప్రేరణను ఇచ్చిన వాళ్ళెవరైనా ఉన్నారా?

(ఏదైనా సందర్భం ఉంటే అది....)

**జ.** ఒకరి ప్రేరణతో నేను కవిత రాయను. ప్రేరణ నాకు కవితా వస్తువే కలిగిస్తుంది. సత్యస్ఫూర్తే కలిగిస్తుంది. అయితే ఎవరో ఒకరు ఏదో ఒక సందర్భంలో నా నుండి కవిత ఆశించినపుడు కూడా నాలోని కవితా చైతన్యం బహిర్గతమవుతుంది.

ప్ర. కవిత్వం కాకుండా మీకు ఇంకా ఏదైనా ఇతర కళా, సాహిత్య అంశాలమీద అభిరుచి, ప్రవేశం, ప్రావీణ్యత లున్నాయా?

**జ.** సంగీతం, నృత్యం, శిల్పం మీద నాకు అభిరుచి ఉంది. వ్యాస రచన వక్తృత్వంలో నాకు కొంత ప్రావీణ్యత ఉన్నది. సృజనాత్మకమైన సౌందర్యోద్దీపకమైన ప్రక్రియలన్నీ నాకు శిరోధార్యాలే.

**తొలి కవిత**

అయ్యయ్యో నే డెంత
ఘోరవార్తను వింటి
అశ్రువులు రాలంగ
ఆవేదనలు పొంగ
మాదు హెడ్మాస్టరు
మమ్ములను విడనాడి
వేరే చోటునకు
వెళ్లుతున్నా డని -

ప్ర. ప్రస్తుతం మీరు దేనికోసం కవిత్వం రాస్తున్నారో తెలుసుకోవచ్చా?

జ. " అహం బ్రహ్మోస్మి, తత్వమసి" అన్న సంపూర్ణ సమతాతత్వాన్ని మానవుల జీవితానుభవంలోకి తీసుకురావడానికి నా సత్యసాహిత్య ఆదర్శం.

మనుషులందరూ సమానులే. ఒకరి నౌకరు పీడించే హక్కు దోచుకునే అధికారం లేదు అనే విశ్వాసాన్ని కల్పించగల్గించే నిజమైన ప్రగతి సాహిత్యం విలువలు మారాలంటే విశ్వాసాలు మారాలి.

వినాదాలు చేసేది రాజకీయం విశ్వాసాలు మార్చేది సాహిత్యం. నూతనసత్య దర్శనం వలన విశ్వాసాలు మారుతాయి. అలాంటి మార్పు కవిత చేసి రాస్తున్నానుకుంటున్నాను.

ప్ర. సినీ స్టార్స్, కమర్షియల్ రైటర్స్‌కు ఉన్నంత గిరాకీ ఈనాడు ఒక మామూలు సాయల్‌కు (సినీ కవులు గాక) ఉండటం లేదు కారణం?

జ. ఆ వ్యాపారం చేసేవాళ్లకు కావలసింది లాభాలు, సత్యమూ, సాహిత్యమూ కాదు. విలువకట్టరాని గాలి, వెలుతురు వంటిది గిరాకీ లేని సృజనాత్మక, రసాత్మక, సమతాసత్యసాహిత్యం.

ప్ర. కవులు భావుకలై ఉండాలా? అదెలా? మీరు కూడా భావుకులా?

జ. కవితా వస్తువునే కవిత్వమని భ్రమపడుతున్న గందరగోళపు రోజులివి. తద్వస్తుగతమైన భావంలో కవిత్వం పుడుతుందన్న అవగాహన కవులమనుకుంటున్న చాలా మందికి తెలియదు. భావుకత లేనిది కవిత లేదు. భావుకత కలిగించేది దార్శనికత. దర్శించిన సత్యాన్ని అనుభూతిని ఇతరులకు అందించగలిగే శబ్దభావశైలీ శిల్పమే కవిత్వం. అడ్డంగా పొడవుగా వ్రాసే అభిప్రాయాలన్నీ కవితలు కావు.

అద్దంలో ముఖాన్ని చూసుకున్నట్లు అక్షరాల్లో జీవితాన్ని చూడగలగాలి! అతిశయోక్తులు, అర్భాటాలు, అనవసరపు ఊహాగానాలకు తావులేకుండా వాస్తవ జీవిత సత్యాలను అక్షరాలపైకి ఎక్కించడం అందరివల్లా అయ్యే పనికాదు!! ఒక సగటు మనిషికోసం, ఆ సగటు మనిషి కర్థమయ్యే సరళ మైన భాషతో మంచిని మంచిగా చేరతీయగల కవులలో డా. జె. బాపురెడ్డి ఒకరు!!!

డా. బాపురెడ్డి 1936 జూలై 21న కరీంనగర్ జిల్లా సిరికొండ గ్రామంలో జన్మించారు. 1959లో ఉస్మానియా విశ్వవిద్యాలయం నుంచి ఏం.ఏ (ఏకానామిక్స్)లో పట్టభద్రులపవడమేకాక, అడ్మినిస్ట్రేషన్, మేనేజ్‌మెంట్, మార్కెటింగ్, వాల్యూ ఇంజనీరింగ్ రంగాల్లోనూ డిప్లొమా సర్టిఫికెట్లను పొందారు.

1978-79లో అప్పటి రాష్ట్ర ముఖ్యమంత్రికి స్పెషల్ అసిస్టెంట్‌గా, 1975లో మొదటి వరల్డ్ కాన్ఫరెన్స్‌కు సెక్రటరీగా ఉన్న డా. బాపురెడ్డి ఐఏఎస్ ఆఫీసర్‌గా ఇంకా అనేకానేక అధికార, అనధికార పదవులను నిర్వహించారు. రాష్ట్ర ఎండోమెంట్స్ కమిషనర్‌గా, తిరుమల తిరుపతి దేవస్థానం ట్రస్ట్‌బోర్డు సభ్యులుగానేకాక మరికొన్ని పదవుల్ని కూడా నిర్వహిస్తున్నారు. 1971లో ఆయన ఆధునిక కవిత బాపురెడ్డి గేయాలకు రాష్ట్ర సాహిత్య అకాడమీ అవార్డు, 1984లో జరిగిన ప్రపంచకవుల మహాసభల్లో ప్రపంచ కళాసంస్కృతుల అకాడమీ నుంచి గౌరవ డాక్టరేట్ బిరుదు కూడా లభించాయి. 'నాదేశం నవ్వుతోంది నందనవనంలా...' వంటి అనేక గేయాలు, కవితలు, గేయ నాటికలు బాపురెడ్డి అటు ఆకాశవాణిలోను, ఇటు దూరదర్శన్‌లోను చాలాకాలంగా ప్రజలకు సుపరిచితులుగా ఉన్నారు. పలు గేయ సంపుటాలు, గేయనాటికలు, కవితలు, తర్జుమాలతో కూడిన ఈ పుస్తకాలు పదిహేడు వరకు తెలుగు, ఇంగ్లీషు భాషల్లో ఇప్పటివరకు ముద్రించబడ్డాయి. అమెరికా, ఇంగ్లండ్, ఫ్రాన్స్, రష్యా, చైనా, ఈజిప్టు తదితర మొత్తం 30 దేశాల్లో వివిధ కార్యక్రమాలపై పర్యటించారు. మాస్కో రేడియోవారు కూడా ఆయన ఇంటర్వ్యూను ప్రసారం చేశారు. కాగా, ఈమధ్యే వరల్డ్ అకాడమీ ఆఫ్ ఆర్ట్స్ అండ్ కల్చర్ గౌరవ డాక్టరేట్ నిచ్చింది.

భావుకత లేని కవిత నేను వ్రాయలేను; ఒక వేళ వ్రాసినా అది కవితగా నేను గుర్తించను. నన్ను నేను భావుకుడుగానే భావిస్తున్నాను.

ప్ర. జీవితం, కవిత్వం, రాజకీయం వీటి మధ్య ఎలాంటి సంబంధం ఉండాలంటారు? .. మరి మీ విషయంలో!!!?

జ. జీవితం చాలా విస్తృతమైన, విభిన్నశక్తి సమన్వితమైన భౌతికానుభూతి. కవిత్వం జీవిత లక్ష్యాలను నిర్దేశించే ఒక రసానందతత్వం. వాంఛనీయమైన లక్ష్యాలను సాధించే వ్యవస్థ రాజకీయం. వివిధ విజ్ఞాన శాఖలు దాని సాధనాలు. జీవితం జీవాత్మ (జీవుడు) కు అనంత సృష్టిలో లభించిన ఒక గొప్ప అవకాశం. సంపూర్ణ సమదర్శన రసానందమే జీవితలక్ష్యంగా నిరూపిస్తుండాలి కవిత్వం. మనకున్న భౌతిక విజ్ఞాన సాధనాలన్నీ దేహాత్మల ఆనందానుభూతికి తోడ్పడాలి. సామాజికపరమైన సమస్యల వెనకాల భావపరమైన శక్తులుంటాయి. నూతన సత్యదర్శనం, ప్రకాశం, ద్వారా భావవిప్లవాన్ని సాధించగలగాలి కవిత్వం జీవితాన్ని ఆనందోన్ముఖం చేయాలి. ఈ దృష్టితోనే నేను కవిత్వం వ్రాస్తున్నాను. ఇతరులు వ్రాయాలని ఆశిస్తున్నాను.

ప్ర. చెప్పేవాళ్ళు చెయ్యరంటారు? మీరు నిజ జీవితంలో ఆదరించిన, ఆచరిస్తున్న ఆదర్శాలేమైనా ఉన్నాయా?

జ. మనుషు లందరూ సమానులే అన్నభావమేకాక అంతకన్నా పవిత్రమైన మనుషులందరూ దైవ సమానులే అన్న విశ్వాసం కలవాణ్ణి నేను. అందరూ ఈ లోకంలోకి ఎక్కడి నుండి వస్తున్నారో తిరిగి ఎక్కడికి వెళ్ళిపోతున్నారో ఆ క్షేత్రమే దైవం అనుకుంటే ఏ చిక్కూ లేదు. "అహం బ్రహ్మాస్మి" అన్న అద్వైత సూత్రాన్ని నేను పరపీడనం లేని పరిపూర్ణ సామాజిక వ్యవస్థకోసం ప్రబోధిస్తున్నాను. అసలు తత్వం తెలియని వాళ్లకు నకిలీ రాజకీయం అమితావేశం కలిగిస్తుంది. నా త్రికరణాలు ఏకోన్ముఖంగా స్పందించే ప్రకరణం.

ప్ర. నేటి పత్రికల తీరు తెన్నులపై మీ అభిప్రాయం?

జ. పత్రికలు ప్రతిభ కంటే ప్రచారానికి ఎక్కువ ప్రాముఖ్యత ఇస్తున్నట్లుగా కనిపిస్తుంది. వాస్తవాన్ని వర్గీకరించడానికి ఇస్తున్న ప్రాముఖ్యత ఆదర్శాలను ఆచరణలోకి అనుభవంలోకి తీసుకురావడానికి ఇవ్వడం లేదు. రాజకీయాలకు ఇస్తున్న స్థానం రచయితల కీయడం లేదు. సాహిత్య విషయంలో, ప్రకృతి కవిత్వం, అభ్యుదయకవిత్వం, భావకవిత్వం, విప్లవ కవిత్వం వంటి కృత్రిమ విభజనను పీఠాలను ప్రోత్సహిస్తూ, ఆధునిక విజ్ఞాన ప్రజ్ఞాన జిజ్ఞాసను నిరాదరిస్తున్నట్లు కనిపిస్తుంది. మరింత నిష్పాక్షికమైన, సృజనాత్మకమైన వైఖరి తెలుగు పత్రికలు అవలంబించాలనీ, ఆశ్రయించిన వాళ్లను కాక ప్రతిబావంతులైన వారిని ఆదరించాలని సూచిస్తున్నాను.

ప్ర. కవిగా మీ నెలసరి ఆదాయం గురించి ఆడగవచ్చా?

జ. నేను కవిగా సంపాదించింది రసజ్ఞుల విజ్ఞుల ఆదరాభిమానాలే. సభల్లో, సమావేశాల్లో, ఆకాశవాణి, దూరదర్శన్ కార్యక్రమాల్లో అందించే పారితోషికం ఆదాయంగా చెప్పుకోదగ్గవి కావు. పుస్తకాలు ప్రచురించిన వారు నాకు ఆదాయం కల్పించకపోయినా నామీద ఆగ్రహించడం లేదు. అయితే కవిగా నేను 'జీవించగలిగే' కాలం కూడా అనతికాలంలో వస్తుందని ఆశిస్తున్నాను.

శ్రీ వరాహలక్ష్మీ నృసింహస్వామినే నమః

# ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ దేవాదాయ ధర్మాదాయ శాఖ కమీషనరు,

# మాన్య శ్రీమాన్

# డా॥ జె. బాపురెడ్డిగారు

## శ్రీ సింహాద్రినాథుని చందనాంతర్లీన నిజరూప సందర్శనానికి విచ్చేసిన శుభావసరమున శ్రీవారి శ్రీకార్యపరులు సమర్పించుకొనిన

# స్వాగత సమ్మానాంజలి

**అతిథిమహోదయా!**

పాలనురుగు వంటి, పండు వెన్నెలవంటి, మల్లెపువ్వువంటి, మంచి ముత్తెమువంటి, స్ఫాటికామల వపువు మా చందన స్వామి ఎన్నాళ్ళకు ఎన్నాళ్ళకు నేటికి ఈ యేటికి పూవువంటి తేనెవంటి వెన్న వంటి వెన్నెల తరగవంటి మెత్తని మనసున్నవాడు ఇలలో మలపై శిలలో చెట్టుపైన పుట్టలోన తనలోపల, పెఱిలోపల అన్నిటిలో అంతటనూ తననుచూడగల్గు చూచిన తన రూపును చూచినట్లె అక్షరముగ నిలుపగల్గు క్రాంతదర్శి కవిబ్రహ్మ పురూరవుని మరోరూపు ప్రహ్లాదుని ప్రకార మొకటి రూపుకట్టి బాపురెడ్డి రూపములో రూఢముకా జన్మాంతర వాసనలవి. చందనంపు నెత్తావుల విచిత్రముగ వియ్యమంది తెలుగువారి ఇలువేల్పుల తెలుగుతల్లి ఎదవేల్పుల వరివస్యావాల్లభ్యము పడయగోరి నడచివచ్చి మునివాకిట ముచ్చటగా నతాంగముగ దోయిలించి ఎదప్రమిదను నెనరు చమురు చిరవాసన వత్తిచేసి నెఱదీపము పెట్టిచూపి తనమేనను పొడమినట్టి రోమాంచపు కోరకములు తన ఏలిక తనవేలుపు చూపుసోకి విరబూసిన వేయివిరుల తనివితీర తపనమీర మనసారా మరల మరల మనస్వామి నర్చింపగ వచ్చినట్టి భక్తపరుని భాగ్యమ్మున మేలిముసుగు దొంతరలవి మేనిపూత గందములవి చిటిలించుకు పెటిలించుకు వెలికి వచ్చి విస్మయమున వెనుకటి ముచ్చటలేవో ఎదలో కదలాడగ మెదలాడగ మెదలకుండ ఆపడి తా ముచ్చటగా ముప్వంకగ మురిపెముగా ముందునిలచె బాపురె ఏమాభాగ్యము బాపురెడ్డి మీయది! స్వాగతమ్ము! స్వామివారి సేవలకై స్వాగతమ్ము!

**ఆస్తిక శేఖరా!**

తెనుగునాట వేనవేలు వేలుపులున్నారులెండు; కాని వారితీరుసారు లొక్కరీతి కావులెండు, వెంకన్నలు, రామన్నలు, భీమన్నలు, మల్లన్నలు, మఱి మా అప్పన్నయొ! తానెక్కటి, సరిలేనివాడు, తానొక్కడె ముప్పరు తానొక్కడుగా ముప్వంకగ మురిపెముగా ముచ్చటగా మస్పణముగా, సరియొక్కరు మరి కానకున్న, సిరియురమున తాల్చుకున్న చందనంపు మేలిముసుగు చక్కగ తొలిగించి నేడు, భక్తపాళి బ్రోచువేడ్క బయటకు నేతెంచువాడు.

వరాహ పుష్కరిణి పాద్యంబిడునట వచ్చెదవో
స్వామివారి తిరునందన వనవాటిక మందాక్ష
మందాక్షరంగా
తన పురావైభవ గాథలు వినిపిస్తుందట, వెళదామా !
మెట్ల మొదటి కావలి భైరవస్వామి భక్తపాళికథలెన్నో
గాథలుగా త్రవ్వి తలకెత్తుతాడట, తరలుదామా!
ఆపన్నార్తిహరుడు హనుమ అడుగుదారి నడుమ
నిరీక్షణంబు సేయుచుండె,
తానేమాయెనొ చూచుకొనక నీ సేమం బరయు చుండె,
నిలిచి యొక్కమారు నీరాజన మిడరాదో!
సింహాచల నరకేసరి తిరునాళ్ళకు దిగివచ్చెడి
సురబృంద పునిత్రేణిక
రాజగోపురమ్ము నిన్ను "రా రమ్మ"ని పిల్చుచుండె!
గాంగవంశ రాజన్యుల కైంకర్య పతాకాలుగ
నాట్యభోగమండపాలు, నాణెపు తిరుచుట్టుమాలె
నేటికి మధుర స్మృతిగా నీటుగొల్పు దీటులేని
మేటి శిల్పవాటికలవి మెరయుచు మీ రాక కోరు,
నెరదీపము చేతపూని నరసింహుని మాతృశ్రీ
ఏడువందలేండ్లనుండి భక్తులఎద వెలుగునింపి
వరివస్య నొనర్చుచుండె నరకేసరి మందిరాన,
చోళులు, చాళుక్య పతులు, మాత్స్యులు,
మాతంగ విభులు,
సురభివంశ వల్లభులు, సురవిభునిభు లెవ్వరెవరొ
సమర్పణలు చేసినారు శాశ్వతయశులైరి వారు.
తా నిచ్చుట గొప్ప, దానికంటె గొప్ప ఒక రిచ్చిన
దాని జిక్క గాపాడుట-అని వారలు శాసనాలు
చెక్కించిరి నొక్కిచెప్పి సింహవిభుని సన్నిధిలో
వారలమది నొవ్వకుండ, నారసింహు డనాథుడనక
"అనదలపతి హరిగిరిపతి అప్పడ"నుచు కొనియాడగ
పురావైభవోత్తుంగ ధ్వజావళిని నిలుపుమయ్య
కర్పూరము, సాంకవంబు, కస్తూరియు, గోరజంబు
మలయజంపు రసములోన కలపముగా కలయనూది
కలధౌత క్షౌమవసన పరిధానపు పరిష్క్రియను
పదిలముగా, మృదులముగా, భయము, భక్తి,
గారవంబు,
ఎదలోపల ముప్పిరిగా ఎన్నరాని వైభవమున
పురావేళ పురూరవుడు పూతపూసె చందనంబు
కుందచంద్ర శారదాభ్ర సుందరునకు, శుభాంగునకు
మువ్వంకల ముచ్చటైన మురిపెమ్ముల మా సామికి
సింహాచల వల్లభునకు శ్రీవరాహ నరహరికిని
వైశాఖపు తృతీయనాడు; వైశాఖపు తృతీయనేడు
పురూరవుని పుణ్యమిద్ది, పురాసుకృతఫలము మీది!

**పరిపాలనధురీణా!**

నిత్యోత్సవ వారోత్సవ పక్షోత్సవ మాసోత్సవ
వర్షోత్సవ వైభవాలు హర్షాతిశయంబుతోడ
ఆలయాల స్వాములెల్ల అనుభవింతు రాదరమున
శ్రీచందనమహోత్సవంబు సింహగిరికి ప్రత్యేకము
భారతీయ దేవాలయ చారిత్రపు సంపుటాల
చంపకాలు చందనాలు సౌరభాలు గుబాళించు,
కష్టమనక నష్టమనక అప్పన్నను సేవింపగ
కదలివచ్చు తైర్థికులకు పదిలమైన చోటువలయు
వారిచ్చిన వీరిచ్చిన స్వామివారి భూములన్ని
కుక్షింభర కుంభోదర రక్షోగణలోహబాహు
బంధమ్ముల వెలికిదెచ్చి పరిరక్షణ సేయవలయు,
అన్నపర్వతంబది మా అప్పన్న నివాసంబని
ఆ నాళుల పెద్దవార లీనాటికి ననుచుందురు.

అనూచానమాచారం బధికజన ప్రమోదదంబు
సదాచారమని చేకొన సంతోషం బగునుగాదె.

**పార్వతభాగధేయా!**

వేదంబులు శాస్త్రంబులు వివిధగానఫణితు లెన్నొ
సంకీర్తన నృత్యాదిక సంప్రదాయ సరణులెన్నొ
అంగరంగ వైభవాలనందిన దీ యాలయమ్ము
ఆగమములు, వేదమ్ములు, అమరవాణి మరియెన్నో
తమయున్నతి కాదుకాదు "మహోన్నతిని"
కాంచగోరి నీ నేమము కాంక్షించుచు నిలిచెనవిగొ ,
సంకీర్తన సంప్రదాయ చంపకాల సౌరభాలు
తెలుగు సాహితీవనిలో తొలిసారిగ గుబాళించె
కృష్ణార్యుల భక్తిగాన తృష్ణాపరవశుడగుచు స్వామి
సింహగిరిని నాట్యమాడె చేతోముదమొప్పగాను
పదునొకటవ యవతారంబని కృష్ణార్యుని కీర్తించెను.
చతుర్లక్ష సంకీర్తన వాక్పూజల వచనంబులు
"తెలుగు వేదవచనంబులు" వెలుగుచూడ
వలయునయ్యా,

దండువెడలి పైనబడగ గుండెపగిలి క్రోధముతో
కూర్మనాధు దుద్దండత కూయివెట్టి కవిత సెప్ప
గండుకంచు తుమ్మెదలవి గాటముగా కమ్ముకొనియె
ఇట్టి కథలు గాథలెన్నొ ఇంపైనవి కల విచ్చిట
'వాటినెల్ల వెలికితెచ్చి వాటముగా' నిలుపవలయు.
సంహగిరికి పరిసరముల సిరికి సుంత నోచుకోని
చిన్న చిన్న దేవవరులు మిన్నలె అనుభావమ్మున
కలరు వారి గరిమ యింత కాపాడగ అప్పన్నకు
తప్పదయ్య ఈ భారము అప్పన్నకనాథపతికి.

**ధర్మరక్షణ పరాయణా!**

దేవస్వం ధర్మస్వం దిగమింగుట ఘోరమయ్య
పెద్దకొడుకు పుట్టైన పిండము దినుటయ్య ఇద్ది,
దేవస్వం ధర్మస్వం ప్రభుత్వాని కంటరాదు.
కొత్తనీరు పాతనీరు కొట్టుక పడిపోయినట్టు
ఉన్నదెల్ల 'ఊచుముట్టు - ఊడ్చుకుమరిపోవునయ్య

అందుచేత ఆలయాల ధనమంతా, ధర అంతా
అచ్చటనే వెచ్చించుట, అర్థముగా వెచ్చించుట,
అభివృద్ధికి వెచ్చించుట, ఆస్తిక్యం పెంచుటకై
ధర్మరతిని పుణ్యమతిని కర్మగతిని సర్వహితము
పెంచుటకై వెచ్చించుట - ఎంచదగిన సుగుణమయ్య.

ఎన్నెన్నో విన్నపాలు మన్నింతురు మీరటంచు
ఇంత చనవుతోన మీకు విన్నవించుకొంటి మిట్లు
భక్తులు భావుకులు మీరు ప్రభవులు బాంధవులు
మాకు
శిల కరగిన ఎద కరగద! శిల పలికిన ఎద పలుకద!
శిలలను శిల్పముగా, కలలను కలరూపుగాను,
అంతయు నందముగా, అందము నానందముగా,
విశ్వహితముగా చూచెడి విబుధవర్య వందనాలు!
అందుకొనును వంద చందనాభివందనాలు!

ఇట్లు
భవదీయులు

సింహాచలము
తేదీ : 18-4-1988

**సింహాచల దేవస్థానోద్యోగుల అసోసియేషన్**

**డా॥ జె. బాపురెడ్డి** ఐ.ఎ.ఎస్

కమీషనర్ - దేవాదాయశాఖ

**విదేశ పర్యటన ముగించుకొని వచ్చిన శుభ సందర్భమున**

**ఏర్పాటుగావింపబడిన అభినందనసభలో సమర్పింపబడిన**

# సుమాంజలి

చదివినది అర్థశాస్త్రము

చదివించెడివేమొ భవ్యశాస్త్రంబులు నీ

మది నెట్లు విశ్వరూపము

విదితంబుగ గోచరించె విద్యుతులెలమిన్

నూనూగు మీసాల నూత్నయౌవనమందె చైతన్యరేఖలు చక్కదిద్ది

ప్రౌఢిమమ్మునదట్టి పట్టి పట్టి బిగించి రాకెట్టురాయబారాలు నడిపి,

పద్యగద్యాలతో పండించి కావ్యాల గేయాల నాటికల్కేలబట్టి,

నడిమి వయస్సులో నాదవేదాలను పరమైన సత్యాల ప్రాభవించి,

శ్రీకారశిఖరాల సీమల దర్శించి దివ్యసౌరభము లందించినావు

వ్యవధిలేదంచు నవ్యవధి నాదేశంబునవ్వుతూందంచును నవ్వినావు

ఇంగిలీషున తెలుగున నెన్నలేని కావ్యకుసుమాల మాలలకనకరత్న

దీప్తుల వెలార్చి జాతికందించి నీవు తెలుగుతల్లి ఋణంబును దీర్చినావు

అందుకొనవయ్య మాదు సుమాంజ లిదియె లలితపదబంధకవితాకలాతపస్వి

ప్రస్థానత్రయ భావబంధురములో భాసించు వేదాంతసూ

త్రస్థానంబుల నిత్యజీవితమునన్ తార్కించి తార్కించి నీ

స్వస్థానంబగు భావభౌతిక విధిన్ చాటించినావంట వి

శ్వాస్థానంబున కాహళంబులును తూర్యారావముల్ మ్రోగగన్ ॥

ఆకసపు జిల్గురేఖల హర్మ్యమందు కొండకొసనుండి త్రుళ్లిడు క్రొత్త ఏటి
పొంగుబుసయందు హసియించు పూలయందు బండగుండెల సవ్వడి బాసయందు
విశ్వకాంతుల దర్శించు వేదివీవు భావభౌతిక వాదివి బాపురెడ్డి

ముగ్ధమోహన సుకుమార మూర్తులైన కావ్యకన్యల సృజియించి, కనకరత్న
మణిమయంబగు మంజీర మమరదొడిగి, విశ్వవీథుల విహరింపజేసి, వారి
హంసనడకల హొయలుల అందములను, మధురగీతిక రాగాల మార్దవముల
దోచుకొనునట్లు జేసిన దొరవునీవు అందుకొనవయ్య మాదు సుమాంజ లిదియె

ఇట్లు

హైదరాబాదు
2-12-1988

**కేతమక్క సత్యనారాయణ**
సహాయ కమీషనరు



*Dr.J.Bapu Reddy honouring President of India. Sri R.Venkataraman in 1989 at Bhadrachallam.*



*Dr.J.Bapu Reddy at Kanakadurga Temple, Vijayawada with Sri Ramamurthy, Dy.Commissioner (Endowment) and Sri Venkatrama Reddy.*

# ఆధ్యాత్మిక చింతనలో శ్రీ బాపురెడ్డి





*Dr.J.Bapu Reddy at "Macca Masjid" in Hyderabad in 1989.*





Dr.J.Bapu Reddy receiving blessings of Lord Venkateswara in the presence of Chairman and Executive Officer T.T.D. in 1988.

# CONTENTS

## REVIEWS



## LETTERS

# BIO-DATA OF Dr. J. BAPU REDDY,

1. **Name** : J. BAPU REDDY

2. **Date & Place of Birth** : 21-07-1936, Sirikonda Village
Karimnagar District, Andhra Pradesh, India.

3. **Permanent Address** : "Ramachiluka". Plot No. 10, Road No.5,
Jubilee Hills, Hyderabad - 500 033.

4. **Profession** : Indian Administrative Service (IAS), Retired in the rank of Secretary to Government of Andhra Pradesh. Working as Member, A.P. Public Service Commision, Hyderabad.

5. **Mother Tongue** : Telugu

6. **Other Languages Known** : Hindu, Urdu and English

7. **Educational Qualifications** :

a) M.A. (Economics), Osmania University, Hyderabad, India.

b) Diploma in "National Development" from the Institute of Social Studies, The Hague, the Netherlands, 1968.

c) Certificate in Value Engineering and Analysis - Institute of Business Management, UNIVERSITY OF WISCONSIN, USA, 1976.

d) Certificate in "Development Administration" from Lal Bahadur Shastry Academy of Administration, Mussorie, India, 1977.

e) Certificate in "Management of Public Utilities" from Administration Training Institute, Mysore, 1986.

f) Certificate in "Marketing of Tobacco by Auctions" from Zimbabwe, Tobacco Marketing Board, Harare, 1982.

g) Certificate in "Management Concept and Decision Making" Faculty of Management Studies, University of Delhi, 1986.

h) Certificate in "Cooperative Management" from Vaikunth Mehta National Institute of Cooperative Management, Pune, 1986.

i) Certificate in "Industrial Policy Planning and Development", Institute of Economic Growth, Delhi, 1991.

j) Certificate in "Management of Change" from Tata Management Training Centre", Pune, 1990.

k) Certificate in "Financial Management" for IAS from the Indian Institute of Management, Bangalore, 1992.

# I. OFFICIAL CAREER

**1. Some Important Positions held :**

i) Revenue Divisional Officer and Sub-Divisional Magistrate, Visakhapatnam.

ii) Special Officer, Rehabilitation of Burma Repatriates, Visakhapatnam.

iii) General Manager, Acetic Acid Plant, A.P. Industrial Development Corporation, Hyderabad.

iv) Special Officer, A.P. Sangeetha Nataka Akademy.

v) Special Assistant to Chief Minister of Andhra Pradesh.

vi) Collector & District Magistrate, Medak and Warangal.

vii) Executive Director, Tobacco Board of India, Ministry of Commerce, Govt. of India.

viii) Commissioner of Endowments, Government of A.P.

ix) Commissioner of Industries A.P. in the rank of secretary to Government.

x) Vice-chairman and Managing Director, A.P., Industrial Development Corporation.

xi) Commissioner of Small Savings in the rank of Secretary to Government.

**2. General :**

i) Visited about 35 countries around the World including U.K. , U.S.A., France, Russia, China, Egypt, Japan, Mexico.

Awarded gold medal by Red Cross Society in 1980

ii) Published several Articles and papers including a paper on Indian Tobacco Marketing, Presented at an International Conference on Tobacco at HONG KONG in 1985 and a paper on Productivity in Civil Service at International Seminar organised by Asian Productivity Organisation, Japan at Kualalampur in 1992.

iii) Participated in International Seminar on Coir Geo Textiles, organised by Coir Board, India and International Trade Centre, Geneva.

v) Worked/Working as a Nominee Director in various Public Sector Corporations and Public Limited Companies.

# II. LITERARY AND CULTURAL FIELD

**1. Important Positions holding :**

i) President, Sukhela Niketan, a cultural & literary organisation, Hyderabad.

ii) Life Member, Poetry Society of India, Delhi.

iii) Member, World Academy of Arts & Culture, USA.

iv) Member, Regional Film Censor Boards, Hyderabad.

v) Member, Lions Club of Hyderbad, East.

vi) Member, Governing Council, Society for Promotion of Art, Hyderabad.

vii) Patron International Poets Academy (Madras)

viii) Member, World Telugu Federation, Madras.

ix) Honorary President, 'Samaikya Bharathi', Cultural Organisation Working for National Integration through culture.

x) Life Member, "Yuva Bharathi", Hyderabad.

xi) Life Member, International Association for the Future of Humanity, Cuttack.

## 2. Past Experience:

i) Special Officer, A.P. Sangeetha Nataka Akademy, 1974-75.

ii) General Secretary, All India Cultural Festival and All India Children's Festival, 1974.

iii) Secretary, First World Telugu Conference - 1975.

iv) Member, Board of Governors - International Telugu Institute.

v) Member, Andhra Pradesh Sahitya Academy, Hyderabad.

vi) Indian Editor of "Poet" an International monthly.

vii) Member Tirumala Tirupathi Devesthanam Trust Board 1987-89

viii) President, Hyderabad Poetry Society.

## 3. Publications:

**A) Creative Works : (Telugu)**

i) Chaitanya Rekhalu (Collection of Poems - 1960)

ii) Rakettu Raayabaaram (Collection of Poems - 1964)

iii) Bapu Reddy Geyalu (Lyrical Poems - 1968)

iv) Bapu Reddy Gadya Kaavyalu (Free Verse - 1971)

v) Naada Vedaalu (Lyrics - 1981) Released in Kualalampur during the Second World Telugu Conference.

vi) Bapu Reddy Padya Kaavyalu (Poetry in meter - 1969, enlarged editions 1973 & 1986)

vii) Bapu Reddy Geya Naatikalu (Lyrical Plays - 1970, enlarged editions - 1973& 1986)

viii) Anantha Satyaalu (Free Verses - 1979) Released in Detroit, USA at the Second TANA Conference (Revised Edition 1985)

ix) Srikara Sikharam (Lyrics - 1985) Released at the 5th North America Telugu Conference in 1985 in Los Angeles, U.S.A.

x) Naadesham Navvutuundi (Lyrics - 1986)

xi) Premaraamam (Lyrics - 1986)

xii) Manachetullonay Undi (Free Verse - 1986)

xiii) Pancha Baana Sancha (Free Verse - 1989 released in U.K.)

xiv) Pranaya Pranavam (Free Verse - 1989, released at the 7th TANA Conference, Houston, U.S.A.)

xv) Rangu Rangula Cheekatlu (Free Verse - 1990)

xvi) Manasuloni Maata (Essays - 1991) released at the 8th North American Telugu Conference at Atlanta Georgia, U.S.A.

xvii) Vadiponi Vasanthalu - 1992 (Poetry)

xvii) Kaalam Maayajaalam (Free Verse - 1995)

**B) Creative works: (English)**

i) In Quest of Harmony (English Poems -1973, Dedicated to Smt. Indira Gandhi, 3rd Edition - 1986)

ii) Longing for Life (English Poetry - 1986, released at the World Congress of Poets, Madras)

iii) Urn of Love (English Poetry - 1988) released at the World Congress of Poets at Bangkok.

iv) Loving is Living. Released at the World Congress of Poets, Istambul, Turkyee in 1991)

**C) Translations of his works into other languages :**

i) "Srikara Sikhar" by Dr. A. Sree Ram Reddy (This is a Hindi translation of Bapu Reddy's Telugu Book of Lyrics "Srikara Sikharam")

ii) "Mas Alla Del Horizontal (Beyond the Horizon) Spanish translation of Dr. J. Bapu Reddy's selected English Poems by Dr. Sonya S. Gupta, Director Department of Spanish, Central Institute of English and Foreign Languages, Hyderabad.

iii) Individual poems translated into other languages like German, Korean, Tamil besides several poems translated into Hindi and published in various journals all over the country.

**4) Awards and Honours :**

i) Andhra Pradesh Sahitya Academy Award for Poetry in 1971 for "Bapu Reddy Geyalu".

ii) Awarded the Degree of Doctor of Literature (D.Lit.) Honoris Causa by the World Academy of Arts & Culture at the VII World Congress of Poets in Morocco, 1984.

iii) Conferred "Fellow Membership" by International Poets Academy - 1986.

iv) Michael Madhusudan Award from Michael Madhusudhan Academy, Calcutta - 1986.

v) Telugu University Award for Manachelulloney Undi (Free Verse)

vi) Listed in WHO IS WHO in India, Reference Asia, Learned India, Men of Achievement (U.K.), Dictionery of International Literature (U.S.A.), Indian Writers "WHO is WHO" published by Central Sahitya Academy, New Delhi.

vi) Interviewed by Radio Moscow on the Role of Literature in World Peace - 1984.

vii) Elected as a Fellow of Temple of Arts Academy International (U.S.A.) and also Honorary Professor of Letters.

viii) Three Audio Cassettes of devotional songs Srikara Sikharam, Aaraadhana Lahari, Sapthagiri Balaji are released. Two Video Cassettes of Dance Ballette, Rituraagam and Saagara Sowdham besides an Audio Cassette on Family Welfare "Sankshema Bharati" are also brought out.

ix) Received Vikas Shree Award from the Shiromani Institute and All India Socio Economic Forum at Hyderabad on 30-11-1991.

x) Participated in the National Symposium of Poets organised by All India Radio at Varanasi - 1992.

xi) Received National Unity Award - 1993 at Hyderabad from All India National Unity Conference.

xii) Participated in 'Kavitha 93' festival of Indian Poetry jointly organised by India International Centre, Department of Culture, Govt. of India at Delhi from 28th to 30th December - 1993.

xiii) Participated in XV World Congress of Poets held in Taiwan in August-1994.

xiv) Received Kosaraju Literary Award - 1996 from "Rasamayi" a leading literary and cultural organisation at its silver jubilee celebrations.

xv) Received National Integration Award - 1996 from the organisation for National Integrity, Hyderabad - 1996.

xvi) Received "Jashuva Literary Award - 1996" Instituted by Dr. B.R. Ambedkar National Youth Cultural Federation, Vijayawada.

xvii) Best Lyric Writer Award in Tely Film "Rutu Ragam" under Nandi Awards for Tely Films - 1994.

xviii) Author of Lyrics for the Popular Ballet "Molla Ramaynam" a unique creation of Dr. Sindhuri, Madras - 1996.

**4. General** :

i) Smt. Susheela of Central University, Hyderabad obtained M. Phil Degree for thesis on Dr. Bapu Reddy's Writings in 1982.

ii) Sri C.H. Mallikarjuna Chary has been awarded Ph.D. for his thesis on "Bapu Reddy Kavitha Drukpatham by Osmania University.

iii) Shri A. Gajendar Reddy is doing research on the topic of "Bapu Reddy's Poetic Theme" from Kakatiya University, Warangal.

iv) Bapu Reddy Geya Natikalu is prescribed as Text Book for Mysore University.

v) Participated in the 1st Convention of the European Telugu Association (June, 95) as Special Guest and addressed the inaugural session of the convention at Birmingham, U.K.

vi) Telecast his Dance Ballets, Bhavi Jeevulu, Sagara Sowdham and Rutu Ragam on Doordarshan, Hyderabad.

# METAPHYSICAL VIBRATIONS

## Profile of A World Poet
## J. Bapu Reddy

**- *Dr. Krishna Srinivas***
*President - World Poetry Society*
*Madras, INDIA*

Dr. Bapu Reddy has emerged as one of the distinguished and most popular poets writing in the field of World Poetry today.

Very sensitive, highly reflective, widely acclaimed in India and abroad, he is strikingly different in his creative concepts and he is deeply rooted in the ancient Indian ethos. One can find in his poetry a happy combination of Indian classical values with the exuberant new Indian consciousness. He speaks in terms of provocative and forceful metaphors. He is highly philosophical, metaphysical and mysteriously mystical in his poems.

Poetic expression comes to Bapu Reddy quite naturally "as birds fly and as leaves to the trees." His excellent handling of verses shows his superb mastery over his poetic craftsmanship. His thought is multidimensional.

He is Aurobindonian in his metaphysical and cosmic concepts, He is Tagore - like in his subtle suggestivity, sensitive imagery and lyrical grandeur, He has all the reverberating qualities - of Khaleel Gibran and Omar Khayam - in his delving deep into the human emotions and intricate passions of life. Bapu Reddy touches the poetic pinnacles of T.S. Eliot and W.B. Yeats - in his vibrating verses of "Social Concern" and trivial Everydayness, - and also in his soul-searching technique of presenting the spiritual crisis of humanity in terms of "Time" and "Timelessness" - "Ephemeral" and Eternal". - with his unique exposition of powerful symbols and vivid imagery.

As sage, sitting on the shores of Time and watching the film of Ages. from primordial times, Bapu Reddy sees the caravan of galaxies and firmaments moving into unknown Beyond and the stars governing the march of times.

The universe to him is pantomime where history enacts orgies of ages, the twists and twirls of civilisations multitudinous and the future promising unenacted epochs.

His sharp mind questions the sorry scheme of things, questions the rigmarole of dismantled creations, questions

the vagaries of mysteries, questions the writs of destiny.

He pants. He fumes. He cries. He rages. He teases into growling the kenneled thoughts and laughs at the flashes of their fiery chains.

Caught up in this great turmoil of unrest, his philosophising comes to his rescue. In some verses, he crosses the frontiers of syllabled silences. In others, he grows serene and pours out mellow lines like Tagore.

Penetrating the frontiers of fossilized stagas, the poet cries :

*I shall divinise man*
*and humanise god*
*dissolving the dubious distinctions*
*in the Cosmic Democracy*
*Soul-Body Socialism,*
*moulding the clay*
*into miniature Reality.*

Bapu is in search of the God who created side by side sacrifice and selfishness, mind and matter, birth and death, pain and pleasure.

And most severely he observes:
*Thought transcending thought -*
*intuitively.............*
*Matter transcending matter -*
*indestructibly.........*
*Man transcending man -*
*invincibly.............*

Bapu's poetry is like a diamond prism. Reflecting many rays, it opens expanded moments-an affinity with nature, its darkness and mystery and serene solemnity. Invisible, magical realities beyond our senses float out of the unconscious when the boundaries between self and world are crossed. He surprises us with a new kind of poetry combining vitality and unexpected images.



# The Aesthetics of the Metaphysical
# The Poetic Achievement of J. Bapu Reddy.

*Dr. S.S. PRABHAKAR RAO*
*Professor of English*
*JNT University,*

The poet is essentially a seeker - ever, in quest of eternal truths and of harmony with himself, with the world and among the disparate forces operating out there. Should the quest lead to conquest, the seeker would become a seer. In poetic odyssey, what is of significance isn't the ultimate trumph, but the honest, yet agonising, process of exploration.

The poetic credo of Dr J. Bapu Reddy, who has been enriching the Telugu literary world and the Indo-Anglian stream with continuous and commendable poetic creativity for decades, may be epitomised by the title of one of his works, 'In Quest of Harmony'.

Poetry in Andhra Pradesh has been bedevilled by a poltical extremism, which insists that a poet ought to be committed to a political creed, even armed activism - and an aesethetic achievement of creative poetic activity has been suspect. It is a truism which bears repetition that a poet ought to be committed to poetry, simultansonsly aware of agonising social reality, maintaining what I should prefer to call 'optimum aesthetic distance', The poet must not embody in his poetic construct ephemeral crude reality but transform it into abiding poetic truth. And to achieve this, he needs what the Telugu poet, Balagangadhara Tilak called 'alchemy', possessed in varying measure by Kalidasa, Peddana, Krishna Sastry and Sri Sri, The alchemy was possessed in ample measure by Tilak himself. To that illustrious constellation, I have pleasure in adding the name of Bapu Reddy.

Bapu Reddy, like any young man, started out in the romantic vein and composed some of the fascinating verses resplendent with fine imagery, rich imagination and melodious phrase. Bapu, it is interesting to note, composed competently several poems in classical prosodic metre collected as "Bapu Reddy Padyakavyalu". Bapu did not, however, believe in a romantic escape from reality; he was intensely aware of the creased visage of exploitative society and he expressed his sympathy for the underdog, But he did not adopt the posture of 'negativism' which pulls down one to uplift the other. He preferred instead a meleoristic approach. The temporal *perse* did not engage his attention for long. He started his quest of the abiding truths behind temporal facts and metaphysical verities beyond physical actualities. This metaphysical quest endowed his poetry with a robust optimism and rescued it from fashionable, facile

